20వ శతాబ్దపు
తెలుగు తేజోమూర్తుల
అపురూప జీవిత చిత్రాలు

# మరపురాని మనిషి



తిరుమల రామచంద్ర



నీలంరాజు మురళీధర్ ఛాయా చిత్రాలతో...

నీలంరాజు మురళీధర్ ఛాయా చిత్రాలతో...

# మరపురాని మనీషి






అ.జో. - వి.భో. ప్రచురణలు

1.9.286/3 విద్యానగర్, హైదరాబాద్ 500044

**MARAPURĀNI MANEESHI**

*(45 Pen Portraits with 300 Photographs)*

*First Edition :*
January 5, 2001

*Cover Design :*
CHANDRA

*Compiled & Designed by :*
*'Rachana'* Sai

*Published by :*
AJO - VIBHO PRACHURANALU
1-9-286/3, Vidyanagar
Hyderabad - 500 044.
Ph : 707 1500

*For Copies :*

- Visalandhra Book House, Bank Street, Hyderabad & Other Branches.
- Navodaya Publishers, Governorpet, Vijayawada.
- Pallavi Publications, Governorpet, Vijayawada.
- Navodaya Book House, Opp. Araya Samaj Mandir, Badi Chowdi, Hyderabad.
- Vahini Book Trust, 1-9-286/3, Vidyanagar, Hyderabad - 500 044.
- Ajo - Vibho Prachuranalu, 1-9-286/3, Vidyanagar, Hyderabad - 500 044.

*Typesetting & Layout :*
Rachana Entinti Patrika, Hyderabad - 500 044
by *Srinivasa Murthy P.*

*Text & Title printed at :*
**CHARITA GRAPHICS** - Offset Printers
Chikkadpally, Hyderabad - 500 044.
Ph : (040) 760 7361

*Price :*
**Rs. 300/- US $ 30**

# ఈ సంకలనం ఇలాగే ఎందుకు?

1999లో డా. అక్కిరాజు రమాపతిరావుగారు శ్రీ తిరుమల రామచంద్రగారు 'ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక'(1962 - 64)లో 'మరపురాని మనీషి' శీర్షికన వ్రాసిన వ్యాసాల గురించి శ్రీ అప్పాజోస్యుల సత్యనారాయణగారితో ప్రస్తావించడం జరిగింది. దాని తాలూకు కటింగ్స్ చూసి, చదివి అబ్బురపడిపోయిన శ్రీ సత్యనారాయణగారికి వాటిని పుస్తకరూపంలో తేవాలన్న కోరిక బలంగా కలిగింది. ప్రచురితమైన ఫొటోలేకాక ఆయా మహానుభావుల ఫొటోలు మరెన్నింటినో శ్రీ నీలంరాజు మురళీధర్‌గారు తీసి ఉన్నారని తెలిసిరావడంతో ఆనందం అవధులు దాటింది. అంతే! వెంటనే శ్రీ మురళీధర్‌గారిని కలిసి వారు తీసిన ఫొటోలన్నింటినీ ఇస్తే 'మరపురాని మనీషి' వ్యాసాలన్నింటినీ కలిపి ఒక అపురూప గ్రంథంగా అచ్చేయించాలని ఉన్నదని శ్రీ సత్యనారాయణగారు తన కోరికను తెలియజెప్పారు.

'ఎవరీ సత్యనారాయణ? జరిగేపనేనా ఇది? నలభై ఏళ్ళ నుంచీ దాచుకున్న నిధిలాంటి నెగిటివ్‌లని ఇస్తే తిరిగొస్తాయా? అసలా ఫొటోలను ఈయన అందంగా అచ్చువేయగలడా?' - ఇలాంటి సంశయాలతో ఒకపట్టాన ఒక నిర్ణయానికి రాలేకపోయారు శ్రీ మురళీధర్.

పట్టువదలని విక్రమార్కుడు గదా శ్రీ సత్యనారాయణగారు! వరుసగా మూడు రోజుల పాటు శ్రీ మురళీధర్‌గారితో గంటలకొద్దీ గడిపి వారికి నమ్మకం ఏర్పడేలా చేయగలిగారు. అందుకు భరోసా యిచ్చి బాసటగా నిలిచింది శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారు.

ఆ విధంగా 'మరపురాని మనీషి' వ్యాసాలను అపురూప ఛాయాచిత్రాలతో పుస్తకరూపంలో తేవడానికి అంకురార్పణ జరిగింది. పని మొదలైంది.

ఆ శీర్షికలో ఏ కారణం చేతనో శ్రీ రామచంద్రగారి వ్యాసాలతో పాటుగా ఐదు వ్యాసాలను శ్రీ ఆరుద్ర చేత రాయించారు 'ఆంధ్రప్రభ' వారు. ఈ సంకలనంలో వాటినీ చేర్చాలని మనసుపడి శ్రీమతి రామలక్ష్మీ ఆరుద్రగారిని అనుమతి కోరగా వారందుకు అంగీకరించని కారణంగా ఆ అయిదు వ్యాసాలను పరిహరించాల్సి వచ్చింది.

శ్రీ రామచంద్రగారి వ్యాసాలనూ, శ్రీ మురళీధర్‌గారు అందించిన ఫొటోలనూ సరి

చూసుకుంటే పదహారు మంది ప్రముఖుల మీది వ్యాసాలు కొరవ పడ్డాయి. వారి అపురూప ఛాయాచిత్రాలు మరుగున ఉంచాల్సిన పరిస్థితి ఏర్పడింది. అది ఇష్టం కాలేదు. వారందరి గురించీ క్లుప్తంగానైనా చిరువ్యాసాలు రాయించి ఆ ఫొటోలను అఖిలాంధ్ర ప్రజానీకం దృష్టికీ తేవాలన్న కోరిక బలీయమైంది. అతితక్కువ వ్యవధిలో ఆ పదహారుమంది ప్రముఖుల గురించీ రాసివ్వగలవారి గురించి ప్రయత్నిస్తున్న తరుణంలో యువ రచయిత శ్రీ మల్లాది కృష్ణానంద్ తారసపడ్డారు. ఇదివరలో వారు కొందరు ప్రముఖుల జీవిత చిత్రాలు రాసి ఉన్నారు. మా కోరిక విని సాదరంగా స్పందించి అతితక్కువ వ్యవధిలో కొరవపడ్డ ప్రముఖుల జీవిత చిత్రాలను రాసి ఇచ్చారు. అందుకు శ్రీ కృష్ణానంద్‌గారికి కృతజ్ఞతలు.

ఆ విధంగా మా ప్రయత్నానికి నిండుదనం చేకూరింది.

'మరపురాని మనీషి' వ్యాసాల కత్తిరింపులను భద్రంగా దాచుకుని మాకిచ్చిన డా. శ్రీపాద కృష్ణమూర్తి (శ్యామకృష్ణ)గారికీ;

శ్రీ తిరుమల రామచంద్రగారి చిన్ననాటి ఫొటోలను అందించి సహకరించిన డా. నీరజగారికీ;

'మరపురాని మనీషి' వ్యాసాలను ప్రచురించిన 'ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక' యాజమాన్యానికీ;

ఈ పుస్తకానికి ముఖచిత్ర రూపకల్పన చేయడం అలవిమాలిన పనే! అయినా ఆ పనిని హుందాగా సాధించిన ప్రముఖ చిత్రకారుడు శ్రీ చంద్రగారికీ -

కృతజ్ఞతలు.

పెద్ద మనసుతో తమ 'ట్రెజర్'ను మాకందించి, ఈ పుస్తకం ఇంత 'ఫొటోఫుల్'గా రావడానికి కారణభూతులైన శ్రీ నీలంరాజు మురళీధర్‌గారికి మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

ఈ పుస్తక రూపకల్పనకు ఆలోచన యిచ్చి ఆచరణలో పెట్టించిన డా. అక్కిరాజు రమాపతిరావుగారికి కృతజ్ఞతాభివందనాలు.

29 డిసెంబర్, 2000 - సంచాలకుడు

# మరో మరపురాని మనీషి - తిరుమల రామచంద్ర

సుమారు నలభై ఏళ్ళనాడు 'ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక' లో (1962-64)లో శ్రీ తిరుమల రామచంద్ర ఈ రచనలను ఒక ప్రత్యేక శీర్షికగా నిర్వహించారు. అప్పట్లో ఆంధ్రదేశంలో సుప్రసిద్ధులైన కవి పండితులు, కళాసిద్ధులు, చరిత్రవేత్తలు, తమ తమ ప్రజ్ఞా ప్రాభవక్షేత్రాలలో పరిగణనీయులు అయిన మనీషులను స్వయంగా కలిసి వారితో ఇష్టాగోష్ఠి ప్రసంగాలు నిర్వహించి వారి జీవిత విశేషాలను, వారి సార్థక జీవన సారస్వత సాంస్కృతిక లలిత కళామూర్తిమత్వాన్ని వివరించడమే ఆయన ఆశించిన లక్ష్యం.

ఎవరి గురించి వారు చెప్పుకోవడంలో కొన్ని సంకోచాలున్నా రామచంద్రగారి వంటి నిత్య నిరంతర సారస్వత మనీషులు సమీపించినప్పుడు, ఆత్మావలోకనం చేసుకోవడానికే ఎవరైనా ఉత్కంఠ చూపుతారు. ఆయన వారి మూర్తిమత్వాన్ని సమర్థంగా చక్కగా రూపొందించగలరని వారి విశ్వాసం. అందువల్ల ఈ మహనీయుల వ్యక్తిత్వ నిరూపణంలో ఒక నిండుదనం, ఒక కమనీయత రామచంద్రగారు నిరూపణం చేశారు. ఒక శతాబ్దంలో సాహిత్యమూర్తులుగా, సామాజిక స్ఫూర్తులుగా విలసిల్లిన సుమారు 30 మంది జీవనరేఖాచిత్రణం ఈ సంకలనంలో చోటు చేసుకున్నది.

ఈ సంకలనంలో కవులున్నారు. కళాకారులున్నారు. సాహిత్య జగత్ప్రసిద్ధ పండితులున్నారు. వ్యాకరణవేత్తలున్నారు. మహానటులున్నారు. చరిత్రవేత్తలున్నారు. సమాజ చైతన్యం సాధించిన మహిళ



1978 జులై, 12, 13, 14 తేదీలలో అనంతపురంలో జరిగిన జిల్లా రచయితల సంఘంలో తిరుమల రామచంద్రను అధ్యక్షుడు శ్రీ పైడి లక్ష్మయ్య సన్మానించారు.



షష్టిపూర్తినాడు (1973)

లున్నారు. అందుకే వీరందరినీ మనీషులన్నారు శ్రీ రామచంద్ర. 'మనీషితాః సంతి గృహేషు దేవతాః' అని కాళిదాసు కూడా అన్నాడు కదా! దేవతలంటే ప్రకాశించేవారని అర్థం. వీరంతా తమ తమ రంగాలలో ప్రకాశించారు. వెలుగులు విస్తరింపజేశారు. కాబట్టి పూజ నీయులని రామచంద్రగారి భావం.

అన్నిటికన్నా ఆకర్షణీయమైన అంశం ఏమంటే ఈ సంపుటంలో ఆ విశిష్ట వ్యక్తుల అపురూపమైన ఛాయా చిత్రాలున్నాయి. అది రామచంద్రగారూ, ఆయన వెంట ఛాయా చిత్రసంగ్రహణలో వీటిని రూపొందించి సేకరించిన శ్రీ నీలంరాజు మురళీధర్‌గారూ తెలుగు వారికి చేసిన మహోపకారం. మామూలుగా వృత్తి నిపుణుడైన ఫొటోగ్రాఫర్ తీసిన ఫొటోల మాదిరిగా కాకుండా ఈ మనీషుల పరా, పశ్యంతీ, అంతస్సత్వాలు కూడా ఫలకీకరించడంలో మురళీధర్‌గారు కృతకృత్యులైనారు. స్వీయ వైఖరిని చెప్పే ఛాయా చిత్రాలు తీయడం, అవి వారి ఇష్టులైనవారు చూడడం ఎక్కడైనా సంభవించేదే. అయితే వారి అంతరంగ బహిః ప్రతిఫలనం ఛాయా చిత్ర స్థితం చేయడం కష్టం. కష్టమే కాదు, అసాధ్యమైన పని. కాని శ్రీ మురళీధర్ దానిని సాధించారు. విశ్వనాథ, కృష్ణశాస్త్రి, నాయని, జాషువ, శివశంకరస్వామి, కాశీకృష్ణాచార్య మహోదయులు, అద్దంకి, స్థానం, పులిపాటి, దీపాల, గుండూరావు హర్కారే వంటి మనీషుల ఫొటోలు ఈ సంపుటంలో తప్ప అటువంటి హావభావ విన్యాసాలతో మరెక్కడా లభించనివి. శ్రీరామచంద్రగారి వాచకం కూడా అనితర సాధ్యంగా ఈ రచనలో విన్యసించింది.

20వ శతాబ్దం తెలుగు సాహిత్యంలో ఈ మనీషులు స్థిర ప్రతిష్ఠితులు. కాబట్టి వారిని గూర్చి తెలుసుకుంటే 20వ శతాబ్ది తెలుగు సాహిత్యపు తీరుతెన్నులు, వివిధ కళానిరూపణ పరిణామాలు స్థూలంగా తెలుసుకోవడానికి అస్కారముంది. ఈ శతాబ్ది కొత్తపాతల మేలుకలయికగా ఈ చరితార్థుల, ఈ కళాశీలుర, విద్వాంసుల ప్రజ్ఞా ప్రాభవాలు శ్రీ తిరుమల రామచంద్ర ఈ రచనలో ఆవిష్కరించారు. కోలవెన్ను రామకోటేశ్వరరావు వంటి ప్రథమ శ్రేణి పత్రికా సంపాద కులు, కాశీ కృష్ణాచార్యుల వంటి సంస్కృతాంధ్ర విద్వద్వతంసులు తమ జీవితకాల కృషిని శ్రీ రామచంద్రగారికి విశ్రుతపరచారు. తద్వార తెలుగువారందరూ తెలుసుకొన్నారు.

ఇక వీరితో సముఖిగోష్ఠులను అక్షరమహితం చేసిన తిరుమల రామచంద్రగారు కూడా మరొక 'మరపురాని మనీషి' అనే చెప్పాల్సి ఉంటుంది. ఆయన కవిగానో, నాటక రచయితగానో, విద్వ ద్విమర్శకుడిగానో, లలిత కళావిశారదుడి గానో, ప్రతిభాపూర్ణుడైన వాఙ్మిగానో ప్రసిద్ధుడు కాకపోయినా, ఆయన ప్రతిభ బహుముఖీన మైనది. విశిష్టమైనది. 20వ శతాబ్ది సాహిత్యవ్రతులలో రామచంద్ర గారి వంటి వైవిధ్యభరితమైన జీవితం గడిపినవారు మరొకరు లేరు. అర్ధశతాబ్ది కాలం తెలుగు పత్రికారంగంలో తనదైన ప్రత్యేక ప్రతిపత్తిని నిరూపించుకున్నవారూ లేరు. సహస్రాధికంగా వ్యాసాలు, సమీక్షలు, ప్రాస్తావిక రచనలూ చేసినవారూ మరొకరు లేరు. పరిశోధన



పెద్దమ్మాయి చి. నీరజతో

ప్రవణులున్నూ మరి లేరు.

శ్రీరామచంద్రగారిది సాహిత్య విషయికంగా, సామాజిక వికాసకృషి విషయికంగా చాలా ఉదారమైన, విశాలమైన దృక్పథం. నిస్వార్థమైన అంకితభావంతో సాహిత్య విజ్ఞాన విస్తరణకు ఆయన కృషి చేశారు. అనేక విషయ సంగ్రాహకులే కాకుండా ఆయన గొప్ప సమన్వయశీలి. ఏది రాసినా మౌలికమైన ఆలోచనతో, గవేషణతో దానినాయన నిర్వహించారు. 1913లో జన్మించి 1997లో పరమపదించారు. ఈ ఎనభై నాలుగు సంవత్సరాల జీవితయాత్రలో నిజంగా నిత్య నిరంతర యాత్రికుడే ఆయన అనిపిస్తుంది. 20వ శతాబ్దిలో తమదైన ప్రత్యేక వ్యక్తిత్వ ముద్రను అటు ఉత్తర భారతంలోకాని ఇటు దక్షిణ భారతంలోకాని వెలార్చిన మహనీయులను శ్రీరామచంద్ర పరిచయం చేసుకున్నవారిని తెలుగువారిలో మరెవరూ పరిచయం చేసుకొని ఉండరు. వారితో కలసి పనిచేసీ ఉండరు. అన్నిటి కన్నా ఆసక్తికరమైన విషయం స్వాతంత్ర్యోద్యమంలో ఆయన జైలు జీవితం గడిపారు. తిరుపతిలో, నెల్లూరులో, మద్రాసులో సంస్కృత విద్యాసంస్థలలో చదువుకొన్న శ్రీ తిరుమల రామచంద్ర స్వాతంత్ర్యోద్యమంలో విప్లవ సంఘాలలో పనిచేయడం వింతలో వింత. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలో ఆయన ఎంత ఆసక్తితో పనిచేశారో తిరువళిక్కేణి రామవిలాస హోటల్‌లోనూ అంతటి ఆసక్తితోనూ పనిచేశారు. సైన్యంలో చేరి హవల్దారు ఉద్యోగ విధులనూ నిర్వహించారు. సౌశీల్యం, సౌజన్యం, సౌమనస్యం మూర్తీభవించిన వ్యక్తిత్వం వారిది. వారు రచించిన గ్రంథాలన్నీ ప్రత్యేక శ్రేణికి, విశిష్ట వర్గానికి చెందినవి. మన లిపి - పుట్టు పూర్వోత్తరాలు, గాథాసప్తశతిలో తెలుగు పదాలు, నుడి - నానుడి, లలిత విస్తరం, అవధాన కల్పలత ఆయన పేరును చిరస్మరణీయం చేస్తాయి. హిందువుల పండుగల వంటి గ్రంథాన్ని విశ్వనాథవారు ఎంతగానో ప్రశంసించారు. 'మరెవరికీ మరేమీ చెప్పడానికి మిగలకుండా మీరీ గ్రంథాన్ని రచించా'రని అంటూ విశ్వనాథవారు మెచ్చుకున్నారని ప్రాస్తావికంగా చెపుతూ రామచంద్రగారు ఎంతో సంతోషిస్తూ ఉండేవారు.

ఇటీవల రామచంద్రగారి స్వీయచరిత్ర 'హంపీ నుంచి హరప్పా దాకా' - అ.జో.వి.భొ వారు ప్రకటించారు. రెండు సంవత్సరాలలో రెండు ముద్రణలు పొంది తెలుగువారి ఆదరాభిమానాలకు పాత్రంకావడమే రామచంద్రగారి మనీషతకు తార్కాణం.

12-12-2000 - డా. అక్కిరాజు రమాపతిరావు
ఫ్రిమాంట్, అమెరికా

# In Retrospection


Neelamraju Muralidhar

Telugu magazines in the early sixties were not vastly different from the contemporary ones. They also strove indefatigably to improve their circulation, unmindful of a climb down in standards. Some magazines even resorted to treating printing ink with perfume to seduce readers into purchasing their product.

Serious subjects were not given more than four or five pages in an issue consisting of, say, 60 pages. The first objective of the journal was to sell space to advertisers at maximum price.

In search of new clientele, the magazines started providing interesting fare to the bored groups of readers such as passengers in trains and buses, students and housewives.

In those years, Andhra Prabha Illustrated Weekly, published from Chittoor/Chennai, owed its popularity to a contributor called Malati Chendur, a housewife, who ran a question - answer column, supplemented by tips on embroidery, recipes, interior decoration, and allied topics of interest to women. The daily chores of

educated urban women having been lightened considerably by acquisition of gadgets like pressure cookers, grinders, mixies and fridges, they had enough time to spend on magazines.

Soon arrived on the scene several women writers, particularly novelists, who churned out lengthy works that could be serialised in the weeklies. One or two novels could sustain the circulation of a journal for months together. All these factors resulted in Andhra Prabha weekly being patronised mostly by women.

Around this time, the editing of the Andhra Prabha Weekly was entrusted to Buddhavarapu China Kamaraju who had earlier worked with Adivi Bapiraju in 'Meezan' Telugu daily published in the erstwhile Nizam State. Besides journalism, Kamaraju possessed an uncanny taste for stories that clicked. He himself wrote under the pen - name "Toolika Bhushan". The Andhra Prabha Weekly scaled new heights under the leadership of Kamaraju, even as the Andhra Prabha Telugu daily published from Vijayawada and Bangalore under the editorship of Neelamraju VENKATA Seshaiah ruled the roost in the districts. (I am the second son of late Seshaiah).

*Buddhavarapu China Kamaraju*



It is necessary to explain here why Kamaraju chose me to do the photography for the "Marapurani Maneeshi" feature.

Though an Andhra by birth, I was a Madrasi (Chennaite) for all practical purposes, having lived there until I was 25.

Political, literary and artistic diversions compelled me to bid farewell to college studies after Intermediate, when I joined an office of the Ministry of Agriculture as a Junior Clerk, to eke out a livelihood, if not assist my father, who as a journalist was not very well off either. The government job was a mere breadearning activity while my soul and spirit was dedicated to poetry, literature, films, fine arts and photography. I grabbed every opportunity to escape into the exciting world of Art, though I was not properly trained, in any discipline. I took photographs with cameras that were borrowed, and yet was able to get them published in

a few periodicals.

Through the good offices of the then General Manager of Indian Express, Mr. T.K. Tyagarajan, himself a lover of fine arts, I joined the newspaper as a Photographer - cum - Reporter and was posted to Vijayawada. My father had asked management to sanction a photographer but did not expect that I will fill the bill.

The newspaper job somewhat freed my long inhibited creative spirit. I looked around through the eyes of photographers like Cartier Bresson Eugene Smith, Margaret Bourke White and Sunil Janah, and thought with a mind influenced by in the works of Christopher Isherwood, Henry Miller, Andre Gide and their ilk.

I remember having made courtesy calls on Kamaraju and others at Madras when he was editing the A.P. Weekly. I suspect that Kamaraju was aware that the weekly was being talked about as a purely story magazine and that it was lacking patronage among the highbrow literary circles. This may have prompted him to introduce the feature "Marapurani Maneeshi". Having seen my photographic work already (he had given me some assignments earlier) and aware of my predilection for literature, he chose me for the job of photographing eminent Telugu personages. Kamaraju promised to depute Tirumala Ramachandra for the writing work. And that was how the feature was born.

I may have seen Tirumala Ramachandra in the early fifties when he was working as a sub-editor in the Andhra Prabha daily at Madras, because I was an infrequent visitor to the office. I skipped classes in Pachaiyappa's College but never ceased acquiring knowledge elsewhere. I was familiar with all the public libraries in Madras and it was at Connemara Library in Egmore that I saw Mr. Ramachandra taking notes without once lifting up his head to look around. (When I mentioned this to Ramachandra later, he replied that he was gathering material for "Mana Lipi - Puttu Purvottaralu" in those days.)

In mid - October 1962, Ramachandra arrived in Vijayawada and our collaborative effort started with interviewing the Colossus of Telugu literature, late Viswanatha Satyanarayana. A highly controversial figure, Viswanatha was respected and hated but never ignored. When Ramachandra and I met him at his Marutinagar residence, Viswanatha made no effort not receive us with warmth or courtesy. He lay supine on the mat spread alongside a wall and it was only his faint smile that seemed to welcome us.

The great Jnanapeeth award winner, huge even by physical standards, was bare but for a dhoti rolled up to his knees. He was dictating something to a scribe but discontinued it to deal with Ramachandra. He was not at all self conscious when I set to work with my camera and soon the candour of his replies, witticisms and the 'Denil - may - Care' attitude endeared him to me most.

To one of the mundane questions posed by Ramachandra, Viswanatha replied that he was accustomed to cutting vegetables for the lunch or would just sit and contemplate his novel'. I took the liberty to ask him whether he would allow me to take a picture while he was slicing the vegetables. I was surprised when he readily agreed.



The next day, to be precise on October 17, 1962, we took on two great stage artists, Addanki Sreeramamurthy and Banda Kanakalingeswara Rao. And next day we journeyed to Guntur to interview Kasi Krishnacharya.

Needless to say, Ramachandra would be very much in his elements when it came to tackling Sanskritists and persons of erudition. Today, nearly forty later, a

feeling of remorse tugs at my heart for not paying attention to the dialogue that ensued between Ramachandra and Krishnacharya, much of which was in Sanskrit. I cannot claim knowledge of Sanskrit then or even now, but cursory reading of some epics and puranaas has enabled me to gain access to at least the fringes of the great language.

But then, I was as much engrossed in my photographic exercise as Ramachandra was in plumbing Krishnacharya's mind. Ramachandra and myself were no doubt equal partners in handling the assignment, but our functions differed from the moment the interview began.

The conversation between Ramachandra and Krishnacharya was reduced to a drone insofar as I was concerned. I considered my physical presence on such occasion itself to be an intrusion, but worse was the job of lugging around a bulky, gleaming camera with lenses, a tripod and other equipment which diverted the person being photographed.

The biggest obstacle I faced in photographing eminent persons was to make them shed the last vestige of self-consciousness before the camera. I would not be able to get authentic, true-to-life pictures otherwise. I adopted countless methods to put my subject at ease. Sometimes, they included a dry run -- clicking away without film in the camera, before really starting to take pictures. Sometimes, I used to pray to my 'Ishta Devata' to bless me and my camera with "unobtrusiveness". Though photography revolved round light and shade, I sought "invisibility" during those few moments in the interest of getting good pictures.

After the conclusion of the interview, Ramachandra and I would exchange notes on the results. He would relate excitedly about the nuggets he had picked up in his chat with the interviewee while I would respond with details of the photographs that promised to come out well.

Before undertaking another interview - I recall meeting Poet Joshua after Kasi Krishnacharya in Guntur - Ramachandra and myself retired to the hotel to have lunch and rest for a while. His mind would be buzzing with words and thoughts while mine would be grappling with images.

Ramachandra was loquacious to the point of denying me a well earned siesta. While I had to some degree mastered the art of switching on and off thoughts, Ramachandra would remain tense for long, which I am inclined to think, was necessary for him to ultimately produce a tight summary of the interview.

In those years, Ramachandra was postered by the ringworm infection. I sometimes used to wonder whether the infection could have psycho - somatic origins in the sense that some inbuilt tension led to itching.



An obsession with Ramachandra which I was to discover soon was his perpetual search for a tasty and hot Andhra meal. Maybe because he was starved of hot chutneys and curries in Madras, he wanted to have a real go with Andhra food while in the state. He would not hesitate to walk up to the cashier who gave the meal ticket and remark : "Guntur is known for its hot chillies but the preparations in your hotel though tasty are not hot enough. I came all the way from Madras to taste hot curries and am disappointed".

Ramachandra was naive. He was pleased with himself for being outspoken whereas I would protest saying that he had been needlessly rude!

Photographing Joshua immediately after handling Kasi Krishnacharya turned out to be a study in contrasts for me. Krishnacharya was short, frail and fair complexioned. Joshua was tall, strong and dark. The

former was orthodox, grew a snowy beard, and was soft and spiritual. The latter was aggressively humanistic, clean shaven, rajasic and enjoyed nothing better than puffing away at a self - rolled cheroot. Joshua was a poet of raw emotions, if perhaps always a little angry. But he had his heart in the right place and stirred the readers with his power - packed lines of poetry.

When ultimately the interviews of Krishnacharya and Joshua were published, I congratulated myself for bringing out their innate qualities to a fair extent in the photographs.

Leaving Guntur, we went to Tenali and near about towns meeting scholar Mudigonda Jwalapati Linga Sastry, actor Pulipati Venkateswarlu, social reformer Kanaparti Varalakshamamma and "Abhinava Tikkanna", Tummala Seetaramamurthy Chowdary. It appeared to me that they all provided Ramachandra with the normal journalistic fare.

We arrived at Ongole one night by train to interview Tallavajjhala Sivasankara Swami, a colourful poet not devoid of some eccentricities. The station was rather distant from the town proper and there was no alternative to hiring a cycle rickshaw.

Soon after we settled in the rickshaw, Ramachandra struck up a dialogue with the rickshaw puller about the hotels in the town.

While I was trying to elicit information about lodging houses which were clean and neat, Ramachandra was back at his eternal search for the typical Andhra meal.

"Take us first to the hotel where meals are really hot. Ongole and Guntur are known for their 'goddu karam'. We have tasted food in Guntur but we are not happy. It is not hot enough. We are at last in Ongole. If we fail here too, we cannot imagine what misfortune awaits the state.....". Continued Ramachandra. I can't remember where we stayed and what we ate that night but I do recollect having lunched in Sivasankaraswamy's house next day, midway through the interview session. Luckily, Sivasankaraswamy was no less a gourmet than Ramachandra and both of them must have enjoyed the homemade meal.

Back in our hotel room, Ramachandra would relate to me several stories about scholars and poets, some quite smutty, but true.



Curiosity, an innate love for the spoken and written word, poetic sense, and a taste for good humor were qualities that I shared in equal measure with Ramachandra, though I was no match to his learning or experience. Candour and integrity, which mark out journalism brought me and Ramachandra close. The mutual trust between us bridged the disparity in our ages.

We next proceeded to Nellore to encounter two eminent scholars of the vanishing generation, Gannavarapu Subbaramaiah and Deepala Pitchayya Sastry. Our next destination was Tirupati where the reception was mixed.

We first fixed up and appointment with the renowned musicologist, researcher and literary luminary, Rallapalli Anantakrishna Sarma. He was living in a street that led to the main entrance of a temple in the town.

When we arrived at his sparsely furnished residence, Sarma was seated on a mat patiently trying to produce music from a violin that he held dearly to himself. I was shocked. It was impossible to imagine that a reputed scholar and critic in the field of music, literature, aesthetics, and mysticism, would begin learning the rudiments of playing a violin! Mentally, I could not help prostrating before his extraordinary humility

and total lack of pretension. Rarely did I ever come across persons capable of such transparency in life.

Anantakrishna Sarma asked us to stay over for lunch. His wife served food on dried leaves in the kitchen - cum - pooja room, responding to our requests for a second helping of a chutney or curry but never uttering a word.

After lunch and just before taking leave, it struck me that it would make a nice picture of the classicist with the imposing temple gopuram as a backdrop. I suggested the same to Sarma through Ramachandra, but the former's reply was a definite 'no'. I was perplexed to say the least.

Sarma had not objected to any of the numerous other pictures I had taken earlier. He did not even mind getting photographed at lunch. Why should he turndown my request? I dared not ask him, anyhow.

I later pressed Ramachandra to tell me what possibly prompted Sarma to virtually 'disown' the temple which was hardly a few yards away from his residence.

Ramachandra guessed that being tradition minded Rallapalli could not perhaps reconcile himself to reforms sweeping the Country, particularly on the administration of temples. I let it go at that.



We called on Pingali Lakshmikantam next day. Ramachandra explained the purpose of our visit and waited for his response. After a short pause, Pingali replied in measured words that he "did not, repeat not" wish to be one of the exhibits in the "Marapurani Maneeshi" gallery suggesting very plainly that we better forget our mission and pack off.

Ramachandra, with the meek support I lent, tried to persuade Lakshmikantam to relent. But it was futile. To mollify our feelings, Lakshmikantam however said that we were welcome to spend some time with him and even be his guests for lunch, on the condition that nothing is published in the feature. Having exhausted all out entreaties, we returned disappointed. Ramachandra was unable to fathom the reasons for Pingali's taciturn behavior. Pingali was not only a reticent person, but adamant after taking a decision.



After a break of a few weeks, we launched our operations in the State capital of Andhra Pradesh, Hyderabad. Educationist Prof. Mamidipudi Venkatarangayya, scholar Khandavalli Lakshmiranjanam, historian Aadiraju Veerabhadra Rao, venerable leader of Telangana, Madapati Hanumantha Rao, grammarian Gunderao Harkare, writer Illindala Saraswati Devi and the doyen among stage artists, Sthanam Narashimha Rao, were among our list.

Our interviews as well as the picture taking sessions with many of the personalities concluded in matter of a few hours. But Devulapalli Krishna Sastry was an exception. It began with a lengthy telephonic conversation. Then a meeting at his residence where time was spent in a pleasant chat without coming anywhere near the business on hand. We fixed up another appointment next day and waited for Krishna Sastry to return from the AIR station. His wife treated us to a hot cup of coffee, followed by pan. And yet, Krishna Sastry, who had meanwhile arrived, was not in the right mood to talk.

"It is rather stifling here. Why not we take a drive and get some fresh breeze?"- Krishna Sastry remarked summoning the driver to keep the car ready.

We dutifully accompanied him to Gymkhana grounds, where, at last, the interview actually commenced. As the evening turned into dusk, I noted that it was no longer a question answer session with

Ramachandra but rather a reverie into which the eminent poet had drifted, an infectious monologue with words coming out from his heart rather his head!



After I had completed writing the foregoing I woke - up one night in my dream land to the sound of a knock on my door. When I opened it, there he was - a smiling, restless and fidgety, Ramachandra dressed in kurta, waist - coat and dhoti. I was glad he came when I wished to meet him most. I invited him inside, and after settling down, reminded him about his desire to bring out the "Marapurani Maneeshi" in a book form and his frequent enquiries whether I was keeping all the pictures and negatives safe.

I told him that Appajosyula Satyanarayana, an ardent lover of arts and literature from the United States, was interested in printing the book and that I had offered to provide whatever pictorial material I had in my possession. I also told Ramachandra that I had been compelled to write a foreword to the book, a task to which I can never measure upto, considering the content of the book. And then I handed this manuscript to him for his perusal.

I watched him keenly while he flicked each page and noticed and how he smiled to himself, sniggered, or exclaimed "bhesh" and looked into my eyes with love and affection.

He patted me on my shoulder as if to reassure me and then faded away. His wish had come true.



I like to think of Marapurani Maneeshi as a large pond, overgrown with lotuses personifying eminent artists, poets, scholars, musicians, grammarians, the creamy layer of the hygiene culture in the 20th century.

I like to think that Ramachandra and myself had been entrusted with the job of collecting a few of the lotuses for enlivening the minds of readers of a popular weekly.

I like to think that in doing so, we both had succeeded in offering what best we could to the Goddess of learning, Saraswati.

— Neelamraju Muralidhar

12, Dec. 2000
Hyderabad



# మరపురాని మాధుర్యం



లేఖినీ-చిత్రాలు:

తిరుమల రామచంద్ర

ఛాయా-చిత్రాలు:

నీలంరాజు మురళీధర్

# ఇందులో...

## తిరుమల రామచంద్రగారి లేఖినీ చిత్రాలు :



## అనుబంధం - మల్లాది కృష్ణానంద్‌గారి జీవిత చిత్రాలు :

# మరపురాని వ్యక్తి



## కాశీ కృష్ణాచార్యులు



రెండు తరాల క్రింది మాట. బందరు పురమందిరం కిట కిటలాడి పోతున్నది. దిగ్గంతులయిన పండితులు, మహాకవులు, పుర ప్రముఖులు చెవులు రిక్కించి వింటున్నారు. వేదికపై తిరుపతి వేంకటకవులు, నాదెళ్ళ పురుషోత్తమ శాస్త్రులు, మేధా దక్షిణామూర్తి శాస్త్రులు, శిష్ట్లా నరసింహశాస్త్రులు, చల్లా రామనాథ శాస్త్రులు, బుక్క పట్టణం తిరుమల వేంకటాచార్యులు మున్నగు విద్వత్కవిశేఖరులు, వందమందికి పైగా పృచ్ఛకులు ఆసీనులయ్యారు. జంధ్యాల గౌరీపతి శాస్త్రులు అధ్యక్షపీఠం అలంకరించారు.

ఈ పండిత గోష్ఠి మధ్యన ఒక స్ఫురద్రూపి, వాక్చతురుడు



అయిన యువకుడు హాస్య ప్రసంగాలు, శాస్త్రార్థాలు జరుపుతూ, అసాధారణ ధారణా ధోరణితో పృచ్ఛకులకు సమాధానం చెబుతున్నాడు. ఆయన కంఠధ్వని శంఖధ్వని లాగ పురమంది రాన్ని తరంగితం చేసింది.

కొంతసేపటికి పండితులందరూ ఒక్కుమ్మడిగా లేచి, ఆ యువ పండితునికి కాశ్మీరు శాలువలు కప్పారు. పూలదండలు వేశారు. జయ జయ ధ్వానాల మధ్యన "అవధాని శిరోమణి" బిరుదం ప్రకటించారు. వందల కొలది ప్రశంసా పద్య పుష్పాలు కురిపించారు. అదీని, స్వజన్మ స్థలంలో ఈ సన్మానం ఆ పండితునికి!

ఆ "అవధాని శిరోమణి" మరెవరో కాదు, నేటి మన ఆస్థాన కవివతంసులు శ్రీ కాశీ కృష్ణాచార్యులవారే.

తొంభయిరెండేళ్ళు పైబడి నేడు దేహం ధనుస్సువలె వంగినా, తొణుకూ, బెణుకూ లేని ఆ మాటతీరు, శరీరపాటవం, కొద్దిగా సడలినట్టు కనిపిస్తున్నా, పొంగులు వారే ఆ ప్రవచనోత్సాహం, తపస్సుతో, సారస్వత తపస్సుతో ఉజ్జ్వలించే ఆ ఆకార సంపద - కృష్ణాచార్యులవారిని చూచినవారు తొలి చూపులోనే, ఏ కారణ జన్మునో దర్శించి కృతకృత్యులమయామని తనిసిపోక తప్పదు.

కృష్ణాచార్యుల వంటివారు ఎక్కడైనా అపూర్వంగానే అవత రిస్తారు. వారొక మహా సంస్థ. ఇటు సాహిత్యం, తర్క వేదాంత గణితాది శాస్త్రాలు, అమరవాణి మొదలు ఆంగ్లం వరకు అనేక భాషలు, అటు సేద్యం, సంగీతం, వీణా వేణు, వాయులీన మృదంగాది జంత్రవాద్యాల నైపుణ్యత, వడ్రంగం, కమ్మరం, కుమ్మరం, నేత, ఈత, వంటకం, వ్యాయామం, కుస్తీ, గరిడీ - ప్రాచీనులు చెప్పిన చతుష్షష్టి కళలూ, ఇంకా మిగిలినవీ ఆపో శనం పట్టిన అగస్త్యులు ఈ విద్యలకన్నిటికీ వెన్నెల మెరుగుగా,



మెరుగు వెన్నెలగా హాస్యరసం. "నాకు హాస్యరసం ఇష్టం. అది లేకపోతే అంతా నిద్రపోతుంది" అంటారు వారు.

జీవితపు లోతులు, ఆశల అంచులు చూచిన పూర్ణవ్యక్తికి హాస్యాసక్తి కలగడంలో ఆశ్చర్యమేముంది? హాస్యమే వీరి అభిమాన రసపోషణ. పోతే, నూనూగు మీసాల నూత్న యవ్వనం నుండి అవధాన ప్రణిధానాలలోను, తర్క కర్కశ వాక్యార్థాల లోను, హరికథా పురాణ కాలక్షేపాలలోను, ఆపామరపండితం ప్రజలను వినోదింప జేయడం ఎలా సంభవిస్తుంది? దాని బలం తోనే వారు పైలా పచ్చీసులో అరగంటకు నూరు పద్యాలు నుడివి షార్ట్‌హ్యాండ్ వడిని గూడ గడగడమనిపించారు. అశ్రుతా నేక విశేషార్థాలతో పురాణేతి హాసాలు ప్రపంచించి "పౌరాణిక రత్న" అయ్యారు. కొన్ని వేల మంది శిష్య ప్రశిష్యులను సంత రించుకొని "విద్యావార్థి" అయ్యారు. "తర్క విద్వదుభయ కవి మిత్రులు" అయ్యారు.

ప్రకృతి చికిత్స అంటే ఆచార్యులవారికి పరమాదరం. చిన్న నాడే ప్రకృతి చికిత్సాభ్యాసం, యోగాభ్యాసం మొదలయినవి ఆచరణలో పెట్టారు. శ్రమజీవన గౌరవం కూడా గ్రహించినవారు. వారి జీవితం నియమబద్ధం, ఎక్కు పెట్టిన విల్లులాగ ఉన్న దేహయష్టితో, ఎక్కుపెట్టిన నిష్ఠతో నేటికీ పంచ పంచ ఉషః కాలంలోనే శీతల జలస్నానం ఆచరించి, అనుష్ఠా నానంతరం



స్వగృహంలోనే ప్రతిష్ఠించిన వీరాంజనేయ మూర్తిని పూజించడం, నియతంగా ఆహారం ఆరగించి సాయంకాలం వరకు విద్యాగోష్ఠి నెరపడం వారి దినచర్య. ఈ గోష్ఠిలో హాస్యరసం చిప్పిలని మాటంటూ ఉండదు.

"మీరు ద్వైతులుగదా! ఆలంకారికులందరూ అద్వైతులే. వారి అద్వైతపరమైన రసస్వరూపనిరూపణంతో ఎలా ఏకీభవిస్తారు?" అని వారిని నేను ప్రస్తుతం వారు స్థిరపడిన గుంటూరులో దర్శించుకొన్నప్పుడు ప్రశ్నించాను. "నేను ద్వైతిని. ఇతరులనూ నేను ద్వైతులనుగానే భావిస్తాను. శంకరాచార్యుల వారూ ద్వైతే అని నా అభిప్రాయం" అని వారు సమాధానం చెబుతూ,

"ద్వైతము లుబ్ధసుఖద, మ
ద్వైతము తస్కర సుఖప్రదంబు, విశిష్టా
ద్వైతము యాత్రిక సుఖదము,
భూతలమున మొత్తమునకు మూడును మెరుగే"



- అంటూ ఎన్నడో సద్యస్ఫురణతో చెప్పిన పద్యం ఛలోక్తిగా ఉదహరించారు.

పది సంవత్సరాల ప్రాయం నుంచే పద్యాలు చెప్పడం ప్రారంభించి, 19వ ఏట గుంటూరులో తొలి అవధానంలో జైత్రయాత్ర సాగించినా, సహస్రాధికంగా శాస్త్రార్థాలు జరిపినా, పది పన్నెండేళ్ళపాటు ఆంధ్ర సంస్కృతోపాధ్యాయులుగా పనిచేసినా, ఏదో వెలితి, ఏదో కొరత కనిపించింది వారికి. అమరవాణీ ప్రచారానికి జీవితం అంకితం చేయడం తమ లక్ష్యమని నిశ్చయానికి వచ్చారు.

ఇంతలో ఒక చిన్న సంఘటన వారి నిశ్చయానికి ప్రోది చేసింది. ఒకమారు తండ్రి తద్దినానికి అధికారులు సెలవివ్వలేదు. దానితో "ఈ సేవక వృత్తి ఏమిటి?" అని ఈసడించుకొని ఉద్యోగానికి స్వస్తి చెప్పి, సంస్కృత భాషా ప్రచారానికి సమాయత్తులయారు. "మాతృభాషా సమాజం" స్థాపించారు. "మాతృభాష" అన్న సంస్కృత పత్రికను నడిపారు. ఆంధ్ర, తమిళ, కన్నడ ప్రాంతాలలో పర్యటించి ఖంగుమనే కంఠంతో ఉపన్యాసాలిచ్చారు.

వారు స్వతహాగా మహావక్తలు, హాస్యచతురులు. పద్యస్ఫూర్తి వారి సొమ్ము. సభ ఎంత పెద్దదైతే, అంత గొప్పగా వికసిస్తుంది వారి వక్తృత్వం. "అష్టవర్ష ప్రభృతి ఆశరీరపాతం అమరవాణీ సముద్ధరణే ప్రయతమానః కాశీ కృష్ణః" అంటూ ఉంటారు, ఎల్లప్పుడూ మేఘ గంభీర నిర్ఘోషంతో.

తమ ప్రచారానికి అనువుగా సంస్కృత బాల బోధినులు, సంస్కృత సంవాదం, వాల్మీకి చరిత్ర మొదలయిన సంస్కృత



గ్రంథాలు రచించారు. వారి సంస్కృత వాచకాల సరళతకు విస్తుపోయిన జర్మనీ పండితులు వారిని తమ దేశానికి ఆహ్వానించారు, ద్వితీయ ప్రపంచ యుద్ధ సమయంలో. "ఈ వయస్సులో ఈ కర్మణ్యదేశం వదలి ఆ శర్మణ్యదేశ నివాసమా?" అని మన సారా నవ్వి నవ్వించారు ఆచార్యులవారు ఆ ఆహ్వానం అందజేసినవారిని.

రెండు తరాల వీరి నిరంతర సారస్వత సేవకు మెచ్చి రెండు సంవత్సరాల క్రితం వీరిని రాష్ట్రపతి సంస్కృత విద్వ న్మూర్ధన్యులుగా సన్మానించారు.

"పత్రికలలో సంస్కృత పాఠాలు వ్రాయదలచాను. శక్తి ఉడిగిపోతున్నది. అయినా పిచ్చాశ ఉంది. విమానంలో తిరిగి సంస్కృత ప్రచారం చేద్దామని ఉంది" అంటారు వారు. "మురారేః తృతీయః పంథాః" లాగ సంస్కృతోద్ధరణకు పూనుకోడమేమిటి ఈ పరమాణు - రాకెట్ యుగంలో? అనుకోవచ్చు మనం. కాని, సంస్కృతం జాతీయ భాష కాగలదని, విశ్వభాషే కాగలదని వారి నమ్మకం. అంతేకాక ప్రాచీనతత్త్వం పునశ్చరితం అవుతుందనీ వారి విశ్వాసం. "అవర్ సైన్స్ బిగిన్స్ వేర్ వెస్టర్న్ సైన్స్ ఎండ్స్. కాలో విశాలః విపులాచ పృధ్వీ" అంటారు వారు. ఈ దృష్టితోనే అశుప్రబంధః, సంస్కృత స్తోత్రాణి మొదలయినవి అచ్చు వేయిస్తున్నారు.

కృష్ణాచార్యులవారికి మరొక కోరిక ఉన్నది. సేవకు, జిజ్ఞాసకు సమాప్తి అంటూ లేదని వారి నమ్మకం. 'ఓం' అనే శీర్షిక కింద, తమకు జ్ఞానం కలిగిన తర్వాత ఎనభై నాలుగు సంవత్సరాలుగా పొందిన అనుభవమంతా వ్రాయదలచారు. ఓం అంటే ప్రపంచం అని వారి నిర్వచనం గనుక, దీనిలో "గద్యాలు, పద్యాలు, శ్లోకాలు, పాకాలు" అన్నీ ఉంటాయట. దీని రచనకు ఆరు మాసాలు తీరికగా కూచుంటే చాలునన్నారు.

వారికి ప్రస్తుతం - తొంభై రెండేళ్ళకు - చూపు కొంచెం తగ్గింది. అంతేవాసి శ్రీ అమరేశ్వర శాస్త్రి మొదలయినవారు గ్రంథాలు, అనుదిన పత్రికలు, ప్రూఫులు చదివి వినిపిస్తుంటారు. వారితో

ఆచార్యులవారు దైనందిన చర్యలోను సంస్కృతమే వ్యవహరిస్తుంటారు. తప్పనిసరైతే తెలుగు.

ఆచార్యులవారికి ముగ్గురు కుమార్తెలు, మనుమలు, ముని మనుమలు ఉన్నారు. పౌత్రుడూ ఉన్నాడు. అయినా, తనను మించిన చెట్టంత కుమారుడు వ్యాసాచార్యులను కోల్పోయినపుడు మాత్రం వారి కంటిలో నీలి నీటితెరలు కనిపించాయి.

"నన్ను మించిన కొడుకును మన్ను చేసికొన్న పాపిని జావలేకున్నవాడ!" అని కూడా ఆవేదన పడ్డారు. అయినా, అది క్షణికం. తర్వాత యథారీతిగా అమరవాణీ సేవ సాగిపోయింది.

అంతటి చతుష్షష్టి కళాప్రపూర్ణుడు, సహస్రానేక శిష్య ప్రశిష్య సంతతిగల కులపతి, విద్యావారాంనిధి, "శిష్యోహం సర్వ లోకానాం, న మే శిష్యోస్తి కశ్చన" అని అన్నప్పుడు ఎంతటి వారికైనా ఒళ్ళు జలదరిస్తుంది.

వీరు వాస్తవంగా ఆర్ష సంప్రదాయ ప్రతినిధులు, ఆస్థాన కవి సింహాసనార్హులు సుమా! - అని తమకు తెలీకుండానే గౌరవభావం మనసులో పొటమరిస్తుంది.

ఆచార్యులవారి వయస్సుకు అనుగుణంగా తొంభయి రెండు వేల రూపాయల నిధిని పోగుచేసి, ఏ విశ్వవిద్యాలయం లోనో వారి నామధేయంతో సంస్కృత భాషాపీఠం నెలకొల్పాలని వారి అభిమానులూ, అంతేవాసులూ చేస్తున్న కృషి సార్థకం కానీ!



# మరపురాని మహత్వం



## మాడపాటి హనుమంతరావు



25



శ్రీ మాడపాటి హనుమంతరావుగారిని తెలంగాణాలో ఆనాడు, ఆంధ్రప్రదేశ్ అంతటా ఈనాడు తెలియనివారు ఎవరూ లేరు. వారు ఆనాడు తెలంగాణాలో సంఘసేవోద్యమాన్ని తమపరం చేసుకొనకపోయి ఉంటే తెలంగాణా పునరుజ్జీవనం, ఆంధ్రావళి సమైక్యం సాధ్యమయ్యేవి కావు. "అభిమాన శూన్యులు, అవివేక పూర్ణులు" అని ఆంధ్రులకు ఆనాటి నిజాం ప్రభుత్వాధికారు లిచ్చిన బిరుదాలు రూపుమాపి, పెక్కు సంఘ శ్రేయోద్యమాలకు నారులు పోసిన "ఆంధ్ర పితామహులు" వారు. అర్ధ శతాబ్ది సాధనతో వాటిని చిగిరింపజేసి, పూయించి, ఫలింపజేసిన "పద్మ విభూషణులు" వారు.

వారికి కుందేటి పరుగుపై నమ్మకం లేదు; వారిది తాబేటి నడక. వారి రథం ఎప్పుడూ ఎడమవైపే; ఏనాడూ తక్కిన బండ్లకు అడ్డుతగిలి ముందుకు దూసుకొని పోలేదు. ఒకొకప్పుడు వారు, తమ రథం గుర్రాల వాగెలను బిగబట్టి వెనుకవచ్చే బండ్లకు ముందుకు సాగిపొమ్మని చేయి విసరడమూ కద్దు. ప్రజాకార్యం నున్నని జారుడుబండ అని వారికి తెలుసు. పరుగు తీసినకొద్దీ ప్రమాదమే. అంటే, వారు సావధానస్వరూపం. వారిని వీరిని పక్కకు నెట్టి కూచునే ఆశ వారికి లేదు. వెనుకనే ఉండి విప్లవాగ్నిని రాజబెట్టడమే వారి సంతృప్తి. కనుకనే ఎన్నో పదవులు వారిని వరించి వరించి విసిగి వేసారాయి. వారిలో ఆదర్శపు వేడి ఉంది; ఆ వేగపు మంటలు లేవు. కన్నులకు లక్ష్యం ఉంది; కాళ్ళకు వడి గడబిడ లేదు. తూకం వేయకవారు ఏ పనికీ చేయి వేయలేదు; వేయరు. కాళ్ళు చాచడానికి ముందు పక్కను కొలిచే వ్యావహారిక వివేకం వారిది. పట్టినపని పండయ్యేవరకు ఫాలా క్షునికి కూడా తెలియనీని రహస్యగోపనం. వారికి మహారాష్ట్రుల మిత వ్యయం, గుజరాతీల చదరంగపుటెత్తులు, కన్నడుల ఓపిక పట్టు వడ్డాయి. వీటివల్లనే కాబోలు వారు రాజ కీయాల జోలికి పోకుండా పలురీతుల సంఘ శ్రేయోద్యమాలను నిజాం



ప్రభుత్వం సంకురుమయ్య చూపు పడకుండా నడప గలిగారు. ఇంతయినా మానవసహజమైన దౌర్బల్యచ్ఛాయలు, తప్పులు వారి సన్నిధిని నడయాడవు. అంతా అసిధారావ్రతం; అచంచల నియమం.

మాడపాటివారు కృష్ణా జిల్లా నందిగామ తాలూకా పొక్కు నూరులో 1885 జనవరిలో జన్మించారు. వారి తండ్రి వెంకట ప్పయ్యగారు వారి ఐదవ ఏటే పరమపదించడంవల్ల తల్లి వెంకటసుబ్బమ్మగారు వారిని, వారి సోదరులు తిరుమలరావు గారిని వెంటబెట్టుకొని, సూర్యాపేటలో తాలూకా సిరస్తాదారీచేసే తమ సోదరులు జమలాపురం వేంకటరావుగారి ఆశ్రయం పొందవలసి వచ్చింది.

మాడపాటివారు సూర్యాపేటలో తిరు నగరి నరసయ్యగారనే ఛాత్తాదవైష్ణవోపాధ్యాయుని ప్రైవేటుబడిలో మూడేళ్ళు చదివారు. తర్వాత ఇబ్రహీం పట్టణంలో ఒక మేరువ కులస్థుని (దర్జీ) పాఠశాలలో నాలుగైదు నెలలు చదువుకున్నారు. పిదప నల్ల గొండలో పేష్కారుగా ఉంటున్న రెండవ మేనమామ రామచంద్ర రావుగారి వద్ద ఉంటూ ఉరుదూ, ఫారసీ, తెనుగు చదువుకుని, 1898లో ఉరుదూ మిడిల్ పరీక్షలో అవ్వల్ దర్జాలో ప్యాస య్యారు. బంగారుపతకం కూడా సంపాదించారు. తర్వాత భువన గిరిలో ఉండి, ఇంగ్లీషు అప్పర్ ప్రైమరీ పరీక్షలోను, 1899లో ఇంగ్లీషు మిడిల్‌లోను, 1902లో వరంగల్ నుంచి మద్రాసు విశ్వవిద్యాలయం మెట్రిక్యులేషన్ పరీక్షలోను ప్రథములుగా ఉత్తీర్ణులయారు.

ఇంతలో రెండవ మేనమామ మరణించడంతో వారికి కళా శాలలో చదివే అవకాశం కలుగలేదు; మీదుమిక్కిలి కుటుంబ భారం కూడా తలపై పడింది. కనుక, వారు 1904లో హనుమ కొండలో స్కూళ్ళ ఇన్‌స్పెక్టరు ఆఫీసులో గుమాస్తాగా చేరవలసి వచ్చింది.



ఈ గుమాస్తాగిరి చేసిన ఎనిమిదేళ్ళకాలమూ వారి సర్వతో ముఖ వికాసానికి, బహుముఖ సంఘసేవకు మూల బంధ మయింది. అప్పుడప్పుడే దేశంలో విస్తరిస్తున్న గ్రంథాలయో ద్యమం వారి సేవాదృష్టిని ఆకర్షించింది. అన్నిటికీ చదువే పదిలమైన పునాది గనుక కొందరు మిత్రుల సహకారంతో రాజ రాజనరేంద్రాంధ్రభాషానిలయమనే గ్రంథాలయం నెలకొల్పారు. తెనుగు సాహిత్యం బాగా అధ్యయనం చేశారు.

"ఆ కాలంలో హైదరాబాదులో ప్రముఖ న్యాయవాదులు మహారాష్ట్ర ప్రముఖులైన వామన్ నాయక్‌గారు, కేశవ్‌రావ్‌గారు (శ్రీ వినాయక్‌రావు విద్యాలంకార్ తండ్రిగారు). కేశరావుగారు ఒక ముకద్దమాలో వాదించడానికి వరంగల్ వచ్చారు. వారు ఉరుదూ చాల పేలవంగా మాట్లాడేవారు. వాద ధోరణీ పటిష్ఠంగా ఉండేది కాదు. ఇంగ్లీషు అసలే రాదు. నాకు ఇంగ్లీషు బాగా వచ్చు. ఫారసీలోను, ఉరుదూలోను అప్పటికే చక్కని శైలి అలవరచుకున్నాను. వకీలుగా ఉంటే కేశవరావ్‌గారి కంటే బాగా షైన్ కాగలనని, తెలుగువారికి ఎక్కువ లాభం కలిగించ వచ్చు"నని అనుకున్నారు మాడపాటివారు. ఈ తలపు కలగడమే తరువాయి - ఒక ముస్లిం మిత్రుని ద్వారా హైదరాబాద్ నగరం లో శాసన నిర్మాణ శాఖలో అనువాదకుని పదవి సంపాదించి, హైకోర్టు వకీలు పరీక్షకు చదవడం ప్రారంభించారు. ఐదేళ్ళలో ఉత్తీర్ణులయి, నౌకరీకి ఆదాబ్‌అర్జ్ చేసి, వకాలత్ మొదలు పెట్టారు. అప్పుడే భార్యావియోగం సంభవించింది. మనస్సు చివుక్కుమని, ఆ వృత్తి తగదేమో ననిపించింది. అయినా, ప్రజాసేవా దృష్టి ముందుకు లాగింది. 24 సంవత్సరాలపాటు లాయరుగా ఉన్నారు.

ఈ ఇరవైనాలుగేండ్లు మాడపాటివారి సేవాదీక్షకు స్వర్ణ




యుగం. వారు వివిధ రంగాలలో నారులు పోసి వాటిని పెంచి పెద్దవి చేశారు. అవి - నారాయణగూడ బాలికల పాఠశాల మొదలయినవి వారు చూస్తుండగానే మహావట వృక్షాల యాయి. ఒకవైపు గ్రంథాలయ విస్తరణ, మరొకవైపు మహిళాభ్యుదయం, వేరొక వైపు సాహిత్య విస్తృతి, ఇంకొకవైపు వర్తక స్వాతంత్ర్యం, బేగారీ నిర్మూలనం - ఇలా రకరకాల కార్యకలాపాలు - వాటన్నిటికీ మీగడతరకగా ఆంధ్రోద్యమం. ఈ ఉద్యమ ప్రాదుర్భావానికి ఒక అపూర్వ సంఘటన జరిగింది. అప్పటి బహిరంగసభలలో ఉరుదూ, మరాఠీలలోనే ప్రసంగాలు జరిగేవి. మాడపాటివారు మొదలయినవారు ఒక సభలో తెనుగులో ప్రసంగించబోగా కొందరు ఆక్షేపించారు. దానితో ఆంధ్రమహాసభ అవతరించి 1930లో జోగిపేటలో తొలి సమావేశం జరిపింది.

ఈ ఉద్యమాలన్నిటికీ మొదట్లో సకల కార్యకర్తలూ వారే. సభ ఏర్పాటు చేయడం, ఆహ్వానాలకు చిరునామా వ్రాయడం, టపా బిళ్ళలు అతికించడం, సభ ముగిసిన తర్వాత వార్తలు పత్రికలకు వ్రాసి పంపడం - నాంది మొదలు భరతవాక్యం వరకు వారే. (వారు తమ భావాల ప్రచారం కోసం ముషీర్ - ఇ - దక్కన్ అనే ఉరుదూ పత్రికకు పదమూడు సంవత్సరాలపాటు సంపాదకులుగాను ఉన్నారు. హైదరాబాద్ మేయర్ అయిన తర్వాత మానుకున్నారు.) ఈ కార్యకలాపాలలో రాజకీయ ప్రసక్తి లేదని, తను మితవాదినని వారు ఎలుగెత్తి చాటేవారు. అయినా పలువురు ఫిర్యాదు చేశారు. "నీలగిరి", "తెలుగు పత్రిక" వంటి వార పత్రికలలో ఆకాశరామన్న ఉత్తరాలూ వ్రాశారు. ఆంధ్రోద్యమం ఉత్తరోత్తరా ప్రమాదకరమని అప్పటి నిజాం మంత్రులూ హెచ్చరించారు. ప్రభుత్వం కూడా రాజకీయమనే అనుమా



నించింది మొదట్లో. కార్యకర్తలను కష్టపెట్టింది. మాడపాటి వారినుంచి అండర్‌టేకింగ్ కూడా తీసుకునేది.

"కాని కర్నల్ ట్రెంచ్, టాస్కర్ అనే ఇద్దరు ఆంగ్లేయులు మంత్రులుగా వచ్చారు. వారిలో టాస్కర్‌కు తెనుగు వచ్చు. మా కార్యక్రమం ఆయన స్వయంగా పరిశీలించారు. దానివల్ల నాకు ఇబ్బంది తగ్గింది. నిజామాబాద్ సమావేశంలో ఆంధ్రమహాసభ రాజకీయ సంస్కరణలు కావాలని కోరింది. నేను టాస్కర్‌కు ఉత్తరంవ్రాసి, ఆంధ్రమహాసభ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చాను. టాస్కర్ నా నిజాయితీకి చాల సంతోషించారు. ఆయన ఇప్పుడు స్వాన్సీలో ఉన్నారు" అన్నారు మాడపాటివారు. నిజమే. భీకర దమననీతి ఎదుట మితవాద విధానమే మెరుగు.

"మీరు అప్పట్లో కాంగ్రెస్‌లో చేరలేదేమి?" అని ప్రశ్నిస్తే, "అప్పటి నాయకులు కాంగ్రెస్ సభలకు వెళ్ళేవారు. విరాళాలు సేకరించేవారు. తర్వాత సంవత్సరం దాక ఆ విషయం తల పెట్టేవారు కారు. కాంగ్రెస్ కంటే ఆంధ్రోద్యమం ముఖ్యమని నమ్మాను. నేను జైలుకు వెళ్ళలేదు. మాడరేటుగా ఉన్నాను. ఆంధ్రోద్యమం - నా పని పూర్తయింది. తర్వాత కాంగ్రెస్‌లో చేరాను" అని వకీలుగా వారు మాట్లాడుతున్నప్పుడు, ఆ మహా వ్యక్తి మితవాది కాదు, మహా విప్లవవాది అని మనకు స్పష్ట మవుతుంది.



ఆంధ్రమహాసభలను వారు గ్రామసీమలలోనే జరిపించే వారు. వాటికి పెట్టుబడి పెట్టినవారు వైశ్యులు. గ్రంథాలయ సభలలో వర్తక సంఘాల ఏర్పాటు చేశారు. 'బేగారీ' (వెట్టి చాకిరీ) అనే పుస్తకమూ వ్రాసి ప్రచారం చేశారు. ఇవన్నీ మిత వాదపు మాటున మహావిప్లవవాదం కాక మరేమిటి?

న్యాయవాద వృత్తిలో వారు న్యాయంగా ఉన్నారు. న్యాయ మైన రుసుమే పుచ్చుకొనేవారు. అందువల్లనే ఆ వృత్తిలో వారు రాణించలేకపోయారు. "క్రమంగాలేని కేసులు వదిలివేసే వాణ్ణి. కక్షిదార్లు నమ్మకపోతే కేశవరావుగారి వద్దకు, విశ్వేశ్వర్‌నాథ్‌గారి వద్దకు పంపేవాణ్ణి. వారూ వద్దనేవారు. ఒకమారు నాకు నచ్చని ఒక కేసును అంబాదాస్‌రావుగారి వద్దకు పంపాను. ఆయన 'ముకద్దమా చల్‌సక్‌తా హై' అని వ్రాసి, 'మీకు ప్రపంచ జ్ఞానం లేదు. నేను తీసుకున్నాను' అని తర్వాత నాతో అన్నారు. ఆ కేసు విషయంలో హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి, అంబా దాస్‌రావుగారిని అధిక్షేపించారు పాయింట్లు సరిగా లేవని. రెండు సంవత్సరాల తర్వాత నేను నల్లగొండకు వెళ్ళినప్పుడు ఆ కక్షిదారు పది రూపాయల మిఠాయితో నా వద్దకు వచ్చి నా చిత్తశుద్ధిని ప్రశంసించాడు" అని వారు ఒక పూర్వగాథను తెలిపారు.

సాహిత్యంలోను వారి స్థానం విశిష్టం. వారిది సంఘ శ్రేయస్సాహిత్యం. చిన్ననాటినుంచే పోతన, పెద్దన వారికి ఇష్టం. ఎప్పుడో చదివిన భాగవత పద్యాలు తర్వాతి జీవితంలో అర్థమ యాయని వారు అన్నారు. హాలీ కవి రచనలంటే వారికి ఎంతో



నప్పుడు నగరవాసులు వారిని తొలి మేయర్‌గా ఎన్నుకున్నారు. మొదటి మేయరు ఆంధ్రుడు, అందులోను మాడపాటి వారి వంటి వారు కావడం విశేషం. 1958లో ఆంధ్రప్రదేశ్ శాసన మండలి ఏర్పడినప్పుడు మొదటి అధ్య క్షులూ వారే. నేడూ ఆ పదవిని సర్వపక్ష రంజకంగా వారు నిర్వహిస్తున్నారు.

వారు తమ సతీమణి (ద్వితీయ కళత్రం) శ్రీమతి మాణిక్యాంబగారిని స్వయంగా చదువు చెప్పి విద్యావతిని చేశారు. ఆమె 1935లో సిరిసిల్లలో మాడపాటివారి అధ్యక్షతన జరిగిన ఆంధ్రమహాసభలో మహిళాసభకు అధ్యక్షత వహించారు. వారి ఏకైక పుత్రుడు న్యాయశాస్త్ర పట్టభద్రుడు.

మాడపాటివారు ఉదయం ధ్యానం చేసుకుంటారు. గజేంద్రమోక్షం మొద లయిన ఘట్టాల పద్యాలు ఎనిమి దింటిని పది పదిసార్లు పఠిస్తారు. తర్వాత తోటలో అరగంటసేపు తిరిగి,

ప్రీతి. మహమ్మద్ హుస్సేన్ ఆజాద్. 'ఇస్లామ్స్ రైజ్ అండ్ ఫాల్' అనే గ్రంథం వారి జీవితపథం నిర్ణయించింది. దానిలో గ్రంథకర్త చెప్పిన "ఫాల్" మనకూ వర్తిస్తుందన్న ధోరణిలో వారిని ఆలోచనా నిమగ్నులను చేసింది. వీరేశలింగంగారి గ్రంథాలు, చిలకమర్తి వారివి వారిని కర్తవ్య పరాయణులను చేశాయి. 1915లో కృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయం వార్షికోత్సవంలో చిలకమర్తివారికి సన్మానం చేశారు కూడా. ప్రేమచంద్ రచనలు వారికి హృద యాన్ని ప్రసాదించాయి. ప్రేమచంద్ కథలు తొలిసారిగా తెలుగు చేసినవారు వారే. కేల్కర్‌గారి పెక్కు మరాఠీ గ్రంథాలను వారు అనువదించారు. మహాభారత సమీక్ష, ఎపిక్ ఇండియా, క్షాత్ర కాలపు హింద్వార్యులు వారి విమర్శ గ్రంథాలు. మల్లికాగుచ్ఛం, మాలతీగుచ్ఛం కథా సంపుటాలు. ఇక మూడు నాలుగు భాష లలో వ్యాసాలు అసంఖ్యాకాలు. వారి సాహిత్య సేవను ఉస్మా నియా విశ్వవిద్యాలయం "డాక్టర్ ఆఫ్ లిటరేచర్" బిరుదంతో గౌరవించింది.

వారి ప్రజాసేవను భారత ప్రభుత్వం 'పద్మభూషణ' బిరుదంతో మెచ్చింది. 1951లో హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ ఏర్పడి

రేడియో వార్తలు విని, స్నానం చేసి పత్రికలు చూస్తారు. సాయంకాలం సభలకు, సమావేశాలకు వెళ్లుతారు. లేకపోతే టాంక్‌బండ్‌కు వెళ్ళి ఏడు గంటల వరకు ఉంటారు. తిరిగి వచ్చి భోజనానంతరం కొంతసేపు చదువుకుని, 9.30కు పడుకుంటారు.

నాయకత్వం, పదవి పలువురికి అఖండ నిధులు. నాగు బాములాగ వాటిని కాపలా కాస్తారు. కాని, మాడపాటివారి స్వభావానికి ఇది విరుద్ధం. వారి జీవితంలో ఎన్నో పదవులు వారి కాళ్లా వేళ్లా పడ్డాయి. వారు ఎన్నిటినో కాదన్నా మిత్రుల బలవంతంతో కొన్నిటిని కాదనలేకపోయారు. ఇంతవరకు వారు తమ పదవి, ప్రతిపత్తి తెలిపే విజిటింగ్ కార్డు ముక్కైనా అచ్చొత్తించుకోలేదు.

వారు గట్టు వరకు నిండిన జలాశయం. నదులన్నీ చేరిన సముద్రం. తమ ప్రయత్నాల ఫలితాలు చూచుకొని మురిసి పోయే భాగ్యశాలులు. అలాటివారు ఆంధ్రులలో అవతరించడం ఆంధ్రుల భాగ్యం.





"నాహం సంస్కృత పండితః నచ కవిః
కింత్వేష యత్నః కృతః
విజ్ఞాతుం బహుమానితాంధ్ర కవితా
మాధుర్య మాంధ్రేతరే,
కాంక్షంతీతి భృశం విచింత్య కతిచి
త్పద్యాని గేయా న్యహం
ప్రీత్యా సంస్కృత భాషయా వ్యరచయం
మా మాద్రియాంతాం బుధాః"

- అని డాక్టర్ గిడుగు వేంకట సీతాపతిగారు తాము రచించిన 'కవితోదయ చంద్రిక'లో వినయంగా పండితులను కోరారు. సంస్కృతం నుంచి, ఇతర భాషల నుంచి తెనుగులోకి అనువదించడానికే మనం అలవాటు పడ్డాముగాని తెనుగు వెలుగు జిలుగులను ఇతర భాషలలోకి తళుక్కు మనిపించడం సకృత్తుగానే జరుగుతున్నది. గిడుగు సీతాపతిగారు ఆంధ్రేతరులు ఆంధ్ర కవితా మాధుర్యాన్ని తెలుసుకొని ఆనందించడం కోసం

'కవితోదయ చంద్రిక' అనే పేరుతో తెనుగు ప్రబంధాలలో మనోజ్ఞాలయిన పద్యాలను, ఘట్టాలను, చాటువులను, క్షేత్రయ్య మొదలయిన వారి పదాలను ఎంచి శ్లోకాలుగాను, గేయాలు గాను సంస్కృతీకరించి తెలుగు సాహిత్యపు సొబగులను దిగంతాలకు విస్తరింపజేస్తున్నారు.

గిడుగువారు 'నేను సంస్కృత పండితుడిని కాను, కవిని కాను' అని చెప్పడం వినయం కొద్దీకాక మరేమి? వారికి ఒక్క సంస్కృత భాషే కాదు, గ్రీకు, లాటిన్, జర్మన్ మొదలయిన పాశ్చాత్య భాషలు, శబరాది అనాది భాషలు, తెనుగు, తెలుగు తోబుట్టువులు వాచో విధేయాలు. ప్రాచీన శబ్దశాస్త్రం, నవీన భాషా శాస్త్రం వారి అభిమాన శాస్త్రాలు. పరిశోధన, పద ప్రయోగ పరిశీలన, లిపి పఠనం, నిఘంటు రచన వారికి పైతృకంగా వచ్చిన సొమ్ము. చరిత్ర వారు తరం పాటు బోధించిన విషయం. విజ్ఞాన సర్వస్వం ప్రధాన సంపాదకత్వమే వారి భాషా సేవకు తార్కాణం. 79వ ఏటనూ వారి సింహసంహననత్వమే వారి సర్కసు ఫీట్లకు కుస్తీ పట్లకు, వివిధ క్రీడల మల్లగుల్లాలకు నిదర్శనం. వారి నటన చాతురికి, సామాజిక రంజనానికి నాటకాలు, సినిమాలు ఉదాహరణలు. వారి సంఘసేవకు పర్లాకిమిడి రాజాతో పోరాటాలు, లండన్‌కు రాయబారాలు, వలసలు - అనంతంగా పేర్కొన వచ్చు. వారిలాగ జీవితంలో వివిధ రంగాలను మెట్టి, నిమ్నోన్నతాలను చూచినవారు సాహిత్య మహారథులలో అరుదు.

గిడుగువారు విశాఖపట్టణం జిల్లా భీమునిపట్టణంలో 1885 జనవరి 28వ తేదీన జన్మించారు. తండ్రిగారయిన వేంకటరామ మూర్తిగారు అప్పుడు పర్లాకిమిడిలో ఉపాధ్యాయులుగా ఉన్నందున్న గిడుగువారి బాల్యం పర్లాకిమిడిలో గడిచింది. గిడుగువారి ప్రతిభ నాలుగోయేటే కనిపించింది. వారి నాయనమ్మ

"చింతామణి యను బ్రాహ్మడు
పంతానికి గోడ మీద పటమున్ వ్రాసెన్
అంతట వర్షము కురిసెను
కాంతామణి కంటి మీద కాకర పూచెన్"

- అంటూ ఏవేవో పద్యాలు, పాటలు వారికి చెబుతూ ఉండే వారట. పండితకోటికే పిడుగు వంటి గిడుగువారి తండ్రి రామమూర్తిగారు కొంచెం విసుక్కునేవారట, తలా తోకా లేని పద్యాలేమిటని. కాని, అప్పుడు గిడుగువారు "అది కాదు నాన్నా! గోడ మీద కాంతామణి పటం రాస్తే, వాన పడితే, బొమ్మ కన్ను తడిసింది. అందులో నీరు చుక్క ఒక్కటి కాకరపూవు అయింది" అని నాయనమ్మను సమర్థించారట. ఆమె పొంగిపోయిందట. ఈ తెలివితేటలే కాదు, వారి అల్లరికీ అంతు ఉండేది కాదు; రోషం కూడా ఒకపాలు హెచ్చే. ఎనిమిదో ఏట ఒకమారు తండ్రి గారు పాఠం చెబుతూ కొడితే, విజయనగరానికి కాలినడకన బయలుదేరిన పట్టుదల వారిది.

గిడుగువారు ఎఫ్.ఎ.వరకు పర్లాకిమిడిలోనే గడిపారు. తర్వాత మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో బి.ఎ. పూర్తి చేశారు. వారు రెండవ ఫారం నుంచీ రెండవ భాషగా సంస్కృతం చదివారు. బి.ఎ.లో అదృష్టవశాత్తు వేదం వేంకటరాయశాస్త్రిగారి వంటివారు వారికి గురువులు. హైస్కూలు రోజులలోనే వారికి నాటకాలన్నా, కసరతు కవాతులన్నా ఇష్టం కలిగింది. బుర్రా శేషగిరిరావు మొదలయిన సహాధ్యాయులతో కలిసి నాటకాలు, సర్కసులు వేసే వారు. అప్పటికి ఆ ప్రాంతంలో హార్మోనియం ప్రచారంలోకి రాలేదు. ఇత్తడి బిందెల అంచులపై లావుపాటి చీపురుపుల్లల నిలబెట్టి వేళ్ళతో రాస్తూ నాదం పట్టించేవారు.

గిడుగువారికి లాయరు కావాలనే ఆశ ఉండేది. చెన్నపురిలో విద్యార్థిగా ఉన్నప్పుడు వీలయినప్పుడల్లా హైకోర్టుకు వెళ్లుతూ భాష్యం అయ్యంగారు, కృష్ణస్వామి అయ్యరు, నార్టన్ ఎట్లా ప్రసంగించేవారో వింటూండేవారు. కాని వారి తండ్రిగారికి లాయరు వృత్తి ఇష్టం కాలేదు. రెవెన్యూశాఖలో చేరితే ఉత్తరోత్తరా గొప్పగా సంపాదించవచ్చునని వారి వాదం. లాయరు వృత్తి ప్రాప్తం కానప్పుడు ఉపాధ్యాయ వృత్తే మెరుగనుకుని వారు ఎల్.టి. ట్రెయినింగ్ అయి పర్లాకిమిడి హైస్కూలులో చరిత్రోపాధ్యాయులుగా ప్రవేశించారు. తర్వాత సంవత్సరం పాటు కోరాపుట్టిలో హైస్కూలు హెడ్‌మాస్టర్ గిరి చేసి, 1911లో పర్లాకిమిడిలో వారి తండ్రిగారు పింఛను పుచ్చుకోడం వల్ల, వారి స్థానంలో చరిత్రోపన్యాసకులుగా చేరారు.

అప్పటినుంచి ఇరవై సంవత్సరాలు వారి జీవితం వివిధ రంగాలలో కమ్మచ్చున లాగిన బంగారు తీగలాగ సాగింది. వారి తండ్రిగారు 1906 వరకు తెలుగులో అంతగా పరిశ్రమ చేయలేదు. తర్వాత యేట్స్, శ్రీనివాసయ్యంగార్ల సలహాతో తెనుగును పిడిపట్టడం ప్రారంభించారు. వ్యవహార భాషావాదం పుట్టుకు రావడంతో వారి పరిశ్రమ ముమ్మరంగా సాగింది. రాత్రి భోజన సమయంలో తమ పరిశ్రమనంతా కుమారునికి చెప్పే వారు. "బాడుదల పట్టి తెమ్ము" అనే భారత ప్రయోగం చర్చ వచ్చింది. శబ్దరత్నాకరంలో ఏదో అసంబద్ధమైన అర్థం ఉంది. కాని మూలంలోని జీవగ్రాహం అన్నది, కన్నడం లోని బాళుదల మొదలయినవి పరిశీలించగా ప్రాణాలతో పట్టుకొని అన్న అర్థం తేలింది. తండ్రిగారి పరిశ్రమంతా అయాచితంగానే తమకు



లభిస్తుండడం వల్ల, "బాలకవి శరణ్యం"వంటి గ్రంథాలలో తండ్రి గారికి తోడ్పడంవల్ల, వారి వాగ్ధాటి సహజంగానే తర్క బద్ధమైనందువల్ల గిడుగువారు వ్యవహార భాషలో "సరస్వతీ విలాసం" అని శార్దూల మాలిక మొదలయినవి రచించారు. పెక్కు ప్రసంగాలు చేశారు. "కొద్ది మొర్ర" అనే పేరుతో కొలది కొద్దిగా మారి ప్రాచీన కవుల ప్రయోగాలలో చేరిన తీరును వివరిస్తూ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి వాదానికి సమాధానం వ్రాశారు. చారిత్రక సభలు, సవర భాషా పరిశ్రమ, వివిధ భాష లలో నాటకాల ఏర్పాట్లు మొదలయినవి నిర్వహించి పర్లాకిమిడి రాజాగారి మెప్పునూ పొందారు. మద్రాసు విశ్వ విద్యాలయం సెనేట్ సభ్యులుగాను, జిల్లాబోర్డు సభ్యులుగాను, 16 సంవత్స రాలపాటు పర్లాకిమిడి మ్యునిసిపల్ సభ్యులుగాను, తెలుగు గరల్స్ హైస్కూలు గౌరవ సూపరింటెండెంటుగాను ఉన్నారు.

కాని, రాజాగారి అనుగ్రహం రాజకీయాల మూలంగా తప్పింది. పర్లాకిమిడి తాలూకాను కాబోయే ఒరిస్సా రాష్ట్రంలో చేర్చాలని రాజాగారు చేసిన ప్రయత్నంలో తెలుగువారంటే సహ జంగా ద్వేషం హెచ్చింది. ఆ సమయంలోనే (1932) కాక తాళీయంగా గిడుగువారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో సవర లను గురించి పరిశోధనలు చేసేవారు. ఆ అదను చూచి గిడుగు వారంటే పడనివారు ఆ సంవత్సరం జీతం నష్టంపై సెలవియ్య డమే కాక, ఏవో సాకులతో వారిని పనినుంచి తొలగించారు కూడా. దీనికి ప్రధాన కారణం ఆంధ్రోద్యమం. ఒరిస్సా రాష్ట్రంలో చేర్చవలసిన భాగాలను సూచించడం కోసం ఓడోనెల్ కమిషన్ ఏర్పడింది. పర్లాకిమిడి తాలూకా అంతా ఒరిస్సాలో కలపాలని రాజాగారి కోరిక. కాని, ఆ తాలూకా తెలుగువారి పక్షాన గిడుగు వారి తండ్రిగారు సాక్ష్యమిస్తూ, 1931 నాటి జనాభా లెక్కల ప్రకారం పర్లాకిమిడి తాలూకాలో నూటికి 60 మంది తెలుగు వారని, కనుక తాలూకాను చేర్చరాదని, గంగ వంశ రాజుల మాతృభాష తమ రాజధానిని ముఖలింగం నుంచి కటకానికి తరలించేవరకూ తెలుగేనని వాదించారు. రాజాగారు తండ్రిపై



కోపాన్ని కుమారునిపై చూపి, ఉద్యోగం ఊడదీశారు. దానితో గిడుగువారి జీవితం కొత్త పుంతలో పడింది.

వారు ఇక బాహాటంగానే ఆంధ్రోద్యమంలో పాల్గొన్నారు. రాజాగారితో పోటీపడి తాలూకా బోర్డు ఎన్నికలలో తెలుగు వారిని అధికసంఖ్యలో గెలిపించి తాలూకా బోర్డు అధ్యక్షులు గను ఎన్నికయారు. పర్లాకిమిడి తెలుగువారి పక్షాన 1933లో జాయింట్ పార్లమెంటరీ కమిటీ ఎదుట వాదించడానికి లండన్ వెళ్ళారు. అక్కడ 45 నిమిషాలసేపు సర్ శామ్యుయల్ హోర్ మొదలయిన వారి ఎదుట వాదించి వారిని ఒప్పించారు. ఇంగ్లండులో ఉన్నప్పుడు సర్ జార్జ్ గ్రియర్సన్ వంటి పలువురు విద్వాంసులను కలుసుకున్నారు. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం మొదలయిన విజ్ఞాన పీఠాలను దర్శించారు.(★) వారు లండన్ నుంచి తిరిగి వచ్చినప్పటి ఆనందోత్సవం చెప్పనలవి కాదు. తెలుగువారు తిలారు రైలు స్టేషను నుంచి పర్లాకిమిడి వరకు - 26 మైళ్ల వరకు - మోటారు కారులో  బాండు మేళాలతో

★ స్ట్రాట్ ఫర్డ్ ఆవన్ దర్శించి షేక్స్‌పియర్ వ్రాతపత్రులు చూశారు.

వారిని ఊరేగించి, గ్రామ గ్రామాన సన్మానించారు.

ఏమైతేనేం? ఆంధ్రుల మొరలన్నీ అరణ్య రోదనలయాయి. రాజాగారి పలుకుబడే చెల్లింది. పర్లాకిమిడి తాలూకాతో సహా 1936లో ఒరిస్సా రాష్ట్రం ఏర్పడింది. అనాడే గిడుగువారి తండ్రి గారు, తల్లిగారు అర్థ శతాబ్దం పైగా నివసించిన పర్లాకిమిడి వీడి రాజమహేంద్రవరం బయలుదేరారు. గిడుగువారు మాత్రం తమకు జరిగిన అన్యాయం కోసం రాజాగారిపై దావా వేయడం వల్ల దాని ఫలితం కోసం తర్వాత రెండేళ్ళపాటు అక్కడ నిలువక తప్పలేదు. కాని, ఆ దావా కూడా రాజాగారి పుణ్యాన వారికి ప్రతికూలంగా అయింది. వారు ఆర్థికంగా చాల బాధలకు లోనుకావలసి వచ్చింది.

ఇంతలో తలవని తలంపుగా, ఒక క్రైస్తవ మిషన్ పక్షాన సవర భాషలో బైబిలు అనువదించే పని పడింది. పర్లాకిమిడికి 20 మైళ్ళలో కొండలపై ఉన్న సరంగ్ అనే గ్రామంలో ఉంటూ ఆరు మాసాలకు మూడు గాస్పెలులు అనువదించారు. ఆ సమయంలోనే సవరలపై రేడియో ప్రసంగం కోసం చెన్నపురి రావడం తటస్థించింది. అప్పుడే గూడవల్లి రామబ్రహ్మంగారితో పరిచయం లభించడం, దాదాపు తొమ్మిదేండ్ల పాటు ఆరేడు చిత్రాలలో నటించడం జరిగాయి. వారు "స్వర్గసీమ"లో పన్నెండు పంక్తుల వాచికాన్ని ఏకదముగా చెప్పినా, వారిది ఎప్పుడూ టేక్ వన్నే కాని టేక్ టూ కాకపోయినా, "సినిమాలో ఎక్కువ ప్రతిభకు అవకాశం లేదు. సినిమా నటుని జీవితం డైరెక్టర్, ఎడిటర్ చేతుల్లో ఉంది. నాటకరంగం మీద రాణించే వాడు సినిమాలో దెబ్బతింటున్నాడు" అని వారికి తోచింది. అంతేకాక సినిమా జీవితం ఆర్థికంగా ఉపకరించినా, వారి దృష్టి సాహిత్య కృషి వైపే ఉండడం వల్ల వేటూరి ప్రభాకరుల గొప్ప పీఠికతో ప్రాచీన కవుల వ్యావహారిక ప్రయోగాల సర్వస్వమన దగిన "భారతీ శతకం" పూర్తి చేశారు. సవరలను గురించి వారి సాహిత్యాన్ని గురించి తెనుగు, ఇంగ్లీషులలో పెక్కు వ్యాసాలు వ్రాశారు. సవర పాటలను ఆంగ్లీకరించారు. వాటికి వాషింగ్టన్ లోని ఇంటర్నేషనల్ అకాడమీవారు 'డాక్టర్ ఆఫ్ లెటర్స్' బిరుదు ఇచ్చారు.

ఆ రోజుల్లోనే పిఠాపురం మహారాజావారితో వారికి పరిచయం కలిగింది. వారి ప్రోత్సాహంతో "సూర్యారాయాంధ్ర నిఘంటు" మిగిలిన సంపుటాల ముద్రణ కొనసాగింపు, "రత్నపాంచాలి"కాది నాటకాల అనువాదం చేశారు. 1948లో తెనుగుభాషా సమితి ఏర్పడి, తెలుగులో "విజ్ఞాన సర్వస్వం" ప్రారంభమయింది మొదలు దాదాపు పది సంవత్సరాలపాటు ప్రధాన సంపాదకులుగా ఉన్నారు. తర్వాత మూడు సంవత్సరాలు రచనాలయానికి డైరెక్టరుగా పనిచేసి పలువురు రచయితలను తీర్చిదిద్దారు. సాహిత్య అకాడెమీ సభ్యులుగాను, మద్రాసు బోర్డ్ ఆఫ్ స్టడీస్ ఛైయిర్మన్‌గాను ఉన్నారు. 1955 నుంచి ఆరేండ్లపాటు మరల సెనెట్ సభ్యులుగా ఉన్నారు. హిందీ విశ్వకోశ్, కన్నడ విజ్ఞాన సర్వస్వం సభ్యులుగాను ఉన్నారు. పెక్కు పుస్తకాలకు బహుమతులు పొందారు. వారు 1914లో వ్రాసిన 'హిస్టారికల్ టేల్స్' పది ముద్రణలు పొందింది. ఇటీవలే వారు తెలుగు సాహిత్య చరిత్రను ఆంగ్లంలో వ్రాశారు. దానిని సాహిత్య అకాడమీవారు ప్రచురిస్తున్నారు.

వారికి చదరంగం అంటే చాల ఇష్టం. బైసికిల్ పోటీలన్నా చాల సరదా; చిన్ననాడు 35 మైళ్ళు ఏకథాటిన తొక్కారు; 40వ సంవత్సరం వరకు జ్వరమంటే ఏమిటో ఎరుగరు. ఉదయం అయిదు గంటలకే లేచి వార్తా పత్రిక చదువుతారు. ఉదయం భోజనానంతరం కొంచెంసేపు కునుకు తీస్తారు. రాత్రి నిద్ర పట్టదు. అప్పుడు ఏదో పద్యమో, పదమో ఆలోచిస్తారు.

"మా నాయనగారు శబ్దరత్నాకరాది నిఘంటువులలో అర్థాలలోను, ప్రయోగాలలోను తప్పులని చూపిన వాటిని కనీసం వేయింటినైనా నాకు ఆయుర్దాయం ఉంటే ప్రకటించాలనుకున్నాను. ఆలస్యమయినందుకు విచారించను. సరైన పాఠ నిర్ణయానికి మన సీస పద్యాలు ఎంతో తోడ్పడుతాయి" అన్నారు వారు.

వారి మరొక మహాప్రయత్నం తెనుగు భాషా చరిత్ర. పూర్వం చెప్పితివేనిన్ అనేది చెప్పితేన్ అయి ప్రశ్నతోనే సంబంధించి ఉండేది. నన్నయ కాలానికి పురుషంతో అన్వయం పొందింది. ఇది ఇలాటి పరిణామ గవేషణతో సాగుతున్నది. ఇంగ్లీషులో వ్రాస్తున్నా తర్వాత దీనిని తెలుగు చేస్తారు.

వీటికంతా మరి రెండేండ్ల ఆయువు చాలునన్నారు వారు. ఆ రెండుకు ఇవతల ఒక సున్న ఉండాలని, భాషా చరిత్రలే కాదు పద చరిత్రా, ఇంకా ఎన్నో చరిత్రలూ వారి నుంచి వెలువడాలని, అవికూడా 'తెలుగులో ఛందోరీతులు' లాగే పాండితికి నికషంగా శాశ్వతత్వం సంపాదించుకోగలవని ఆశిద్దాం.



డా. గిడుగు వేంకట సీతాపతి స్వీయచరిత్ర 1962లో అచ్చైంది. అయితే అది సంక్షిప్త చరిత్ర మాత్రమే!

# మరపురాని ముఖం



హార్కే గుండేరావు



ఆ విద్వద్వతంసులను ప్రతి ముస్లిం ధార్మిక సమావేశానికీ ఆహ్వానించే సంప్రదాయం ఏర్పడింది. వారు పదవాక్య ప్రమాణ పారావారపారీణులు. ద్వైతాద్వైత విశిష్టాద్వైతవేదాంత నిష్ణాతులు. వేదాలను తరచి నిరుక్తాన్ని తెనుగు చేసిన "విద్యా వాచస్పతులు". అరబ్బీ, ఫారసీ, ఉరుదూ భాషలను పుక్కిట బట్టి ఇస్లాం తత్త్వశాస్త్రాన్ని భారతీయ తత్త్వభావనతో సమన్వయపరచి, ఖురాన్ షరీఫ్‌ను అరబ్బీ నుంచి, మన్సనీ షరీఫ్‌ను (సూఫీ మధురాద్వైతాన్ని) ఫార్సీ నుంచి సంస్కృతీ కరించిన రచనా ధౌరేయులు. ఆంగ్లం నుంచి పలువురి కవితలను, నాటకాలను సంస్కృతీకరించిన కవిశేఖరులు. యాజ్ఞవల్క్యుని మితాక్షరను ఉరుదూ చేసిన న్యాయా ధీశులు. తాము పరిపాలించిన జిల్లాలో అందరి మన్ననలు పొందిన అవ్వల్ తాల్లూక్దార్లు (కలెక్టరు).

ఏటా జరిగే బారహ్‌వీ షరీఫ్ (మహమ్మద్ వారి జన్మ దినోత్సవం) నాడు యథారీతిగా వారూ ఆహూతులై వెళ్ళారు. ఆనాడు ఉలేమాల సంబరం హెచ్చుగానే ఉంది. అరేబియా నుండి హబీబ్ రఫయీ అనే మహా విద్వాంసుని రాక ఆనాటి ఉత్సవం విశిష్టత. ఆయనకు అరబ్బీ భాష తప్ప మరొక భాష రాదు. కనుక చర్చ అరబ్బీలోనే జరుగుతున్నది. ఖలుల సంగతి, ముఖ్యంగా గోబలుల సంగతి ప్రసక్తానుప్రసక్త మయింది. హబీబ్ రఫయీ ఆ విద్యా వాచస్పతులవైపు తిరిగి, "మీరు అన్యధర్మం వారు. ఈ విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?" అని ప్రశ్నించారు. వారు నెమ్మదిగా లేచి, "బిస్మిల్లా ఇర్రహమాన్, ఇర్రహీమ్" అని మొదట అవిఘ్నమస్తు చదివి, దానికి సంస్కృతానువాదం

"వంద్యస్య వ్యాహరన్ నామ
ప్రారభే పరమాత్మనః,
అపార కరుణాపారా
వారస్య కరుణావతః"

అని పఠించి, "మీకూ బకర్ (అరబ్బీలో బకర్ అంటే ఆవు) పవిత్రమైందే. ఒక ఆవు ఏడు దుంబా గొర్రెలతో సమానం; పది ఆవులయితే ఒక ఒంటెతో సమానం అని హదీస్ (కురాన్ ఇతిహాసంలో) వక్కాణించిఉంది. ఒంటెను బలిగా చంపడం కన్నా, అహంకారాన్ని చంపడం 'నఫ్ సే అమ్మారా బెకుష్' (అహంకారాన్ని చంపు) గొప్ప అన్నారు. మేము గోవును పూజించి గౌరవిస్తాము. మీరు భగవంతుని పేర బలి యిచ్చి గౌరవిస్తారు. దారులు వేరే కాని, భావం సమానమే. అలాగే



బుత్ పరస్తీ (మూర్తి పూజ) విషయమూను. మీరు అసలే మూర్తి పూజ వద్దని మూర్తులను కొట్టి వేస్తారు. మేము అధికార తారతమ్యాన్ని బట్టి అవసరమంటాము. మూర్తిని మీరు నిరాక రించినా కాబా వంటి వాటిలో పోలేదు. మూర్తిని కొడితే, దేవుడు చస్తాడా? ఉద్దేశాలు ఇద్దరివీ పవిత్రమైనవే. కాలదేశాలను బట్టి మార్గాలు మారాయి'' అన్నారు. తత్త్వదర్శి అయిన హబీబ్ రఫయీ ఆ భీమబలులను ఆలింగనం చేసు కున్నారు; ఆనందబాష్పాలు రాల్చారు.

ఆ విద్యావారాంనిధులు శ్రీ హర్కారే గుండే రావుగారు. హర్కారేవారు బిదర్ దగ్గర ఒక అగ్ర హారంలో 1887 మార్చి 13న జన్మించారు. ఆరు నెలలకే మాతృవియోగం సంభవించింది. వారి తండ్రి హైదరాబాద్ హైకోర్టులో ముంతజిం (ఆఫీసు సూపరింటెండెంట్)గా ఉండేవారు. తల్లి లేని కొడుకు గదా అని తండ్రి అల్లారుముద్దుగా పెంచినా, హర్కారే వారు చెడిపోలేదు. చిన్ననాటి నుంచే వారి బుద్ధి నైశిత్యం వెలుగులు విర జిమ్మింది. మాతృభాష మరాఠీ; దేశభాష తెనుగు; మతభాష కన్నడం; నాగరకభాష ఉరుదూ - ఈ నాలుగు భాషలూ హర్కారేవారికి మాటలు రావడంతోటే పట్టుబడ్డాయి. వారి చిన్ననాటి విద్యాభ్యాసం హైదరాబాద్ సమీపంలోని షా - అలీ - బందాలోని వైదిక ధర్మ ప్రకాశికా పాఠశాలలో కొనసాగింది. రాజధాని సమీపంలోని పాఠశాలలో ఆ కాలంలో తెనుగు అంతగా లేదు. ఫార్సీ అరబ్బీలే హెచ్చు. కనుక వారు మెట్రిక్ పూర్తిచేసే వేళకే అష్ట భాషా విశారదులయారు. మెట్రిక్యులేషన్ తర్వాత బిదర్ సమీపంలోని కల్యాణ్ (బసవేశ్వరుని జన్మస్థలం) లోని మహావిద్వాంసులు శ్రీ మాణిక్యశాస్త్రి గారి వద్ద సంస్కృత నాటకాలంకారాలు చదివారు. కనకాపురం శ్రీనివాసాచార్యుల వద్ద న్యాయ (తర్క), వేదాంతాలు చదివారు.

ఇంతలో తండ్రిగారు పరమపదించడం వల్ల, పొట్ట చేత పట్టుకొని బయలుదేరవలసి వచ్చింది. సిటీ సివిల్‌కోర్టులో బస్తీ గుమస్తాగా చేరారు. తర్వాత బెంచి క్లర్కుగా పనిచేశారు. ఈ గుమాస్తాగిరీ వెలిగిస్తూనే వకీలు పరీక్షకు చదివి కామ్‌యాబ్ అయ్యారు. ఇతరత్రా గోష్ఠులలో, వాగ్వాదాలలో పాల్గొంటూ, తమకు వచ్చిన భాషలను పెంపొందించుకుంటూ, న్యాయ సాహిత్య శిరోమణి పరీక్షలలో ఉత్తీర్ణులయారు. రెండు పి.ఓ.ఎల్. పరీక్షలలోను నెగ్గారు.

వారి వివిధ భాషా పాండిత్యాన్ని, న్యాయశాస్త్ర వైశారద్యాన్ని గుర్తించి, సమున్నత బలిష్ఠమూర్తిని చూచి ప్రభుత్వం వారిని మున్సిఫ్ - మేజిస్ట్రేటుగా నియమించింది. దానిని వారు సమర్థ తతో నిర్వహించి, జిల్లా జడ్జి పదవికి వెళ్ళారు. వారిని ప్రభుత్వం అవ్వల్ తాల్లూక్‌దార్ (జిల్లా కలెక్టర్)గా నియమించింది. కాని, వారు పరిపాలన శాఖ కంటే న్యాయశాఖనే అభిమానించడం వల్ల సెషన్స్ జడ్జిగా తెలంగాణాలో పెక్కుచోట్ల పనిచేసి, ఆ పదవినుంచే విరమించారు.

వారి ప్రతిభ మొట్టమొదటిసారిగా గద్వాల పండిత పరిషత్తు లో ప్రకాశించింది. అక్కడి వైయాకరణులతో వారు వాక్యార్థానికి తలపడ్డారు. ఆ సమయంలో వారి నుంచి అకస్మాత్తుగా -

"రామా న్నామ జ్యాయః
గ్రావాణో యద్వశాత్ ప్లవంతేహి,
త్యక్తో రామేణ హి యత్
........................"

- అంటూ సంస్కృత కవిత వెలువడింది. అప్పటి నుంచి గద్వాల రాజాగారు ప్రతి ఏడూ పండిత సభకు రావాలని వారిని

కట్టడి చేశారు.

హర్కారేవారు పాల్గొనని ఓరియంటల్ కాన్ఫరెన్సు లేదు. ప్రతి సమావేశంలోను ప్రతిపాదించని మౌలిక విషయం లేదు. వారి నిశిత బుద్ధి, తర్కజటిల వాదపటిమ తిరుగులేనివి. వారి ప్రచండ పాండిత్యానికి పూనా పండిత పరిషత్తు మెచ్చి "విద్యావాచస్పతి" బిరుదం ఇచ్చి గౌరవించింది. ఇటీవల జరిగిన ఓరియంటల్ కాన్ఫరెన్స్‌లో రసనిష్పత్తిలో ధ్వనికారుని ప్రత్యభిజ్ఞావాదాన్ని ఖండిస్తూ వ్యాసం చదివినప్పుడు అలంకారికులందరూ దిగ్భ్రాంతులయారు.

యాస్కుని నిరుక్తానికి (వేదనిఘంటువుకు) వారి తెనుగు అనువాదం 'గోల్కొండ పత్రిక'లో ప్రచురితమయింది. వారు ఖురాన్ షరీఫ్‌ను సంస్కృతీకరించడంలో దానిలోని క్రియాపదాలు ఏ లకారాలలో ఉన్నాయో, తద్ధితాంతాలు ఎలా ఉన్నాయో సంస్కృతంలోను ఆ లకారాలు, ఆ తద్ధితాంతాలు వ్రతంగా వాడారు. మితాక్షరను ఉరుదూలో తర్జుమా చేయడం మౌల్వీలకు, కాజీలకు ఎంతో సహాయకారి అయింది. మస్నవీ షరీఫ్‌ను (సూఫీ అద్వైతాన్ని) ఫార్సీ నుంచి సంస్కృతీకరించడంలో వారు భారతీయ, పారసీక, అరబ్ భావనాధారల సమన్వయ దృష్టిని అనుసరించారు.

వారు ఉరుదూ సంస్కృతాంగ్లాలలో అసంఖ్యాకంగా వ్యాసాలు వ్రాశారు. ఉద్యాన పత్రిక, మధురవాణి, సంస్కృతం మొదలయిన పత్రికలు వారి వ్యాసాలతో అలంకృతమయాయి. ఉరుదూ, ఆంగ్లాలలో వ్రాసిన వ్యాసాల విషయాలు హిందూ సంస్కృతి, వైదిక సంస్కృతి మొదలయినవి. ఉరుదూ భాషేతిహాసం, మరాఠీ సాహిత్య చరిత్ర తెనుగులో వ్రాశారు.

పెక్కు ఆంగ్ల రచనలను సంస్కృతీకరించారు. థామస్ గ్రే కవి 'ఎలిజీ'ని, వర్డ్స్ వర్త్ కవి 'ఏన్ వోట్ టు ఇంటిమేషన్ ఆఫ్ ఇమ్మోర్టాలిటీ'ని, గోల్డ్ స్మిత్ కవి 'ట్రావెలర్'ను, షేక్సిపియర్ 'మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీం, హామ్‌లెట్ మొదలయిన నాటకాలను సంస్కృతీకరించారు. "ప్రశ్నోయం, సముపస్థితో మమ పురః జీవామ్యజీవామి వా" అంటూ హామ్లెట్ సంస్కృతంలో ఆలోచిస్తాడు. థామస్ గ్రే కవి "ది కర్ఫ్యూ టోల్స్ ది నెల్ ఆఫ్ పార్టింగ్ డే" పాదంతో ప్రారంభమయ్యే ఎలిజీని -

"వాదత్యేషా తపనవిరహ
ద్యోతినీ నైశఘంటా
ప్రత్యాయాంతి స్వయమిహ శనైః
గోచరాద్గో ధనాని,
స్వీయం వేశ్మానుసరతి పరి
క్లిన్నగాత్రః కృషీకః
యుంజన్ గుప్యై నిభృతజగతో
మాంచ గాఢాంధకారం"

అంటూ "చైత్యవిలాపః" అన్న ఖండకావ్యంగా మధుర గంభీరంగా అనువదించారు.

హర్కారేవారు ఓరియంటల్ కాన్ఫరెన్స్ శాశ్వత సభ్యులు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యులు.

ప్రస్తుతం వారు చార్‌మినార్ ఆవల ఉన్న అలియాబాద్‌లోని గోవిందబాగ్ అనే సొంత తోటలో విశ్రాంతి తీసుకుంటున్నారు. ఓపిక ఉన్నప్పుడు సేద్యం చేయిస్తారు. ప్రతి దినం ఉషఃకాలంలోనే లేచి, స్నానాద్యనుష్ఠానాలు తీర్చుకుని, పార్థివ లింగ పూజ చేస్తారు. ఆహార నియమంతో, వచ్చినవారిని సత్కరిస్తూ నిరాడంబరంగా సంతృప్తితో ఉన్నందువల్లనే కాబోలు, ఈ 77వ సంవత్సరంలోను వారి నడుము వంగలేదు; చూపు తగ్గలేదు; వాద పటిమ విడనాడలేదు; సమున్నత విగ్రహం సడలలేదు. వారికి సంతు లేదు. ఒకరిని దత్తు తీసుకున్నారు. ఆయన ఎల్ ఎల్.బి. పాసయి ఆంధ్ర హైకోర్టులో ఉద్యోగిగా ఉన్నారు.

"నా లక్ష్యం ఫార్సీ, ఉరుదూ, ఇంగ్లీషుల ద్వారా సంస్కృత భాషా ప్రచారం. పాణినీయం మీద ఒక మిషన్ (యంత్ర పరికరం) తయారుచేసి పరిశీలిస్తున్నాను. వేద సంహితకు కాండ సూచి సిద్ధపరుస్తున్నాను. వాటిని పూర్తి చేయాలి. 'ఉపనిషత్తత్త్వ ముక్తావళి' అన్న పేరుతో స్రగ్ధరలో ఎప్పుడో ప్రారంభించిన ఉపనిషద్భాష్యం ఇంకా పూర్తి కాలేదు. ప్రతి ఓరియంటల్ కాన్ఫరెన్స్ నా ప్రాణం. ఈసారి వెళ్ళలేకపోయాను. వ్యాసం మాత్రం పంపాను" అన్నారు వారు, ఆవేదనతో.

నిజమే. హర్కారేవారిది అపూర్వ వ్యక్తిత్వం. సజాతీయ విజాతీయ సంస్కృతులను జీర్ణించుకొని, పాండిత్యంలో పరిణతి పొంది, సాహిత్యంలోను, న్యాయాధీశుడుగా అసిధారా వ్రతంతో మెలిగే వారి వంటి వారు మన నాడులో అరుదు. వారి విజ్ఞాన భండారం వ్యర్థం కాకూడదు. వారి వ్యాసాలు, గ్రంథాలు పెక్కు సంపుటాలవుతాయి. వాటిలో కనీసం నిరుక్తం ఆంధ్రానువాదం, మస్నవీ షరీఫ్ సంస్కృతీకరణం, ఆంగ్ల రచనల అనువాదాలనైనా సాహిత్య అకాడమీ వంటి సంస్థలు ప్రచురించి పుణ్యం కట్టుకోవాలి. ఈ విషయంలో విద్యారణ్యంలో హర్యక్షుల వంటి హర్కారే వారి సహకారమూ కూడ గట్టుకోవాలి.



పెదవి దాటితే పృథివి దాటుతుందన్న సంయమం; ఆ సంయమమూ ఎప్పుడైనా సడలుతుందేమోనన్నట్టు తరుచు చుట్ట బిగింపు; ముక్తసరిగా సూత్రప్రాయమైన మాటతీరు; న్యాయం కోసం ఎంతటివారినైనా ఎదిరించగల దిట్టతనం; తమ భావాలను ఎదుటివారికి సౌమ్యంగానైనా కచ్చితంగా చెప్పే కరుకుతనం, మతభేదం కలిగినప్పుడు కుమారుణ్ణే కాదు మరొకరినైనా సహించగల ఔదార్యం,తెలియని ఏ చిన్న విషయమైనా ఏ చిన్నవాడు తెలిపినా స్వీకరించే సరసత; పరస్పరం పోటీలు పడి జీవితం నడిపిన జిజ్ఞాసా పరిశ్రమలు; తప్పని తెలిసిన తర్వాత చప్పున సవరించుకొని ముందడుగు వేసే గుండెనిబ్బరం; శత్రుత్వంతో సమీపించినవారినయినా మిత్రులనుగా మార్చే సరళతర ప్రవర్తన; కీర్తికోసం కాని, కాంచనంకోసం కాని కక్కుర్తి పడని ఉదాత్తత; పాండిత్య ప్రకర్షకోసం కాక పరిశోధితాంశాలు పదిమందికీ తెలియజేయడానికే చేపట్టిన రచనా దీక్ష; గడ్డంతో పాటే అందంగా పెరిగిన అంతరంగం; తాత్సార మేమోనన్నంతగా ఒకొకప్పుడు తలపింపజేసే తాపీతనం - ఈ ధర్మాలన్నీ సమపాళాలుగా పోతపోసిన వ్యక్తిత్వం శ్రీ తాపీ ధర్మారావుగారిది అంటే - పలురంగాలలో వారిని గురించి శాఖాచంద్ర న్యాయంగా చెప్పినట్టవుతుంది.

తాపీవారి నాయనగారు నరసింగరావుగారు పెద్ద గవర్నమెంటు డాక్టరు. వారు బరంపురానికి బదిలీ అయినప్పుడు 1887లో తాపీవారు జన్మించారు. వారి చిన్ననాటి చదువు సాములు శ్రీకాకుళంలో సాగాయి. వారు విజయనగరంలో మెట్రిక్యులేషన్ చదివి, పర్లాకిమిడిలో ఎఫ్.ఎ. పూర్తిచేసి,



మద్రాసు పచ్చయప్ప కళాశాలలో పట్టభద్రులయారు.

తాపీవారికి పసితనంనుంచే తెలుగు సాహిత్యమన్నా, విషయ జిజ్ఞాస అన్నా ఆసక్తీ, అభిరుచీ ఉండేవి. కాని, నాయనగారు పూర్తిగా దొర. పద్యాలు అల్లితే పడ తిట్టేవారు; తెలుగు చదివితే తన్నేవారు. కనుక, తాపీవారు నాయనగారు మేడమీదికి వెళ్ళే వరకు ఏ ఇంగ్లీషు పుస్తకమో చదువుతున్నట్టు నటించి, తర్వాత పద్యాలు వ్రాసుకునేవారు.

నాయనగారి క్రమశిక్షణకూడా కరుకైనదే. తమ పిల్లలు ఇంగ్లీషు బాగా చదివి, గొప్పవాళ్ళయి, పెద్ద పెద్ద సర్కారు ఉద్యోగాలు వెలిగించాలని వారి ఆశయం. తాపీవారు చిన్నప్పుడు ఒకనాడు తాంబూలం నములుతుండడం నాయనగారు చూచారు. "తాంబూలం వేసుకొంటే, చదువు రాదు" అని శాసించారు. తాపీవారు తాంబూలం మరెప్పుడూ తాకనైనా తాకలేదు. కాని, చుట్ట మాత్రం అనుంగు చుట్టంవలె అర్ధశతాబ్ది వారిని వెన్నాడింది. తండ్రీకొడుకుల ఒడ్డూ, పొడుగూ ఒక్కటే. అందువల్ల పొరపాటున ఒకరి దుస్తులు మరొకరు ధరించడం సంభవించేది. నాయనగారు కోటుజేబులో స్టెతస్కోపు కోసం తడుముకుంటే, చుట్టముక్కలు తగిలేవేళకు కొంచెం తికమక పడేవారు. ఏమంటారు తమంతటి కుమారుణ్ణి? (తాపీవారు ఆ చుట్టనూ ఇప్పుడు వర్జించానన్నారు).

తాపీవారు తలచుకొనే ఉంటే, వారి యోగ్యతను బట్టి, నాయనగారి పలుకుబడిని బట్టీ గొప్ప సర్కారు ఉద్యోగమే దొరికేది. కాని వారికది ఇష్టం లేదు. ఒక్కదానికి అంటిపెట్టుకొని ఉండడం కూడా ఆ స్వేచ్ఛాచారులకు, సాహితీ ప్రియులకు గిట్టలేదు. ఉన్నంతలో ఉపాధ్యాయవృత్తే ఉత్తమమని బరంపురంలో కళ్ళికోట రాజా కళాశాలలో లెక్కల మేస్టారుగా చేరారు. అప్పుడే (1910 - 11లో) కొందరు మిత్రులతో కలిసి "వేగుజుక్క గ్రంథమాల" స్థాపించారు. విజ్ఞాన చంద్రికా గ్రంథమాల, ఆంధ్ర భాషాభివర్ధినీ సభ తాకని విషయాలపై గ్రంథాలు ప్రచురించడం ఈ గ్రంథమాల లక్ష్యం. తదనుగుణంగానే, తెనుగులో మొట్ట మొదటి ఆంధ్ర వాఙ్మయ చరిత్రను "తెలుగునెడు కాంత" స్వీయ చరిత్ర రూపంలో "ఉషఃకాలము" అనే పేరుతో ప్రకటించారు.



మొదటి నిరూపక నవల "వాడే వీడు"; మొదటి భావ పరిణామ నవల "క్రొవ్వు రాళ్ళు", మొదటి ఆంధ్ర చారిత్రక నాటకం "ప్రేమము" మొదల యిన గ్రంథాలు వెలువరించారు. వారి కార్య వ్యగ్రతకు ప్రోత్సాహకరంగా మొట్టమొదటి ఉగాది సంచికలో (1911లో) "ఆంధ్రుల కొక మనవి" అన్న వ్యాసం ప్రచురిత మయింది. అదే వారి తొలి వచన రచన. సమకాలంలోనే ఆంధ్ర పత్రికలో (అప్పుడది బొంబాయి నుంచి వెలు వడుతున్న వార పత్రిక)-

"నల్లిరొ నిన్ను జేకొని ఘ
నంబగు నాతపమందు వైచి, నీ
వల్లల నాడుచుండ, దర
హాసము చేయుచు జూచుచుండు నీ
కల్లరి వాని దూరపు; ము
ఖంబున గోపము జూప; వెంతయో
చల్లగ నోర్చి; తౌర! ఘన
సౌఖ్యము నాకమునందు గాంచవే"

- అంటూ "నల్లిపై కారుణ్యము" అన్న శీర్షికతో ఎలిజీ వ్రాశారు. అవే వారి అచ్చయిన మొట్ట మొదటి పద్యాలు. ఆంగ్లంలోని అనేక వాఙ్మయ శాఖలను అనుసరించి, మన రచన లను కొత్త పుంతలకు తిప్పాలని రకరకాల రచనలు చేశారు.

ఇంతలో నాయనగారు కాలధర్మం చెందడం వల్ల వారు విశాఖపట్టణం తిరిగి రావలసి వచ్చింది. అప్పుడు "కొండెగాడు" అనే కానీ పత్రిక పెట్టి-

"పత్రార్ధేన ప్రవక్ష్యామి
యదుక్తం గ్రంథకోటిభిః"

- అనే హెడ్డింగుతో పి.టి. శ్రీనివాసయ్యం గారు మొదలయిన పెద్దల రచనలను ఘాటుగా విమర్శించారు. సెట్టి నరసింహంగారి "వసంత సేన"కూడ ఈ కొండెగాని కఠిన విమర్శను తప్పిం చుకోలేదు. దానితో వారి ప్రసిద్ధి విస్తరించి, కలెక్టర్ వెర్నాన్ దృష్టిలో పడింది. మైనర్ జమీందార్ల కోసం కోర్టాఫ్ వార్డ్స్ మద్రాసులో పెట్టిన న్యూయింగ్టన్ కాలేజీలో ట్యూటర్ - గార్డియన్ పదవికి వెర్నాన్,



తాపీవారిని సిఫార్సు చేశారు. తాపీవారు 1918 నుంచి పదహారు సంవత్సరాలపాటు ఊర్కాడు, చుండి, సౌత్ వల్లూరు, మందసా మైనర్ జమీందారులకు ఉపాధ్యాయులుగా ఉంటూ వారి వెంట దక్షిణ భారతమంతా తిరిగారు. వారికి ఆప్తులుగా, నిజమైన సంరక్షకులుగా ఉంటూ వారి హృదయాలు చూరగొని, వారిని క్రమశిక్షణలో పెట్టారు. ఒక జమీందారు కుమారుడు న్యూయింగ్టన్ కాలేజీ ప్రిన్సిపాలును కోపంతో తుపాకీతో కాల్చి చంపాడు. కాని, తాపీవారు మాత్రం ఎప్పుడూ ఆచార్య గౌరవాన్ని కోల్పోలేదు.

అటుతర్వాత వారు విజయనగరంలో సంవత్సరం పాటు ట్యుటోరియల్ కాలేజి నడిపారు. అలా ఉంటూనే బొబ్బిలి దివాన్‌గిరి (హెడ్ మేనేజరీ) చేశారు. అప్పుడే జస్టిస్ పార్టీ పత్రిక 'సమదర్శిని' సంపాదకులయ్యారు. సత్యాగ్రహం ముమ్మరం కావడం వల్ల సమదర్శినిని దినపత్రిక చేయడం, చెన్నపురిలో వాసం అవసరమయ్యాయి. పత్రిక జస్టిస్ పార్టీదయినా, భావాలు జాతీయాలు. కనుక ఆ పత్రిక తాపీవారి హయాములో ఎంతో ప్రజాసేవ చేసింది. వారు ఒక్కరూ వార్తలు వ్రాసి వేళ్ళు కాయలు కాచేవట.

ఆ రోజులలోనే భాషా విషయంలో వారి మతం మారింది. వారు మొదట్లో వీర గ్రాంథికవాదులు; గిడుగువారికి పర్లాకిమిడిలో ప్రియశిష్యులయినా వ్యావహారిక భాషావాదంలో వారిని ఎదిరించినవారు; 1907లో వ్రాసిన "విల్హాసార్జున" నాటకంలో గురజాడ వారిని దుయ్యబట్టినవారు కూడ. మతం మారడంతో 'కొత్తపాళీ' పేరుతో 'ప్రజామిత్ర'లో ధారావాహికంగా భాషా



కోసం అసిస్టెంట్ పబ్లిసిటీ - రెక్రూయిటింగ్ ఆఫీసరుగా పనిచేశారు. 1936 నుంచే 'సారంగధర' చిత్రంతో వారికి సినిమాతో కలిగిన సంబంధం 46-47లలో పూర్తిగా జీవనాధారమయింది. అప్పటినుంచి ఇంతవరకు దాదాపు 50 చిత్రాలకు సంభాషణలు మొదలయినవి వ్రాశారు. 49 నుంచి ఐదేళ్ళపాటు 'జనవాణి' అనే వారపత్రిక నడిపారు. తర్వాత నేటివరకు తమ పాత రచనలను పునర్ముద్రించడంలో నిమగ్నులయి ఉన్నారు.

చుండి జమీందారుకు సంరక్షకులుగా ఉన్నప్పుడు వారికి నెల్లూరు ఉనికిపట్టు. అప్పటి నెల్లూరును గురించి చెప్పనక్కర లేదు - అదొక సకల కళా కేంద్రం. అక్కడ మహా విద్వాంసులు వేదం వేంకటాచలయ్య (న్యాయ వాది) గారితో తాపీవారికి పరిచయమయింది. "వారి ప్రభావం నాపై ఎంతో ప్రసరించింది. వారు నాతో తప్ప ఎవ్వరితోనూ మాట్లాడే వారు కారు. అప్పుడే నేను మిథిక్ సొసైటీ సభ్యుడు, లిటరరీ సొసైటీ సభ్యుడు కావడం, పెళ్ళి పుట్టుపూర్వోత్తరాలు, దేవాలయాలపై బూతు బొమ్మలు మొదలయిన విషయాలు పరిశోధించాను" అని పాత విషయాలు చెబుతున్నప్పుడు తాపీవారి సంయమం సడలినట్టే కనిపిస్తుంది.

14వ ఏటే వారు 'విజయవిలాసం' గుజిలీ ప్రతిలో చదివారు. నెల్లూరిలో మిత్రులతో బిలియర్డ్స్ ఆడు కుంటూ, పద్యాలు చెప్పుకుంటూ వినోద కాలక్షేపం చేసు కొనేటప్పుడు ఒక మిత్రుడు 'విజయవిలాసం'లోని పద్యం చదివి ఆలవట్టం అంటే ఏమిటన్నాడు. వేదం వేంకట రాయశాస్త్రిగారి వ్యాఖ్యానం చూడగా, వారికి సంతృప్తి కలుగలేదు. అలాగే గుట్టసియాడ వంటి పద్యాల వ్యాఖ్యా వారికి నచ్చలేదు. ప్రతి పదంలోను జాతి, వార్త, చమ త్కారం గుప్పించానని ప్రతిజ్ఞ చేసిన వేంకటకవి హృదయం ఇంకా బాగా తెలుపాలనే సత్సంకల్పంతో విజయ విలాస వ్యాఖ్య ప్రారంభించారు. ఒక పత్రికలో కొంత ప్రకటిం చారు. సమదర్శిని సంపాదకులుగా ఉన్నప్పుడు పారిజాతాపహ రణానికి భావప్రకాశిక వ్యాఖ్య వ్రాసి పత్రికలో ప్రచురించారు.

ఊర్కాడు సంస్థానంలో ఉన్నప్పుడు శృంగేరీ పీఠాధిపతులు తాపీవారిని "ఆంధ్ర విశారదా!" అని సంబోధించి, దుశ్శాలువ లతో సన్మానించారు. అప్పుడు తాపీవారు చెప్పిన "అక్షర శారదా ప్రశంస" అన్న కవిత మన లిపి పుట్టుపూర్వాల ప్రామాణికమైన చరిత్ర సంగ్రహమే.

విషయిక వ్యాసాలు వ్రాశారు.

ఇంతలో దేశంలో ఎన్నికల సంరంభం బయలు దేరింది. (1936). పిఠాపురం రాజావారు తమ పార్టీ కోసం ఆంగ్ల తమిళ తెలుగులలో మూడు పత్రికలు పెట్టారు. వాటిలో తెనుగు పత్రిక 'జనవాణి'కి తాపీవారు సంపాద కులు. ఇప్పుడు పేరు మోసిన పత్రికా రచయితలలో చాలమంది వారివద్ద శిక్షణ పొందినవారే. జనవాణి మూడేళ్ళపాటు నడిచింది. తర్వాత వారు స్వతంత్రంగా 'కాగడా' వార పత్రిక కొన్నేళ్ళపాటు నడిపి, మద్రాసుపై బాంబులు పడగానే, పత్రిక ఆపి, చల్లపల్లికి వెళ్ళి మూడేళ్ళపాటు యుద్ధం



తాపీవారు ఆగర్భ శ్రీమంతులు; నూనూగు మీసాల కాలం నుంచి సంస్థానాధీశులతోనే మెలగి, సకల భోగాలూ అనుభవించి, వివిధ మానవ ప్రవృత్తులూ తరచినవారు. ఆడంబరాలన్నా, ఆర్భాటాలన్నా వారికి గిట్టవు. కనుకనే 'రావుబహదూర్' బిరుదం నిరాకరించారు. చిన్నప్పుడు గోల్ఫ్, చదరంగం మొదలయిన ఆటలు ఆడేవారు. గుర్రపుస్వారీలో నిపుణులు. వారి ఇరువురు కుమారులు శ్రీ మోహనరావు, శ్రీ చాణక్య తండ్రికి కీర్తి తెచ్చేవారే.

తాపీవారు ప్రస్తుతం హైదరాబాదులో శ్రీ చాణక్య వద్ద ఉన్నారు. పాత రచనల పునర్ముద్రణ చూచుకోవడం, సాహిత్య



అకాడెమీ పనులు చేయడం వారి నేటి దినచర్య. వారు తమ దృష్టినంతా నేడు విజయవిలాస వ్యాఖ్యాన ప్రచురణలో కేంద్రీకరించి ఉన్నారు. దేవాలయాల మీద బూతుబొమ్మలెందుకన్న రచన రెండవ ముద్రణ పెక్కు ఫొటోలతోను, విదేశాల మ్యూజియంలోని చిత్రాలతోను ఉదాత్త పరిశోధక ప్రచురణగా ముద్రించడానికి యత్నిస్తున్నారు.

తాపీవారిది తాబేటి నడక అని ఈ తరం ఆత్రగాళ్ళు అనుకోవచ్చు. ఆ గుణమే వారి పాత కొత్త పాళీల నుంచి సంఖ్యాతీతంగా వివిధ రచనలను వర్షింపచేసింది.

వివిధ రంగాలలో భీష్ములుగా దర్శనమిస్తూ, పాతకొత్తలకు పూవుల వంతెనగా కానవస్తున్న తాపీవారు వేదోక్తాయువుతో తమ రచనలన్నింటినీ సంపుటాలుగా ముద్రించి తమ ధర్మాన్ని నిర్వర్తింపజేస్తారు. సందేహం లేదు.

8-5-63వ తేదీ పత్రిను చూశాను. అందు శ్రీ తాపీ ధర్మారావుగారిని గూర్చి శ్రీ తిరుమల రామచంద్ర రచించిన 'మరపురాని మనీషి' శీర్షికలోని వ్యాసంలో కొన్నింటిని గూర్చి నా అభిప్రాయాలను తెలియజేయ సంకల్పించాను. ఏడవపేరా ప్రారంభంలో "అటు తర్వాత వారు విజయనగరంలో సంవత్సరంపాటు ట్యుటోరియల్ కాలేజీ నడిపారు. అలా ఉంటూనే బొబ్బిలి దివాన్‌గిరి (హెడ్ మేనేజరీ) చేశారు" అన్నారు. బొబ్బిలిలో తాపీవారు ఉద్యోగం చేసే రోజులలో (లేటు) జోసెఫ్ రెడ్డి బి.ఎ., బి.ఎల్. (రిటైర్డ్ కలెక్టరు) గారు దివాన్‌గా ఉండేవారు.

పంద్రెండవ పేరా ఆఖరివాక్యంలో "వారి ఇరువురు కుమారులు శ్రీ మోహన్‌రావు, శ్రీ చాణక్య తండ్రికి కీర్తి తెచ్చేవారే" అని తెల్పారు. వారికి ముగ్గురు కుమారులు. వారి రెండవ కుమారుడైన అహోబలరావు వారి అన్నగారికి పెంపకం.

బొత్స ఆదినారాయణ (బొబ్బిలి)

# మరపురాని మహత్వం



ఆదిరాజు వీరభద్రరావు



గోలుకొండ సీమ తెలుగు కావ్యాలలో ఎవడో "చిత్తాబుఖాను విభుడు" కనిపించాడు. సొంత పాండిత్యం వెలిగించ దలచిన లేఖకోత్తము డెవడో "చిత్తాబ్జఖాను విభుడు" అని సవరించుకొని వ్రాసుకున్నాడు. చిత్తమనే అబ్జానికి ఖానుడేమిటి? అన్వయ మేమిటి? అర్థమేమిటి? - అనుకుని వీరేశలింగం పంతులుగారి వంటివారే కానులోని 'ఖా' వ్రాలు సెబ్బర అనుకొని 'భా'గా దిద్ది చిత్తాబ్జభానుడని సాధుపాఠం చేసుకున్నారు.

ఇంతలో ఓరుగల్లు కోటలోని సంస్కృత శాసనాలలో ఒక వింత శాసనం కనిపించింది. దానిలో చిత్తాపఖానుడనేవాడు నాయకుడు. అతనికి దానిలోనే సితావఖాన అనే నామాంతరమూ ఉన్నది. ఓరుగల్లు కోటలో షితాబుఖాన్ దీవానే ఆమ్ (దర్బారుహాలు), షితాబుఖాన్ చబూతరా (వేదిక) అనేవి జనం అనుదినం చూస్తున్నవే. అంతవరకు ఇవేవో కట్టుకథలని అనుకున్న చరిత్ర పరిశోధకులను ఈ శాసనం నిజం వైపు మళ్ళించింది. "వీడెవడో మనవాడే"నని షితాబుఖానును తన వాణ్ణి చేసుకొనడానికి నిజాం ప్రభుత్వం కలలుగనింది; పరిశోధించి తేల్చండని కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారికి ఆ శాసన ప్రచురణ కార్యం అప్పగించింది. కొమఱ్ఱాజువారు అదివరకే శివతత్త్వసారం పీఠికలో ఈ విషయాన్ని గుర్తుపెట్టుకోవడం వల్ల పరిశోధన సులువైంది. కాని, దురదృష్టవశాత్తు వారిని ఆ కాలంలో కాలుడు కబళించివేశాడు. ఆ పరిశోధనను (ప్రభుత్వపరంగా కాకపోయినా) ప్రజల పక్షాన, ప్రజల కోసం కొనసాగించి, షితాబుఖాను హిందువే కాని తదితరుడు కాడని, ఏ ముస్లిం సల్తనత్తుకూ మూలపురుషుడు కాడని, సీతడు సీతాపతి అయి, ప్రాభవ దినా లలో షితాబుఖాను, చిత్తాపుఖాను అని బిరుదాలు ధరించిన వాడని ఖైఫియతులు మొదలయిన ఉపపత్తులతో, సాహిత్యం లోని ప్రస్తావనల ఉట్టంకనలతో నిరూపించారు కొమఱ్ఱాజు వారికి దీటయిన వారు మరొకరు; నిజాం ప్రభుత్వం కలలను కల్లలు చేశారు. వారే శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు.

అర్థ శతాబ్ది పైచిలుకు తెలంగాణా చరిత్ర తిరగవేస్తే, సేవా రంగంలో శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారూ, శ్రీ మాడపాటి హనుమంతరావుగారూ కవలలుగా కానవస్తారు. మాడపాటివారు సంఘసేవకు అంకితులైపోతే, ఆదిరాజువారు సారస్వతోద్యమానికి అంకితులయారు. సేవారంగాలు వేరయినా, ఇద్దరి స్వభావాలూ ఒక్కటే: ఒకే కార్యదీక్ష, తోటివారిపై ఒకే వాత్సల్యవీక్ష; ఒకే నిదానం, ఒకే ఆదాన ప్రదానం; ఒకే నిసర్గ మధుర ప్రకృతి, ఒకే నిరాడంబరోదారాకృతి; ఒకే అసిధారా వ్రతం, ఒకే అచంచల నియమానువ్రతం; ప్రజానిధుల నిర్వహణలో అదే పొదుపు, అదే అదుపు.

ఆదిరాజువారు మధిర తాలూకా దెందుకూరులో 1887లో జన్మించారు. నందిగామ తాలూకా ఆదిరాజువారి పుట్ట. వారి ఐదేళ్ళ ప్రాయంలోనే కరోడ్గిరి (కస్టమ్స్)లో గుమాస్తాగా ఉన్న వారి తండ్రి లింగయ్యగారు, పరమపదించడంవల్ల, తల్లి వెంకమాంబగారు చెల్లెలి యింట, వారు (ఆదిరాజువారు) కొంతకాలం తిరువూరు తాలూకా పెంగొలనులో మాతామహుల ఇంట, కొంతకాలం పినతండ్రి, పెదతండ్రుల యింట గడపవలసి

వచ్చింది. కనుకనే వారు "నేను తండ్రిని ఎరుగను" అంటూ ఉంటారు. చింతకానిలో పోలీసు ఠాణాలో నవిసిందా (రైటరు)గా పనిచేస్తున్న పెదతండ్రి రామకృష్ణరావుగారి ఇంట ఉన్నప్పుడూ, కొణిజెర్లలోనూ వారు వీధిబడిలో చదివారు. బడిలో వీణె సీతారామయ్య పంతుల మెప్పు, ఠాణా లెక్కలూ అవీ వ్రాసిపెట్టి పెత్తండ్రిగారి మన్ననా పొందేవారు. ఇలా పదమూడేండ్లు గడిచాయి.

కొడుకు ప్రయోజకత్వానికి వెంకమాంబగారు ఒకవైపు మురిసిపోతున్నా, అంగ్రేజీ చదువులు లేనిదే అతడు పెద్ద ఓహదేదారు కాడనే అనుమానం కలుగగానే, బల్దాకు (రాజధాని హైదరాబాదుకు) కొడుకుతో సహా పయనం కట్టారు. అప్పుడు రావిచెట్టు రంగారావుగారు హైదరాబాదు నగరంలో ప్రముఖ దేశభక్తులు, సారస్వత పోషకులు, వితరణశీలులు, తెలుగువారికి పట్టుగొమ్మ, నెలకు వంద రూపాయలు గౌరవ వేతనం పొందుతున్న మున్సబ్‌దారు. వారి సతీమణి, వేంకమాంబ ఒకే ఇంటి ఆడబడుచులు. రంగారావు దంపతులు ఆ అభిమానంతోను, నిస్సంతువులు కావడం వల్లను వారిద్దరికీ ఆశ్రయమిచ్చి, ఆదిరాజు వారిని పుత్ర నిర్విశేషంగా చూడసాగారు.

ఆదిరాజువారి జీవితం మారాకు తొడిగింది. చాదర్‌ఘాట్ హైస్కూలులో ఇంగ్లీషు మూడవ తరగతి (ఫస్ట్‌ఫారం)లో చేరారు. ఇంట్లో చెప్పించుకుని 1903లో ఐదవ తరగతి (థర్డ్ ఫారం) ప్రభుత్వ పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. అప్పుడు ఐదవ తరగతితో మిడిల్ స్కూలు ముగిసేది. తర్వాత ప్రీమెట్రిక్, మెట్రిక్. హైస్కూలు మొత్తం రెండు సంవత్సరాలే. వార్షిక పరీక్షలు డిసెంబరులో జరిగేవి. ఆదిరాజువారు తర్వాత రెండు సంవత్సరాలు హైస్కూలులో చదివి మెట్రిక్ పరీక్షకు కట్టారు. కాని, శీతాకాలం వారి శరీర తత్వానికి సరిపోనందున పరీక్షకు వెళ్ళలేకపోయేవారు. అంతతోనే వారి బడి చదువు ఆగింది.

కాని, రావిచెట్టువారి గృహం ఆనాడొక సారస్వత కేంద్రం కావడంవల్ల, నేటి కృష్ణరాయాంధ్ర భాషానిలయం (1901), విజ్ఞాన చంద్రికా గ్రంథమాల (1905)నాడు వారి ఇంటనే మొలకెత్తడం వల్ల, రావిచెట్టు వారి పక్షాన నూనూగుమీసాల ప్రాయాననే ఆదిరాజువారే గ్రంథాలయాన్ని, గ్రంథమాలను నిర్వహించవలసి రావడంవల్ల, కొమర్రాజు వారి మార్గ దర్శకత్వం అనుషంగికంగా లభించడం వల్ల ఆదిరాజువారి ప్రతిభ వేయి రేకులుగా విరిసింది, బుద్ధి పరిశ్రమ ప్రవణ అయింది.

ఆదిరాజువారు 1906 లో గృహస్థులయారు. వారి సతీమణి శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు అన్నివిధాల వారికి ప్రతిచ్ఛాయ. కొమర్రాజువారు మునగాల రాజాగారి దావాల కోసం మద్రాసులో ఉండడం వల్ల, ఇతర కారణాలవల్ల రావిచెట్టువారు విజ్ఞాన చంద్రికా గ్రంథమాలను 1908లో మద్రాసుకు తరలించారు. ఆదిరాజువారు ఊరికే చుట్టపుచూపుగా చూసిరావడానికి మద్రాసు వెళ్ళారు. రావిచెట్టువారు వారిని అక్కడే ఆపివేసి, గ్రంథమాల పనులు చూడమన్నారు.

"అప్పుడు గ్రంథమాలకు గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు కార్యదర్శి. వారు 'స్వరాజ్య' పత్రికలో సర్ అర్థర్‌లాల్‌ను 'అరెరే సర్ అర్థర్ లాల్ క్రూర వ్యాఘ్రమా!'* అంటూ విమర్శిస్తూ వ్యాసం వ్రాసినందుకు కిందికోర్టు ఎనిమిది నెలలు శిక్ష విధించింది. హైకోర్టుకు అప్పీలు చేయగా రెండు సంవత్సరాలని తీర్పు చెప్పింది. అప్పుడు పోలీసు సోదా అతి తీవ్రం కనుక ఆ కాగితాలన్నీ తగులబెట్టాము" అని ఆదిరాజువారు ఆనాటి ముచ్చట్లను మహోత్సాహంతో చెబుతూ ఉంటే శ్రోతలు మైమరచిపోతారు.

మద్రాసు నివాసం వారి సర్వతోముఖాభివృద్ధికి అవకాశాలు తీర్చింది. వారికి సహకార్యకర్తలు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, ఆదిపూడి సోమనాథరావుగారు. కొమర్రాజువారు ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ కార్యకలాపం కొంత ఆదిరాజువారితోనూ నడిపించేవారు. అయితే, వారి మద్రాసు నివాసం అట్టేకాలం సాగలేదు. 1910లో రావిచెట్టువారు కాలధర్మం చెందారు. ఆదిరాజువారి తల్లిగారూ పరమపదించారు. కొమర్రాజువారు కూడా దావాలు పూర్తికాగానే నడిగూడేనికి మకాం మార్చారు. విజ్ఞాన చంద్రికా గ్రంథమాల నిర్వహణ ఆచంట లక్ష్మీపతిగారి వశమయింది. ఈ పరిస్థితిలో మనస్సు బాగులేక 1914లో ఆదిరాజువారు హైదరాబాదుకు తిరిగి వచ్చారు.

తిరిగి వచ్చిన తర్వాత వారి జీవితం వారి స్వభావానికి అనుగుణమైన, ప్రశాంతమైన ఉపాధ్యాయ వృత్తిలో నల్లేరుపై బండివలె నడిచిపోయింది. మహబూబు కాలేజీలో ఏడేళ్ళపాటు, తాము చదువుకున్న చాదర్‌ఘాట్ హైస్కూలులో ఇరవయ్యేడేళ్ళపాటు ఆంధ్రోపాధ్యాయులుగాను, స్కౌట్ మాస్టరుగాను ఉండి 1948లో పదవి నుంచి విరమించారు. అనంతరం నారాయణగూడ బాలికల ఉన్నత పాఠశాలలో ఐదు సంవత్సరాలపాటు పనిచేసి, 1953 నుంచి 'సంగ్రహ విజ్ఞాన కోశం'లో ఎడిటోరియల్ సూపరింటెండెంటుగా పనిచేస్తున్నారు. చిన్నప్పుడు కొమర్రాజు వారివద్ద పొందిన అనుభవం విజ్ఞానకోశ గ్రథనంలో పనికి వచ్చింది.

"జీవనోపాధికి వేరే పని చేస్తూ 'స్పేర్ టైం'లో ఏదో సారస్వత సేవ చేసేవాణ్ణి" అని వారు తమ సేవను చప్పరించి వేస్తారు

* అర్థర్‌యాష్ తిరుచునాపల్లిలో కలెక్టరు. ఇతడు కాల్పులు జరిపించగా సత్యాగ్రహులు ఇద్దరు మరణించారు.

గాని, తెలంగాణాలో వారులేని సారస్వతోద్యమం లేదు; వారు కనిపించని సారస్వత సంస్థ లేదు. కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయానికి వారు రకరకాల హోదాలలో సేవ చేశారు. విద్యార్థి దశలోనే వారు దానికి మొట్ట మొదటి లైబ్రేరియన్. ఆంధ్రోద్యమానికి మూలస్తంభాలలో ఒకరు. 1921లో శ్రీ మాడపాటివారు మున్నగువారితోపాటు 'ఆంధ్ర జనసంఘం' స్థాపించారు. దానికి కార్యదర్శిగాను ఎన్నికయ్యారు. దానికి అనుబంధంగా, మరుసటి సంవత్సరం 'ఆంధ్ర పరిశోధక మండలి' నెలకొల్పారు. దానిని కొమర్రాజువారి అస్తమయానంతరం 'లక్ష్మణరాయ పరిశోధక మండలి'గా మార్చారు. దానికీ నేటివరకూ వారే కార్యదర్శి. ఆంధ్ర సారస్వత పరిషత్తు, విజ్ఞాన వర్ధనీ పరిషత్తు, ఆంధ్ర చంద్రికా గ్రంథమాల మొదలయిన పెక్కు సంస్థల మూలపురుషులలో వారూ ఒక్కరు. తెలంగాణా సాంస్కృతిక, సారస్వత పునరుజ్జీవన చరిత్రే వారి సేవా చరిత్ర అంటే చాలు. అందుకే వారికి తెలంగాణాలో అన్నిచోట్ల సన్మానాలు, అంతటి గౌరవాదరాలూనూ.

వారి కార్యదర్శిత్వంలో లక్ష్మణరాయ పరిశోధక మండలి చేసిన సేవ అసదృశం. తెలంగాణా శాసనాలు రెండు సంపుటాలు, షితాబుఖాను ప్రచురించింది. "అన్ని ఇబ్బందులలో అంతటి పని ఎలా చేయగలిగారు?" అని ప్రశ్నిస్తే, "ప్రతిదానికీ సర్కారునిగా ఉండేది. అందులో నేను సర్కారు నౌకరును. అడుగడుగునా చిక్కులే. ఒకమారు శాసనాల కోసం నిరసనదీక్ష కూడా చేశాను. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అధికారరీత్యా తాళపత్ర గ్రంథాల సేకరణకు వస్తేనే మొదట్లో నిజాం ప్రభుత్వం అనుమతించలేదు. తర్వాత లండన్ నుంచి తాఖీదు రాగా తల ఒగ్గింది" అని తమ తాళపత్ర, శాసన గవేషణ గాథలు చెబుతూపోతారు వారు.

వారికి చిన్ననాటినుంచే సరళ సుందర రచన అలవడింది. ఎప్పుడో పద్యాలూ, చెప్పడానికి ప్రయత్నించారు కాని కవనం కన్నా వచనం ఎక్కువ ప్రయోజనకరమని ఆదిపూడి సోమనాథరావుగారి సలహాపై వచన రచనకే పూనుకున్నారు. వారి మొట్టమొదటి ముద్రిత గ్రంథం రావిచెట్టు రంగారావుగారి జీవితం. అముద్రితాలు 'చిత్రశాకుంతలం' మొదలయినవి ఎన్నో! అప్పటినుంచి పుంఖానుపుంఖంగా చారిత్రక, మానవజాతి పరిశోధక వ్యాసాలు వందలాదిగా వ్రాశారు; వ్రాస్తున్నారు. వాటి లో కొన్ని ప్రాచీనాంధ్ర నగరాలు, తెలంగాణము, లలిత కథావళి, గ్రీకు పురాణగాథలు మొదలయిన సంపుటాలుగా వెలు వడ్డాయి. 'గ్రీకు పురాణ గాథలు'ను గురించి కొంత గాథ ఉంది. వారు చాదర్‌ఘాట్ హైస్కూలులో ఏదో భారతీయ పురాణ కథ పాఠం చెబుతున్నప్పుడు ఒక క్రైస్తవ విద్యార్థి ఆక్షేపించాడట. "జాతి ఎంత ప్రాచీనమైతే అంత విడ్డూరపు ఐతిహ్యా లుంటాయి. బైబిలులో నీళ్ళ మీద నడవడం వంటి కథలలాగే ప్రతి పురాణగాథలూ ఉంటాయి" అంటూ నచ్చజెప్పి, ప్రాచీన పాశ్చాత్య మత గాథలు అవలోడించి, పూర్వ గాథాలహరిలాగ 620 గ్రీకు పురాణ కథలు వ్రాశారు. వాటిలో కొన్నే ఈ సంపుటం. వారి మరొక అపూర్వ పరిశ్రమ 'కాకతీయాంధ్రదర్శిని.'

ఆదిరాజువారు ఆలస్యంగా పడుకొని, ఆలస్యంగా లేస్తారు. పగలు నౌకరీ, ఇతర వేళల్లో ప్రజాకార్యం చేయడంవల్ల ఇది అలవాటయింది. చదువూ, వ్రాతా రాత్రిళ్లే.

ఉదయం, సాయంకాలం వారే పాలు పితుకుతారు. ఇప్పుడు వారింట ఉన్న గొడ్డూ గోదా ఎవరో కసాయి కబేలాకు తోలుకొని పోతున్న నిండు చూలాలయిన గోమాత ఆరవతరం.

తువ్వాయిలన్నీ వారి ఒడిలోనే పెరిగాయి. వారికి పిల్లలు లేరు. తమకు నచ్చినవారిని పెంచడం, వారికి పెండ్లీ పేరంటం చేయడం, వారి ముచ్చట్లు చూచి మురిసిపోవడం వారికి సరదా. ఈ సరదాలను వరుసగా తీర్చుతున్న వారి సతీమణి పరదాలు లేని మనస్సును మెచ్చుకోవాలి.

"నాకు తెలియని విషయాలు తెలుసుకున్నాను. వాటిని ఇతరులకు తెలుపుదామనే ఉద్దేశంతో ఏ పనైనా చేశాను" అని వారు అన్నప్పుడు ఆ తరంవారిపైనే అపార భక్తి ఏర్పడుతుంది. అదొక కోవ. పాండిత్యం పండిన కొద్దీ ప్రశ్రయంతో పరువమయ్యే చేవగల కోవ. ఆ గుణాలు నేడు రెండు పంక్తులు వ్రాయగానే డిండిమం వాయించుకునేవారికి అబ్బితే, ఎంతో మేధ సార్థకమయ్యాని!






**వం**దేమాతరం ఉద్యమం కారుచిచ్చులాగ వ్యాపిస్తున్న రోజులు. మహావక్త విపిన చంద్రపాల్ దేశమంతటా పర్యటిస్తూ, చెన్నపురికి విచ్చేసిన సమయం. ఆయన బేసిన్‌బ్రిడ్జి స్టేషనులోనే దిగుతారని తెలిసి, చెన్ననగరం నగరమే వేలం వెర్రిగా అక్కడికి వెళ్ళి రాయపురం ఆస్పత్రి మీదుగా వీధి పట్టనంత క్రిక్కిరిసి తిరువల్లిక్కేణి వరకు ఊరేగింపుగా నడిచింది. పాల్ ప్రసంగించ డానికి ఎవ్వరూ హాలు ఇవ్వలేదు. సముద్రుడు ప్రసాదించిన తీరమే ఉందన్నారు పాల్. తొలి సారిగా మెరీనా బీచిలో ఆయన ప్రసంగించారు. ఐదునాళ్ళ ప్రసంగోత్సవం. బ్లాక్ నార్టన్ అని పేరుపొందిన ప్రముఖ న్యాయవాది శ్రీ టి.ఎన్. వెంకట సుబ్బయ్యర్ అధ్యక్షత వహించే సాహసానికి పూనుకున్నారు. విపినచంద్రుని మేఘ గంభీర గర్జనలు చెన్నపురి పౌరులను, ముఖ్యంగా యువకులను కదలించి వేశాయి.



అంతదూరమూ ఆయన వెంట తిరిగి, అన్ని ప్రసంగాలూ విన్న ఒక నవయువకుడు - అంతరంగపు ఔన్నత్యం తెలిపే ఆజానులంబిబాహువైన అత్యున్నత దేహయష్టి; విజ్ఞాన దీధితులు వెలార్చే చిరునవ్వు చిందులు; ప్రజ్ఞా నైశిత్యం పరుగులు తీసే చూపు; నిరంతర దీక్ష ప్రస్ఫుటమయ్యే ముఖ కవళిక; ఆచార్యత్వం అవతారం దాల్చినట్టున్న ఆకృతి విశేషం; మనో నైర్మల్యం నిగనిగలాడే తెల్లని ఖద్దరు దుస్తులు - తన గదిలో దీర్ఘాలోచనా నిమగ్నుడై ఉన్నాడు. అతడు 1907లో పచ్చయప్ప కళాశాలలో బి.ఎ.లో చరిత్ర మొదలయిన మూడు భాగాలలోను విశ్వవిద్యాలయ ప్రథముడుగా వచ్చాడు.

అతని సహాధ్యాయులు శ్రీ శొంఠి రామమూర్తిగారు ఐ.సి.ఎస్. చదవ డానికి ఇంగ్లండు వెళ్లుతున్నారు. ఆ యువకునికి గూడ ఆఫీసర్స్ అసోసియేషన్ వారు ఐ.సి.ఎస్. చదవడానికి స్కాలర్ షిప్ ఇస్తా మన్నారు. ఐ.సి.ఎస్. అయితే, వెంటనే

కలెక్టరీ ఖాయం. అయితే తనకు నచ్చిన ఉపాధ్యాయ పదవి చేతికి అంది ఉంది. మనస్సు ఊగిసలాడింది కొంతసేపు. విపిన చంద్రుని ఉపన్యాసం ఇంకా చెవులలో గింగురు మంటున్నది. ఒక నిశ్చయానికి వచ్చి పిడికిలి బిగించాడు. ఛస్! ఇలాటి సర్కారు నౌకరీయా? ఐ.సి.ఎస్. మానుకున్నాడు. పచ్చయప్ప కళాశాలలో హిస్టరీ ట్యూటరు పదవి స్వీకరించాడు.

అవును మరి! దేశమంతటా తన శిష్య ప్రశిష్య సంతతి తామర తంపరగా అల్లుకోవలసి ఉండగా, ఆచార్యత్వం సుప్రతిష్ఠితం కావలసి ఉండగా, కలెక్టరో, గవర్నరో, మరొకరో అయి, ఆయన కర్రపెత్తనంతో ఉండగలడా? ఆ యువకుడే ఆచార్య మామిడి పూడి వేంకటరంగయ్యగారు.

మామిడిపూడివారు 1889 జనవరిలో నెల్లూరు జిల్లా కోవూరు తాలూకా పురిణి గ్రామంలో జన్మించారు. వీరి పూర్వులు మామిడిపూడి అగ్రహారికులు. ఈ అగ్రహారం విజయనగర సార్వ భౌముడు సదాశివరాయలు మామిడిపూడి వారి పూర్వులు నీల మేఘాచార్యులకు వైదిక జ్ఞాన సంపత్తికి బహూకరించినది. మామిడిపూడివారు పురిణిలోనే చిన్ననాడు చదువుకున్నారు. గర్భాష్టమంలో ఉపనయనానంతరం తండ్రి గారి వద్ద వేదాధ్య యనం, సంస్కృతాధ్యయనం కావించారు. తన కుమారునికి ఇంగ్లీషు చదివించాలని బుద్ధి పుట్టింది ఆ తండ్రికి. ప్రైవేటు చెప్పించి 1899లో పచ్చయప్ప కళాశాల అనుబంధ పాఠశాలలో రెండవ ఫారంలో చేర్చారు. అప్పటి నుంచీ మామిడిపూడి వారు ప్రతి తరగతిలోను సర్వ ప్రథములుగా వచ్చారు.

రెండేండ్లు ట్యూటరుగా గడిచాయి. ఆ రెండేండ్లలోను ఎం.ఎ. విడిగా చదివి ఉత్తీర్ణులయారు. తర్వాత బ్రహ్మర్షి సర్. ఆర్. వెంకటరత్నం నాయుడుగారి ఆహ్వానంపై చరిత్రోపన్యాసకులుగా కాకినాడకు వెళ్ళి 1910 నుంచి మూడు సంవత్సరాలపాటు ఉన్నారు. వారు బ్రహ్మసమాజానుయాయులు కాకపోయినా, వారిని నాయుడుగారు ఎంతో అభిమానించేవారు. ఈ మూడేళ్ళలోనే మామిడిపూడివారు ఏ విషయమైనా కరతలామలకంగా తెలుసుకొని, కదళీపాకంగా బోధించగల సమర్థులని, శిష్యవత్సలులైన ఆచార్యులని వాసి గన్నారు. ఇంతలో విజయ నగరం కళాశాలలో చరిత్ర శాఖలో బి.ఎ. తరగతులు ఆరంభించగా, అక్కడి ప్రిన్సిపాల్ శ్రీ కిడాంబి రామానుజాచార్యుల ఆహ్వానంపై వెళ్ళి దాదాపు పద్నాలుగు సంవత్సరాలపాటు (1927 వరకు) చరిత్రాచార్యులుగా ఉన్నారు.

ఆ సమయంలోనే మామిడిపూడివారి జీవితం మరొక మలుపు తిరిగింది. సహాయ నిరాకరణోద్యమం సందర్భంగా 1921 లో గాంధీజీ విజయనగరం వచ్చారు. మామిడిపూడివారు గాంధీజీని సకుటుంబంగా దర్శించారు. వారి సతీమణి శ్రీమతి వెంకమ్మగారు తమ చేతి బంగారు మురుగులు గాంధీజీకి సమర్పించారు. (అప్పుడు విజయనగరం సంస్థానం ట్రస్టీ శ్రీ వి.టి. కృష్ణమాచారి - ప్లానింగ్ కమీషన్ మాజీ ఉపాధ్యక్షులు) విజయనగరం మహారాజా శ్రీ అలక్ నారాయణ్ గజపతిగారికి మామిడిపూడివారిపై ఫిర్యాదులు వెళ్ళాయి. మహారాజా సమక్షం లో ఉంటే, ఇలాటి దేశద్రోహం జరుగదని కాబోలు - మహా రాజాకు ట్యూటరుగా ఉండాలని మామిడిపూడివారికి హుకు మయింది. కళాశాలలో పనిచేస్తూనే ట్యూటరుగా మూడు సంవత్సరాలు ఉన్నారు.

1925లో మహారాజా ఇంగ్లండు వెళ్ళారు. ఆ సమయంలో మామిడిపూడివారు సగం జీతంపై సెలవు పుచ్చుకుని, మద్రాసు విశ్వవిద్యాలయంలో ఫెలోషిప్ సంపాదించి, స్థానిక స్వపరిపాల నను గురించి, పన్నులను గురించి పరిశోధించారు. దాని ఫలితమే, "ది డెవలప్‌మెంట్ ఆఫ్ లోకల్ బోర్డ్స్ ఇన్ మెడ్రాస్ ప్రావిన్స్", "బిగినింగ్స్ ఆఫ్ లోకల్ టాక్సేషన్ ఇన్ ది మెడ్రాస్ ప్రెసిడెన్సీ" మొదలయిన గ్రంథాలు. వీటిలో మొదటిది ఆంధ్ర విశ్వవిద్యాలయం మొదటి ప్రచురణ.

తర్వాత సంవత్సరానికి విజయనగరం మహారాజా దేశానికి తిరిగి వచ్చారు. వారికి, అప్పటి దివాను శ్రీ ఏల్చూరి నరసింహం పంతులుగారికి పొసగలేదు. మామిడిపూడివారిని ఊటీకి పిలిపించారు మహారాజా. దివానుగిరి స్వీకరించమన్నారు. వారు స్వీకరించారు. ఈ పదవిలో వారు సంవత్సరమే ఉన్నా, తమ పరిపాలనా దక్షతను, ప్రజారంజకతను నిరూపించుకొన్నారు. మహారాజా జాతీయవాది. ఆయనకు యూరోపియనులంటే గిట్టదు. గవర్నర్ వెల్లింగ్టన్ విజయనగరానికి వస్తారని విని నవంబరులో ఎముకలు కొరికే చలికాలంలో డార్జిలింగుకు పయనం కట్టారు. మామిడిపూడివారూ బయలుదేరారు.

మహారాజా, దివానూ ఇద్దరూ జాతీయాభిమానులు కావడం వల్ల తెల్ల ప్రభుత్వానికి కన్నెర్రయింది. ఏమిచేశారో? సరిగా శ్రీరామనవమి నాడు దివాన్‌గిరి తీసివేసినట్టు మామిడిపూడివారికి తాకీదు వచ్చింది. తర్వాత వారు మహారాణీ లలిత కుమారీదేవి సలహాపై మహారాజాను కలుసుకున్నారు. వారిద్దరూ "మీరు సీతారాముల వంటి వారు. దివానుగిరి పోయినందుకు కారణాలు అడగకండి" అంటూ ఏడు వేల రూపాయలు బహూకరించి, రెండు వందలు యావజ్జీవం పింఛను ఏర్పాటు చేశారు. 1928 తో విజయనగరవాసం పూర్తయింది.

అక్కడినుంచి మూడు సంవత్సరాలపాటు వారు నెల్లూరు వెంకటగిరి రాజా కళాశాల ప్రిన్సిపాలుగా ఉన్నారు. అది దండి సత్యాగ్రహ సమయం. ఖద్దరు కట్టేవారిని చూస్తేనే ప్రభుత్వానికి బెదురు. పోలీసులు విద్యార్థులకు అర్ధ రూపాయి ఇచ్చి విషయాలు కనుక్కునే వారు. ఆ నిగాలోనే మామిడి పూడి వారు స్వదేశీ



పారిశ్రామిక ప్రదర్శనం ఏర్పాటు చేశారు. ఇంతలో ఆంధ్ర విశ్వవిద్యాలయం చరిత్ర - రాజనీతి శాఖలో రీడరు పదవికి వారిని ఆహ్వానించింది. జాతీయవాది గనుక ఆ పదవి వారికి ఇవ్వరాదని పెక్కు ఆకాశరామన్న ఉత్తరాలు, కొన్ని ఆక్షేపణలు చేరాయి. వాటిని వైస్ ఛాన్సలర్ డాక్టర్ రాధాకృష్ణన్ తోసి రాజన్నారు. మామిడిపూడివారు ఆ పదవిని కొంతకాలం, తర్వాత ప్రొఫెసర్ పదవిని మొత్తం 14సంవత్సరాలు అలం కరించారు. అప్పటికి వారి వయస్సు 55 సంవత్సరాలు. వైస్ ఛాన్సలరూ మారారు. వారూ పదవినుంచి విరమించారు.

తర్వాత సంవత్సరం భీమవరం కాలేజ ప్రిన్సిపాలుగాను, మూడేళ్ళు పత్రికలకు వ్యాసాలు వ్రాస్తూను గడిపారు. 1949 నుంచి మూడేళ్ళు బొంబాయి విశ్వవిద్యాలయంలో సర్ ఫిరోజ్‌షా మెహతా ప్రొఫెసర్‌గా ఉండి, కాంపిటీటివ్ అండ్ కో ఆపరేటివ్ ఫెడరలిజం, జనరల్ ఎలెక్షన్ ఇన్ బొంబే అనే ఉద్గ్రంథాలు రచించారు. హిందూస్తాన్ టైమ్స్ పత్రికలో పెక్కు గ్రంథాలు సమీక్షించారు. పిదప మూడు సంవత్సరాలు మద్రాసు రేడియోలో విద్యా విషయ ప్రయోక్తగా ఉండగా వారిని హైదరా బాద్‌కు బదిలీచేశారు. అక్కడి పని నచ్చక రాజీనామా ఇచ్చారు.

మామిడిపూడివారితో సంబంధంలేని సంఘహితోద్యమమే ఆంధ్రప్రదేశ్‌లో కనిపించదు. సహకారోద్యోమంలో, గ్రంథా లయోద్యమంలో, బాంకింగ్ ఉద్యమంలో వారు ప్రధాన పాత్ర వహించారు. ఆంధ్ర టీచర్స్ ఫెడరేషన్‌కు చాలకాలం అధ్య క్షులు. 'ఎజుకేషనల్ ఇండియా' పత్రికకు మూడు దశాబ్దాలు సంపాదకులు. పాఠ్యగ్రంథాలు మొదలు రాజ్యాంగ వివరణ వంటి అనేకోద్గ్రంథాలు రచించారు. శతాధికంగా వివిధ విశ్వ విద్యాలయాలలో ప్రసంగాలు చేశారు. విజ్ఞాన సర్వస్వ, సంగ్ర హవిజ్ఞానకోశాలకు ప్రధాన సంపాదకులు.

మామిడిపూడి దంపతులు కడుపుచల్లని వారు. వారికి ఏడు గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. అందరూ వారి కీర్తికి మెరుగులు దిద్దేవారే. మామిడిపూడివారు ఉదయం ఐదు గంటలకే లేచి కాలకృత్యాలు తీర్చుకొని, రెండు గంటలసేపు పత్రికలు చదువుతారు. భోజనానంతరం స్వాతం త్ర్యోద్యమ చరిత్ర పని కావలసినంత. సమీక్షలూ, వ్యాసాలూ సరేసరి. సాయంకాలం మనుమలకు, మనుమరాండ్రకు పాఠాలు చెబుతారు. రేడియో వింటారు.

ప్రస్తుతం వారు చేస్తున్న ముఖ్యమైన పని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పక్షాన స్వాతంత్ర్యోద్యమ చరిత్ర తృతీయ సంపుట రచన. "పదివేల పుటలకు సరిపడే విషయాలు సేకరించి ఉన్నాయి. వాటిపి వినియోగించుకొని, సహాయ నిరాకరణో ద్యమం మొదలు సత్యాగ్రహం వరకు వ్రాయడానికి రెండు సంవత్సరాలు పడుతుంది. రోజుకు ఎనిమిది గంటలు పని చేస్తున్నాను" అన్నారు వారు. 1908లో 'శశిరేఖ' పత్రికలో తొలి సారిగా "ఇటలీ స్వాతంత్ర్యోద్యమం" అన్న వ్యాసంతో ప్రారం భమై, దేశంలోని పెక్కు పత్రికలలోను, గ్రంథరూపం లోను అవిచ్ఛిన్నంగా సాగిన వారి రచనావ్యాసంగం ఈ పరిణత వయ స్సులో స్వాతంత్ర్యోద్యమ చరిత్రకు పూనుకోడం కాకతాళీయం కాదనుకుంటాను. రాజ్యాంగానికి సంబంధిం చిన ఇతర గ్రంథాలు కూడ పూర్తి చేయాలనీ వారు అభిల షిస్తున్నారు.

ఇప్పటి విద్యావిధానం వారికి అంతగా నచ్చినట్టు లేదు. "ఇప్పుడు చదువులో శిష్యులకు, గురువులకు శ్రద్ధ కనిపిం చదు. నేను (ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తప్ప) పన్నెండు విశ్వవిద్యాలయాలలో పరీక్షకుడుగా ఉన్నాను. విద్యా ప్రమాణం తగ్గిందనే నా నమ్మకం. ప్రభుత్వం బాధ్యత వహించాలి. మేమంతా ఈ దుస్థితి మారాలని అంటూనే ఉన్నాము. పూర్వం ఇప్పుడున్నన్ని వినోదాలు లేవు. కనుక అప్పటివారి దృష్టి ఏకాగ్రంగా ఉండేదనుకుంటాను" అంటారు వారు.

ఏడేళ్ళ ముందు జనగామ రైలు ప్రమాదం జరిగిననాడు మద్రాసుకు పయనమై, వర్షం కుండపోతగా కురవడం వల్ల టికెట్టు వాపసు చేసి ఆగిపోవడంతో పెద్ద గండం గడచిన మామిడిపూడివారు ఆయురారోగ్యాలతో అలరారుతూ తమ విజ్ఞానాన్ని పంచిపెడుతూ ఉండాలి; వారికి ఆంధ్రావళి ఆ అవకాశం కలిగిస్తూ ఉండాలి.





సుబ్బరామయ్యగారు - అంటే ఎలా తెలుస్తుంది? ఆ పేరుగల వారు ఎందరో మరి? కాని, గన్నవరపు సుబ్బరామయ్యగారు అంటే, వెంటనే తడుతుంది, ఇప్పుడు పేరు మోసిన రచయిత లందరికీ, పండితులందరికీ. 'భారతి' పత్రికే తాముగా, తామే 'భారతి' పత్రికగా నవ రచయిత లందరినీ తీర్చిదిద్దినవారనీ, పాత రచయితలందరినీ పట్టుగా నడిపించినవారనీ, 'భారతి'లో రచన పడడమంటే ఏ మంగళా ప్రసాద పారితోషికం పొంది నట్లో, ఏ ప్యులిట్జర్ బహుమతి సంపాదించినట్లో భావించే ప్రమాణం, ప్రతిష్ఠా సంతరించిన కులపతి అనీ.

ఫాలాక్షుడు వచ్చినా పక్షపాతం చూపని పట్టుదలా, ఎవరే మనుకున్నా నమ్మినదానిని ఒంటరిగా అనుసరించే గుండె నిబ్బరం, జన్మ విరోధం ఏర్పడినా జంకక తోచిన అభిప్రాయం తెగవేసి చెప్పే తెగువ, తమవల్ల పలువురికి మేలు జరుగాలనే తపన, తాము చేసే పని అన్నివిధాల ప్రజల మెప్పు పొందాలనే వ్యగ్రత - సమష్టిగా గన్నవరపువారి స్వరూపమంటే కొంత వరకు సరిపోతుంది. వారికి ఇలాటి గుణాలు అబ్బడానికి కారణం జీవితంలోను, జీవికలోను పొసగిన వైవిధ్యమే అనుకుంటాను. ఇలాటిది పత్రికా సంపాదకులలో ఏ కొద్దిమందికో, కాని లభించదు.

గన్నవరపు వారి స్వగ్రామం నెల్లూరు జిల్లా సూళూరుపేట తాలూకా సూరప్పాగ్రహారం. కాని, వారు జన్మించింది చెన్నపురి లో (15-3-1890) మాతామహుల ఇంట. తర్వాత స్వగ్రామంలో పితామహులు శ్రీ శేషశాస్త్రిగారి వద్ద తెనుగు, సంస్కృతాలు నేర్చుకున్నారు. పూర్వాపరాలు సంత చెప్పుకున్నారు. పన్నెండో సంవత్సరం వరకు వారికి ఎ.బి.సి.డి. లు రావు. అంతేకాదు, ఆ పన్నెండో ఏటే మేనత్త కుమార్తెను పెండ్లాడడం వల్ల తక్కిన చదువూ అటకకెక్కి 'వివాహో విద్య నాశాయ' అనే సామెతను సార్థకం చేసింది. దురదృష్టవశాత్తు వారి 18వ ఏట ఆమె కాల ధర్మం చెందడం, ఆ యేటే ద్వితీయ వివాహం కావడం, అప్పటి నుంచి మాతామహుల ఇంటికి మద్రాసుకు రాకపోకలు ఎక్కువ కావడం - వీటివల్ల వారికి చదువంటే మరల ఆసక్తి పెరిగి జీవితం మరొక మలుపు తిరిగింది. మొదటి పెండ్లయిన తర్వాత స్వగ్రామంలోనే ఒక రిటైర్డ్ మెట్రిక్యులేటును ఆశ్రయించి నేర్చుకున్న ఇంగ్లీషు కొంత అభివృద్ధి అయింది. చెన్నపురి పెక్కుభాషల కూడలి కావడం వల్ల క్రమంగా తమిళ, కన్నడ, మలయాళ, హిందీ, గుజరాతీ, బెంగాలీ భాషలూ నేర్చారు. బుక్



కీపింగ్, షార్ట్‌హాండ్, టైప్‌రైటింగ్ మొదలయిన సద్యోజీవికా దాయక విద్యలూ కరచారు.

వారికి 1912లో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు వంటివారితో సన్నిహితత్వం ఏర్పడింది. శ్రీ ప్రభాకర శాస్త్రిగారి స్థానంలో నాలుగేండ్లు మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో పండితులుగా పనిచేశారు. వారి దస్తూరీ ముత్యాలకోవ. పిదప పన్నెండేండ్లూ రకరకాల పనులు చేశారు. శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారివద్ద 'సూర్యారాయాంధ్ర నిఘంటువు'లో సహాయ సంగ్రాహకులుగా కొంతకాలం, విదేశీయులకు దేశభాషాధ్యాపకులుగా కొంతకాలం, మద్రాసు



ప్రభుత్వం యాంటీ హుక్‌వర్మ్ కాంపైన్‌లో స్టెనోగ్రాఫరుగా కొంత కాలం - ఇలా ఏవేవో వృత్తులతో గడిపారు.

ఇంతలో శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికి ఉత్తమ సాహిత్య మాస పత్రిక ప్రచురిద్దామనే సంకల్పం కలిగింది. దాని నిర్వహణకు వివిధ ప్రాచ్య భాషా పాండిత్యం మాత్రమే కాక ఆధునిక విజ్ఞానం, రాజకీయాలతో పరిచయం, దక్షత గలవారు అవసరమని పంతులుగారు అన్వేషించారు. వారి చల్లనిచూపు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి ప్రోద్బలం మీద గన్నవరపువారిపై ప్రసరించింది. పత్రిక 1924నుంచి వెలువడింది.

వెనుకటి పత్రికలు కేవలం పద చర్చలతోను, పట్టుదలలతోను ఒకేదారిని సాగేవి. అలాకాక 'భారతి' నానా మార్గాలలో నానా ముఖంగా అభివృద్ధికి ప్రయత్నించాలనే పంతులుగారి సంకల్పాన్ని గన్నవరపువారు ప్రజలకు, దేశానికి మంచిదని తాము నమ్మిన తోవలో అనుసరించారు. పంతులుగారు ఎప్పుడూ వారికి అడ్డు చెప్పలేదు.



"సాహిత్య పత్రిక కదా? నాకేమీరాదే? ఏమిటి చేయడం? - అనుకున్నాను. అప్పటికి వచ్చిన వ్యాసాలు చూచి ఫరవా లేదనిపించింది. పత్రికను అన్ని మార్గాలలోను నడపగలననే ధైర్యం కలిగింది" అన్నారు వారు.

వచ్చిన రచనలలో నచ్చిన మంచి రచనలను ఏరుకోవడం, సంస్కరించి పంతులుగారితో సంప్రతించి ప్రకటించడం వారు తొలి రోజులలో చేసిన పని. మనవి మాటలు, మీగడ తరకలు, గ్రంథ సమీక్షలు, వ్యాసాలు, కలగూరగంప - ఎన్నో స్వయంగా వ్రాసేవారు. మనవి మాటల మల్లెరేకులవంటి శైలి, మీగడ తరగల నిష్పాక్షిక వ్యాఖ్య, గ్రంథ సమీక్షల నిశితదృష్టి, కలగూర గంప విషయ మధు సంగ్రహణం, శాసనాలు, రస చర్చలు మొదలయినవాటిపై జరిగిన వివిధ వాద వివాదాలను సరసంగా సమాప్తి చేసిన తీరూ ఆంధ్ర జగద్విదితాలు.

"సంవత్సరంపాటు కొందరు విద్యావంతులను, యువకులను గ్రంథాలయాలలో అధ్యయనం చేయడానికి వదులుదాము. వారు ఆయా విషయాలు చదివి వ్రాసిన వ్యాసాలను పరిశీలించి, సంస్కరించి పత్రికలో ప్రకటిద్దాము. సంవత్సరానికి ఇద్దరిని అలా వదులుదాము" అని వారు పంతులుగారికి సలహా యిచ్చారు. సలహా పూర్తిగా కాకపోయినా, కొంతవరకూ అమలు జరిగింది. దాని ఫలితమే 'భారతి' వాస్తు శిల్పాది వివిధ శాస్త్రాలకూ, శాసన చరిత్రాది పరిశోధనకూ, సాహిత్య విమర్శకూ ఇతర భాషలవారూ వరవడిగా తీసుకోదగినంత అపూర్వంగా కృషి

చేయగలగడం. ఇప్పటికీ సాహిత్య పత్రికలు ఈ సలహా పాటించడం అవసరమనే నా నమ్మకం.

"భారతి తొలిరోజులలో తగిన వ్యాసాలు ఏరుకోవడమంటే సామాన్యం కాదు. రచయితలందరూ తమ వ్యాసాలే మంచివని పోట్లాడే వారు. నన్ను దూషిస్తూ ఉత్తరాలు నాకూ, పంతులుగారికీ వ్రాసేవారు. పంతులుగారు ఆ ఉత్తరాలు చదువుకొని, నన్ను పిలిపించి నవ్వుతూ వాటిని నాకు అందించేవారు. అంతే. ఏమీ చెప్పేవారు కాదు. రాను రాను రచయితలతో ఈ సంఘర్షణ తగ్గింది" అని తమ అనుభవం వివరించారు వారు.

పంతులుగారు శివైక్యం చెందేవరకు గన్నవరపువారు 'భారతి' సంపాదకులుగా ఉన్నారు; తర్వాత 1938లో 'తుది మొక్కు'తో వారకి 'భారతి'తో సంబంధం తీరిపోయింది. పిదప మూడేండ్లు ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రకటించిన 'రంగనాథ రామాయణం' సంపాదకత్వంలోను, పరిష్కరణలోను శ్రీ వేటూరివారికి సహాయ పడ్డారు. అటు పిదప దాదాపు పదకొండు శరత్తులు నెల్లూరులోని ఎ.బి.ఎమ్.బాలికల ఉన్నత పాఠశాలలో తెనుగు పండితులుగాను, 1956నుంచి నాలుగేండ్లపాటు తెలుగు భాషా సమితివారి 'విజ్ఞాన సర్వస్వం'లో అసిస్టెంట్ కంపైలర్‌గాను ఉన్నారు. అప్పటికి డెబ్బయి ఏండ్లు నిండాయి.

గన్నవరపువారు ప్రస్తుతం డెబ్బయి రెండు ఏండ్ల ముదిమిలోను మరెవరూ చేయని గొప్ప పని చేశారు. సుప్రసిద్ధ కేరళ నవలా రచయిత శ్రీ తకళి శివశంకరంపిళ్లె రెండు నవలలు -రెండు ఇడంగళి, చెమ్మీన్ అనేవాటిని - కేంద్ర సాహిత్య అకాడమీ పక్షాన తెనుగు చేశారు. చెమ్మీన్‌లోని మలయాళ దేశపు సెంబడుల వ్యవహారాన్ని తెనుగులో పెట్టడం సామాన్యం కాదు, శ్రమసాధ్యం. వారు చిన్ననాడు నేర్చిన మలయాళం ముదిమిలో ఉపయోగించింది.

నేటి సాహిత్య పరిస్థితికి, పత్రికా రచనా పరిస్థితికి వారు చాల ఆవేదనపడుతారు. "నేడు కొన్ని రచనలు అందరికీ అందుబాటులో లేవు. మరి కొన్ని మరీ తేలికగా ఉంటున్నవి. ఎంగిలి కూడు తప్ప తాము వండుకున్న కూడు తక్కువగా కనిపిస్తున్నది. అంతా లోతుకు వెళ్ళని పరిశోధనే. ఇప్పుడు అందరి దృష్టి డబ్బే కాని, సాహిత్యం కానట్టు తోస్తున్నది. డిగ్రీలు సంపాదిం చడం ఉద్యోగం కోసమే కాని, జ్ఞానం కోసం కాదు. ఈ పరిస్థితి మారేవరకూ సాహిత్యాభివృద్ధికి అవకాశాలు కనిపించవు. డబ్బే ప్రధానంగా చెప్పే పద్ధతి, కళాశాలలో ఒక ప్రొఫెసర్ చెప్పిన నోట్సు అనుశ్రుతంగా చెప్పే పద్ధతి పోవాలి" అంటారు వారు.

"తకళి నవలలవంటివి ఆధునిక తెలుగు సాహిత్యంలో ఏవీ?" అని వారి సూటి ప్రశ్న. బహుభాషా కోవిదులైన సంపాదకుల ప్రశ్న ఇది.

"జర్నలిజం దేశౌన్నత్యాన్ని సాధించేదిగా ఉండాలి; సంఘ మర్యాదను కాపాడేదిగా ఉండాలి. ఇప్పుడు ఆ దృష్టి తగ్గినట్టు తోస్తుంది. ఇప్పుడు చాలమంది రచయితలు ఏర్పడ్డారనే సంతోషమే తప్ప నిజమైన అభివృద్ధి కానరాదు. ఇది బలుపు కాదు, వాపే. ఇతర దేశాలలో అలా కాదు. వారి దృష్టి వారి దేశ సంఘాభివృద్ధిని మీరి పారదు" అని వారి వలవంత.

అంతమాత్రాన వారికి రాష్ట్ర దురభిమానమని కాని, సంకుచిత మనోవికారమని కాని భ్రాంతి పడతారేమో! వారిది మానవత్వ మతం. ఈ విషయం వారితో పరిచయమున్న ప్రతి వ్యక్తికీ తెలుసు. ఆనాళ్లలో - నేడూ - వారి యిల్లు తీర్థం. ఇంటికి వచ్చిన సాహిత్య బంధువులను వారెప్పుడూ కులగోత్రాలు అడగలేదు, అతిథి సత్కారాదులలో వలపక్షం చూపలేదు. ఈ విషయంలో వారి శ్రీమతి వారికి మించిన విశాల హృదయ.

పేరూ, ఊరు లేకనూ, ఏవేవో పుటాక్షరాలతోను వారు వ్రాసిన వ్రాతలన్నీ అచ్చువేస్తే కొన్ని - కనీసం ఇరవై అయినా - సంపుటాలవుతాయి. వారు ఎప్పుడూ అలాటి ప్రయత్నం చేయలేదు. ఆ వ్రాతలన్నీ సమసామయిక ప్రచార ప్రయోజనం కలవేకాని శాశ్వత ప్రయోజనంకలవి కావని వారి ఉపేక్ష. వారి వ్రాతలు, వారనుకొన్నట్టు అన్నీకాక పోయినా, కొన్నయినా ప్రయోజన కరమైనవనే ఇప్పటికీ నా తలంపు.

రామానంద ఛటర్జీ చేసిన కృషి భారతీయ సాహిత్య సంస్కృతులను ముందుకు తీసుకొని వెళ్ళినట్టు, మహావీర ప్రసాద్ ద్వివేదీ పరిశ్రమ హిందీ సాహిత్యం ఎన్నో యోజనాలు ముందు నడవడానికి ఉపకరించినట్టు తెనుగు సారస్వత చరిత్రలో శాశ్వతంగా నిలిచే గన్నవరపువారి కార్యదీక్షా తెనుగు సంస్కృతి, తెనుగు సారస్వతం ముందు వెళ్లేట్టు చేసిందనే పలువురితో పాటు నా నమ్మకం. దానికి తార్కాణలుగా నేడు పలువురు పండితులు, పరిశోధకులు, కథకులు, కవులు, నవలాకారులు, విమర్శకులు ఉన్నారు; వారి రచనలూ ఉన్నాయి.

వయసుతో, అనుభవ వైవిధ్యంతో, పత్రికా రచనాపారంగతితో సంపాదక భీష్ములైన గన్నవరపువారి సలహాలు ఇప్పటికీ, ఎప్పటికీ పథ్యాలే, పాథేయాలే నవ, యువ రచయితలకు.



అర్ధశతాబ్ది మునుపటి మాట. మహోపాధ్యాయ, కళాప్రపూర్ణేత్యాది బిరుదాంకితులు వేదం వేంకటరాయశాస్త్రిగారు నెల్లూరు శివారులోని బాండ్‌దొర బంగళాలో ఇష్టులతో, మిత్రులతో, అంతేవాసులతో గోష్ఠి జరుపుతున్నారు. గోష్ఠి విషయం ఆనాడు ప్రతాపరుద్రీయ నాటకం ప్రశంసిస్తూ ఎవరో వ్రాసిన వ్యాసం. ఇంతలో ఒక విద్యార్థి ఎంతో బిడియపడుతూ అడుగులు పెడుతూ ప్రవేశించాడు. అతని వయస్సు పదిహేను ఏళ్ళుంటాయేమో?

"ఎవరు?" అన్నారు శాస్త్రిగారు. ధీర గంభీరులైన శాస్త్రిగారిని ఆ విద్యార్థి దర్శించడం అదే మొదటిసారి. నోట మాట రాలేదు. అతని వివశత్వానికి గోష్ఠి అంతా గొల్లున నవ్వింది. విద్యార్థికి రోషం వచ్చింది. ధైర్యం చిక్కబట్టి, "నేనే. ఆ వ్యాసం వ్రాసిన వాణ్ణి నేనే" అన్నాడు.

గోష్ఠిలోనివారంతా మెడలు తిప్పి మరొకమారు చూచి, ఇంకొకమారు అట్టహాసం చేశారు, "బాగుందే వరుస?" అంటూను. విద్యార్థి ముఖం జేవురిం చింది. ప్రతివాది భయంకరులైనా శాస్త్రి గారు విద్యార్థి వత్సలులు. ఆదుకొకపోతే, అతడు ఆగ్రహోదగ్రుడవుతాడనే అనుమానం కలిగింది వారికి. దగ్గరికి పిలిచి, "నీవేనా నాయనా వ్రాసింది? చాలా బాగా వ్రాశావు. ఏ స్కూలు? ఏ క్లాసు?" అని ఊరడించారు. విద్యార్థికి ఏనుగెక్కినట్లయింది. "నీ విమర్శ పద్ధతి బాగుంది నాయనా. చరిత్ర కూడా బాగా చదువుకో. మంచి దృష్టి అలవరచుకో" అని హితవు చెప్పారు శాస్త్రిగారు. ఆ హితవు ఆ విద్యార్థికి జీవితపాథేయ మయింది.

మరొక సంవత్సరం గడిచింది. ఆ విద్యార్థికి పరిశోధన పరిమేష్టులు వేదం వేంకటాచలయ్యగారితో పరిచయ మయింది. "దొరలు వ్రాసిన చరిత్ర వట్టి అబద్ధాలు. వాటిని నమ్మవద్దు. మనకు కావలసింది సత్యం" అని వేంకటాచలయ్యగారు హెచ్చరించారు. ఆ హెచ్చరిక ఆ విద్యార్థికి చరిత్ర పరిశోధనలో చేదివ్వెగా సహకరించింది. ఆ విద్యార్థి శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు.

శ్రీ వేంకటరమణయ్యగారిని నేలటూరి వేంకట రమణయ్యగారని అనడంకంటే, హంపీ వేంకటరమణయ్య గారనో, విజయనగరం వేంకటరమణయ్యగారనో అంటే, చప్పున చరిత్రాభిమానులందరికీ తెలుస్తుంది. వారు ఒక్క విజయనగర సామ్రాజ్య చరిత్రకే కాదు చాళుక్యుల చరిత్రకూ, తక్కిన తెలుగుదేశ చరిత్రకూ అంకితమై పోయారు.

నేలటూరివారు నెల్లూరు జిల్లా నేలటూరు గ్రామంలో 1891లో జన్మించారు. వారికి ఐదుగురు సోదరీమణులు; ఒక సోదరుడు. (ఆ సోదరుడు రాఘవయ్య. మహా మేధావి. 1927లో మరణించారు). తండ్రి సుబ్బయ్యగారు, మంచి సంపన్న కుటుంబం. బోడిస్వామి కండ్రిక అనే అగ్రహారంలో భాగమూ ఉండేది. కాని, తండ్రిగారు వ్యాపారంలో చాల నష్టపడ్డారు. కుటుంబం చితికిపోయింది. గోరు చుట్టుపై రోకటిపోటన్నట్టు తండ్రిగారు చాల చిన్నతనంలోనే కాల ధర్మం చెందారు. కనుక నేలటూరివారు తమ పెదతండ్రి రాఘవయ్య గారివద్ద ఉంటూ నక్కలమిట్ట, అనంతపురం, మామిడిపూడి బళ్ళలో చదువుకున్నారు. పెదతండ్రి కరణం కూడా. వారు నేలటూరివారిని వెంటబెట్టుకుని తిరుగుతూ, అన్ని విషయాలూ కథలుగా చెప్పేవారు. ఎంతో అభిరుచి కలిగించేవారు. నేలటూరివారు భారతం మొదలయిన వాటిని గుజిలీ పుస్తకాలలో పదపదమూ కూడబలుక్కొని చదువుకొని, తన్మయత్వం చెందేవారు.

అప్పుడు మునుకూరు వేంకటసుబ్బారెడ్డిగారనే సంపన్న గృహస్థు తన కుమారునికోసం మామిడిపూడి వేంకటాచార్యులనే పాత మెట్రిక్యులేటును పిలిపించి బడి పెట్టించారు. నేలటూరి వారూ అక్కడ కొన్ని నెలలపాటు ఎ.బి.సి.డీ.లు, పదాలు నేర్చుకున్నారు. పాత వకాబులరీని తీసుకొని, ఇంటికి దూరంగా తాటితోపులో వెళ్ళి కూర్చుని పదాలు వల్లెవేసేవారు. వేంకటాచార్యుల బడి ఎంతోకాలం సాగలేదు. కనుక నేలటూరివారు రోజూ మామిడిపూడికి వెళ్ళి తిరుమల రామయ్య అనే వారివద్ద చదువుకుని వచ్చేవారు. ఈ విధంగా కొంత పునాది ఏర్పడిన తర్వాత, 12వ సంవత్సరంలో నెల్లూరు వెళ్ళి అమెరికన్ బాప్టిస్టు మిషన్ స్కూలులో మొదటి ఫారంలో చేరారు. జాన్ కొళందవేలుగారు హెడ్‌మాస్టరు. క్రమశిక్షణకు ఆయన పెట్టిన పేరు. నాలుగేళ్ళు ఎలాగో కష్టపడి లాక్కు వచ్చారు. నాలుగో ఫారంలో వివాహమయింది. దానితో కొన్ని ఆర్థికమైన చిక్కులు గట్టెక్కాయి.

నేలటూరివారికి అప్పుడు లెక్కలంటే చాల ఇష్టం. అయితే ఒక్క లెక్క సరిగా వచ్చేది కాదు. హెడ్‌మాస్టర్ భరించలేక వారిని హిస్టరీ గ్రూపులోకి తోశారు. అక్కడ కళ్యాణరామయ్యర్, తుంబివనం నటేశయ్యర్ వారికి చరిత్రలో ఎంతో ఆసక్తి కలిగించారు. ముత్తరాజు సుబ్బారావుగారనే మరొక ఉపాధ్యాయులూ వారిని ఎంతో ప్రోత్సహించారు.

"హైస్కూలు రోజుల్లో డబ్బుకు గిజగిజగా ఉండేది. పుస్తకాలకూ డబ్బు పుట్టేది కాదు. ఒకసారి జాగ్రఫీ పుస్తకమొకటి కొనవలసి వచ్చింది. ఖరీదు ఎనిమిదణాలు. దానిని సంపాదించడానికి ఎంతో శ్రమపడ్డాను. అదే నేను కొన్న మొట్ట మొదటి సొంత పుస్తకం. ముత్తరాజు సుబ్బారావుగారి దయతో పరిస్థితి మారింది. ఆయన గొప్ప మనస్సు గలవారు. వారి ప్రభావం నామీద ఎంతో పడింది. వారి గ్రంథాలయమంతా నా వశంలో ఉండేది" అని వారు చిన్ననాటి ముచ్చట్లు కృతజ్ఞతతో స్మరిస్తారు. చిన్ననాడు వారికి చదువుతప్ప మరొక వ్యావృత్తి లేదు. ప్రతి విషయంలోను ఫస్టులో ఉండేవారు.

నెల్లూరులో స్కూలు ఫైనల్ ముగించిన తర్వాత నేలటూరివారు మద్రాసు క్రిస్టియన్ కళాశాలలో ఇంటర్‌మీడియట్ తరగతిలో చేరారు. మణలి హాస్టల్‌లో ఉచి తంగా భోజనం సంపాదించారు. మిత్రులు వారికి సహాయం చేశారు. రెండేండ్లు గడిచాయి. మలేరియా తగలడం వల్ల పరీక్షకు వెళ్లలేదు. జీవికకోసం తాలూకాఫీసులో గుమాస్తాగా మూడు నెలలు పనిచేశారు. జీతాల బిల్లు తయారుచేస్తే,

మామూళ్ళు ముట్టేవి. ఇదేమిటీ అన్యాయం? - అనుకుని, ఆపని మానివేశారు. తర్వాత మరుసరి టెర్మ్‌కు ఇంటర్ పాసై, బి.ఎ.లో సీటుకు ప్రిన్సిపాలుతో పోట్లాడి ఎలాగో సంపాదించారు. అప్పట్లో మాక్మిలన్ కంపెనీ సలహాదారుగా కె.ఎ.వి. రాఘవాచారి అనే సహృదయులు ఉండేవారు. ఆయనకు నెల్లూరు వారంటే ప్రత్యేకాభిమానం. కంపెనీ ప్రచురణ, ప్రూఫులు చదవడం మొదలయిన పనులు చూడమని నేలటూరి వారికి కొంత సహాయం చేసేవారు.

నేలటూరివారు 1918లో ఆనర్సు ముగించి, బెంగుళూరులో వెస్లీ మిషన్ హైస్కూలులో చరిత్రోపాధ్యాయులుగా కుదిరారు. అప్పుడు సహాయనిరాకరణోద్యమం తీవ్రంగా ఉంది. నేలటూరి వారికి కూడా హృదయం పొంగింది. బెంగుళూరికి ప్రిన్స్ ఆఫ్ వేల్స్ వచ్చారు. ఆయనకు మిషన్ వారిచ్చిన స్వాగతంలో పాల్గొనడానికి నేలటూరివారు నిరాకరించారు. ఫలితం ఉద్యోగం కాస్తా పోయింది.

వారు తిరిగి చెన్నపురికి వెళ్ళి శిష్యవత్సలుడైన ప్రిన్సిపాల్ ఆదరంతో క్రిస్టియన్ కళాశాలలో తెలుగు పండితులుగా చేరారు. కొన్నాళ్ల తర్వాత చరిత్ర శాఖలో ట్యూటరుగాను, పిదప లెక్చరరుగాను అయ్యారు. 1921 నుంచి పది సంవత్సరాలుపాటు వారు దాదాపు ఈ పదవిలోనే ఉన్నారు. చరిత్రను సమ్యగ్దృష్టితో అధ్యయనం చేసి బోధించారు. పల్లవులపై వ్యాసాలు ఆంగ్లంలో వ్రాశారు. వారి సిద్ధాంతాలను అందరూ అంగీకరించారు.



అవి చరిత్రలోనే చేరి పోయాయి. "ఆరిజిన్ ఆఫ్ ది సౌత్ ఇండియన్ టెంపుల్స్" అనే విషయమై పరిశోధించి మద్రాసు విశ్వవిద్యాలయం డాక్టరేట్ పొందారు. అదే మద్రాసు విశ్వవిద్యాలయంలో చరిత్రలో మొదటి డాక్టరేట్ (1930). తోడి లెక్చరర్లు అందరూ కలిసి డాక్టరేట్ గౌను కుట్టించి బహూ కరించారు.

వారి జీవితం తెనుగుదేశ చరిత్రకు అంకితమయ్యే సుసంఘటన అప్పుడొకటి జరిగింది. "చాళుక్యుల చరిత్రలో కొన్ని సంశయాలు" అనే వ్యాసం వ్రాసి 'భారతి' కార్యాలయానికి వెళ్లారు (1928). అదే 'భారతి'కి వారి మొదటి వ్యాసం. అప్పుడు వారికి మల్లంపల్లి సోమశేఖర శర్మగారితో పరిచయమైంది. నేలటూరివారి చరిత్ర దృక్పథం మారింది.

"శ్రీ శర్మగారితో నా స్నేహం ఆఖరు వరకు ఉంది. శర్మగారు అప్పుడు అద్దంకి శాసనాలు (పాండురంగని శాసనాలు) ప్రచురణకు సిద్ధపరుస్తున్నారు. ఆదినారాయణశాస్త్రి, వీరభద్రరావు, శ్రీ టి.ఎన్. రామచంద్రన్ మొదలయిన చరిత్ర, పురాతత్వ పరిశోధకుల పరిచయం కలిగింది. పల్లవుల మీది అభిమానాన్ని విజయనగరానికి మళ్ళించినవారు శర్మగారు. నాకు ప్రియమిత్రులు శర్మగారు" అంటూ కన్నీరు కుక్కుకుంటారు నేలటూరివారు.

1929లో నేలటూరివారు విజయనగర చరిత్ర పాఠం చెప్పవలసి వచ్చింది. కృష్ణస్వామి అయ్యంగారు పుస్తకాలు పూర్వాపరం విరుద్ధంగా కనిపించాయి. కనుక ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారానికి వెళ్ళి అక్కడ కైఫియతులు మొదలయినవి పరిశోధించారు. తర్వాత సంవత్సరానికి మద్రాసు విశ్వవిద్యాలయంలో చరిత్ర శాఖలో రీడరుగా ఎన్నికయిన తర్వాత విజయనగర చరిత్ర ప్రధాన విషయంగా స్వీకరించారు. వారి పరిశోధన ఫలితాలే, "ఆరిజిన్ ఆఫ్ ది సిటీ ఆఫ్ విజయనగర్", "స్టడీస్ ఇన్ ది త్రీ డైనాస్టీస్ ఆఫ్ విజయనగర్", "ఫర్దర్ సోర్స్ ఆఫ్ విజయనగర హిస్టరీ" (మూడు సంపుటాలు), "కంప్లీ అండ్ విజయ నగర్", "ఎర్లీ ముస్లిం ఎక్స్‌పాన్షన్ ఇన్ సౌత్ ఇండియా" మున్నగు ఉద్గ్రంథాలు. 'ఆరిజన్ ఆఫ్ ది సిటీ ఆఫ్ విజయనగర్' అనేది విజయ నగర స్థాపకులు ఆంధ్రులని నిరూపించే ఉత్తమ పరిశోధన. దీనిని వైస్ ఛాన్సలర్ డాక్టర్ ఎ. లక్ష్మణస్వామి మొదలియార్‌గారూ చాలా మెచ్చుకున్నారు. 'ఎర్లీమస్లిం ఎక్స్‌పాన్షన్' అన్న గ్రంథంలో కాపయ నాయకుని గూర్చి వివరంగా ఇచ్చారు. వారి సిద్ధాంతాలు ఐతిహాసి కులను తలలూపజేశాయి. వారి మొదటి గ్రంథం "త్రిలోచన పల్లవుడా? కరికాళచోళుడా?" అన్నది.

వెలుగోటి వారి వంశావళి, రఘునాథాభ్యుదయం, విష్ణు మాయా నాటకం మొదలయిన చారిత్రక సాహిత్య గ్రంథాలను సంస్కరించి ప్రచురించారు. వేంగీ తూర్పు చాళుక్యులను గురించి, వేములవాడ చాళుక్యులను గురించి కొత్త సిద్ధాంతాలతో గ్రంథాలు రచించారు. ఆ సిద్ధాంతాలను చరిత్ర జిజ్ఞాసువులు తెలుగు భాషా సమితివారి విజ్ఞాన సర్వస్వ సంపుటాలలో చూడవచ్చు. "పాల్కురికి సోమనాథు డెప్పటి వాడు?", "మధుర తంజావూరు ఆంధ్రనాయకుల నాటి తెలుగు వాఙ్మయము" మొదలయిన సాహిత్య విమర్శ గ్రంథాలు రచించారు. పాల్కురికి సోమనాథుడు ఎప్పటివాడనే గ్రంథంలో సోమనాథుడు తిక్కనకు ఇటీవలివాడనే కొందరి వాదాన్ని సమర్థిం చారు. దాదాపు 200 వ్యాసాలు వ్రాశారు.

పలుతావులలో తిరిగి శాసనాలు సేకరించారు. "1930లో నేను, మల్లంపల్లివారు కమలాపురం తాలూకాకు వెళ్ళాము. ప్రాగైతిహాస్ని సమాధులు పరిశీలించాము. వాటివల్ల మాకును కొన్ని భ్రమలు పోయాయి. మరుసటి సంవత్సరం పొద్దుటూరు నుంచి మాలెపాడు వెళ్లి శాసనాలు నకలు వ్రాసుకున్నాము. మూడవ సంవత్సరం గుత్తి దగ్గర అశోక శాసనాలు చూడడానికి వెళ్లాము. ఇది జొన్నగిరికి, ఎర్రగుడికి మధ్య గుట్టపైన ఉంది. మొత్తం పధ్నాలుగు శాసనాలు. ఎలాగో జట్కాలో వెళ్ళి, నీళ్ళు తెప్పించి కడిగి నకళ్ళు తీసుకున్నాము. పెద్ద వడుగూరులో చాళుక్య శాసనాలు వ్రాసుకున్నాము. అది శాతవాహనుల స్థానం. ఇదంతా తెలిసి, మా అనుమతి లేనిదే నకళ్ళు తీసుకోరాదని ఎపిగ్రఫీవారు మాకు తాఖీదు ఇచ్చారు" అంటూ వారు శాసన సేకరణ యాత్రలను వినోదంగా తెలుపుతారు.

విశ్వవిద్యాలయం నుంచి విరమించిన తర్వాత వారు 1953 నుంచి 59వరకు స్వాతంత్ర్యోద్యమ చరిత్ర రచనాధికారిగా పని చేశారు. ప్రస్తుతం హైదరాబాదులో జిల్లా గెజెటీర్ల సంపాదకులుగా పనిచేస్తున్నారు.

నేలటూరివారికి మొదటి కళత్రానికి ఇద్దరు కుమార్తెలు. ఉదయం ఉషఃకాలంలోనే లేచి, స్నానసంధ్యలు ముగించి, మేడమీద తమ చదవుల గదిలో కూర్చుని నన్నెచోడుని 'కుమారసంభవం' చదివి ప్రతిపదార్థం వ్రాసుకుంటారు. ఎనిమిదిన్నరకు భోజనం ముగించి, ఆఫీసుకు వెళ్ళుతారు. సాయంకాలం 5-30 కు తిరిగి వస్తారు. రాత్రి ఏమీ చదువరు, వ్రాయరు.

"ప్రస్తుతం నా కోరిక విజయనగర విస్తృత చరిత్ర వ్రాయాలని. స్థానిక వంశ చరిత్రలు వ్రాయాలి. రేనాటి చోళులు, వైదుంబులు, కాయస్థులు, నోళంబులు మొదలయిన వంశాల చరిత్ర వ్రాయ దలచుకున్నాను. ఇప్పటి పనివల్ల నాకు తెలియని విషయాలు ఎన్నో తెలిశాయి. అనంతపురం స్థానిక వంశ చరిత్రలు, నెల్లూరు చరిత్ర వ్రాస్తున్నాను. గుంటూరు,చిత్తూరు చరిత్రలు చాల కుతూహలం కలిగించేవి" అన్నారు వారు.

"మహమ్మదీయ మహాయుగం, ఆంధ్రుల చరిత్ర చదివి తన్మయుణ్ణవుతాను" అని అనే నేలటూరివారు, తమ చరిత్ర గ్రంథా లతోను పాఠకులకు తన్మయత్వం కలిగిస్తారు. వారు ఆశిస్తున్నట్టే ప్రతిజిల్లా చరిత్రా పూర్తి చేసే వరకు ఆయురారోగ్యాలతో విరా జిల్లాలని ప్రతి తెలుగువాడూ కోరాలి.



# మరపురాని వ్యక్తి



తల్లావజ్ఝుల శివశంకర శాస్త్రి



**వా**రు వివిధ శాస్త్ర పారావారాలను చుళుకించిన విద్వద్వ తంసులు. ప్రాచ్య పాశ్చాత్య రామణీయక వాదాల పారం చూచిన విమర్శకులు. అనేకానేక భాషల సాహిత్యోద్యానాలలో మూల మూలల విహరించి, బహువిధ రచనా కుసుమాలను ఆస్వాదించిన రసలోలుపులు. కొత్త ఫణితులు చూచి బిత్తర చూపులతో కుంచించుకొనిపోని ధీరులు. నవకవి కుమారులు కంటబడగనే అసహనంతో, అసహ్యంతో రంధ్రాన్వేషణ చేయక, వికటంగా నవ్వక, వెన్నుతట్టి సానుభూతితో సమాశ్వాసించే



సరసోదారులు.

కనుకనే వారు ఆనాడు నవకవితా శాఖకే ఆలవాలమయారు. నైకవిధ నూతన ప్రక్రియలతో అఖండ ధారగా రచనలు కురిపించి, నూతన కవి విమర్శక పండితకోటికి మహా వటవృక్షమయారు. తర్క కర్కశ పండిత పుండరీకుల ధాటికి ఆగలేని కవికుమారులకు శ్రీరామరక్ష అయారు. వేనకువేలు నవ్య కావ్య రత్నాలను వెలకట్టి సహృదయ విపణికి వెదజల్లిన రత్న పరీక్షకులయారు. ఆనాటి భావకవి సదస్సులకు సభాపతి అయారు. వారు శ్రీ తల్లావజ్ఝల శివశంకర స్వాములవారని ఎవరూ తెలుపకనే అందరికీ తెలిసిపోతుంది.

తల్లావజ్ఝలవారి జన్మస్థానం గుంటూరు జిల్లా, మంగళగిరి తాలూకా, కాజ గ్రామం. జననం 1892లో. వారికి శ్రీకృష్ణ లీలా తరంగిణి పాడిన శివనారాయణ తీర్థులవంటివారు అవతరించిన వంశం, సంగీత సాహిత్యాలకు పేరుగన్న వంశం. వారి జనకులు కృష్ణశాస్త్రిగారు సంపన్నులు, మంచి వ్యుత్పన్నులూను. తల్లావజ్ఝలవారు ఆధునిక సాహితికి ఆచార్య పీఠం వహించవలసి ఉండగా, బడి చదువులపై ఆసక్తి ఎందుకుంటుంది? మెట్రిక్యులేషన్‌తో బడి చదువు ముగించి, పలువురు మహా పండితుల వద్ద న్యాయ వ్యాకరణ వేదాంతాలు సాంప్రదాయికంగా అభ్యసించారు. వివిధ భాషలు నేర్చారు. గ్రీక్, ఇటాలియన్, ఫ్రెంచ్, జర్మన్ భాషా సాహిత్యాలలో మజ్జన మాడారు. ఇక భారతీయ



భాషలా? సంస్కృత ప్రాకృతాలను పుక్కిటబట్టిన వారు గనుక హిందీ, మరాఠీ, బెంగాలీ, కన్నడాది భాషలను అతి సులభంగా నేర్చారు. దక్షిణాపథ భాషలలో వారికి కన్నడం చాల ఇష్టం.

శరీర వ్యాయామం, వ్యవసాయం, ఉద్యాన కళ, వారికి చాల ఇష్టమైనవి. చిన్ననాడు గొలుసులు, ఇనుపతీగలు తెంపేవారు. ఒక పంజాబీ వస్తాదును చూచి, సర్వేరాళ్ళను చేత్తో పగులగొట్టి చూసారట. ఈతలో, గుర్రపు సవారీలో అఖండులు. గుర్రం మీది నుంచి ఎన్నోసార్లు పడ్డారు. ఇక ఆటలలో క్రికెట్, టెన్నిస్, బేస్‌బాల్ అంటే మహాప్రీతి.

వారి దృష్టి సౌందర్యాపేక్షిణి గనుక చిత్రకళపైనా ప్రసరించింది. నీటిరంగుల చిత్రాలు పెక్కు గీశారు. అజంతా చిత్రాలెన్నో నకలు చేశారు. 1916లో బొంబాయిలో శిల్పం నేర్చుకున్నారు.





1924లో బందరు జాతీయ కళాశాలలో ప్రమోదకుమార్ ఛటర్జీ వద్ద కళ అభ్యసించదలచారు కాని, కుదరలేదు. అయినా నేటికీ, వారికి నీటిరంగు చిత్రాలు వేయగలననే నమ్మకం ఉంది.

వారు పన్నెండవ ఏటనే కవితకు శ్రీకారం చుట్టినా, అచ్చయిన మొట్ట మొదటి రచన "జీవన ప్రభాతం" అనే వంగ నవల అనువాదం, 1913లో. 1915లో మొదటి మౌలిక రచన 'గాదె' అన్న కథ. అప్పటినుంచి పుంఖానుపుంఖంగా హృదయేశ్వరి, పద్మావతీ చరణ చారణ చక్రవర్తి, రాజ జామాత, నౌణక భార్య, వరపరీక్ష, వకుళమాల, దీక్షిత దుహిత, రత్నాకరము, ఆవేదన, కవిప్రియ, మహారాష్ట్ర జీవన ప్రభాతం, జీవన సంధ్య - మొదలయిన పద్య, గీతి నాటికలు, కావ్యాలు, నవలలు వ్రాశారు. 1952లో షష్టిపూర్తి సందర్భంలో వారి కావ్యాలు కొన్ని రెండు సంపుటాలుగా పునర్ముద్రితాలు.

వారు జాతీయోద్యమ సమయంలో కేవలం సేవాభావంతో తెనాలి జాతీయ కళాశాల మొదలయిన సంస్థలలో ఏడెనిమిది సంవత్సరాలు ఉపాధ్యాయులుగా పనిచేశారు. ఉప్పు సత్యాగ్రహంలోను, తర్వాతను రెండుమార్లు కారాగారక్లేశం అనుభవించారు. గుంటూరు జిల్లా కాంగ్రెస్ కార్యదర్శి పదవిని రెండుమార్లు, రాష్ట్ర కాంగ్రెస్ సంఘ సభ్యత్వాన్ని కొంతకాలం నిర్వహించారు. పెక్కు గ్రంథమాలలు, పత్రికలు నడిపారు.



సభాపతిగా, వక్తగా నేర్పు అలవరచుకున్నారు. ఎంత చెప్పాలి, ఎంతవరకు చెప్పాలి అనే విషయం వారికి వెన్నతో పెట్టిన విద్య. విమర్శలలో మార్దవం, సంయమం అవసరమన్న సంగతి వారికి తెలిసినట్టు చాలామందికి తెలియదు. ఊరూరా తిరిగి, తామే సభాపతిత్వం వహించి, నవకవుల రచనలను దిద్ది, చదివించి, ఆక్షేపకులను ప్రాచ్య పాశ్చాత్యాలంకారికుల వాక్యోదాహృతితో పారదోలి, నవ్యసాహితీ జైత్రయాత్ర సాగించారు. పెక్కుచోట్ల కవితా పట్టాభిషిక్తులయారు.

నిరుడే వారి సప్తతి పూర్తి వైభవోపేతంగా జరిగింది. ప్రస్తుతం వారు ఒంగోలులో కుమారుడు శ్రీకృత్తివాసతీర్థులుగారితో ఉంటున్నారు. చిన్ననాడు శరీర వ్యాయామం, యోగాభ్యాసం చేసినవారేమో, నేటికీ జెట్టీగానే కనిపిస్తారు. ఉదయం కాల కృత్యాలు తీర్చుకున్న తర్వాత వ్రాయడం, చదవడం వారి అల వాటు. పదకొండు గంటలలోగా భిక్ష (భోజనం) ముగించుకుని, రెండు గంటలపాటు పడుకొని, తర్వాత ఉత్తరాలు వ్రాస్తారు. ఏరోజు ఉత్తరాలకు ఆరోజే సమాధానం ఠంచన్‌గా వెళ్ళవలసిందే.



సాయంకాలం ఏ పార్కులోనో కూర్చుని విద్వాం సులతో కాలక్షేపం చేస్తారు. రాత్రి పొద్దుపోయేదాకా చదువు కుంటారు. ఊరికే ఉన్నప్పుడు జపయోగం, ఏకాంతవాసం ఇష్టం. పూర్వులు తొమ్మిది తరాల నుంచి యతీశ్వరులు. పారమార్థిక దృష్టి ఉన్నది గనుక, ప్రపంచస్థితి తెలియడం వల్ల వారు సన్యసించారు. ఇటీవలనే పిల్లల కోసం జాతక కథలు అనువదించి, రెండు సంపుటాలు ప్రకటించారు. లోగడ 'కథా సరిత్సాగరం' అనువదించారు.

సంస్కృతంలో వచన గ్రంథం నవల లాంటిది ఒకటి, పద్య కావ్యమొకటి త్వరలోనే ఆరంభించదలచారు. "ఆంధ్రంలో వచన గ్రంథమొకటి, మహాకావ్యమొక్కటి (మహాకావ్యం అనడం తప్పు నేడు. సుదీర్ఘ కావ్యం) జీవితలక్ష్యం ప్రతిపాదించేది తల పెట్టాను. సిద్ధాంత ప్రకారం వ్రాయను. జీవితమే రేకులు విచ్చాలి". ఇదీ వారి వార్ధక్య లక్ష్యం.

ఇప్పటి అసంతృప్తి, అగమ్య గోచరత ఇక దశకంలో స్పష్ట రేఖలు గోచరించి, తొలగి విశిష్ట మార్గం తోచవచ్చునని వారి ఆశాభావం. "1914 నుంచి 1940 వరకు జాజ్వల్యమానమని నాకు తోస్తుంది. తర్వాత చెడిపోయిందని అనను. కాని అప్పటి విద్యా ప్రీతి, సహనం, గ్రహణధారణ, పట్టుత్వం ఇప్పుడు నాకు కన బడడంలేదు" అని వారి ఆవేదన.

సక్రమమైన సంప్రదాయంలో, నవీన దృష్టితో, నూతన కల్పనలతో సాహిత్యం పెంపొందించడమే లక్ష్యంగా వారు జీవించారు. "మరీ విశృంఖలంగా ప్రవర్తించాలని నేనెవరికీ చెప్పలేదు.



నూతనత్వం కావాలనే అన్నాను, అంటున్నాను. ఆంధ్రులలో నిగ్రహం కొంత తక్కువ కావడం చేత వివిధ మార్గాలలో ఇష్టం వచ్చినట్టు వెళ్ళారు. గమ్యం మనసులో ఉంచుకుని మధ్యమ మార్గంలో వెళ్ళడం సుఖమని, శ్రేయోదాయకమని నా అభిప్రాయం. ఇంగ్లండులో ఆధునిక కవులు అలెగ్జాండర్ పోప్, మాచ్యూ ఆర్నాల్డ్ పద్ధతులకు వెళ్ళినట్టు మన రచయితలు కూడా మళ్ళీ ఉత్తమ ప్రాచీన దృక్పథం అలవరచుకుంటారనుకుంటాను" అంటారు వారు మరింత ఆశతో.

ఉత్తమ దృక్పథం, ఉత్తమ సాహిత్యం అంటే వారి నిర్వచనమిది: "ఉత్తమ సాహిత్యం భావ ప్రపంచం ఉన్నంత వరకు పనిచేస్తుంది. కాఠిన్యం తొలగించి ఆర్ద్రభావం కలిగించి, విరుద్ధ విషయాలలో గూడ సాహిత్యం కలిగించి, ఒక విధమైన చిత్తశుద్ధి చేసి, ఉద్రేకాలు తగ్గిస్తుంది. ఏమైనా స్వానుభవంతో వచ్చిన సాహిత్యం మంచిది. అనుభూతి ముఖ్యం".

ఇంతటి మహాపండితులయినప్పటికీ తల్లావజ్ఝలవారు తామెప్పుడూ రచనలలో పాండిత్య ప్రకర్ష చూపలేదు. భాషా విషయంలో సరళత, విశేష జనాదరం గల పలుకుబడి అనుసరించడం అవసరమని వారి అభిప్రాయం. "పదాలు లోక ధర్మి, శాస్త్ర ధర్మి అని రెండు విధాలు. లోక ధర్మాన్ని బట్టి కొన్ని పదాలు ఉద్గీర్ణమవుతాయి. ఒక్కొక్క బుద్ధిమంతుని నోట ఒక్కొక్క శక్తిమంతమయిన పదం బయలుదేరవచ్చు. వెరసి, కొంతకాలానికి సమర్థ పదజాలం సిద్ధం కావచ్చు. కాకపోతే సంకేతాలు ఏర్పాటు చేసుకోవచ్చు" అనే ధైర్యం వారిది.

వారు తమ రచనలలో పాశ్చాత్య సంప్రదాయాలెన్నింటినో మధురంగా మేళవించినా, వారికి ప్రాచ్య వాసన పోలేదు. ఎలా పోతుంది? అంతర్ముఖులయిన వారినుంచే ఉత్తమ సాహిత్యం



వెలువడుతుందంటారు. తపోబలంతో ఉత్తమ సాహిత్యం
వెలువడుతుందంటారు. తపోబలంతో ఉత్తమ సాహిత్యం
కలుగాలనీ, 'పలికించెడి వాడు రామభద్రుండట' అనే మోస్తరుగా వాక్కులు రావాలని వారు అంటారు. "జగత్తుకు ఉత్తమ మార్గం చూపాలంటే, భారతీయ యోగమే ప్రధానం. సక్రమ మార్గంలో (భంగు మొదలయిన మాదక ద్రవ్యాలు లేకుండా) పాతం జల యోగం అనుసరిస్తే, ఒడుదుడుకులు ఉండవు. అప్పుడు సమాధి చ్యుతి జరిగి, తైత్తిరీయం చివరిలో వలె అప్రయత్నంగా, ఒకవిధంగా అపౌరుషేయంగా ఉద్భాసించే ఉత్తమసూక్తి మహా కావ్యత్వం, మంత్రత్వం పొందుతుంది. దాని వలననే సంసార తరణం" అని వారి ఉద్బోధ.

వారికి భక్తిగీతాలంటే చాల ఇష్టం. భగవద్రామానుజుల వారి గద్యత్రయమంటే ప్రాణం. అది అన్నమయాదికోశాలు దాటి, ఉత్తమకోశంలోనుంచి, తన్మయత్వం నుంచి, అఖండ సంగీత దృష్టితో చెప్పినదని వారి భక్తిప్రపత్తులు.

వారికి ఆధునిక భారతీయ కవులలో బేంద్రే అంటే మరీ ప్రీతి. మనిషి మీదనూ చాల అభిమానం. "ఆయన మండోదరిని





నాలుగేళ్ళ క్రితం బాపట్లలో కవితా పట్టాభిషేకం చేసుకున్న తల్లావజ్ఝలవారు

అనువదించవలసిందిగా బళ్ళారి రాఘవ కోరారు. కాని నేను చేయడం పడలేదు" అని వారు చింత ప్రకటించారు.

ఇన్ని భాషలు నేర్చిన తల్లావజ్ఝలవారు "మనభాష కాక మరి రెండు భాషలు ప్రతివారికీ రావాలి" అనడంలో ఆశ్చర్య మేముంది? సత్యాగ్రహులు, కారాగార క్లేశానుభోక్తలు అయిన తల్లావజ్ఝలవారు "హిందీయే మనకు జాతీయ భాష. ఇంగ్లీషు కొంతకాలం ఉండవచ్చు" అనడమూ కొత్తేమీ కాదు.

తల్లావజ్ఝల వారొక విజ్ఞాన సరస్వం, సంచార గ్రంథాలయం, చైతన్యంతో తొణికిసలాడే మహాసంస్థ. వారి రచనలన్నీ సంపుటాలుగా పునర్ముద్రితం కావాలి. వారి అనంతానుభవం తెలిపే ఆత్మకథ*, సాహిత్యపాంథులకు మార్గదర్శకంగా ఉంటుంది. నవ్యసాహిత్యాన్ని లగ్గలకెత్తిన వారి త్రివిక్రమ, శివశంకర పాత్ర నవ్య సాహిత్యం నవనవలాడుతున్నంతవరకు నవ్యకాంతు లీనుతూ వెలుగొందుతుంది.



*తల్లావజ్ఝలవారి ఆత్మకథ 'నాలో మార్పు' అనే పేరుతో 1936లో 'ప్రతిభ' పత్రికలో వచ్చింది. కాని అది అసంపూర్ణం.



మైసూరులోని పరకాల మఠంలో కవిగండ భేరుండ, సర్వ తంత్ర స్వతంత్రేత్యాద్యనేక బిరుదాంకితులు శ్రీకృష్ణ బ్రహ్మతంత్ర పరకాల యతీంద్రులు, చామరాజనగరం శ్రీ కంఠ శాస్త్రిగారనే మహా విద్వాంసులతో ముచ్చటిస్తున్నారు. అప్పయ్య దీక్షితులవారి ప్రస్తావం వచ్చింది. వీధిలో ఏదో కలకలం వినిపిస్తే "ఏమిటో చూడమ్మా!" అని దీక్షితులవారు కూతురితో అన్నారట. ఆమె వీధిలోకి వెళ్ళి తిరిగివచ్చి తండ్రితో -

"తురుష్కా నిష్కాశిః
    తురగఖుర కుద్దాల దళిత
క్షమా ధూళీ పాళీ
    చుళుకిత చతుస్సింధు సలిలః,
స్వదోర్లీలా భగ్న
    ప్రతిభట వధూటీ పరికరః
ప్రతస్థే కార్తాంతీం
    దిశమితి హి వార్తా సమజని"



- అని చెప్పిందట. మరికొన్ని చాటువులతోపాటు శ్రీకంఠ శాస్త్రిగారు ఈ శ్లోకాన్నీ పరకాల యతీంద్రులకు తెలిపారు.

పరకాల యతీంద్రుల సన్నిధిలో అప్పుడొక వటువున్నాడు. స్ఫురద్రూపి అయిన అతని ప్రాయం పన్నెండు సంవత్సరాలేమో? "అనంతూ, ఈ శ్లోకం గుర్తు పెట్టుకోరా!" అన్నారట యతీంద్రులు. "చెప్పింది ఒక్కసారే కదా?" అని అడిగారట శాస్త్రిగారు. "మరేం ఫరవాలేదు. జ్ఞాపకం పెట్టుకుంటాడు" అన్నది యతీంద్రుల జవాబు. ఆ శ్లోకాన్ని, దానితో పాటే మరికొన్నిటిని ఆ వటువు 'టేప్ రికార్డు' చేసేసుకున్నాడు మనసులో.

ఆ వటువు గర్భాష్టమంలోనే సంస్కృతంలో కవిత చెప్పడమే కాక భోజుని చంపూ రామాయణానికి ప్రతిగా మరొక చంపువు చెప్పినాడని రాజస్థాన కథావళి చదివి పదవ ఏటనే తారాబాయి, మీరాబాయి తెలుగు కావ్యాలు రచించినాడని ఆ శాస్త్రిగారికి ఏమి తెలుసు?

తర్వాత పదకొండేళ్ళకు (1917లో) రవీంద్ర కవీంద్రుడు మైసూరుకు వచ్చినప్పుడు ఆ వటువు పాతికేండ్లు నిండని



యువకుడు. రవీంద్రుడు "భువన మన మోహిని", "జనగణ మన" పాడుతూ ఉంటే ఆ యువకుడు వెంట వెంటనే స్వర పరచుకున్నాడట. రవీంద్రుడు "ఐ కెన్నాట్ ఇమేజిన్ హౌ దిస్ యంగ్ పండిట్ ఫాలోస్ మి విత్ నొటేషన్స్!" అని ఆశ్చర్యపడ్డా రట. ఆ యువకుడు సంగీత సాహిత్య రంగాలలో సుప్రతిష్ఠితు డనీ, మైసూరు మహారాజాస్థాన విద్వాంసులలో ఎనిమిది రూపా యల నెల జీతం పుచ్చుకుంటున్న పైస్థాయి వాడనీ, చిన్ననాడే "జలరాశి బాలేలోలే" అంటూ ఎన్నో కృతులు చెప్పిన వాగ్గేయ కారుడనీ రవీంద్రునికి ఎలా తెలుస్తుంది?

వారికే కాదు, "ఆంధ్ర వాఙ్మయమున నాచన సోమనాథున కీయదగు స్థానము" అన్న వ్యాసంపై టేకుమళ్ళ అచ్యుతరావు, నడకుదుటి వీరరాజు, దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారలు మున్నగు ఆంధ్ర పండిత నివహం ఒక్కుమ్మడిగా విరుచుకుపడేవరకు ఆ వ్యాసకర్త ఫలానా అని, పేరు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారని ఎవరికీ తెలియదు.

రాళ్ళపల్లివారు విమర్శకులుగా ఆంధ్రావళికి ఏ సుము హూర్తాన దర్శనమిచ్చారో కాని, వారు ప్రవర్తింపజేసిన శిష్టాభిరుచి ప్రస్థానం అర్ధ శతాబ్దిగా అవిచ్ఛిన్నంగా సాగుతున్నది; ఆంధ్ర సారస్వతరమకు అసదృశ నీరాజనంగాను, జిజ్ఞాసువులకు విమర్శామ్నాయ మణిదీపంగాను వెలుగొందుతున్నది. వారు ఆనందవర్ధనులుగా, అభినవగుప్తులుగా సాక్షాత్కరిస్తారు.

వారి విమర్శనలను ఏ కొంచెం చదివినా, తత్త్వమును దెలిసి కొనవలెనను నాశ, తెలిసిన వానిని నిర్భయముగా ప్రపంచము నకు బోధించు ధైర్యము, దానికి నిబంధనమై యిరుప్రక్క లందును మరుగులేని మంచి పదునుగల చురకత్తివంటి రచనాశక్తి, దానికి మెరుగిచ్చునట్టి సూక్ష్మదృష్టి, గాయపు మందు





కత్తికే పూసి కొట్టినట్టు తిడుతూనే నవ్వించే హాస్య కుశలత వారి విమర్శలకు మూలద్రవ్యాలని తెలిసిపోతుంది.*

బహు వాఙ్మయాలలో తలస్పర్శి పాండితి, దాని మీగడతరగ అనదగిన సహృదయత, దాని బాహిరరూప మనదగిన కమ్మని కవిత, దానికి గమకమైన గానగరిమ, వాటన్నిటినీ సమాహార మనదగిన సచ్చరిత్ర పటిమ, దాని ప్రతికృతి అయిన మహితా కృతి, దానిని ప్రతిఫలించే పరిశుద్ధాభిరుచి, దానితో బారలు సాచి స్పర్ధించే సదభివ్యక్తి - రాళ్ళపల్లి వారి 'అపురూప' స్వరూప రేఖలు అంటే చాలును.

వారి వ్యక్తిత్వం ఇంత మధురోదారంగా రూపొందడానికి కారణం చిన్ననాడు అనంతపురం జిల్లా రాళ్ళపల్లిలో పితృపాదులు కర్నమడకల కృష్ణమాచార్యుల వద్ద పన్నెండు సంవత్స

* ఈ విషయం వేమన కవిత్వాన్ని గురించి శర్మగారు విశ్లేషిస్తూ ప్రస్తావించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు ఏర్పాటు చేసిన 'వేమన' ఉపన్యాసాలు శ్రీ శర్మగారు నిర్వహించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయమే వీటిని పుస్తకంగా ప్రచురించింది.



రాల వరకు సంప్రదాయరీతి శిక్షణ, తర్వాత పందొమ్మిదవ ఏడు వరకు మైసూరులో కృష్ణ బ్రహ్మతంత్ర పరకాల యతీంద్రుల వంటి మహాపురుషుని సన్నిధిని అంతేవాసిత్వం, ఇరవయ్యవ ఏటి నుంచి (1912) మైసూరు మహారాజ కళాశాలలో తెనుగు ఒజ్జలయిన తర్వాత డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి సాహచర్య మూను. "సాహిత్య సంస్కారమున నాకు కడపటి గురువు ఆయన. రామలింగారెడ్డి గారు నన్ను సమాన స్కంధునిగా చూచే వారు. నా దృక్పథం మారడానికి, ప్రత్యేకంగా తిక్కనపై అభిమానానికి ఆయనే కారణం" అని రాళ్ళపల్లి వారు ముక్తకంఠంతో చెప్పుకుంటారు.

చిన్ననాడు తల్లి శ్రీమతి అలమేల్మంగమ్మగారి ప్రోత్సాహంతో వారికి సంగీతంలో కలిగిన అభిరుచి పిదప బిడారం కృష్ణప్పగారి వంటి వైణిక గాయకసార్వభౌముని శిష్యత్వంతో తీగ సాగింది. నోటి పాట, వయొలిన్ సాధన చేశారు. అయినా "వయొలిన్ నా వృత్తిగా నేను సాధన చేయడం పడలేదు" అని విచార పడుతుంటారు వారు, నేటికీ.

రాళ్ళపల్లివారు దాదాపు ముప్పయి ఎనిమిది సంవత్సరాలు మైసూరులో మహారాజ కళాశాలలో ఆంధ్ర పండిత పదవిని నిర్వహించారు. ఆ కాలం లోనే వారు వేమన, నాటకోపన్యాసాలు, సారస్వతోపన్యాసాలు, సారస్వతాలోకం, జీవన మత్తు కలె (కన్నడం) మొదలయిన విమర్శ గ్రంథాలు వెలయించారు. శాలివాహన గాథా సప్తశతిని తెనుగు చేశారు. సంస్కృత కవితా స్పర్థ (1924)లో 'మహీశూర రాజ్యాభ్యుదయ దర్శనం' అనే ఆశు ప్రబంధం చెప్పారు. రఘువంశం, స్వప్నవాసవదత్త తెనిగించి తగవని చించివేశారు.

మూడు సంవత్సరాల క్రితం ఆంధ్ర లలిత కళా అకాడమీ వారికి 'గాన కళా ప్రపూర్ణ' బిరుదం, నిరుడు కన్నడ గాయక మహాసభ 'గాన కళా సింధు' బిరుదం ఇచ్చి సత్కరించాయి. మద్రాసు మ్యూజిక్ అకాడమీ వారు సన్మానపత్రంతో సత్కరించారు.

వారు 1950 నుంచి ఏడేండ్లపాటు తిరుపతి ప్రాచ్య పరిశోధనాలయంలో అన్నమాచార్యుల సంకీర్తనలను స్వరపరిచారు. ఇట్టిటీవల వేదాంత దేశికుల అభీతిస్తవం, సుందర పాండ్యుని నీతి ద్విషష్టిక తెనిగించారు.

వారు ప్రస్తుతం తిరుపతిలో చిన్నకుమారుడు శ్రీ జయంత (ఆంగ్లోపన్యాసకులు, వేంకటేశ్వర విశ్వ విద్యాలయం) వద్ద కొంత



కాలం, పెద్ద కుమారుడు శ్రీ ఫణిశాయి (సైకాలజీ లెక్చరర్, బెంగుళూరు) వద్ద కొన్నాళ్ళు గడుపుతూ ఉంటారు. ఇప్పుడు - 71వ ఏట - వారి నిత్యకృత్యం స్నానానుష్ఠానానంతరం కొందరికి సంస్కృతం, వయొలిన్ చెప్పడం, ఓపిక ఉంటే వయొలిన్ సాధన చేయడం, భోజనానంతరం కొంతసేపు విశ్రమించి, ప్రాచీన సాహిత్యం చదువుకోవడం, ఎవరైనా అడిగితే సందేహాలు తీర్చడం.

"ఇప్పటికీ ప్రాచీన సాహిత్యాభిరుచి జనంలో తగ్గలేదు. ఇటీవల కర్నూలులో ఒక గోష్ఠిలో తిక్కనను చదివి వినిపించాను. బెంగుళూరులో కన్నడులకూ తిక్కన భారతం వినిపించే వాడిని. వ్యావహారిక భాషావాదం వ్యాపిస్తున్న ఈ కాలంలో ప్రాచీన గ్రంథాలపై అభిరుచి కలిగించడానికి పఠనం అవసరం" అంటారు వారు. ఇలాంటి అభిరుచి ఇప్పుడు లేకపోవడం ప్రజల తప్పుకాదు, మనతప్పే నంటారు. ప్రజలను దారికి తెచ్చేవారు ప్రత్యేకంగా కావాలని, వారికి సంస్కారం కలిగించాలని వారి సూచన.

"ఇప్పటి పద్ధతిలో లోపం ఏకాగ్రత లేకపోవడం. కళలో ప్రధానం ఏకాగ్రత. సంత మీద ఏకాగ్రత కలిగించలేము. సంతకు ఉద్రేకం అవసరం. కనుక కొంతమందే చాలు పఠన గోష్ఠికి. కళలను గురించి, కవులను గురించి ఉపన్యాసాలివ్వడం ఎంత

అగిపోతే అంత మంచిది. కళలను ముందు పెట్టండి. కవిని ముందు పెట్టండి" అనీ అంటారు వారు.

కనుకనే, నేటికీ వారు తిక్కన భారతం పునశ్చరణ చేస్తుంటారు. "తెనుగు వారికి వ్యాసుని గొప్పదనం తిక్కన మూలంగానే తెలిసింది. వాల్మీకి అంతస్తు ఎవరూ అందుకోలేరు. తిక్కన వ్యాసుని అంతస్తు అందుకున్నాడు. భిన్న భిన్న చిత్త వృత్తులను చూపడమే వ్యాసుని ప్రధాన ధర్మం. అతని దృష్టి కథ కాదు. తిక్కన కథాప్రవాహం చెడకుండా భారతం సంగ్రహించి, తెనుగు జీవితంలో అన్వయించి తెలుగు చేశాడు. తిక్కన పాత్రలలో సత్యాపనం అనే ధర్మం ఉంది. రామాయణంలో రామణీయకం ఎక్కువ. భారతంలో చిత్త సంస్కారం ఎక్కువ. కనుక వ్యాస - తిక్కనల పాత్రలలాగా ఇంకెవరి పాత్రలను అంత హార్దంగా అనుభవించలేము" అంటూంటే వారి చారులోచనాలు ఆనందబాష్పాలు కురిపిస్తాయి.

"సాహిత్య పరమార్థం - అన్ని కళల పరమార్థమూ - అలౌకికానుభవం, చిత్త సంస్కారమూను. ప్రపంచానికి అద్దంగా ఉందా, లేదా అనేది చిన్న మెట్టు విమర్శ. ఉండినది, ఉండవచ్చునది, ఉండవలసినది అనేవి ఉత్తరోత్తరం బలీయాలు. దీనిని నైతిక ధార్మిక హార్దికమైన వాటికీ అన్వయిస్తాను. ఒక్కొక్క దానినుంచి మరొక్కదానికి వెళ్ళడమే నా ప్రయత్నం. ప్రయోజనాత్మకత కంటే, ఉన్నదున్నట్టు చూపడం కంటే, ఉండవలసినదిగా చూపడం పై స్థాయి" అన్నది ఈ విమర్శ ప్రస్థానాచార్యుల నిర్వచనం.

రచయిత జీవితానికీ, రచనకూ తప్పక సంబంధం ఉందనీ, తప్పులు తెలుసుకొని పోగొట్టుకొనడానికి ప్రయత్నించని వానికి ఒక్క విషయం చెప్పే బాధ్యతా లేదనీ, రచనయితలో ఆర్జవమనే ధర్మం ఉంటే అది మాటలలోనూ ప్రతిఫలిస్తుందనీ వారి నమ్మకం.

నేటి ఉద్వేగ కవులను చూచి వారు చాల చింతపడుతారు. నిర్మాణాత్మకంగా పనిచేసే శక్తి ఉద్వేగ కవులలో లేదని, వారు సమసామయికోద్యమంతో ఉద్రేకపడి కొంత చేయగలిగినా, మానవోద్యమమనే నిరంతరోద్యమమే మన లక్ష్యం కావాలని వారంటారు. "శ్రద్ధయాదేవో దేవత్వ మశ్నుతే" అన్నది వారి గట్టి నమ్మకం.

రాళ్ళపల్లివారు నాటికీ, నేటికీ సాహిత్యంలోను, జీవితంలోను పులుగడిగిన ముత్యాల రాశిగా, సాయం సంపుల్ల మల్లి మతల్లికా గుచ్ఛంగా, అపరంజి పోత పోసిన దివ్యమంగళ విగ్రహంగా దర్శనమిస్తుంటారు.



# మరపురాని వ్యక్తిత్వం



## ద్వారం వెంకటస్వామి నాయుడు



"క్రియాసిద్ధిః సత్త్వే భవతి మహతాం నోపకరణే" అన్న భర్తృహరి మాటలు అక్షరాల లక్ష మాడల మూటలు.

కాకపోతే, అపస్వర వాద్యమని, 'నిరాధార వాద్య'మని మన సంగీత విద్వాంసులు అనే వయొలిన్‌ను సాధించి, స్వాధీన పరచుకొని, సుస్వరం పలికించి, శ్రోతలను తన్మయులను చేయడం శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడుగారికి ఎలా సాధ్యమవుతుంది? అది ఆయన సత్త్వం! అది ఆయన సాధన! అదే ఆయన తపోదీక్ష! శ్రీ రాళ్ళపల్లివారన్నట్టు " ఏ సంగతి వాయించినా, ఎంత మృదువుగా, ఎంత ఘనంగా కమాను తీసినా, నాదంలో స్నిగ్ధత, గాంభీర్యం కొంచెమైనా చెదరక, దృఢ సంకల్పంతో, నిశ్చలమైన నమ్మికతో, ఏకాగ్ర దృష్టితో, బహిరంగ మైన చేష్టలేమీ లేక 'ఫిడేలే తామై, తామే ఫిడేలై' నాదా మృతపు సోనలు కురిపించిన నాయుడుగారు ఫిడేలు నాయుడుగారు" అనే జనం హృదయాలలోనే గాక నాలుకపై నాట్యమాడడం సహజం.

ఆయన వాదనంలో గమకాలు, చాకుపట్లు, రవజాతి ఫిక్కాలు (పలుకులు) లాఘవంతో ప్రస్ఫుటంగ్గా, నిండుగా, ఆకర్షణీయంగా ఉండేవి. లయ ఆయన రక్తం. ఆయన స్వర విస్తారం



సాటి లేనిది. నోటి పాటలోని గమక విశేషాలను ఆయన కైవసం చేసుకొని, వాటికి తమ వాద్య వాదన విశేషాలు జోడించి పవిత్రమైన నాదంతో శ్రోతలు "చేతనము లచేతనములై బరగ" వాయించేవారు.

ఆయన కర్నాటక సంగీతంలోని రహస్యాలను - త్యాగయ్యగారన్నట్టు నాద విద్యా రహస్యాలు - తెలుసుకొన్నది ఒక ఎత్తు; తాము ఊహించిన సంగీత కల్పనలను వయొలిన్ వాద్యంలో ఎంత అద్భుతంగా ప్రదర్శించడానికి వీలున్నదో అంత బాగా నాదం తీయడానికి పాశ్చాత్యుల వయొలిన్ టెక్నిక్‌ను పరిపూర్ణంగా తెలుసుకొనడం మరొక ఎత్తు. పడమటివారి నాద పుష్టిని, వయొలిన్ వాయించే తీరును మన సంగీతపు రుచుల పారిశుద్ధ్యం ఇసుమంతయినా చెడనీయక ప్రదర్శించేవారు.

పెద్ద రాగాలలో లాగ ఆయన శుద్ధ బంగాళ, అమృత వాహిని, రంజని, ఉమాభరణం, హంసానంది, శుభపంతువరాళి మొదలయిన చిన్న రాగాలలోను అత్యద్భుతమైన స్వాతంత్ర్యంతో రాగ విస్తారం రక్తిగా కొనసాగించేవారు.

పక్కవాద్యంగా వయొలిన్ వాయించడంలో ఆయనదే ఒక ప్రత్యేకమైన శైలి. సమకాలికులైన గొప్ప గాయకులందరికీ

ఆయన పక్క వాద్యం వాయించారు. గొప్ప వ్యక్తిత్వం, మనో ధర్మం, విశిష్టశైలిగల ఆయన వయొలిన్ వాదన ప్రదర్శనకు పక్క వాద్యాలలో అవకాశం చాల తక్కువ. కనుక తమ ఊహలను, కల్పనలను స్వేచ్ఛగా, విస్తారంగా, విస్మయావహంగా శ్రోతలకు వినిపించడానికి ఆయన స్వతంత్ర వాదనం (సోలో కచేరీలు) ఎక్కువగా జరిపేవారు. తమ ఆత్మను లయింప జేయడానికి అట్టి సన్నివేశాలు తప్పనిసరి.

ఆయన పలువురు శిష్య ప్రశిష్యులను తీర్చిన కులపతి. ఆయన వయొలిన్ కచ్చేరీలు విని, సన్నిహితులై, గొప్పగా బుద్ధి మనోవికాసాలు పొందిన వారిలో కర్నాటక సంగీత కళాశాల వైస్ ప్రిన్సిపాల్ శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావుగారివంటి పలువురు విద్వద్వతంసులూ ఉన్నారు. 'కళాప్రపూర్ణ' బిరుదాన్ని ఆలస్యంగానైనా ఇచ్చి ఆంధ్ర విశ్వవిద్యాలయం పేరు తెచ్చుకుంది.

ఆంధ్ర తమిళ కన్నడ సంగీత ప్రియులను ముప్పేటగా కలిపిన కర్నాటక సంగీతంలాగే కన్నడనాడులో 1893లో పుట్టి, తెనుగునాట మనుగడ గడిపి, తమిళనాడులో స్థిరపడి, అర్ధశతాబ్ధి పాటు సంగీత ప్రియులకు వయొలిన్ వాదనంలో వరప్రసాదిత నిపుణతతో, అందచందాల పరిశీలనతో, పండిత పామర రంజకత్వంతో అప్రాకృతం, అనిదంపూర్వం, అనిర్వచనీయం అయిన ఆత్మానందం చేకూర్చి అనేకానేక బిరుదులు పొందిన నాయుడుగారు గడిచిన నెల (1964 నవంబర్ 25వ తేదీన) భౌతికకాయం వీడినా, సంగీత ప్రియుల చిత్తాలలో చెక్కుచెదరక ఉంటారు.

నాయుడుగారి ఈ మహోన్నత దశకు కారణం సాధన - నిత్యం వేయి త్రిస్థాయిలు వాయించే సాధన. అట్టి సాధన సంపత్తి కలవారికే నాదసంపత్తి సమకూరుతుంది. ఇలాటివారిని చూచే కాబోలు "సాధనమున పనులు సమకూరు ధరలోన" అని తత్త్వవేత్త వేమన అన్నాడు.



# మరపురాని మనీషి



దీపాల పిచ్చయ్య శాస్త్రి

93



"రంగము మీది కెక్కుదము,
రా, మరి? కావ్యము సేయ నేర్తునో?
ఖంగున ఒక్క పద్యము సు
ఖంబుగ పాడగనేర్తు నో? రసా
భంగుర భంగి అర్థపరి
పాటి వచింతునో? లోక తత్వ పా
రంగతులైన సభ్యులవు
రాయని మెచ్చ నుపన్యసింతునో?
రంగము మీది కెక్కుదము, రా!"

- అంటూ శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు తమకు శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారితోను, ఇతరులతోను కలిగిన పదాల పోరాటంలో మారుపేర్లతోను, పేర్లు లేకను ఆక్షేపిస్తూ వ్రాసే వారిని సవాలు చేస్తూ చెప్పిన పద్యాలు తరం కిందివే అయినా, నేటికీ పండిత గోష్ఠులలో మారుమ్రోగుతూనే ఉంటాయి. ఇక, ఆ వాదాలు విన్నవారూ, పాల్గొన్నవారూ పులకరింపులతో పొంగి పోతారంటే అతిశయోక్తి ఏముంది?

దీపాలవారి మూర్తి చిన్నదైనా, స్ఫూర్తీ, కీర్తీ దొడ్డవి. పదాల పోరాటంలో ముక్తపదగ్రస్తంలాగ, నాల్గవ పాదం తర్వాత మొదటి పాదాన్ని అందుకుని ముక్తపాదగ్రస్తంగా పద్యాలు ఆశువుగా చెబుతూ ఉంటే, నాటక ఫక్కీలో వాద వివాదాలు కొనసాగిస్తూ ఉంటే, సభంతా నోరు తెరచుకుని ఉండిపోయేది. వారిలాటి గమకి అరుదుగా కనిపిస్తారు. చిన్ననాటి నుంచి చేసిన సంగీత సాధన, దానికితోడు శ్రావ్యమైనా గంభీరమైన శారీరం, వాద వివాదాలలో ఒడుపు, ఎదిరిని బెదరగొట్టే సమయస్ఫూర్తీ,



వీటన్నిటికీ దీపాల వెలుగుగా -

"భయమేలా బయటికి రా,
నయమార్గంబుననె బుధులు నలువురు విన వా
జ్మయ చర్చ చేసికొందము,
జయము పరాజయము లేదు చదువులనోనన్"

- అనే సరసత, దీపాలవారిని ప్రతివాది భయంకరులనుగానే కాక, ప్రతివాది శివంకరులుగాను తీర్చాయి.

"ఎగిరి వెక్కిరించి యిగిలించుకొన్నట్టు
కాదు కవులతోడి కతలు వెతలు,
కవుల జెనక నూరకయ పోవునా? అది
కుమ్మరడుసు గాదు, కమ్మరడుసు"

- అన్న హెచ్చరిక అప్పటివారికే కాదు, ఇప్పటివారికీ, ముందు వారికీ గుండె గుభేలుమనిపించేదే.

దీపాలవారు గుంటూరు జిల్లా, వినుకొండ తాలూకా, బొమ్మ రాజుపల్లెలో 1894 మే నెలలో జన్మించారు. వారి బడి చదువు వినుకొండలో బోర్డు హైయరుగ్రేడ్ ఎలిమెంటరీ స్కూలులో సాగింది. పితృపాదులు శ్రీ వేంకటనరసయ్యగారి వద్దనే సంస్కృ తాంధ్రాలు చదువుకున్నారు. మొదటినుంచి సారస్వతాభిరుచి,



కూనిరాగాలు తీయడం ఉండనే ఉన్నాయి. సంగీతంలో పరిశ్రమ చేశారు. కాని, ఏమీ సాధించకపోయినా, పద్యం, శ్లోకం, వచనం మంచి గమకంతో చదివే తీరు విలక్షణంగా సొంతం చేసుకున్నారు. పద్యాలు చెప్పే ఉబలాటం పరవళ్ళు వారగా పదిహేనవ ఏటనే -

"రాతిన్ నాతిని జేయు మంచడు గగా
    రాలేదు; ప్రత్యర్థికిన్
భీతిం జెందియు చేరలేదు, క్రతువుల్
    వేవేగ రక్షింప రా
వే తప్పంజనదంచు పల్కగను లే
    దే, దర్శనం బిచ్చినన్
చేతోమోదము నందెదంటి గద తం
    డ్రీ భక్త కల్పద్రుమా!"

అంటూ "భక్త కల్పద్రుమా" మకుటంతో శతకం చెప్పారు. ఇదే వీరి మొదటి కృతి కూడా.

ఇలా కాలం గడుస్తుండగా, వారి పందొమ్మిదవ ఏట (1915లో) వారిని మహాపండితులుగాను, సారస్వత పరిశోధకులుగాను తీర్చిదిద్దే సంఘటన, సత్సంగం ఏర్పడ్డాయి. అప్పుడు వినుకొండ ప్రాంతానికి శేషగిరిరావుగారనే సాహిత్య పిపాసితులు ఫారెస్టు రేంజరుగా వచ్చారు. వారికి దీపాల వారిపై అవ్యాజ వాత్సల్యం కలిగింది. వారివద్ద తాము ప్రాచీన ప్రబంధాలు చదివి, కవిత చెప్పడం నేర్చుకోసాగారు. ఒక ప్రభుత్వాధికారికి,





తనకన్నా పెద్ద వారికి ప్రబంధాలు చెప్పడమంటే, ఎంతో పరిశ్రమ అవసరం. దీపాలవారు రేంజరుతో పాటు కొండలలో, కోనలలో గడుపుతూ, స్వయంగా ప్రబంధానుసంధానం చేస్తూ, అధ్యాపనం సాగిస్తూ ఉండేవారు. ఇప్పటి పంచవర్ష ప్రణాళికా ప్రచార రూపకాలలాగ సంఘ ప్రయోజన దృష్టితో, రేంజరు ప్రోత్సాహం తో దీపాలవారు అప్పుడు 'కానన ప్రహసనం' వ్రాశారు :

"క్ష్మానాథున్ జయమొందుగాక యనుచున్
ఫారెస్టు వర్నాకులర్
ట్రైనింగ్ స్కూలు కళార్థులే ప్రహసన
ప్రాయంబునై కాననా
నూనానేక ఫలంబులన్ తెలుపు చెం
తో వింతయౌ నాటకం
బీనాడిచ్చుట చూపువారు మది కెం
తే తోష ముప్పొంగగాన్"

- అంటూ నాందీ ప్రస్తావనతో.

ఆ ఫారెస్టు రేంజరుకు గుర్రం ఉండేది. దీపాలవారు ఆ గుర్రమెక్కి పరిసర గ్రామాలకు వెళ్ళి, తాళపత్ర గ్రంథాలు సేక రించి రేంజరును మెప్పించారు. ఈ తాళపత్ర గ్రంథాల సేకరణ లోనే వారికి శ్రీ వేటూరి ప్రభాకార శాస్త్రిగారి పరిచయమైంది. వేటూరివారు ప్రభుత్వ పక్షాన తాళపత్ర గ్రంథాలు సేకరించేవారు. దీపాలవారు వారితో కలిసి చాటుపద్యాలు సేకరించారు. చాటు పద్యాలకోసం తిరుగుతూ నెల్లూరు వచ్చారు. అక్కడ వాటిని "చాటుపద్య రత్నాకరము" అనే పేరుతో సంపుటంగా ముద్రించారు. నెల్లూరులోనే స్థిరనివాసం ఏర్పరచుకున్నారు.

అప్పటి నెల్లూరు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు, శ్రీ దర్భా సుబ్రహ్మణ్యశర్మగారు వంటి విద్వత్కవులకు ఆటపట్టు. నెల్లూరులో దీపాలవారికి సారస్వతాభిమానులైన రెడ్ల ఆశ్రయం లభించింది. ఆ రెడ్లు వారికి ఇల్లూ, పొలమూ ఇచ్చి ఆదు కున్నారు. వారేమో అవధానాలు, ఉపన్యాసాలు, గోష్ఠులు జరుపుతూ, 'భారతి' మొదలయిన కావ్యాలు చెబుతూ, సాహిత్య వ్యాసాలు వ్రాస్తూ తమ ఆశ్రయదాతలను సంతోషపెట్టేవారు. తీరికనాళ్ళలో తాళపత్ర గ్రంథాలు సేకరించి, ఆంధ్ర సాహిత్య పరిషత్తుకు బహూకరించడంకోసం శ్రీ జయంతి రామయ్య పంతులుగారికి పంపేవారు.

వారు ఆ కాలంలో సాగించిన పదచర్చలు, వాగ్వివాదాలు, వేదంవారితో జరిపిన శబ్దసమరాలు 'జితకాశి'లోను, 'ఓదార్పు' లోను చూడవచ్చు.

అన్నేండ్లవరకూ విశృంఖలులుగా ఉన్న దీపాలవారు నలభయ్యో ఏట ఉపాధ్యాయవృత్తి అవలంబించారు. అప్పటికి స్థిరంగా ఒకచోట తప్పనిసరిగా ఉండవలసి రావడం వల్ల జిజ్ఞా సుల హితం కోసం తీరికగా, ముమ్మరంగా సారస్వత పరిశ్రమ చేయవలసి వచ్చింది. దాని ఫలితమే రఘువంశ, దశకుమార చరితల, భాస భారత రూపకాల సుందరాంధ్ర వచనానువాదం, మేఘసందేశ, ప్రణయకుసుమ, సువర్ణమేఖల, నెల్లూరి గాలివాన ఆది మనోహర కావ్యాలు, సారంగధరాది వ్యాఖ్యలు, సాహిత్య సమీక్ష, ద్రోణ ప్రశస్తివంటి పరిశోధన గ్రంథాలూను. వారి మేధ

సందేశం అనువాదం కాళిదాసు తెలుగువాడై పుట్టి కలం పట్టినా ఔరా అనేట్టుంటుంది. సాహిత్య సమీక్ష వారి పాండిత్య ప్రాభవానికి, పరిశోధన దీక్షకు సరస్వతీ కటాక్ష వీక్ష.

దీపాలవారు వారి "రంగము మీదికి" అన్న పద్యంలో సవాలు చేసినట్లు కావ్యాలు సేయనేర్తురు. ఖంగున పద్యం పాడగా నేర్తురు. అర్థ పరిపాటి వచింపనేర్తురు. సభ్యులవురా అని మెచ్చ నుపన్యసింతురు. వారు హాస్య సరసవచో నిపుణులు. "అన్యుల మనముల్ నొప్పింపక, తానొవ్వక" హాస్యోక్తులతో తమ అభిప్రాయం మొగ మోటమి లేకుండా చెప్పగల దిట్టలు. ఒకప్పుడు వారి ఆశ్రయ దాతలలో ఒక్కరైన ఒక పెదరెడ్డిగారు ఏవో పద్యాలు వ్రాసి, చూడమన్నారట. చూచి, చదివి బాగున్నా యన్నారట దీపాలవారు. "శాస్త్రులుగారూ, తప్పులున్నాయని నా మిత్రులు అంటున్నారే?" అని రెడ్డిగారు ప్రశ్నించారట. దీపాలవారు వెంటనే "కవులు మూడు రకాలవారు - వరకవి, నెరకవి, దొరకవి అని. తమరు దొరకవి" అన్నారట. "అన్నన్నా!" అంటూ ఆ రెడ్డిగారూ నవ్వారట.

ప్రస్తుతం వారు నెల్లూరులో ఉస్మాన్ సాహెబ్‌పేటలో సొంత ఇంటిలోనే నివసిస్తున్నారు. ఉదయం స్నానసంధ్యానుష్ఠానాల తర్వాత, అభిషేకించి అలంకరించిన శివలింగంలా విభూతి పిండికట్లతో వెలిగిపోతూ, పుస్తకాల దొంతర్ల మధ్యన కూర్చుని, ప్రాచీన కావ్యపాఠ పరిశీలన చేస్తుంటారు. ప్రస్తుతం ధూర్జటి కాళహస్తి మహత్మ్యం పాఠ పరామర్శ చేస్తున్నారు. వారికి ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. ఏదో ఆలోచనలో ఉన్నప్పుడు, పద్యాలు చెప్పేటప్పుడు డాబా మీద అటూ ఇటూ పాదచ్ఛాయలు వేస్తూ పచారు చేయడం వారి అలవాటు.

"నా ఆదర్శం ప్రభాకరశాస్త్రిగారు. ప్రాచీన కావ్యపాఠ పరిశీలనం నా ముఖ్యోద్దేశ్యం. ప్రాచీన కావ్యాలు పూర్వం లేఖక ప్రమాదాలవల్ల, నేడు అచ్చు తప్పులవల్ల చెడిపోతున్నాయి. కనుక వాటిని ఇతర గ్రంథాల పాఠ పరామర్శతో సంస్కరించాలి" అంటారు దీపాలవారు.

నిజమే. నేడు విస్తృతికి ప్రాధాన్యంకాని, గంభీరతకు కాదు. ఏ భాషయినా నేర్చుకోవలసిందే. కాని, మన వికాసానికి మూలకందమైన తెలుగునే మరచిపోగూడదు కదా! నేడు మహా మహా పండితులనబడేవారే గుజ్జనగూళ్ళంటే గూళ్ళనుకుని గూళ్ళు కట్టుకుంటున్నట్టు ప్రయోగించారు. బిడ్డకుట్లంటే ప్రసవ వేదన అని తెలియక వేవిళ్ళని ఒక మహా వ్యాఖ్యాత వ్యాఖ్యానించారు. ప్రేత స్నానమంటే ప్రాత స్నానమనుకుని ప్రయోగిస్తున్నారు. (గరిటె గెరిటె అవుద్ది గదా, ప్రాత ప్రేత కాక పోతుందా? - అనుకున్నారేమో!) దీనికంతా కారణం నుడికారమంటే ఏమిటో సరిగా తెలియక అవ్యవస్థ ఏర్పడడమే.

"ఇలాటి అవ్యవస్థ పోయి సరైన భాష రావడానికే పదప్రయోగాల, పాఠాల, పలుకు బళ్ళ పరిశీలన జరుగాలి. భాష మళ్ళీ ఉద్ధరించబడాలనే దాని కోసమే నేను ప్రయత్నిస్తున్నాను. ఒక్కడు ఒక్క పని చేయగలడు. నేను ఈ పని చేస్తున్నాను. ఇప్పటి పండితులు కూడ అరకొర జ్ఞానంతో, ప్రాచీన కావ్య పరిచయం లేక వ్రాస్తున్నారు. వారిని సక్రమంగా దిద్దడానికి భాషా పరిశోధన అవసరం." ఇదే వారి లక్ష్యం.

ఈ లక్ష్యంతో దీపించే దీపాలవారు, ఈ లక్ష్యసాధనతో దీపించే దీపాలవారు భాషా స్వరూప జిజ్ఞాసువులకు, కావ్యరస పిపాసువులకు, సత్యాన్వేషకులకు గండాదీపంగా, అఖండ దీపంగా వెలుగులు వెలార్చుతూ వెలుగొందుతుంటారు.





హౌరా స్టేషన్‌లో బండి ఆగింది. ఒక మొదటి తరగతి పెట్టె నుంచి ఒక ప్రయాణీకుడు దిగాడు. అంత పొడుగూ, పొట్టీ కాని కాయవాటు తెల్లని శరీరం; సౌమ్యమైన ఆకృతి విశేషం; నిరాడంబరమైన ప్రవర్తన; అంతరంగంలోని ఆశయాలను, ఆదర్శాలను తెలుపుతున్నవా అన్నట్టున్న తెల్లని ఖద్దరు దుస్తులు పంచ, లాల్చీ, ఉత్తరీయం; ఏ ప్రాణికి ఏం బాధ కలుగుతుందో అని చూచి చూచి అడుగులు వేసే శ్వేతాంబర జైనాచార్యులలాగ "అతి నాజూకు" నడకతీరు; మాట నోటి నుంచి వెలువడితే ముత్యాలు రాలుతాయేమో నన్నంత మౌనముద్ర - ఎవరో పెద్దమనిషి అని చూచిన వెంటనే ఎవరైనా అనుకుంటారు.

ఆయనకోసం ప్లాట్‌ఫారం మీద వేచి ఉన్నవారు ఆయన దిగీ దిగగానే, చేతిలోని చిన్న పెట్టె అందుకోబోయారు. "ఏమంత బరువు?" అని ఇంగ్లీషులో అంటూ ఆయన వారినందరినీ వారించారు. ఇంతలో ఎవరో అడిగారు "తమరే రావలసి వచ్చిందా? మరెవరినైనా పంపితే పోయేదే!" అని. దానికి ఆయన "బాధ్యతతో కూడిన పని. సొంతంగా చూచుకోడం, రచయితలందరినీ కలుసుకోవడం ఉచితం కాదా?" అని చిన్న నవ్వుతో సమాధానమిచ్చారు. స్విచ్చి తీసి వేసినట్టు వెంటనే నవ్వూ మాటలూ ఆగిపోయాయి.

ఒకానొకమారు ఆయనను ఆయన కార్యాలయంలో చూచాను. తీర్చి దిద్దినట్టున్న పరిసరాలు - వ్రాత మేజావద్ద ఒక మూల ముఖ్యమైన పుస్తకాల బీరువా, మేజాపై కలం, కాగితం,

పేపరు వెయిటు మొదలయినవి ఎక్కడి వస్తువులక్కడ "చిత్రార్పితారంభం" లాగ, కుర్చీకి వెనుకల గాంధీజీ దండియాత్ర ఛాయాచిత్రం, ఎంతటి వాగుడు కాయను గూడ ఆటకట్టించే పరిసరాలు. ఇంతలో ఎవరో వచ్చి, తాను ఎందుకు వచ్చిందీ సవిన యంగా తెలియజేశారు. ఆయన లేచి ఎంతో ఆప్యాయంగా పలుకరించి, కుర్చీ చూపి, వెంటనే పక్క గదిలోకివెళ్ళి, చెక్కుచెదర కుండా పెట్టిన వ్యాసాల దొంతరను గాలిం చి, ఒక వ్యాసం తీసుకొని, మరల వరుస వారీగా అమర్చి మావద్దకు వచ్చి "ఫలానా సంచికలో ఇది ప్రకటితమవుతుంది. ఇది వరకే నిర్ణయమైనట్టు మీకు తెలియజేశాము కూడా" అని రెండు మాటలతో పరిస్థితి వివరించి కూర్చున్నారు.



ఆ ప్రశాంతత పరాకాష్ఠ, ఆ బాధ్యతా పరిజ్ఞాన పరమావధి, ఆ మౌనపరాకోటి బహుకార్యవ్యాపృతులై తొందర, తొట్రు పాటు తొణికిసలాడేవారిని వెర్రెత్తించే మాట వాస్తవమే. కాని, పొంగే పాలలాటివారు కాక, కాగి చల్లారిన పాలలాటివారే శాశ్వత బహుళ శ్రేయోదాయకలయిన మహా కార్యాలు చేయగలరనడం కూడా వాస్తవమేనని గ్రహించినప్పుడు శ్రీ కోలవెన్ను రామ కోటేశ్వరరావుగారి పద్ధతి మనలను ముగ్ధులను చేస్తుంది.

ఈ స్వభావం కోలవెన్నువారికి ఈ 68వ యేట అబ్బినది కాదు; చిన్ననాటినుంచే అలవడినది. ఆ నాళ్ళలోనే వారికి విలక్షణమైన తలంపొక్కటి - దేశంలోని వివిధ ప్రాంతాలను, ప్రజలను ఒక్క కొలికికి తీసుకురావడానికి సాహిత్యం వినా ఉత్తమ సాధనం మరొకటి లేదు గనుక పరిపాలన భాష అయిన ఇంగ్లీషు ద్వారానే ఆ మహా కార్యానికి పూనుకోవాలని, తెనుగు సొబగులను ఇతర ప్రాంతాలవారికీ, ఇతర దేశాలవారికీ అందిం చాలని - మనస్సులో తళుక్కుమన్నది. ఈ దృష్టితోనే విద్యార్థి దశనుంచే ఆంగ్లసాహిత్యాన్ని ఆకళించుకోడం, రచన సాగిం చడం, తెనుగు సాహిత్యం ఆంగ్లంలోకి అనువదించడం కొన సాగించారు. పట్టభద్రులై, చెన్నపురిలో న్యాయకళాశాలలో చదివే టప్పుడు, వివిధ ప్రాంతాలమిత్రుల ప్రోత్సాహంతో ఆ తలంపు బలపడి సంకల్పమయింది.



న్యాయశాస్త్ర పట్టభద్రులయిన తర్వాత రెండు మూడేళ్ళ పాటు (1918-20) నరసారావుపేటలో కోర్టు కచ్చేరీలు ఎక్కారు. ఇంతలో సహాయనిరాకరణోద్యమం ముమ్మరంగా రాగా, న్యాయవాది వృత్తికి స్వస్తిచెప్పి, ప్రజోద్యమంలో దూకారు. కాని, మనసులోని చిన్ననాటి తలపు - సంకల్పంగా బలపడిన తలపు - కెలకవేయక మానలేదు.



కనుక ప్రకాశంగారి 'స్వరాజ్య'పత్రికలో ఖాసా సుబ్బారావు, కృపానిధిగార్లతో కలిసి కొంతకాలంపాటు సహాయ సంపాదకులుగా పనిచేశారు. అప్పటికిగాని వారి సంకల్పం దృఢతరం కాలేదు. స్వరాజ్యను వదలి చెన్నపురినుంచే 'త్రివేణి' అనే ఆంగ్ల సాహిత్య మాసపత్రికను వెలువరించ నిశ్చయించారు.

ముప్పయి అయిదు సంవత్సరాలనాడు (1927) 'త్రివేణి' వారి సంపాదకత్వంలో అవతరించింది. చిన్ననాటి సంకల్పం సిద్ధించింది. తెనుగువారే కాక మహారాష్ట్ర కన్నడాది భాషా సాహిత్యవేత్తలు వారి కృషికి అమోఘంగా తోడ్పడ్డారు. ఈనాడు సాహిత్య అకాడెమీ, పి.ఇ.ఎన్. సంస్థలు నిర్వహిస్తున్న పనికి 'త్రివేణి' మార్గదర్శకమైంది. 'త్రివేణి' సాధించిన భావసమైక్యం అనిదం పూర్వం; ఆంగ్లం ద్వారా దేశంలోని వివిధ సాహిత్యాల సౌందర్యం దేశవాసులు, విదేశవాసులు ఆస్వాదించేట్టు చేసింది. దక్షిణాపథ సాహిత్యాల, ముఖ్యంగా తెనుగు సాహిత్యపు నిగ్గును ఇతరులకు అందజేసి, తెనుగు సాహిత్యం ఉత్తమ ప్రపంచ సాహిత్యానికి ఎంతమాత్రం తీసిపోదని, క్రాంతదర్శులు ఎక్కడి వారైనా, దేశకాలావధులు దాటి దర్శనమిస్తారని దిగంతాలకు చాటింది; పలువురు కొత్త రచయితలను ప్రోత్సహించింది; వారితో అపూర్వ సేవలు చేయించింది.

"రాజనీతిజ్ఞులకన్నా సాహిత్యవేత్తలే భారత సమైక్యం సాధించగలరని నా విశ్వాసం. ఇతర భారతీయ భాషలను మనం చక్కగా పరిశీలించినట్టయితే, సంస్కృతానికి, ఆంగ్లానికి కూడా మనం ఋణపడి ఉన్నామని తెలుతుంది. ఏ భాషను గురించి కాని ద్వేషమన్నది ఎన్నడూ పెంచుకోరాదు" అన్నది కోలవెన్నువారి కఠోర నియమం.

ఒకవైపు 'త్రివేణి' సేవ చేస్తూనే, కోలవెన్నువారు, కోపల్లె హనుమంతరావుగారి నిర్యాణానంతరం బందరు జాతీయ కళాశాల ప్రిన్సిపాలుగాను, ముట్నూరి కృష్ణారావుగారి కాలధర్మం తర్వాత

'కృష్ణాపత్రిక' సంపాదకులుగాను, కొంతకాలం సౌత్ ఇండియన్ బుక్ ట్రస్ట్‌లో తెనుగు సంపాదకులుగాను పనిచేశారు. కేంద్ర సాహిత్య అకాడెమీ సలహాసంఘం సభ్యులుగాను ఉన్నారు.

ప్రస్తుతం వారు స్వస్థలమైన నరసారావుపేటలోనే స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. అరవై ఎనిమిది శరత్తుల వయసన్నప్పుడు దేహపాటవం తగ్గుతున్నదని చెప్పనక్కరలేదు. వీలైనంతవరకు విశ్రాంతిగా ఉండాలనే వారి కోరిక. ఇటీవల చూపు కూడా తగ్గడం వల్ల వారు ఎక్కువగా చదువడమూ మానివేశారు. ఉదయం రెండు మూడు గంటలపాటు కళాశాల విద్వాంసుల తోను, ఇతరులతోను గోష్ఠి, భోజనానంతరం మధ్యాహ్నం విశ్రాంతి; సాయంకాలం రెండు మూడు మైళ్ళ వాహ్యాళి వారి దైనందిన చర్య. వారి మనస్సుకు ప్రతిబింబంవంటి సతీమణి శ్రీమతి రాజ్యలక్ష్మమ్మగారు వారికి సేవలు చేస్తుంటారు. ఇటీవలనే (అపుత్రస్య గతిర్నాస్తి అని కాబోలు) ఒక బాలకుని పెంచు కున్నారు.

తెనుగు నవకవితోద్యానంలో నవనవానర్ఘ పుష్పాలు పూయించిన అడవి బాపిరాజు, నండూరి సుబ్బారావు, బసవరాజు అప్పారావుగార్లు కొలవెన్ను వారికి ప్రాణమిత్రులు. "వారు దివంగతులయిన తర్వాత ఒంటరివాణ్ణయాను. నాకు అత్యాప్తులలో ఒక్కరయిన కాటూరి వేంకటేశ్వరరావుగారు అస్తమించడంతో మరీ ఒంటరి వాణ్ణయ్యాను" అని వారు ఆవేదన పడుతారు.

పాశ్చాత్య సాహిత్యం, ముఖ్యంగా ఆంగ్ల సాహిత్యం తరచి చూచిన కొలవెన్నువారికి నేడు ఆయా సాహిత్యాలలో చెలరేగిన కొన్ని కొత్త పోకడలనబడేవి గిట్టవు. డి.హెచ్.లారెన్స్, జీన్‌పాల్ సాత్రే వంటి వారి రచనలు కొన్ని జుగుప్సాకరమైనవి, మానవుని లోని నీచ ప్రవృత్తిని రేకెత్తించేవీనని వారి విమర్శ. మానవ స్వభావాన్ని చక్కగా చిత్రించినంత మాత్రాన, చక్కని శైలిలో వ్రాసినంతమాత్రాన అలాటివి ఉత్తమ సాహిత్యానికి చెందవని, అవి తాత్కాలికంగా కొంత వినోదోల్లాసాలను కలిగించవచ్చునేమో కాని, కాలగర్భంలో కలిసిపోయేవేనని, డిక్కెన్స్ మొదలయిన వారివి నిలుస్తాయని వారి నిశ్చయం. వర్డ్స్‌వర్త్ రచనలు, థామ్సన్ రచనలు ఉపనిషత్తుల పథంలో ఉన్నాయని వారి విశ్వాసం.

ఇక నేటి 'యాంగ్రీ యంగ్‌మెన్' ప్రతిభావంతులు; నూతన సృష్టి చేస్తున్నారు; కొంత సాధిస్తున్నారు; కాని, లక్ష్యశుద్ధి లేని వారని వారి విచారం. "మన సాహిత్యం వైపు చూస్తే, ప్రతి సాహిత్యంలోను ఆటుపోటులు ఉంటాయి. విజయనగర



సామ్రాజ్యం ఛిన్నాభిన్నమయిన తర్వాత చిన్న చిన్న జమీందారీలు ఏర్పడడంతో ఉన్నత లక్ష్యం దూరమయింది. అప్పటి రచనలలో కవిత్వానికి లోటులేదు; శైలీ బాగానే ఉంటుంది; అయితే జీవం లేదు. దక్షిణాంధ్ర సాహిత్యం లోస్థాయిది. దేశంలో ఉత్తమ కార్యాలు జరిగే కాలంలో కవులు, గాయకులు ఉత్తమ స్థాయికి వెళ్ళగలుగుతారు. అంతరంగా ఎంత పరిణతి పొందినా పరిసర ప్రభావం తప్పించుకోలేరు. ఏమైనా, పశుత్వం నుంచి మానవత్వానికి, మానవత్వం నుంచి దైవత్వానికి దారితీసేదే ఉత్తమ సాహిత్యం" అని నొక్కి వక్కాణిస్తారు కొలవెన్నువారు.

ఆంగ్ల సాహిత్యం తెనుగు సాహిత్యానికి ప్రమాదం తెచ్చి



పెట్టిందనే మాటలకు వారు ఆశ్చర్యపడతారు. ఏ భాషవల్లా మరొక భాషకు ప్రమాదం లేదనీ, అంతేకాదు "మనకు హిందీ, ఇంగ్లీషు రెండూ అవసరమే. కనుక కాలపరిమితి లేకుండా ఆంగ్లం అధికార భాషగా గాని, పరిపాలన భాషగా గాని ఉండాలి. రాజ్యాంగంలో తక్కిన భాషలతోపాటు ఇంగ్లీషునూ చేర్చాలి. మన వారసత్వంలో ఆంగ్ల సాహిత్యం కూడా చేరింది. ఆంగ్లమంటే ఆంగ్లం ద్వారా వచ్చిన ఇతర సాహిత్యాలు కూడా" అనీ వారి వ్యాఖ్యానం.

"మహోజ్జ్వలంగా కాకపోయినా, ఉత్తమ స్థాయిలోనే 'త్రివేణి' నడిపానని నాకెంతో తృప్తి ఉన్నది. తీరని కోర్కెలంటూ నాకు లేవు" అని వారు అంటూ ఉంటే, తామే త్రివేణిగా, త్రివేణే తాముగా సేవాదీక్షపట్టి, సర్వస్వం 'త్రివేణి'లో ధారపోసిన త్యాగ సంపన్నులు ఆ మాత్రం సంతృప్తిపడడం సహజమే ననిపిస్తుంది.

సహజమని అనిపించనిదల్లా వారు చేసిన సేవకు తగిన రాణ,తగిన పరిగణన రాలేదనడం, ఎన్నో కారణాలవల్ల మనసు మార్చుకొనే ప్రభుత్వం ఎలా ఉన్నా, ప్రజలు - సాహిత్యాభిమానులైన ప్రజలు - కూడా సీతకన్ను వేశారనడం మాత్రమే.

# మరపురాని మహత్వం



## విశ్వనాథ సత్యనారాయణ

105



కాశీ విశ్వవిద్యాలయం పార్లమెంటు హాలు కిటకిటలాడుతున్నది. హాలు వసారా చుట్టూ కూడా జనం గజిబిజిగా ఇరుక్కుని ఉన్నారు. వేదిక ముందు వరుసలో విశ్వవిద్యాలయోపాధ్యక్షులు ఆచార్య నరేంద్రదేవ్, విశ్వవిద్యాలయాచార్యులు, ప్రముఖులు ఆసీనులయి ఉన్నారు. వేదిక నుంచి,

"గోదావరీ పావనోదార వాఃపూర
మఖిల భారతము మాదన్ననాడు,
తుంగభద్రా సముత్తుంగ రావముతోడ
కవుల గానము శ్రుతిగలయునాడు"

- అని మేఘ గంభీర నిర్ఘోషం వినబడగానే కలకలం చప్పున చల్లారింది. అందరూ చెవులు దోరపెట్టుకుని వినసాగారు. శ్రోతలలో తెనుగు తెలియని హిందీ, బెంగాలీ వారే పెక్కుమంది. వారిని ఏదో రసధుని ముంచెత్తింది. వేదిక నుంచి మరికొంత సేపటికి -

"పరసుఖదశౌ పరీపా
క రామణీయక యెరుంగు కచస్సాన్నిధ్యా



త్త రమణ ప్రథమ స్పర్శ
ప్రరూఢి మెడవాలిచె సూత్రబంధన వేళన్"
- అని వివాహ ఘట్టమూ, ఆఖరున -
"అమరీ కైశిక పారిజాత కుసుమో
హస్వాదు నీ బాలకాం
డము నీ భక్తుడు శోభనాద్రి దగు సం
తానంబు జన్మాద్యపా
యము తప్పించుత!........"
- అనే మంగళ పద్యం వినిపించాయి.

పది నిమిషాలపాటు కరతాళ ధ్వనుల కోలాహలం ఆగలేదు. తర్వాత ఆచార్య నరేంద్రదేవ్ లేచి వేదిక అధిరోహించి, పద్యాలు చదివినవారిని గాఢాలింగనం చేసుకొని, "ఈ గమకం, సంస్కృత వృత్తాల గతి, శయ్య దేశంలోనే అపూర్వం. సంస్కృతాంధ్రాలు ఇంత సహజీవనం చేస్తాయని మాకు తెలియదు. ఇలాటి కవి దేశంలో ఉన్నారని కూడా మేము ఎరుగం. హిందీలో 'రీతి సంప్రదాయ' మనే విశిష్ట విధానానికి ప్రవర్తకులు తెనుగువారు. ఈ కవి రచనా రీతి భారతదేశంలోనే విశిష్టమయింది. దీనిని ఆంధ్ర రీతి అని కాని, విశ్వనాథ రీతి అని కాని అందాము" అంటూ



ఉండగా జయజయ నినాదాలతో మరొకమారు సభాంగణం ప్రతిధ్వనితమైంది. ఆచార్య నరేంద్రదేవ్ ఆ కవికి దుశ్శాలువలు కప్పి, తులసీ రామాయణం, అవధీ వ్యాకరణం, నిఘంటువు మొదలయినవి బహూకరించారు.

పర రాష్ట్రంలో సాటి తెనుగువానికి, తెనుగువాణికి జరిగిన ఆ మహాగౌరవం తలచుకుంటేనే ఒళ్ళు కడిమిచెట్టవుతుంది.

ఆ కవి, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. విశ్వనాథ సత్యనారాయణగారంటే ఆంధ్రప్రదేశ్‌లో అబాలవృద్ధం ఎరుగును. వారిని ఫలానా అని చెప్పడం సూర్యుణ్ణి దివిటీతో చూపడమే.

విశ్వనాథవారు పట్టి సాధించని సాహిత్య ప్రక్రియ అంటూ లేదు. మెట్టి చూడని సారస్వతమంటూ లేదు. వారిని తలచుకొన్నప్పుడెల్లా హంపీ విరూపాక్షాలయ గోపురం, దానికి అనతి దూరంలోని పంపా సరోవరం, మహాబలిపురంలోని దీపస్తంభం, దాని పక్కనే దొర్లాడే తరంగ హస్తనిస్తులమైన మహోదధి, వింధ్యాటవీ మధ్యమణి చిత్రకూటం, దాని పక్కనే పారే గద్గద నదద్గోదావరీ పూరం, వేయి మైళ్ళ వేగంతో వీచే ఝంఝూ మారుతం, దానిని అనుసరించి వచ్చే అకాల జలధర ధారం సంపాతం, అభ్రంకష శిఖరరాజి విరాజమాన హిమవన్నగం, అగాధాగాధమై తిమితిమింగిలాకులమైన పసిఫిక్ మహాసాగరం స్ఫురిస్తాయి.



వారు ఇంతటివారు కావడానికి నిదానం, స్వయంకృషీ, పట్టుదలానూ. ఈ గుణాలు ఏర్పడడానికి మూలహేతువు వారు తలయెత్తే నాటికే పిత్రార్జితం పూర్తిగా తుడిచిపెట్టుకొని పోవడం. వారి పితృపాదులు శ్రీ శోభనాద్రిగారు వందంజిల్లర యకరాల పెద్ద భూస్వామి. ఆయన మహాభోగి; మహాత్యాగి. వారి ఇంట భుజించనివారు నందమూరు పరిసర ప్రాంతాలలోనే కాక కృష్ణాజిల్లాలోనే లేరని ప్రతీతి.

విశ్వనాథవారు జన్మించింది నందమూరులోనే (1893)*, అయినా, విద్యార్థి దశ అంతా బందరులో హిందూ హై స్కూలు లోను, నోబుల్ కాలేజీలోను గడిపారు. ఆ దశలో హిందూ హైస్కూలు ఆవరణంలోని కానుగ చెట్లెక్కి కూర్చుని, ముచ్చట ముడి సర్దుకుంటూ 'శృంగారవీధి' అని పద్యాలు చెప్పారు.

మొదట్లో శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారితో కలిసి పద్యాలు చెబుదామని వారికి ఉబలాటగా ఉండేది. ఒకనాడు బందరు రామలింగేశ్వరస్వామి ఆలయంలో కలుసుకున్నప్పుడు "నీతో కలిసి పద్యాలు చెబుదామని ఉందోయ్!" అన్నారట. "ఛస్! నీకేమి వచ్చు. సంస్కృతమా? తెలుగా? ఇంగ్లీషా?" అని పింగళి వారు కస్సుమన్నారట. 'ఇదా సంగతి?' అనుకున్నారు విశ్వనాథ వారు. పొంగే రక్తం! పట్టుదల పెరిగింది. సంస్కృతం సాధించ దలచుకున్నారు. "సత్కవి చెళ్ళపిళ్ళ వేంకన గురువంచు జెప్పి కొనగా నది గొప్ప" అని వారు చెప్పుకున్నా, నిజానికి వారి శిక్షా గురువు శ్రీ విమలానంద భారతి (పూర్వాశ్రమంలో శ్రీ కె.టి. రామారావు). వారితో కలసి, సంస్కృత రామాయణ భారతాలు పిండి చేశారు. పాణినీయం పుక్కిట బట్టారు. ఈ నిరంతర పరిశ్రమ వల్లనే కాబోలు బి.ఎ. పలుమారు తప్పారు. (డిగ్రీ త్వరగా చేతికి రాలేదనే ఆవేదన శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారికి "ఆంధ్ర ప్రశస్తి"ని అంకితమిస్తూ అవతారికలో చెప్పిన "డిగ్రీలు లేని పాండిత్యమ్ము.... ఈ పాడుకాలాన బుట్టి" ఇత్యాదులలో ధ్వనించింది). తర్వాత వారు ఎం.ఎ. కూడా పాసయారు.

నిరంతర సంస్కృత కావ్య వ్యాసంగంతో విలక్షణత సంపాదిద్దామనే అభినివేశంతో వారి రచన క్లిష్టతరమయింది. అప్పటి బందరు కవులు ముందు మెచ్చుకుంటూ వెనుక వెక్కిరించే వారట. "పాషాణపాక ప్రభూ" అని కూడా సంబోధించారు. ఆ విమర్శలకు వారి మనసు కొంత కలగుండు పడింది. సంఘర్షణ బయలు దేరింది. "నా మార్గం నాదే. నేను ఎందుకు ఒకరివెంట

*విశ్వనాథ జననం 10-9-1895. అది మన్మథనామ సంవత్సరం.



పరుగు పెట్టాలి?'' అనే నిశ్చయానికి వచ్చారు. ఈ ఆవేదన అర్థ శతాబ్ది క్రితం 'కృష్ణా పత్రిక'లో ప్రకటితమైన కిన్నెరసాని పద్యాలలో కనిపిస్తుంది.

వారు జీవిక కోసం నేషనల్, హిందూ, ఎ.సి. కాలేజీలలో కొంతకాలం, విజయవాడ కళాశాలలో ఇరవై ఏళ్ళూ ఆంధ్ర భాషాచార్యులుగా ఉన్నా, కరీంనగర్ కళాశాల ప్రిన్సిపాలుగాను ఉన్నా, సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షులుగా ఉన్నా, శాసన మండలి సభ్యులుగా ఉన్నా ప్రధాన వ్యాసంగం రచన. లేడికి లేచిందేవేళ అన్నట్లుగా వారు వెళ్ళిందే కాలేజీ వేళగా గడిచాయి ఉద్యోగాలన్నీ.

వారి తొలి కవిత గిరికుమారుని ప్రణయగీతాలని* అంటారు. మొదటి నవల❖ సగం వ్రాసి వదలిపెట్టారు. ముద్రితమైన మొదటి నవల ఏకవీర. నాటినుంచి పుంఖానుపుంఖంగా పత్రికలలోను, విడిగాను వేయిపడగలు, చెలియలికట్ట, బద్దెన్న సేనాని, సముద్రపు దిబ్బ, మ్రోయు తుమ్మెద మొదలయిన నవలలు; ఆంధ్ర ప్రశస్తి, ఋతుసంహారం, విశ్వనాథ మధ్యాక్కరలు, రామాయణ కల్పవృక్షం మొదలయిన కావ్యాలు; కిన్నెరసాని పాటలు, కోకిలమ్మ పెళ్ళి, బానిసల దీవి, ఉయ్యాల

*'గిరికుమారుని ప్రేమగీతాలు' - 1920 ప్రాంతంలోనే ఇవి 'సాహితి'లో వచ్చాయి.

❖ మొదటి నవల పేరు 'అంతరాత్మ' - జాతీయోద్యమం నాటి నేపథ్యం.

తాళ్ళు మొదలయిన గేయ వాక్యాలు, నర్తనశాల, సౌప్తిక ప్రళయము, అనార్కలీ, వేనరాజు, త్రిశూలం, కళింగరాజ్యం మొదల యిన నాటకాలు; అద్భుత శర్మిష్ఠ మన్న సంస్కృత నాటకం వ్రాశారు. మాక్లీ దుర్గంలో కుక్క మొదలైన కథలు ఎన్నో వ్రాశారు. ఇటీవలనే పురాణ వైర గ్రంథమాల పేర దాదాపు ఇరవై నవలలు వ్రాశారు. ఇటీవల వ్రాసింది 'మ్రోయు తుమ్మెద'. ఇంకా నేటికీ వ్రాస్తు న్నారు; రేపూ వ్రాస్తారు.



ఇంత కవిత చెప్పినా, తిరుపతి వేంకటేశ్వరుల శిష్యులమని చెప్పు కున్నా వారు ఎప్పుడూ అవధానం చేయలేదు. ఒకానొకప్పుడు "ద్రుపద భూపతి యజ్ఞధూమంబు వెంబడి బాహిరిల్లిన చలద్భ్రమరవేణి" అని వేణీ సంహార కథ ఆశువుగా మాత్రం చెప్పారు.

ప్రతి రచయిత పాత్రలకూ ఏదో ఆలంబన విభావం ఉంటుందనడం నిజం. కాని విశ్వనాథ వారి పాత్రలు కొంత వేషం మార్చుకొని తిరిగే లోకంలోని మానవులే పూర్తిగా. విశ్వనాథవారు ఒక్కొక్క సమయంలో ఒక్కొక్కరకం మనుష్యుల సావాసంలో ఉంటారు - వారు పురుషోత్తములూ కావచ్చు, పరమ నికృష్టులూ కావచ్చు. అలాటివారి స్వరూప స్వభావాలన్నీ కొంత కల్పనా కల్పంతో వారి తర్వాతి రచనలలో అచ్చుయాయన్నమాటే. పిదప అలాటివారి సహవాసం వారికి ఉండదు. ఈవిధంగా 'తెరచిరాజు' నవల ముంజులూరి కృష్ణా రావనే నటుని జీవితం. 'చెలియలికట్ట' 'ఫ్రీ లవ్' ఉద్యమంపై దెబ్బ. హరిజనుడు నాయకుడైన 'బద్దెన సేనాని' నేటి పలువురి గాథల పుట్ట. 'వేయిపడగలు'లో నేటి నాయకులు, పత్రికా సంపా దకులు పలువురు మనకు కన్నుల గడుతారు. 'వేనరాజు' బందరు జాతీయ కళాశాల కుళ్ళు కడిగివేసిన మడివేలు. 'దమ యంతీ ద్వితీయ స్వయంవరం' తమ ఆంధ్ర విశ్వవిద్యాలయో ద్యోగ ప్రయత్న నాటకం. 'మ్రోయు తుమ్మెద' కరీంనగర్‌లోని ఒక మహాగాయకుని ఇతివృత్తం. పేరు కూడా కరీంనగర్ పరిసరాల మ్రోయుతుమ్మెద వాగుదే.

విశ్వనాథవారి రచనలలో శాశ్వత లక్ష్యమే కాక సమసామయి కోద్యమాల ప్రభావంగలవీ చాల ఉన్నాయి: "బానిస గుడిసెల పజ్జలపయో రాశి ఎందులకో!" అని ఆరంభమై "పయోరాశి వీచివాత్య పరువులిడుట ఇందులకా?" అని ముగిసే 'బానిసల ద్వీపం',"ఎడ్ల కనులకు గంతలు" అని ప్రారంభమయ్యే 'ఉయ్యాల త్రాళ్లు' ఆనాటి భారతీయుల బానిస బ్రతుకుకు ముకురాలు.

విశ్వనాథవారి రచనావిధానం విచిత్రాతి విచిత్రం. కూర్చునే బల్ల అవీ ఏమీ లేవు. పద్యాలయితే వందకుపైగా తలలోనే వ్రాసుకుని తర్వాత స్వయంగా కాయితంపై పెడుతారు. వచన మయితే, వారు చెబుతూంటే ఇతరులు వ్రాసుకోవలసిందే. 'ఏకవీర' వ్రాసినప్పుడు మాత్రం ప్రతి శుక్రవారం టెంకాయకొట్టి పూజచేసి మిత్రులకు వినిపించేవారట. 'వేయిపడగలు' మొదట్లో స్వయంగా వ్రాయడం ప్రారంభించగా మూడు ప్రకర

ణాలు మూడు నెలలు పట్టింది. ఇది సరికాదని చెప్పడం ప్రారంభించి వేయి పుటలు 29 నాళ్ళలో చెప్పారట. నవల ఏదీ నాలుగు నాళ్ళకు మించి లేదు.



వారి అలవాట్లు మరీ వింతగా ఉంటాయి. వారు మంచి భోక్త. ఆవకాయలో పచ్చిమెరప కాయ కొరుక్కుంటారు. హాస్యప్రియులు. వారు జిలేబీ జాతి. స్టంట్ సినిమాలన్నా. ఇంగ్లీషు సిని మాలన్నా వారికి ప్రీతి మెండు.

వారి రచనలలో ఏది నిలుస్తుందీ అంటే ప్రతిదీ నిలుస్తుందనే వారున్నారు. కాని, "తన కావ్యం ప్రతివాడూ గొప్పదంటాడు. ప్రతివాడూ తన అభిప్రాయమే గొప్పదంటాడు. ఎవరో నా 'ఏకవీర' ఉత్తమమన్నారు. నేను ఉత్తమమని ఎందుకనాలి? ఒక తరం పోయి మరొక తరం వచ్చినట్లు చెప్పిన 'వేయిపడగలు' గొప్పది కాదా? దాని గుణగణాలు ఎవరైనా పరిశీలించారా? ఎంతో 'సైకాలజీ' గుప్పించిన 'చెలియలికట్ట' ఏమైనట్టు? 'పురాణ వైరగ్రంథమాల'లో ఒక్కొక్క నవలలో ఒక్కొక్క శిల్పం చూపానే? ఎవరైనా చూచారా? మన ప్రమాణాలు నిలుస్తాయా? ఎంతో పోయె! దేవాలయాలే కూలిపోయె!" అంటారు వారు.

"అయినా, అన్నిటికన్నా 'విశ్వనాథ మధ్యాక్కరలు' శిల్ప వైలక్షణ్యంతోను, భావనా సౌకుమార్యంతోను, దేశిచ్ఛందో విశేషం వల్లను శాశ్వతంగా ఉంటుందండీ" అన్నాను. వారు ఒప్పలేదు. "రామాయణ కల్పవృక్షాన్ని మించిన కవిత్వం ఉండదు. సర్వశక్తులూ పెట్టి వ్రాశాను. పరమేశ్వరుడు అనుగ్రహించాడు. నారాయణుడే పరమేశ్వరుడు" అన్నారు వారు.

పత్రికలంటే వారు ఉగ్రులైపోతారు. పత్రికా సంపాదకులకు శిక్షణ అవసరమని వారి సూచన. ప్రతి అడ్డమైనవాడూ వ్రాసినది ప్రచురించి సాహిత్య ప్రమాణాలు పాడుచేస్తున్నారు పత్రికల వారని, బాధ్యత గుర్తెరుగడంలేదని వారి విమర్శ.

వారు పట్టుబట్టలు కట్టుకుని భోజనం చేయటం చూచి ఎవరైనా, "మరీ సనాతన ధర్మం పునశ్చరిత మౌతుందా?" అని ప్రశ్నిస్తే, "సనాతనధర్మం రాదు. కాని వేదమతానుసరణ తప్పదు. అదివినా ప్రపంచ శాంతి ఉండదు. ఏ ఇజమూ గట్టెక్కించదు. వేదిజం ఒక్కటే శరణ్యం" అంటారు వారు.

"మీరు సాధించంది లేదు. సాహితీసమితి వారి ఆక్షేపణకు కోపం వచ్చి, పాశ్చాత్య సాహిత్యాన్నే మథించివేశారు. ఇంగ్లీషులోను, సంస్కృతంలోను కవిత చెబితే ఎంతో బాగుండును. దిగంతాలకు కీర్తి వ్యాపించేది" అని అంటామనుకోండి. "ఇంగ్లీషులో ఏ రవీంద్రుడిలాగో, ఇలియట్స్‌లాగో కవితాభాష వ్రాసే అలవాటు పోయింది. సంస్కృతంలో ఇప్పుడు వ్రాస్తే ప్రాచీన కవుల పరంపరలో ఏ వెయ్యాన్నొక్కటో వాణ్ణో అవుతాను. తెలుగులోనంటారా, పన్నెండుగురు ప్రాచీన మహాకవుల తర్వాత పదమూడవ వాణ్ణి నేను" అంటారు.

లక్షన్నర పుటలకు పైగా వ్రాసిన విశ్వనాథవారు ఏ సిద్ధాంతం చెప్పినా, ఏమి వ్రాసినా వారి రచనలకున్న ప్రాచుర్యం ఆంధ్రప్రదేశ్‌లోనే కాదు, భారతదేశంలోనే మరే కవి రచనలకూ లేదు. వారితో పోల్చదగినవారు అలనాటి క్షేమేంద్రుడు, పడమటి సీమ బాల్జాక్, నేటి రాహుల సాంకృత్యాయనులూను.

వేయిపడగల పాపరేడూ, చెలియలికట్ట లేని పసిఫిక్ పాథోనిధీ, మూడడుగులతో నేల కొలచిన త్రివిక్రముడూ ఒక్క రూపంలో తెనుగు సాహిత్యలోకంలో అవతరించినట్టు నాకు పొడగట్టుతారు విశ్వనాథవారు.



విరుస్తూంటే, వారో, వీరో - కొసకు గోదాలో నిలిచినవారితో జట్టీ పెట్టుకొనడానికో, చెట్టా పట్టాల్ కట్టడానికో మిడిమల్లులు మరొక వంక ఉసిగొల్పి కసి పెంచుతుండగా, కుర్ర జెట్టీల ఒడుపులను, వృద్ధమల్లుల మలుపులను, వారి సులువులను, వీరి బలువులను ఆకళించుకొన్నారు గుర్రంవారు.

నేడు చెల్లుబడిలో ఉన్న నుడికారంపై వారిది అద్వితీయమైన అధికారం. ప్రాచీన సంప్రదాయానికి వారితో సంపూర్ణ సహకారం. సమసామయిక విషయాలతో కొత్త సమయాలు కల్పించుకొని, జాతీయాలు సృష్టించుకున్నారు. కనుకనే, వారు సూర్య సూనుడు కర్ణునిగాని, సూర్యుని చూచి కబోది అయ్యే గబ్బిలాన్నిగాని, రేణుక చరిత్రనుగాని, రేడియో చేడియ చలిది పాటను గాని, లవణాన్నిగాని, లైక్షానుగాని, శారదనుగాని, శ్మశానాన్నిగాని - దేనినిగాని పొదిగిన ప్రతిమాట మన మనస్సున

వినుకొండలో జన్మించిన శ్రీ గుర్రం జాషువాగారి సమున్నతోదార గంభీర విగ్రహం విష్ణుకుండినుల అకుంఠిత ధర్మనిష్ఠ, వారి నిరుపమాన నిర్మాణ నైపుణి తొణికిసలాడుతూ రూపు కట్టినట్టు పొడగట్టుతుంది. అయితే, విష్ణుకుండినులది మతావేశం. గుర్రంవారు విశ్వమానవ మతాభినివేశంతో కరుణ రసం కలబోసి భారతమాతకు కల్పనానల్ప కవితామందిరాలు నెలకొల్పారు. వారి భారత మాత హిమమేరు కిరీట, త్రిసముద్ర రశన కాదు; జగన్మాత. విష్ణుకుండినులది పురాణ కవులకు మారురూపు. గుర్రంవారు ప్రకృతి పరిశీలన పారవశ్యంతో అత్యంత మధురోహలను మేళవించి, సువిశాల విశ్వంలోని అనంత ఖండాలకు ప్రతిగా ఖండకావ్య కుసుమాలు, కావ్య కుసుమాలు పూయించి విరాట్స్వరూపుని ఆరాధించారు. విష్ణుకుండినుల శిల్పశైలి తర్వాత వారికి ఒరవడి అయింది. నవకవి చక్రవర్తుల శైలి తర్వాత పలువురికి రాజపథ మయింది.

ఏది కవిత్వమనే గోదాలో బయలుదేరిన మల్లయుద్ధం శతాబ్దాలు గడచినా అమీతుమీ తేలక, ప్రబంధ సంబంధ నిబంధనల సాముగరిడీల కాకలుదీరి కరుడుగట్టిన వృద్ధ మల్లులొక మూల, ఛందోబందోబస్తులను ఫెళ ఫెళార్భటులతో తెంపివేసిన కుర్రకైసరి జెట్టీ లొకవంక తొడలు చరచి, ఒడలు

హత్తుకుపోతుంది. మరణంలేని మానవత్వాన్ని కామించే కవితావీణను వ్యథిత హృదయంతో మీటుతారు. అవును, ఘోరవ్యధ మనస్సును పగలగొడితే ఆ వెనుక ఉన్న నిజం దానంతట అదే బయట పడుతుంది, చాల పదునుగా దూసుకుని వస్తుంది. అప్పుడే అది ప్రతిభ అవుతుంది.

కాదూ, మరి? గుర్రంవారు జన్మించిన నాటి (1895 అక్టోబరు 28) కాలం ఎలాటిది? కులమత కర్కశక్రకచకరాళదంష్ట్రలు కరకరలాడుతున్న కాలం. వారి జనకులు శ్రీ వీరయ్యగారు, మాతృదేవి శ్రీ లింగమ్మగారు వారి భవిష్యత్తును తీర్చి దిద్దడానికి ఎంత ప్రోదిచేసినా, ప్రకృతే వారికి ప్రధానాచార్య అయింది. కనుకనే వారి పద్యగుచ్ఛాలలో ఆ పారిజాత పరీమళాలు;

"దొరల రాచరికమె మెరుగయ్యె ననిపించె మారుపల్కవేల మంతిరన్న?"

- అని గద్దించగల ఆ ధైర్యసాహసాలు; తాము పదాలకు ప్రాణం పోసి నడపగలిగినా, ద్వారం వారి వ్రేళ్ళలో ఏ వరముందో అంటూ,

"చెవులు బట్టి పిండి శిక్షించి జడమైన కట్టెకెట్లు విద్య గరపినాడో!"

- అని సహజసుందరంగా చోద్యాలుపోయే ఆ గడుసు



తనాలు; వైరస్యం కలిగించే వైరి రసాలను -

"కలవారిచ్చిన పట్టు వస్త్రములతో
గన్పట్టు నన్ జూచి శ్రీ
గలవా డీతడటంచు నల్వురన నా
కర్ణించి నాకన్న కొ
డ్కులు, జుట్టాలును డబ్బులేదనిన సం
కోచింతు రీనాటి క
న్యుల మాటేల? ప్రచారమందు బుతమున్
శుద్ధానృతంబయ్యెడిన్"

- అంటూ, సర్కస్ రింగ్‌మాస్టర్ పులి, మేక వంటి సహజ వైరులను కలిపి నడిపినట్టు ఏకధాటిగా నడిపే రసప్రస్థానాచార్యుల ఆ రాజస చాకచక్యాలూను.

గుర్రంవారు ఉన్నత పాఠశాల చదువు పూర్తయిన పిదప 1919 నుంచి తొమ్మిదేండ్లపాటు గుంటూరు ట్రైనింగ్ స్కూలులో కొలువుచేసినా, తర్వాత ఉభయ భాషాప్రవీణులై పదిహేనేళ్ళు గుంటూరు జిల్లా బోర్డు పాఠశాలలో తెలుగు పండితులయినా, పిదప మూడేళ్లు యుద్ధ ప్రచారకోపన్యాసకులయినా, అనంతరం కొన్నేళ్లు రేడియోలో ప్రొడ్యూసర్ పదవి నిర్వహించినా, పదపడి నౌకరీలు చాలించుకున్నా, "చిన్నప్పుడే పెండ్లాడిన" కవితను మాత్రం వదలక ఫిర్‌దౌసీ, గబ్బిలము, స్వప్నకథ,



కాందిశీకుడు, ముంతాజ్ మహల్, నేతాజీ, స్వయంవరము, అనసూయ, క్రీస్తు చరిత్ర, శివాజీ చరిత్ర మొదలయిన కావ్యాలు; (ఆరు సంపుటాల) ఖండకావ్యాలు, వీరాబాయి, తెరచాటు మొదలయిన నాటకాలు; నా కథ (తమ కథ) రచించారు. ఆ చిన్ననాటి చెలి వారికి గండపెండెరం తొడిగించి, ఏనుగెక్కించి, కనకాభిషేకం చేయించి వారిని వదలక, కీర్తిని దిగంతాలకు వెళ్ళగొట్టింది.

ప్రస్తుతం వారు గుంటూరు అరండల్‌పేటలో గోపాలకృష్ణయ్య తోట ప్రాంతంలో "మతముల్ వర్ణము లడ్డు గోడలయి ప్రేమన్ రాక్షసత్వంబుతో హతమార్పం బ్రయతిం"చే ఈ కాలంలోనూ సాహిత్యాభిమానులు కట్టించి ఇచ్చిన గృహంలో కాపురమున్నారు. ఆ సాహిత్య ప్రేమికులే -

"పక్కా ఖద్దరు శాలువల్, బిరుదముల్,
పద్య ప్రశంసావళుల్,
నక్కీదండలు దక్క నక్కరలకున్
ద్రవ్యంబు లేకుల్లమున్
ముక్కల్ సేయు విచార భారమున
నప్పుల్ చేసి జీవించు...."

- వారి చిక్కులు తీర్చారు. లేకపోతే "కవిత్వ మేమిటికి కూటికి గుడ్డకు రాదురా కవీ!" అని ఇంకా ఎంత మధనపడేవారో!

ఇంతయినా వారు, కావ్యాలలోనే కాక జీవితం లోనూ నిండుగా నవ్వగల దండి గుండెగలవారు. హాస్య సంభాషణలంటే వారికి చాల ఇష్టం. హాస్యమంత చింతాపనోదనం మరొకటి లేదని వారు తరుచు అంటుంటారు.

"నవ్వును జంతువుల్, నరుడు
నవ్వును, నవ్వులు చిత్తవృత్తికిన్
దివ్వెలు, కొన్ని నవ్వు లెటు
తేలవు, కొన్ని విషప్రయుక్తముల్,
పువ్వులవోలె ప్రేమరస
మున్ వెలిగ్రక్కు విశుద్ధమైన లే
నవ్వులు సర్వ దుఃఖ దమ
నంబులు వ్యాధులకున్ మహౌషధుల్"

- అని రకరకాల నవ్వులను వింగడించారు వారు ఒకప్పుడు.

గుర్రంవారు తెల్లవారుఝాము నాలుగు గంటలకే లేచి, కాలకృత్యాలు తీర్చుకొని, వ్యాహ్యాళికి బయలు దేరుతారు. తర్వాత ఒకమారు బజారుకు వెళ్ళిరావడం మామూలు. తొమ్మిదిన్నరకు భోజనం చేసి, కొంచెంసేపు విశ్రమించి, పద్యాలు వ్రాసుకుంటారు. ఎవరన్నా వస్తే, మధ్యాహ్నం మాట్లాడతారు. సాయంకాలం ఎక్కడికీ వెళ్ళరు.

కుక్కలను, పక్షులను పెంచడం వారి సరదా. వేట వారి అభిమాన వినోదం. పద్యాలు వ్రాసుకోడం, మిత్రులతో ముచ్చటలు వారి అభిమాన విషయాలు. రాజకీయాలు వారికి సుతరామూ గిట్టవు. రాజకీయాలను వెన్నాడుతుంటాయి కులమతాల నీడలు.

గుర్రంవారు ఒకమారు వర్ధాకు గాంధీజీ దర్శనం కోసం వెళ్ళారు. అక్కడున్న ఒక జర్మన్ పండితునికి ఒక రాజకీయ




నాయకుడు వారిని "దిస్ ఈజ్ ఎ క్రిస్టియన్ పొయట్" అని పరిచయం చేశారట. ఆ విదేశ పండితుడు ఆశ్చర్యపడి ఆ నాయకునివైపు చూశాడట. కవితకు కులమతాలు అంటగట్టడం ఎలాంటి సభ్యతో అర్థం కావడం లేదంటారు గుర్రంవారు. ఇలాటి కట్టుబాట్లు, పట్టింపులు పటాపంచలు చేయడానికే వారు శ్రీ గోరా (గోపరాజు రామచంద్రరావు)గారితో వియ్యమందారు.

"విశ్వమానవ సౌభ్రాత్రం, నిర్మత నిర్జాతి సంఘం నా ఆదర్శం. ఒక జాతికి, ఒక మతానికి చెందిన కవిత్వాలు మంచివి కావు. అవి కవిత్వాలే కావు. అలాటివి వీలునామా కవిత్వాలు అంటాను. నా భావం సామాన్యులకు అందివ్వడానికే ప్రయత్నించాను. గహనసంచారం లేని కవిత్వం నా లక్ష్యం" అని స్పష్టపరిచారు వారు.

ప్రాచీన కవితా సంప్రదాయాలు - వారికి కరతలామలకమయినా, నేడవి నాటు సరుకని వారి నమ్మకం. "చమత్కారం, అలంకారాలు పూర్వం ఉపయోగపడ్డాయి. ఇప్పుడు కవి సమయాలపట్ల హృదయ పరివర్తనం జరుగదని నా విశ్వాసం" అంటారు వారు; కనుకనే విశిష్టమార్గం తొక్కారు తమ రచనలలో.

"ఎక్కువమందికి మంచిదీ, అనుకూలమయినదీ సభ్యత, బహుజనామోదం పొందినదీ సభ్యత. ఈ దృష్టితోనే, వయస్సును బట్టి, పరిస్థితిని బట్టి, మానవ మనఃపరిణామాన్ని బట్టి నా

మనస్సు మారింది. రాష్ట్రీయతే సముచితమని తోచింది". అందువల్లనే వారి రచనలన్నిటికీ పసిడిమెరుగు జాతీయత.

"గబ్బిలం శాశ్వతంగాఉంటుందని నా నమ్మకం" అన్నారు వారు. 'గబ్బిలం' కావ్యం తాను చేసుకొన్న పాపకారణ మేమిటో తనకే తెలియని ఒక అభాగ్యుని అశ్రువుల గాథ. దానిలో అతని బాష్పసందేశం ప్రధానం; దేశవర్ణన గౌణం, అనుషంగికం. పరమ నికృష్టాంధకారం నుంచి హిమధవళ కైలాసోన్నతులలో నివసించే పరమశివుని వరకూ పాకిన గాథ అది. దానిపై వారికి ప్రత్యేకాదరం ఉండడం సహజమే.

కాని, గిజిగాడు గూడు అల్లుకున్నంతకాలం, సాలీడు వల నేస్తున్నంతకాలం, నెలబాలుడు వెన్నెలలు విరజిమ్ముతున్నంత కాలం, ముక్తక ముక్తాఫలాల నీరు నిగనిగలాడుతున్నంతకాలం గుర్రంవారి ప్రతి పద్యమూ వెలుగుతుంది, ప్రతి పదమూ మిగులుతుంది.





ఆవి జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజులు. జాతీయోద్యమానికి ఆంగోపాంగాలుగా మహిళాభ్యుదయ సంఘ సంస్కార కార్యకలాపాలు శాఖోపశాఖలుగా విస్తరిస్తున్న రోజులు. ఎందరో మహిళలు ప్రబోధ వ్యాసాలు వ్రాసేవారు; ప్రచారోప న్యాసాలు జరిపేవారు. "మా చెట్టు నీడ ముచ్చటలు" అనే శీర్షిక కింద లీలాదేవి అనేవారు వ్రాసేవారు. కొంతకాలానికి అవి ఆగిపోయాయి. "శారద లేఖలు" పుంఖానుపుంఖంగా శారద అనేవారు వ్రాసేవారు.

"మా చెట్టు నీడ ముచ్చటలు" మదరాసు, నెల్లూరు, కర్నూలు, విశాఖపట్నం, గుంటూరు జిల్లాల అయిదుగురు ముత్తయిదువులు విజయవాడలో కాపురం ఉండి, ఆ యింటి ఆవరణలోని నారింజ చెట్టు కింద కూర్చుని తమ తమ యాసలతో వివిధ విషయాలను చర్చించే రచనలు. అవి దేశం స్వతంత్రం కావాలని పడిన ఆవేదనల అచ్చట్లు. తెలుగునాడు సమైక్యం కావాలనే ముక్తాయింపుతో పొరపొచ్చెం లేకుండా ఆడుకున్న ముచ్చట్లు.



"శారద లేఖలు"లో ఆ శారద ఒక్కొక్కప్పుడు కళావిశారదగా కనిపించేది. రాజకీయాల ప్రసక్తి వచ్చినప్పుడు, మహిషాసుర మర్దనిగా సాక్షాత్కరించేది. సంఘ సంస్కరణ విషయాలు వచ్చినప్పుడు మైత్రేయిలాగ కనులగట్టేది. విద్యా సమస్యల చర్చలలో వాచక్నవి గార్గిలాగ దర్శనమిచ్చేది.

ఎవరీ లీలాదేవి? ఎవరీ శారద? ఇద్దరూ ఒక్కరేనా? వేర్వేరా? - అని పాఠకులు తహతహలాడిపోయేవారు. మరో ముచ్చటలో ఏమి తెలుపుతుందో, మరో లేఖలో ఏ పిడుగుల వర్షం పడుతుందో అని వేయి కళ్లతో వేచి ఉండేవారు.

ఆ లీలాదేవి, ఆ శారద పల్నాటి ఎర్రమట్టి రంగు ముతక ఖద్దరు చీర ధరించిన, పెద్ద చదువూ, పదవీ లేని కనుపర్తి వరలక్ష్మమ్మగారని అతి ప్రయత్నంమీద తెలుసుకున్న తర్వాత అందరూ ముక్కు మీద వేలు వేసుకున్నారు. అయిదవ తరగతి అంతైనా చూడని ఈమె ఏమిటి? ఆ రచనా రామణీయకమేమిటి? ఈ సోమిదేవమ్మ ఏమిటి? రచనలలో ఆ సంఘ సంస్కరణ జ్వాలలేమిటి? ఇంకా పట్టుమని పాతికేండ్లైనా నిండని ప్రాయమే! వ్రాతలలో ఆ విజ్ఞాన ప్రభ లేమిటి? - అనుకున్నారు అందరూను. కాని, వరలక్ష్మమ్మగారి పుట్టిన ఊరూ, మెట్టిన ఊరూ బాపట్లేనని, బాపట్ల ఆంధ్రోద్యమానికి పుట్టినిల్లు కావడమేగాక తక్కిన అభ్యుదయోద్యమాలకు కాణాచి అని ఎరిగినవారు మాత్రం "అచట పుట్టిన చిగురు కొమ్మైన చేవ" అనుకొని తల ఊపారు.

కనుపర్తి వారి అదృష్టమేమిటంటే, అన్నలయిన పాలపర్తి నరసింహం, కృష్ణమూర్తి, భావనారాయణగార్లు చిన్ననాటినుంచీ చదువు సందెల విషయంలో ప్రోత్సహించడమూ, 1909లో వివాహమయిన తర్వాత కూడా విదేశాలకు వెళ్లి విద్య నేర్చి వచ్చిన భర్త హనుమంతరావుగారు సంస్కారాభిలాషి గనుక ఎలాటి ఆటంకమూ చెప్పకపోవడమూ, చిన్ననాటినుంచే చోరగుడి సీతమ్మగారివంటి విదుషీమణి, సంఘసేవాపరాయణ సాంగత్యం లభించడమూను. సీతమ్మగారు 1913లో బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభ జరిపించిన చోరగుడి వేంకటాద్రి పంతులుగారి సతీమణి. సనాతనులకు ఆలవాలమైన బాపట్లలో త్రిపురసుందరీ సమాజమనే మహిళాసమాజం, యువతీ విద్యాలయం, రాత్రి పాఠశాల స్థాపించి సంఘసేవ చేసేవారు. 'సావిత్రి', 'హిందూ సుందరి' వంటి ఆనాటి స్త్రీ మాస పత్రికలలో వ్యాసాలు, కవితలు వ్రాసేవారు. ప్రథమాంధ్ర మహాసభతోపాటు ప్రథమాంధ్ర మహిళాసభను జరిపించిన వ్యవస్థా నిపుణురాలు. ఆమె కనుపర్తి వారితో పత్రికలు చదివించుకొని వినేవారు. కనుపర్తివారిది చిన్ననాటినుంచే మంచి వాచకం. సీతమ్మగారు ఆమె చదువుతుంటే విని ఎంతగానో ఆనందించేవారు.

ఆమె ప్రోత్సాహంవల్లనే కనుపర్తివారు యువతీ విద్యాలయోపాధ్యాయిని చాట్రాతి లక్ష్మీనరసమ్మగారి వద్ద సంస్కృతం, తెనుగు పంచకావ్యాలు చదివారు. అప్పటినుంచి కనిపించిన ప్రతి తెనుగు పుస్తకమూ చదువనారంభించారు. ఆఖరుకు పొట్లాలు కట్టివచ్చిన కాగితం కూడా వదిలేవారు కారు. ఈ పరిశ్రమతోనే వారు నర్సాపురం తాలూకా అభివృద్ధి సంఘం స్త్రీల





బహుమతి పరీక్షకు వెళ్ళి ఉత్తమ శ్రేణిలో గెలుపొంది బంగారు పతకం పొందారు. విజ్ఞాన చంద్రికా పరిషత్పరీక్షలకు, భక్తి ప్రచారిణీ పరీక్షకు వెళ్లి నెగ్గారు.

కనుపర్తివారి రచనావ్యాసంగానికి కూడా అన్నగారే ప్రోది చేశారు. వారి తొలి రచన అనువాదం. (మన సాహిత్యావతారమే అనువాదంతో కదా!) ఒక ఆంగ్ల కథను అన్నగారి సాయంతో 'సౌదామిని' అన్నపేరుతో అనువదించారు. అది 1919లో 'అనసూయ' పత్రికలో ప్రచురితమయింది. అప్పటినుంచి వారి రచనావ్యాసంగం అప్రతిహతంగా కొనసాగింది.

ఇంతలో కనుపర్తివారు తమ జీవితాన్నే సంఘసేవకు అంకితం చేసే సుసంఘటన జరిగింది. 1921లో బెజవాడలో అఖిల భారత కాంగ్రెస్ స్థాయి సంఘ సమావేశం జరిగింది. ఆ సమావేశానికి గాంధీజీ మొదలయిన మహానాయకులు వచ్చారు. సమావేశం తర్వాత గాంధీజీ స్వరాజ్యనిధికోసం చరిత్రాత్మకమయిన భారత పర్యటన ఆంధ్ర నుంచి ప్రారంభించి బందరు వచ్చారు. అప్పుడు బందరులో అన్నగారివద్ద ఉన్న కనుపర్తివారు జాతీయ కళాశాలలో విడిసిన గాంధీజీని దర్శించి, తాము వడికిన ఖద్దరు నూలు, ఒక బంగారు ఉంగరం సమర్పించారు. అప్పుడు గాంధీజీ ఉల్లిపొరలాంటి గుడ్డలు ధరించిన కనుపర్తి వారిని చూచి "ఇకనుంచి ఖద్దరు ధరిస్తారా?" అని ప్రాధేయ పూర్వకంగా ప్రశ్నించారు. కనుపర్తివారి ముఖం చిన్నబోయింది. "అలాగే" అని గాంధీజీకి వాగ్దానం చేశారు. అప్పటినుంచి ఖద్దరు వ్రతం పట్టారు. దానితోపాటే స్వరాజ్యలక్ష్మీ వ్రతాలు, రాట్నలక్ష్మీ పూజలూను.

నాటినుంచి వారి జీవిత ధ్యేయమే మారిపోయింది. ఏది వ్రాసినా సంఘశ్రేయో లక్ష్యశుద్ధితో వ్రాయాలనే సంకల్పం కలిగింది. "మనం కథ వ్రాశామంటే, ఒక ఉత్తమమైన సందేశం ఇవ్వవలెననే ఉత్తమ లక్ష్యంతో వ్రాయవలె. అంతేకాదు. తల్లీ తండ్రీ, అన్నా తమ్ముడూ, అక్కా చెల్లెలూ అందరూ కలిసి అరమరలు లేకుండా ఒక్కచోట కూర్చుని చదువుకొని ఆనందించేదిగా ఉండాలె" అనే అన్నగారి ఉపదేశం ఉండనే ఉంది. కనుకనే ఆమె లక్ష్యశుద్ధి లేకుండా ఏమీ వ్రాయలేదు. అనవసరంగా ఏమీ వ్రాయలేదు. అందువల్లనే వారి రచనలలో అంత ఆవేగోత్తేజాలు తొణికిసలాడడం; 'శారద లేఖలు' రాజకీ

యాది వివిధ విషయాల చర్చకు స్వర్ణరేఖలు, సంఘ దురాచారాలపై తీవ్రతర మయూఖలు కావడం.

కనుపర్తివారు తమ పదునైన ఇతివృత్తం బలంతో పాఠకులను కథల వైపు ఆకర్షించారు. 'పెన్షను పుచ్చుకున్న నాటి రాత్రి' వంటి అపూర్వమైన కథలు దాదాపు అరవై వరకు వారి లేఖిని నుంచి ప్రవహించాయి; పాఠకలోకాన్ని తన్మయం చేశాయి. వారి కథలు హిందీ తమిళ కన్నడాలలోను అనూదితాలయాయి. వారు కొన్ని వందల వ్యాసాలు వ్రాశారు. 'స్త్రీ అబల కాదు' అనే గృహలక్ష్మి వ్యాసం పోటీలో వారికి (1930లో) సువర్ణపతకం వచ్చింది. 'శారద లేఖల'ను డాక్టర్ కె.ఎన్. కేసరిగారు సంపుటంగా ప్రచురించి, 1934లో 'గృహలక్ష్మి సువర్ణకంకణం' బహూకరించారు. రచయిత్రులలో కంకణ స్వీకారానికి నాందీ ప్రస్తావన కావించిన వారూ వారే.

'వసుమతి' వారి తొలి పుస్తకం; సాంఘిక నవల. వారి నాటకాలలో 'పద్మ' సాంఘిక నాటకం. 'పునఃప్రతిష్ఠ' చారిత్రక నాటకం. 'ద్రౌపదీ వస్త్రసంరక్షణం', 'సత్యా ద్రౌపదీ సంవాదం' ద్విపద రచనలు. 'మహిళా ప్రబోధం' బుర్రకథ. ఇంకా ఎన్నో రచనలు. మహిళా ప్రబోధంలో ఇతివృత్తం ఉన్నవ లక్ష్మీబాయమ్మగారి జీవితం. శారదానికేతనం రజతోత్సవంలో సమర్పించబడింది.

క్రమంగా వారి జీవితం బహుకార్య వ్యగ్రమయింది. 1931లో బాపట్లలో 'స్త్రీ హితైషిణీ మండలి' స్థాపించారు. 20 సంవత్సరాలపాటు కార్యదర్శినిగా పనిచేశారు. దానికి శాశ్వత భవనం 1942లో నిర్మించారు. దానికి గ్రంథాలయమూ ఏర్పాటు చేశారు. కొన్నాళ్ళు కుట్టు, సంగీతం, హిందీ తరగతులూ నడిపారు. 1949 నుంచి మూడున్నర సంవత్సరాలపాటు గుంటూరు జిల్లాబోర్డు సభ్యత్వ గౌరవమూ పొందారు.

ఇప్పుడు 'స్త్రీ హితైషిణీ మండలి' 'యువతీ సంక్షిప్త విద్యాలయం' నడుపుతున్నది. దీనిలో రెండు సంవత్సరాలపాటు చదువుచెప్పి ఎనిమిదవ తరగతి ప్రభుత్వ పరీక్షలకు పంపుతున్నారు. విద్యాలయానికి స్వంత వసతి గృహం ఉంది. ప్రభుత్వం ఐదువేల రూపాయల గ్రాంటు ఇస్తున్నది. స్వర్గీయ కోపల్లె హనుమంత రావుగారి కుమార్తె కుమారి కమలాదేవిగారు, కుమారి మద్దాలి శ్రీలక్ష్మిగారు ఉపాధ్యాయినులు. శ్రీమతి కామరాజు వేంకట లక్ష్మమ్మగారు వార్డెన్. ఈ వసతి గృహంలో అన్ని కులాలవారు, అన్ని మతాలవారు, అన్ని జిల్లాలవారు ఉన్నారు. రెండు సంవత్సరాలపాటు ఉచిత భోజనం, మూడు చీరలు, పుస్తకాలు ఇస్తారు.

"మీరు మహిళాభ్యుదయంకోసం ఎంతో పాటు పడ్డారు. నేటి





వరకూ కట్నాలు పోలేదు. కులభేదాలు కూలిపోలేదే?" అని అడిగాను. "మేము కట్నాలు పుచ్చుకోవద్దని ఎంతో ప్రబోధం చేశాము. కాని, వ్యర్థమయింది. చదువుకున్నా ప్రయోజనం లేక పోయింది. ఇప్పటి సంపాదనలపై తలిదండ్రులు ఎంతో కాలం కట్నాలు ఇవ్వడం సాగించలేరు. కొంత కాలానికన్నా ఈ సమస్య తీరుతుందనే నా నమ్మకం" అని ఆమె సమాధానమిచ్చారు.

శాఖాంతర వివాహాలే జరుగనప్పుడు కులాంతర వివాహాలు జరుగడం ఎలాగని ఆమే ఆశ్చర్యం ప్రకటించారు. "వర్ణ భేదం, వర్గభేదం అంతటా ఉంది. అది కూలిపోవడం కష్టం. వర్ణభేదం



వారికి రవీంద్రుని రచనలు చాల ఇష్టం. 'కళాపూర్ణోదయం' మరీ ఇష్టం. విద్యాలయంలోను ప్రబంధాలు చదివిస్తారు. సాహిత్యం సభ్యంగా ఉండాలని, ఇప్పటి కథలు చాల అసభ్యంగా ఉన్నాయని వారి విమర్శ. అయితే, ప్రబంధపు ప్రమాణంలో వ్రాసినప్పుడు శృంగారం ఫరవాలేదని వారి విశ్వాసం.

"బహుముఖ ప్రజ్ఞతో రచనలు చేసిన శ్రీమతి వరలక్ష్మమ్మగారి రచనలు తెలుగు సీమంతినుల హృదయ సీమలకు కర్పూర నీరాజనాలు. శారద లేఖల ద్వారా ఆధునిక నారీయుగానికి వారు చేసిన సేవ, ఆధునిక ప్రపంచానికి వారిచ్చిన సందేశము అనల్పమైనవి". 44 సంవత్సరాలుగా వీను మిగిలిన రచయిత్రులుగా సమకాలికుల మన్ననలు పొంది 64 శరత్తులు దాటిన కనుపర్తివారి కథలు, ఇతర వ్యాసాలు సంపుటాలుగా అచ్చయితే ఎంతో ప్రయోజనం.

మొండి గోడలుగా ఉన్నంతవరకూ సంఘ పరిస్థితులు ఇంతే" అని వారి నిరంతర విచారం.

హృదయపూర్వకంగా కాంగ్రెస్‌ను అనుసరించేవారు తక్కువయారని, ప్రజాక్షేమం కోసం పనిచేసేవారూ కొరవడ్డారని వారి ఆవేదన. సంఘం బాగుపడాలంటే మంచి నాయకత్వం ఏర్పడి ప్రజలకు జ్ఞానం కలిగించాలని వారి సూచన.

"నా భర్త విదేశాలలో డిగ్రీ పొందారు. ఇంగ్లండు నుంచి తిరిగి వచ్చిన తర్వాత ఏ ఉద్యోగమూ చేయలేదు. ఇంట్లోనే ఉండి దేశసేవ చేయమన్నారు. కనుక, వారి ఇష్టప్రకారం నడుస్తూ, నాకు స్వాతంత్ర్యం ఉన్నంత వరకూ సేవ చేశాను. వారి ఆమోదం లేకపోతే ఇంత మాత్రమయినా సేవ చేసేదాన్ని కాదు" అని వారు తమ పతిదేవుని తలచుకుని కనుకొలకులలో నీరు నిండగా, గద్గదకంఠంతో పలికినప్పుడు ఒళ్లు పులకరించింది.

తెల్లవారుజామునే లేచి వ్రాసే అలవాటు వారిది. అలా వ్రాసినవాటికి తర్వాత సాపు వ్రాసుకుంటారు. ప్రస్తుతం వీరేశలింగంగారి సతీమణి రాజ్యలక్ష్మమ్మగారి జీవితం వ్రాస్తున్నారు. శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ జీవితం వ్రాస్తారు. సూర్యోదయానంతరం స్నానం చేసి కాస్సేపు భగవత్ప్రార్థన చేసుకుని యువతీ సంక్షిప్త విద్యాలయం వసతిగృహానికి వెళ్లి సరకులు ఇస్తారు. మధ్యాహ్నం చదువుకుంటారు. ప్రతి శుక్రవారం సాయంకాలం పాఠశాల విద్యార్థినులకు వార్తలు చదివి చెబుతారు. ప్రతి శనివారం మండలిలో భజనలు చేయిస్తారు.





శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిని తలచుకున్నప్పుడు మధుర మధుమాసం, దానిలో విరగబూచిన గున్నమామిడి, దాని కొమ్మ నెక్కి పల్లవం మెక్కి పాడే కోయిల; ప్రావృడంబోధర స్వామి, వాని ఎదుట ఆపాదచూడం పుష్పించిన కుటజవిటపి, దాని సరసన మత్తెక్కి నర్తించే జిలుగు వన్నెల నమలిరేడు; శరత్కాల నీలాభ్రసరసి, దానిలో విహరించే నిండు జాబిల్లి, ఆ జాబిల్లి నుంచి జాలువారే వెన్నెలజల్లు; నవవిభాత మహోత్సవం, దానిలో దోబూచులాడే ఉషఃకళ్యాణ లావణ్యం; గంధర్వలోక మధుర సుషమా సుధాగాన మంజువాటి, దానిలో వినిపించే వియోగ గీతిక; పచ్చ తాటాకుల పచ్చితావులు వెదజల్లే పెండ్లి పందిరి, కన్నెమిన్నలు చిలకరించే పన్నీరు, ఒత్తుగా ఆశాంచలాలకు సాగిపోయే అగరువత్తుల ధూపధూమశిఖలు, మేలిమి పసిండి మలామాల మంచిగంధం జ్ఞాపకం వస్తాయి.

వారి మాటలు వింటూ ఉంటే, ఉన్నత పర్వతాగ్రంమీదో, సంజమబ్బుల పవడాల చాయలలో నదీతీరానో, ఉద్యానవనం లోనో, సముద్రపు అంచులలోనో విహరిస్తున్నట్టు అనిపిస్తుంది; చీదర్లు, చీకట్లు పటాపంచలయినట్టు పరమానందమవుతుంది; పానకం తాగుతూ ఉన్నట్టే ఉంటుంది. గిరీశం అన్నట్టు వారి మాటలు వినడమే ఒక 'ఎడుకేషన్'. వారి సాంగత్యం ఒక మత్తు. విడిచి రాబుద్ధి పుట్టదు.

అదేదో అద్భుత వశీకరణ శక్తి! కొంపలు మునిగి పోతున్నా, వదల మనసు రాదు. అదేదో అసదృశమైన మాగ్నటిజం!

వచనంలోను కవిత్వం ఉంటుందా - అన్నది ఒకప్పుడు వివాదాంశం. 'గద్యం కవీనాం నికషం వదంతి' అని దండ్యా చార్యులు మొదలయిన అలంకారికులు చెప్పినా సందేహం

సమసిపోలేదు. కాని, దేవులపల్లివారి మామూలు పలకరింపులలోను కవిత్వం చిప్పిలితూ ఉంటుంది. మనను వారు ఏ వయోవృద్ధునికో 'వీరు ఫలానా' అని పరిచయం చేస్తారనుకోండి. "కంటి చూపు తగ్గింది బాబూ, చెబితే గాని తెలీదు నాయనా!" అని ఆ వృద్ధులంటారు. దానికి దేవులపల్లి వారు "మీరు ఎంతో అదృష్టవంతులు. చెబితే తెలుస్తున్నది. చెప్పినా తెలియనివారు ఎందరున్నారో భారతదేశంలో!" అంటారు వెంటనే. మనకు నవ్వు ఆగదు. ఇలా అనునిమేషం వారి వాక్కులలో చిల్లర విషయాలూ చమత్కారంతో కవితగా కనవస్తాయి, వినవస్తాయి. అందువలనే కాటూరి వేంకటేశ్వరరావుగారు తరచు అనేవారు "మా కృష్ణశాస్త్రి మామూలు మాటలలోనే కవిత్వం ఉంటుంది. చాలమంది వాటితోనే తృప్తిపడిపోతారు. ఆయన కవిత్వం చెప్పదలచుకుంటే,



అంతకన్నా పై స్థాయి ఉండాలి. అందువల్లనే ఆయన హెచ్చుగా వ్రాయలేక పోయాడు" అని.

గణంకన్నా గుణానికి, రాశికన్నా వాసికి ప్రాధాన్యమిచ్చే దేవులపల్లివారు 1897లో తూర్పు గోదావరి జిల్లా చంద్రంపాలెంలో జన్మించారు. ఈ గ్రామం కూచిమంచి తిమ్మకవి నివసించినది. దేవులపల్లివారి పూర్వులది ఆకిరిపల్లి. తాతగారు వలస వచ్చారు. తండ్రిగారి దాక పండితులు కానివారు గాని, రామ భక్తులు కానివారుగాని లేరు. కనుకనే "దేవులపల్లి వంశమున దేవులు పుట్టిరి"అని చెళ్ళపిళ్ల వేంకట శాస్త్రిగారూ ప్రశంసించారు. దేవులపల్లి వారి జనకులు వేంకట కృష్ణశాస్త్రి గారు కూచిమంచి తిమ్మకవి మునిమనమడు వేంకట్రాయ మంత్రి వద్ద కవిత్వపు మెలకువలు తెలుసుకున్నారు.వారూ, పెత్తండ్రి సుబ్బారాయశాస్త్రి గారూ పీఠికాపురాస్థాన విద్వత్కవులు. కనుక దేవులపల్లి వారికి పుట్టుకతోనే గొప్ప సంస్కారం అబ్బింది. తండ్రిగారు, పెత్తండ్రి గారు చిన్నప్పుడు పద్యాలు వ్రాసి వినిపించి "ఏది బాగుంది?" అని అడిగేవారట. వ్యస్తాక్షరి చేయించేవారట. అప్పటినుంచే దేవులపల్లివారికి పదాల సంగీతం తెలిసింది; ఏది మధురమో తెలుసుకొనే జ్ఞానమూ కలిగింది. ఈ సంగీత సంగతితోనే వారు ఏడవఏటే సామర్లకోటలో "నంద నందన ఇందిరానాథ వరద" అని తొలిసారిగా పద్యం చెప్పారు. తర్వాత పదవ ఏట రామతీర్థంలో కవిత చెప్పారు. కాని, దురదృష్టవశాత్తు వారికి తమ తండ్రి, పెత్తండ్రిగార్ల వద్ద బహుకాలం శిక్షణపొందే అవకాశం లేకపోయింది. పెత్తండ్రిగారు 1909లోను, తండ్రిగారు తర్వాత రెండేండ్లకు కాలధర్మం చెందారు. కాని దేవులపల్లివారు వారి రచనలను పారాయణం చేశారు. "నా కవితలో నాన్నగారి లిరికల్ ఫెర్వర్, పెదనాన్నగారి జిగీ వచ్చాయి" అంటారు వారు.

వారి విద్యార్థిదశ పిఠాపురంలోను, కాకినాడలోను గడిచింది. పిఠాపురం హైస్కూలులో హెడ్మాస్టరు కూచి నరసింహంగారు, కాకినాడ కళాశాలలో రఘుపతి వేంకటరత్నంనాయుడుగారు, రామానుజాచార్యులుగారు వారిని తీర్చి దిద్దారు. "చిన్నతనంలో కూచి నరసింహంగారు, తర్వాత నాయుడుగారు నాకు ఆంగ్ల సాహిత్యంలో అభిరుచి కలిగించారు" అని వారు తరుచు భక్తితో అంటారు. అంతేకాదు. "సరకు నాన్నగారు ఇచ్చారు. ఆధునిక యుగధర్మానికి అనుగుణంగా కిటికీలు తెరిచి, కొత్తచూపు ప్రసాదించినవారు వేంకటరత్నంనాయుడుగారు. సారస్వత ప్రియత్వమే కాక లోకమంతటినీ అప్యాయంగా ఆలింగనం



చేసుకొనే అనురాగ బంధం ఆయన శిష్యత్వంవల్ల లభ్య మయింది, జీవితంలోని ప్రతి అల్పానుభవాన్ని ఒక ఉదాత్త దృష్టితో అనుభవించే శక్తి ఆయనవల్ల కలిగింది'' అంటారు వారు.

దేవులపల్లివారు 1918లో పట్టభద్రులై జీవితంలో అడుగు పెట్టే వేళకు బ్రహ్మ సమాజోద్యమం, వ్యవహార భాషావాదం తీవ్రంగా ఉన్నాయి. వాటితో వారు ప్రభావితులయారు. రెండేండ్ల పాటు కాకినాడ, పెద్దాపురం మిషన్ హైస్కూలులో ఉపాధ్యాయు లుగా పనిచేస్తూ, "ధర్మసాధన" అన్న పత్రికలో పిఠాపురం రాజా గారికి వ్యతిరేకంగా వ్యాసాలు వ్రాశారు. వాటి ఫలితం కోట నుంచి వచ్చే వార్షికం ఆపివేత. ఆ సమయంలోనే సతీవియోగం సంభవించింది. వారి కరుణాంతరంగం కరిగి 'కన్నీరు' ఖండ కావ్యంగా తరంగితమయింది. ఇదే వారి తొలి ఖండకావ్య సంపుటి (1923). తర్వాత ద్వితీయ వివాహమై పిఠాపురం హైస్కూలులో నౌకరీ దొరికింది. కాని, అది కొన్ని నెలలపాటే. వారి భావాలు రాజాగారికి నచ్చనందున పని మాని, పది సంవత్సరాలపాటు దేశమంతా తిరిగారు. మళ్ళీ 1933 నుంచి పదేళ్ళపాటు కాకినాడ కళాశాలలో ఉపాధ్యాయులుగా ఉన్నారు.

దేశం తిరిగిన పది సంవత్సరాలూ వారి జిజ్ఞాసకు, కవితకూ

పరువం. వారికి హరీంద్రనాథ చట్టోపా ధ్యాయుడు, సాహితీ సమితి సభాపతి శ్రీ శివశంకరులు వంటి విద్వత్క వివతంసులతో ఆత్మీయత కలిగింది. శాంతినికేతనంలో పలువురు సాహిత్య బంధువులు అయారు. వారు ప్రాచ్య పాశ్చాత్య కవుల రచనలను క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. 'ఏకో రసః కరుణ ఏవ' అన్న భవభూతి వాదం ప్రియ మైంది. రొమాంటిక్ ఉద్యమ ప్రవాహం వారిని ముంచెత్తింది. ప్రాచీనుల సంప్ర దాయానికి సమకాలిక జీవితం మేళ వించారు.



"ఆకులో ఆకునై పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై నునులేతరెమ్మనై
ఈ అడవి దాగిపోనా, ఎట్లైన
నిచటనే యాగిపోనా?"

- అంటూ గొంతు విప్పారు. కరుణ విప్రలంభాలు కరవైన తెనుగులో ఆరని దివ్వెలు వెలిగించారు. ఔను మరి! "కలికి పాటల కోయిల కులము" వారిది. విలక్షణత వారి సొమ్ము. 'కృష్ణపక్షము'తో (1925) తెనుగులో కన్నీటి కెరటాల వెన్నెలల మహోజ్జ్వల పక్షమే స్థాపించారు. "ఊర్వశి"తో (1928) తెనుగుకు నూతన శ్రీవిలాస హాసాలు అందించి, నూత్న కళ్యాణ తూర్య మనోజ్ఞ గాన నృత్య కోలాహలం చెలరేగించారు. అప్పుడు వారు హరిజన సేవలో నిమగ్నులయి ఉండేవారు. కరుణరసం వారికి మానవా కించనత్వాన్ని కనులగట్టించి -

"కురియుమురా కన్నీటిని
మరి మరి విలపింపుమురా"

- అంటూ భక్తి కీర్తనల రూపంలో ప్రవహించింది. వారి దారుణ దురంత హృదయావేదన ఈ కీర్తనలలో కట్టలు తెంచుకుంది. విన్నవారికి ఉప్పెనవలె ఆవేదన పొంగి వస్తుంది. వాటిని ఇతర మతాలవారూ కొంచెం మార్పులతో పాడుకుం టున్నారంటే వాటి ప్రాచుర్యం ఏమనాలి?

1942నుంచి వారు చెన్నపురిలో ఉంటూ 'మల్లీశ్వరి' మొదల యిన సినిమాలకు మాటలు, పాటలు వ్రాశారు. రేడియో ప్రసారం కోసం క్షీరసాగర మథనం, విప్రనారాయణ చరిత్ర, మాళవికాగ్నిమిత్రం యక్షగానాలు, రామానుజ కథ, ముఖ లింగం, శివకవి కథ, ప్రసన్న పారిజాతం సాయుజ్యం, మొదల యిన భక్తి నాటికలు, విద్యాపతి, కార్తికి, కృష్ణాష్టమి మొదలయిన లిరికల్ నాటికలు వ్రాశారు. హైదరాబాద్ రేడియోలో ప్రయోక్తగా చేరిన తర్వాత, 'ఏడాది పొడుగునా' అనే నాటకంలో సంవత్సర గ్రామజీవితం చిత్రించారు. 'ఋతుచక్రం'లో "చౌరస్తా ఆహిస్తా" అంటూ నగర శ్రమజీవుల జీవితం వర్ణించారు. ఇటీవల వారు రచించిన 'కొత్త కోవెల' (గాంధీ సమాధి), 'ఆండాళ్' నాటికలు అసదృశమైనవి.

"తన కంఠమున దాచి హాలాహలం
తలనుంచి కురిపించి గంగాధరం
మనిషి శివుడవడమే గాంధీవరం
బాపు ననుసరిస్తే చాలు మనమందరం"

- అంటారు కొత్త కోవెలలో.

"నవ్వంటే జాబిల్లి
పువ్వంటే మల్లి



నవ్వేటి పూవంటె
నా చిట్టితల్లి"

- అంటూ పిల్లల పాటలు మొదలు దంపుళ్ళపాటలు, అమ్మ లక్కల పాటలు, ఆకలి పాటలు - అనంతంగా వ్రాశారు. "నేనేదో భక్త కవిని కాను. మీరనుకునేంత భక్తుణ్ణి కాను. కొందరు అనుకునేంత దుర్మార్గుణ్ని కాను. ఎప్పుడో హృదయావేదన భరించనప్పుడు కేక పెడతాను. అది కీర్తన అవుతుంది" అన్న వారి మాటలు ఎంత హాయి!

వారి రేడియో ప్రసంగాలలో మలుపు తిరిగితే, రిక్షావాలా, భూట్‌పాలిష్ వంటివి సాహిత్యదృష్టితోను ఉత్తమమైనవి.

దేవులపల్లివారు ఏది రచించినా, ప్రతిపదానికీ రంగూ, రుచి, వాసనా ఉన్నవన్న సూక్ష్మపరిశీలనతో, శిరీష కుసుమకోమల పదాలలో హరజటా పారిజాత లతాంత మధుపేశల భావాలు మలచి, వేయి కన్నులతో వీక్షించి, స్వాదు సంగీత కలనా లసద్విపంచిమీద మ్రోయించారు.

వారి పద్యాలు చదువుతున్నా, వింటున్నా "నాకు కవిత్వం పుట్టలోని పాములాగ, తెల్లవారి తలుపులు తట్టి వచ్చిపడే అతిథి లాగ, రేకులు విచ్చుతున్న పూవులాగ, రకరకాలుగా వస్తుంది" అన్నవారి మాటల సత్యం గోచరిస్తుంది.

"మీరు ఏదీ మహాప్రబంధ నిర్మాణానికీ, ఇతిహాస రచనకూ పూనుకోలేదే?" అని ప్రశ్నిస్తామనుకోండి. "రామాయణం మానవ రచితమైన గొప్ప ఇతిహాసం; కలకాలానికీ వర్తించేది. కాళిదాసు కవిత కవితాగుణాలన్నీ పుంజీభూతమైంది. పాతవారికి అంతా సత్యం. రామాయణం ఇప్పుడు ఎవరైనా వ్రాస్తే, నప్పదు. నన్నయ్య, తిక్కన మానవుల లోతులు, ఎత్తులు సులభంగా



తెలిపారు" అని వారి సమాధానం.

"కవికి నిజాయితీ ఉండాలి. ప్రేమ ఉండాలి. మానవత ప్లస్ నిజాయితీ అన్నమాట. కవులు రెండు రకాలవారు. తాము చెప్పదలచింది నిజాయితీతో చెప్పేవారు. వారిది కొంతకాలం నిలుస్తుంది. కాలానుగుణమైన సత్యాన్ని - యుగధర్మాన్ని - నిర్వచించేవారు రెండవవారు. వారిది శాశ్వతంగా ఉంటుంది. మానవత అంటే, విభేదాలకు అతీతమైన రసాస్వాదనం. ఈ దృష్టితో కవులందరూ విశిష్టాద్వైతులు. ఆధునిక యుగంలో రెండు ఉద్యమాలు బయలు దేరాయి. ఒకటి మానవోద్యమం; మరొకటి హిందూ ధర్మ పునరుద్ధరణోద్యమం. మొదటిదానికి ప్రవర్తకుడు రామమోహనరాయ్. నేను మానవోద్యమానికి చెందినవాణ్ణి. నా మానవతావాదానికి ఆచార్యులు నాయుడు గారు. నాకు ఆయన విశ్వమానవ దృష్టి ఇచ్చారు" అంటారు వారు.

కనుకనే వారు కవిత్వంలోను జాతులు, మతాలు చూస్తే వెర్రెత్తిపోతారు. విశ్వమానవ భావన లేనివాడు గొప్ప కవి ఎలా అవుతాడని వారి ప్రశ్న. పరమత సహనం వేరు; ఎక్కడ ఏ మంచి ఉన్నా తనది చేసుకొనడం వేరు. ఈ దృష్టితో వారు మతాన్నిగాని, ధర్మాన్నిగాని సులభంగా కవితలో ఒంట బట్టించు కున్నారు. అందువల్లనే వారు "నేను హృదయవాదిని. నాకు వేదాంతం, తర్కం తలకెక్కవు. నన్ను ఎడారిలో కూర్చోబెట్టి వేయి పుస్తకాలు ఇస్తామన్నా వద్దు. ఒక్క పుస్తకమూ అక్కరలేదు. పనికిమాలిన వారు, చెడ్డవారు, వికార రూపులు అయినా సరే - జనం మధ్యన నన్ను పడేయండి. నేను ఆరోగ్యంతో ఎంతకాలమైనా బ్రతుకు తాను. మనుష్యులు లేకపోతే కాయిలా పడుతాను" అని ఎన్నోసార్లు అన్నారు.

మనమింకా నాటకాల ప్రాంగణంలోనే ఉన్నామన్నది వారి నమ్మకం. "జాతి వయస్సులో ఉన్నప్పుడు టాగూరు లాంటివారు పుట్టారు. సంఘదృష్టి కలిగితే మంచి నాటకం, మంచి సాహిత్య విమర్శ వస్తాయి. కవిత చాల ఆత్మాశ్రయం. వయస్సులో వచ్చేది. పెరిగాక నాటక కర్త అవుతాడు. నాటకకర్త ఇంటి యజమాని వంటివాడు" అని వారి వివరణ.

వారి బాహ్య వ్యక్తిత్వంలాగే వారి వక్తృత్వం కూడా విశిష్టం. కవితను, వ్యక్తిత్వాన్ని అనుకరించినట్టే దానినీ పలువురు అను కరించి కృతార్థులు కాలేకపోయారు. షష్ఠిపూర్తి దాటి ఆరేండ్ల యినా నూనూగు మీసాలు, ముసి ముసి నవ్వులు, ఉంగరాల జుట్టు, దుస్సహ దురంత వేదనలున్నా మన వికా రాలను గరళ కంఠునిలాగ దిగమింగుకోవాలి కాని ఏడుపు ముఖం పెట్టి వికార రూపంతో ఉండడం సంఘద్రోహ చర్య అన్న సిద్ధాంతంతో పసం దైన వేషం, మాటలో, చేతలో, భావనలో, ఇంటా ఒంటా, శుచీ, సౌందర్యం తొణికిసలాడే వారి వ్యక్తిత్వం అనుకరించడం సాధ్యమా? మిత్రులు కనబడితే వదల లేని ఆప్యాయత చూపే వారి చేతలు అనుకరించడం సాధ్యమా?

ప్రస్తుతం వారు వేంకటరత్నం నాయుడుగారి చరిత్ర





వ్రాస్తున్నారు. "బ్రహ్మర్షి మాట" మకుటంతో నాయుడుగారి సుభాషితాలు గుదిగుచ్చి, వారు పరమపదించినప్పుడు

"ఈ జడ జీవితమ్ముః పలి
కించితి, నీ యఘపంకమందు నం
భోజము మొల్వజేసితి, వ
పూర్వము నీ దయ యీ నిశీథి నీ
రాజన మెత్తినావు విపు
లమ్మగు నీ యెద నిండెనే శర
ద్రాజిత చంద్రకాంతు లమృ
తమ్ములు స్వర్గలతాంత వాసనల్"

- అని వాపోయిన దేవులపల్లివారు వ్రాసే ఈ చరిత్ర తెనుగుకు వెన్నెల నివాళిగానే ఉంటుంది. తమ అనుభవాలు - జ్ఞాపకాలు వ్రాయదలచారు. వారికి రకరకాల మనుష్యులతో సంబంధం ఉంది. అవీ తళుకు బంగరు తారలుగానే తెనుగు ఆకసాన్ని ఆలంకరిస్తాయి. నాయుడుగారి శిష్యరికం వల్ల వారికి సమయ పాలన అబ్బలేదనేది పలువురి ఫిర్యాదు. కాని, వారిప్పుడు చేతికి గడియారం కట్టారు. తప్పక మాట నిలబెట్టుకుంటారు. దేనినైనా చిత్రికపెట్టే స్వభావం గనుక కొంత విలంబనను సహిద్దాము.

"నాది చిక్కని కవిత అని నా నమ్మకం. అన్ని వర్గాల పరిశీలనా ఉంది" అన్నారు వారు. ఎంత వద్దనుకున్నా కాళిదాస భవభూతుల, యామున వేదాంతదేశికుల, తిక్కన పెద్దనల, కబీరు సూరదాసుల, షెల్లీ బైరనుల వరుసలో నిలబడే దేవులపల్లి వారికి అంతమాత్రం అనుకోడానికి అవకాశం ఇద్దాము. రాచవీటిలో పెరిగి జీవితంలోను, కవితలోను అబ్బిన రాజసాన్ని గౌరవిద్దాము.

"వారు వ్రాసింది ఎంత?" అన్నది బాలిశుల ప్రశ్న. "అమరుక కవేః ఏకః శ్లోకః ప్రబంధ శతాయతే" అన్నాడు ఒక సహృదయుడు. అది నాడూ, నేడూ నిజం. దేవులపల్లివారి "ఏకం పద్యం ప్రబంధ శతాయతే" అంటాను నేను. ఇది నేడూ, రేపూ నిజం. సాహిత్య చరిత్రకారులు ఏమి వ్రాతలు వ్రాసినా, నేను మాత్రం దేవులపల్లివారిని నవ్యకవితా ప్రస్థానాచార్యులుగా పురస్కరిస్తాను.

"నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు?
నా యిచ్చయే గాక నాకేటి వెరపు?"





**1934** నాటి మాట. గుంతకల్లు రైల్వే జంక్షనులో గుంటూరు బండిలో దాక్కున్న ఒక యువకుణ్ణి కొందరు బలవంతంగా దింపి, పూనా బండి ఎక్కించడానికి ప్రయత్నిస్తున్నారు. వారంతా కొల్హాపూర్ వెళ్ళుతున్నారు. ఆ యువకుడు "అబ్బే! నేను రాను. నాకు భయం వేస్తుంది. హరిప్రసాదరావుగారిలాగ మెప్పించ గలనా హరిశ్చంద్ర వేషం? చూచినవారు ఏమంటారు? గుంటూ రుకు టిక్కెట్టు కూడా కొన్నానే. రానంటే రాను" అని గింజు కుంటున్నాడు. అందరూ కలిసి అతణ్ణి పట్టుకు లాక్కొనిపోయి, ఉత్తర కుమారుణ్ణి అర్జునుడు రథానికి కట్టివేసినట్టు పూనా బండిలో ఎక్కించి, పెట్టె తలుపులు బిడాయించి, సీటుకు కట్టివేసినంత పని చేశారు. బండి కదిలింది.

ఆ యువకుని చిన్ననాడూ - 1916 లో ఇలాటి తమాషాయే జరిగింది. రాజమండ్రికి ఏదో చుట్టపు చూపుగా వెళ్ళాడు. అతనిది కమ్మని శారీరం. చిన్ననాటి నుంచే కమ్మగా పాడేవాడు కూడా. స్నేహితులు ఆయనను నాటకానికి పిలుచుకొని వెళ్లారు. పాట పాడుతాడని 'పాడించండీ అంటే పాడించండీ' అన్నారు నలు గురూ. అక్కడి నాటక సంఘం యజమాని కృత్తివెంటి గున్నేశ్వర రావు యువకుణ్ణి కౌగిలించుకొని "మా కంపెనీలో ఉండి పోవోయ్! నెలకు 25 రూపాయల జీతం" అంటూ బజానాగా 300 రూపాయలు దోసిట్లో గుమ్మరించారు.



“నేను నాటకాలలో వేషాలు వేయడానికి రాలేదు. టీచర్స్ ట్రెయినింగు అయినవాణ్ణి. మాస్టరీ చేసుకుంటాను” అని యువకుడు మొర పెట్టుకున్నాడు. పదిమందీ కలిసి ఎలాగో ఒప్పించారట. నెలకు పాతిక జీతం, 300 బజానా అంటే యువకుని మనస్సు కొంత మారింది. (స్కూలు మాస్టరుగా ఉంటే ఎలా ఉండేదో!)

ఆ యువకుడు ఎవరనుకున్నారు? దాదాపు నాలుగు దశాబ్దాలపాటు నటనరంగంలో కరుణ రస ప్రవాహాలు పారించి సహృదయులను ముంచెత్తిన నటసార్వభౌములు శ్రీ అద్దంకి శ్రీరామమూర్తిగారే.

నాటకరంగంలో అద్దంకివారు వేయని వేష మంటూ లేదు. వివిధ పాత్రలను నిర్వహించారు, అన్నిటా సమానమైన సమర్థతతో. పాత్ర వైవిధ్యంతోపాటు నటన వైవిధ్యమూ, నైపుణీ మెరుగెక్కేవి. ఏ నాటకంలోనైనా కింది వేషం మొదలు పై వేషం వరకూ వేసేవారు. సీతతో ఆరంభించి దశరథునిలోను, ముని కుమారునితో ఆరంభించి కణ్వునిలోను, సహదేవునితో ఆరంభించి ధర్మరాజులోను వారి అభినయ చాతురి పరాకాష్ఠ నందుకొంది.

ఎన్నో వేషాలు వేసినా, మూడింట మాత్రమే వారికి మన్ననా, మక్కువా ఎక్కువ. అవి : ధర్మరాజు, కణ్వుడు, దశరథుడు. ‘పాండవ విజయం’లో వారు ధర్మరాజై మరణించిన అభిమన్యుని “ఆకర్ణాంతములైన ఆ కనులు.... ఆ మోకాల్మీదికి జారు చేగవ” అని పద్యం పాడుతూ ఉంటే ప్రేక్షకలోకం ఏడిచేది.

అలాగే కణ్వుడుగా శకుంతలను హస్తినాపురికి పంపుతూ, కాళిదాసు శ్లోకం చదివి, “కొందలమందె డెందము” అని కందుకూరి వారి పద్యం అందుకుంటే, ప్రేక్షకుల డెందాలు కొందల మందేవి.

దశరథ పాత్రధారణలో వారు పరాంకోటిని అందుకున్నారు. దశరథుడు ఎలాటివాడో ఎవరూ చూడలేదు గాని, అద్దంకి అపరావతారమేననే ప్రథ పడిపోయింది. అప్పుడు దశరథ పాత్ర ధారణలో పేరుగన్న ఆలమూరి పట్టాభి రామరావుగారు అద్దంకివారి దశరథ పాత్ర చూచి, “ఇక నేను సంతృప్తిగా విరమించుకుంటాను” అన్నారట.

అద్దంకివారు ఈ మూడు పాత్రలూ సాధించారు. నాటకాలలో పద్యం చదవడానికి ఒరవడి పెట్టారు. వారి గమకం, (పద్య పఠనం) పద్యానికే వన్నె తెచ్చేట్టు ఉండేది. అవసరమైనంత రాగం భావస్ఫురణకు ఆవశ్యకమైనంత మాత్రమే. దానితో ఏదో వచనంలో సంభాషిస్తున్నట్టే, స్వాభావికంగా ఉండేది. రాగం రేఖామాత్రంగా చూపేవారంటే సంగీతం రాదని కాదు. సంగీతంలో కచ్చేరీలు చేసిన విద్వాంసులు.

అద్దంకివారు ఇంతటి ప్రావీణ్యం గడించడానికి కారణమేమిటి? “పూర్వం ప్రతి నాటక సంఘానికీ పాటలకు ఒక్కరూ, నటనకు ఒక్కరూ శిక్షకులు ఉండేవారు. అందువల్ల ఏ నాటకమైనా పక్వంగా తయారయ్యేది. బి.టి. రాఘవాచార్యులుగారి వద్ద ఒక్కొక్క పాత్రను ఎంతో అధ్యయనం చేసి నటించేవాళ్ళం. తర్వాత యడవల్లి సూర్యనారాయణ పెద్దన్నయ్యలాగ ప్రతిదీ నేర్పేవాడు” అంటారు వారు.

అద్దంకివారి పితృపాదులు వెంకటరాయుడుగారు గొప్ప హరిదాసు. వంశమూ భాగవత వంశం. పితృపాదులు ఒంగోలు తాలూకా కలువకూరులో నిర్యాణం చెందినప్పుడు ఊరు ఊరే ఆయనకు పాదాభివందనం చేసిందట. ఆ సౌమ్యత, గాంభీర్యం పుత్రునిలోనూ ఉన్నాయి.

అద్దంకివారు 14వ ఏటనే, 1911లోనే, నాటక జీవితం ప్రారంభించారు. అప్పుడు వారు బాపట్ల బోర్డు హైస్కూలులో నాల్గవ ఫారం విద్యార్థి. శ్రీ పంచాపకేశయ్యర్ హెడ్ మాస్టరు. పంగులూరి



ముందుండేవారు. కాని, జీవితగత్తి మారి నాటకాలలో పడ్డారు. రాజమండ్రిలోని కృత్తివెంటి గున్నేశ్వరరావు నాటక సంఘంలో కొన్నేళ్ళు, ఏలూరులో మోతే నారాయణరావు గారి సీతారామాంజనేయ నాటక సమాజంలో పదేళ్ళు పనిచేశారు. మైలవరం కంపెనీలోను కొంతకాలం ఉన్నారు. యడవల్లి సూర్యనారాయణ, ఉప్పులూరి సంజీవరావు, పారుపల్లి సుబ్బారావు మొదలయిన వారు వారి సహనటులు. మోతేవారిని "ఆయన నాకు చాల సహాయం చేశారు. గొప్ప కళాభిమాని"అని ఎంతో గౌరవంతో స్మరిస్తారు అద్దంకివారు.

సంగీతం బాగా రానిదే ప్రయోజనం లేదనుకున్నారు. ఒకప్పుడు వేషాలు వేయడంమాని, పుష్కరం పాటు గాయక సార్వభౌమ పారుపల్లి

శేషతల్పశాయి, మద్రాసు మాజీ న్యాయమూర్తి చింతగుంట రాఘవరావు సతీర్థ్యులు. పాఠశాల వార్షికోత్సవంలో తొలిసారిగా రంగు పూసుకున్నారు. 'గయోపాఖ్యానం'లో సహదేవుడుగా.

చిన్నప్పటినుంచీ వ్యాయామంపై ప్రీతిహెచ్చు. కుస్తీలు పట్టేవారు. ఉపాధ్యాయ శిక్షణలో డ్రాయింగు, జిమ్నాస్టిక్స్‌లో

రామకృష్ణయ్యగారి వద్ద సంగీతం సాధనచేసి, పదేళ్ళపాటు పాట కచేరీలు చేశారు. పారుపల్లి సుబ్బారావు, జొన్నవిత్తుల శేషగిరిరావు మొదలయినవారితో చేరి సంగీత నాట్యమండలి స్థాపించి నిర్వహించారు.

వివిధ పాత్రలను నిర్వహించారు. అందరినీ మెప్పించారు.





పెక్కు సన్మానాలూ పొందారు. 1924లో మద్రాసులో కాశీనాధుని నాగేశ్వరరావుగారు బంగారు పతకం బహూకరించారు, దశరథ పాత్రకు విస్మితులై.

ఇంతలో నాటకాలను మింగి ముందుకు వస్తున్న చలనచిత్ర కళ వీరిని ఆకర్షించింది. 1934లో హరిశ్చంద్ర వేషంతో సినిమా జీవితం ప్రారంభమయింది. (అప్పటి సంగతినే మొదట పాఠకులు చదివారు) చంద్రమతి శ్రీమతి కన్నాంబ. అద్దంకివారు దాదాపు ఇరవై చిత్రాలలో నటించారు. ఈ సినిమా జీవితం 1948లో నహుష పాత్రధారణతో ఆఖరయింది. పదిహేను సంవత్సరాలపాటు సినిమా జీవితం ఉజ్జ్వలంగా సాగింది.

1949లో అద్దంకివారు సినిమా నుంచి తిరిగివచ్చి చూస్తే, పరిస్థితి తారుమారయింది. నాటక ప్రపంచం స్వరూపమే మారిపోయింది. మునుపటి సాధన, గురుముఖతః నేర్వడం అంతరించాయి. పౌరాణిక నాటకాలు అవసరంలేదనే వాదం బయలుదేరింది. ప్రాచీన నాటకాలపట్ల అభిరుచీ అంతంత మాత్రమయింది. ముగ్గురు కృష్ణుల, నలుగురు ధర్మరాజుల, ఐదుగురు సీతల నాటకాలు వచ్చాయి. అయినా, వారు ఆడపాదడపా వేషాలు వేయడం ఉండనే ఉండేది.

1954 నుంచి విజయవాడలో బుడమేరు కొత్త వంతెనవద్ద తోటలో ఆశ్రమం వంటి ప్రశాంతమైన గృహంలో నివసిస్తున్నారు.



నాల్గవ తరగతి ప్రేక్షక మహాశయుడు ఒకడు "పెద్దగారోయ్!" అని కేక వేశాడట. దానితో "ఇక లాభం లేదు. మానాటి సంస్కారం గల వారు తక్కువవుతున్నారు. మైక్ లేకనే హాలు నలుమూలలా పాకేలాగ ఎంతో ముచ్చటగా నొక్కులు నొక్కే పద్ధతి ఇక లేదు. ఇక తగ్గడం మంచిది" అనుకున్నారు. ఆ భావం సంకల్పం గాను, క్రియగాను మారింది.

"అదేమిటి? ఆ మధ్యన చెన్నపురి వి.పి. హాలులో మీరు 'ఏకచ్ ప్యాలా' అనే మహా రాష్ట్ర సాంఘిక నాటకంలో (తెనుగు అనువాదంలో) బారిస్టర్‌గా ఎంచక్కగానో నటించారే! పౌరాణికాలే కావాలా? సాంఘికాలు లేవా?" అని ప్రశ్నించాను.

వారు కండలు తీరిన చేత్తో పొగాకు ఈనెను తీస్తూ, "కోడి రామమూర్తిగారిలాగ సర్కసు కంపెనీ లేవదీద్దామనుకున్నాను. సంగీతంలో దిగాను. నాటకాలు, సినిమాలు-అల్లా ప్రవాహంలో కొట్టుకు పోయాను. నేను ఆగి పోయాను. ముందుకు సాగిపోతున్న వారిని పోనివ్వండి. వారిలో పడితే నేను రాణించనని అనుకుంటున్నాను. కనుక, వారిలో దూరను. సంగీతంలో ఉంటే గొప్పవాడిని అయ్యేవాడిని" అంటూ చుట్ట చుట్టి వెలిగించారు.

కాని, అద్దంకివారు అలా ఎంతమాత్రమూ పశ్చాత్తాప పడనక్కరలేదు. వారు సంగీతంలో ఉంటే అపర త్యాగబ్రహ్మ, వ్యాయామంలోనే ఉంటే రెండవ రామమూర్తీ అయ్యేమాట నిజమే. ఎక్కడున్నా వెలిగే జాతకమే. నటనలో

ఇద్దరు కుమారులు, ఐదుగురు కుమార్తెలు. సతీమణి శ్రీమతి దుర్గా మహాలక్ష్మిగారు. ప్రస్తుతం అరవై ఐదో ఏడు. షష్టిపూర్తి దాటేవరకు జిర్రున చీది ఎరుగరు. జ్వరమనేదే తెలియదు. తోటకు కాపలా రెండు జాతి జాగిలాలు. ఆయనకు కుక్కలంటే మొదటినుంచి మోజే. కాని, ఇప్పుడు అవసరమైంది.

ఇటీవల అమలాపురంలో శాకుంతలంలో కణ్వపాత్ర ధరించి, "యాస్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా" అని కంఠం బిగించి ఉత్కంఠ చూపబోయారట.

దాదాపు అర్ధశతాబ్ది ఆంధ్రావళిని తనియించి, తామూ తనివి చెందారు, సార్థక్యం పొందారు. ఇటీవలనే వారిని ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఫెలోషిప్పుతో గౌరవించింది.

నేడు "అనేక యుద్ధముల నారియుతేరిన" అద్దంకివారి వంటి పెద్దల నటనానుభవం ఈ తరం వారు వినియోగించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.



# మరపురాని మనీషి



## నాయని సుబ్బారావు



"అన్నా, మా మామ యిదివరకే నాకు కూతు నీయ ననెను. నేను నాలుగేండ్ల నుండి యుద్యమములో జదువు మానిన తరువాత 'దినుటకు దిండి లేదు. వానికి బిల్ల నెవరిత్తు'రని యన్నాడట. పిల్లమాట యెట్లున్నను, స్వరాజ్యము వచ్చునని చదువు మానితిని. వచ్చుననుకొన్న స్వరాజ్యము రాలేదు. రాదనుకొన్న శశి మరీ రానట్లున్నది."

" - కిరీటి యొయ్యారమైన విలాసమైన పసి సిగ్గు వెలిగ్రక్కు చిరునవ్వు బలహీనమైన మొగమున దాండవింపజేసెను. చచ్చిపోవుచున్న తీగ కెరు వుంచి నీరు పోయగా మరునాడు నిలద్రొక్కుకొని మొండిపడిన కొమ్మ కణుపులో కనబడీ కనబడనంత సన్నని లేత చివురు కనిపించినట్లున్నదా నవ్వు. రెండు రోజులలో కిరీటి మరల మనిసివలె కనబడజొచ్చెను. శరీరమునందు బలహీనముగా నున్నను, కొద్దిగా లేచి తిరుగుటకు నుత్సాహము తనలో గనబడుచుండెను. స్నేహితులందరకును శుభలేఖలు వ్రాయబడినవి. కిరీటి తాను స్వయముగా వ్రాసెను. పెండ్లి బాపట్లలో. వివాహమునకు బంధువులకన్న స్నేహితులే ఎక్కువమంది వచ్చిరి. కిరీటి ప్రణయ కథ స్నేహితులంద రెరుగుదురు. చివరకు వారి యిద్దరకును బునస్సమాగమము కలుగుచున్నదనుటచే సంతోషించని మిత్రుడు లేడు.-"

'వేయి పడగలు' లో ప్రణయ తపస్వి, ప్రణయ సిద్ధుడు అయిన ఈ కిరీటి మరెవరో కారు; శ్రీ నాయని సుబ్బారావుగారే.

కవి కేవలం దాగి ఉండి, ఏ నాయికా నాయకులతోనో మాట్లాడించడం కాక స్వయంగా తన హృదయాన్ని విప్పి చూపడమనే ఆత్మాశ్రయ కవితా నూతన ప్రవాహంలో ఉవ్వెత్తుగా లేచిన మహాతరంగమైన శ్రీ నాయనివారు నెల్లూరు జిల్లా పొదిలె తాలూకాలో 1899లో జన్మించారు. వారి నాయనగారు శ్రీ కృష్ణారావుగారు వెంకటగిరి సంస్థానంలో తాసీల్దారు. పొదిలె లోనే వారి ప్రాథమిక విద్యాభ్యాసం జరిగింది.

నాయనివారికి ముగ్గురు సోదరులు, ముగ్గురు సోదరీమణులు. తండ్రిగారు వారందరినీ చుట్టూ చేర్చుకొని నేర్పుతో కథలు చెప్పేవారు. వారి నాయనమ్మ పర్వతమ్మగారు మహాభక్తురాలు. వారి వెంట నాయనివారు పొదిలె కొండమీది నిర్మమేశ్వరాలయానికి వెళ్లుతూ, కీర్తనలు, స్తోత్రాలు వినేవారు. దానివల్ల నాయనివారికి తెనుగు అన్నా, సత్ప్రవర్తనమన్నా లేలేత హృదయంలోనే నారులు పడ్డాయి.

వారు మేనమామల యింట, ఒంగోలులో ఉంటూ మిడిల్ స్కూలులో చేరినప్పుడు వారి కవితాభిరుచికి మంచి ప్రోది ఏర్పడింది. అక్కడి ఉపాధ్యాయులు పిశుపాటి వేంకట రంగయ్య, కురుగంటి శ్రీరామశర్మ, అక్కిరాజు నరసింహారావు మొదలయినవారు ఇతర విషయాలు బోధించేవారయినా, విద్యార్థులతో తెనుగు పద్యాలు చదివించి, తోక పద్యాలు (అంత్యాక్షరి) చెప్పించేవారు. నాయనివారు మిడిల్ స్కూలు నుంచి మిషన్ హైస్కూలులో చేరినప్పుడు, ముక్తినూతలపాటి గోపాలకృష్ణ శాస్త్రిగారు చాల అభిరుచి కలిగించారు.

అప్పుడే తెనుగు పుస్తకాలు కొనడం కూడ వారికి అలవాటయింది. ఒకమారు ఒక పుస్తకం కొనదలచారు. చేతులో పది అణాలే ఉన్నవి. ఎవరూ చూడకుండా

అత్తమ్మగారి పోపులపెట్టెలోని చిల్లర డబ్బులు తీసుకుని ఉడాయించారు.

నాయనివారు 1916లో స్కూలు ఫైనలు తరువాత ఒక సంవత్సరం ఊరికేనే ఉన్నారు. అప్పుడే అడపా దడపా ఒక ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయులుగా పనిచేశారు. ఆ సంవత్సరమే తొలిసారిగా పద్యాలు చెప్పారు - 'క్షీరసాగరమథనం' పేరుతో. అప్పటికి వారికి ఛందస్సంటే ఏమిటో తెలీదు. 'గుజిలీ భారతం' ప్రతి చదువుతూ ఉండగా, పద్యం రెండవ అక్షరాలన్నీ ఒక్కటిగా ఉండడం కనిపించి ఆశ్చర్యపోయారు. ఆ విషయం తామే కనిపెట్టినంతగా ఆనం దించారు.

సంవత్సరం తర్వాత వారు బందరు వెళ్ళి నోబెల్ కళాశాలలో ఎఫ్.ఎ.లో చేరారు. వారికి తెనుగు, సంస్కృతం, లాజిక్ తీసుకుందామని ఉండేది. కాని, అన్నగారు శ్రీనాయని నరసింహారావుగారు చరిత్ర తీసుకోమన్నారు. అన్నగారి ఆజ్ఞ సుగ్రీవాజ్ఞ.

నాయనివారు బి.ఎ. ఆఖరు సంవత్సరంలో ఉన్నారు. దేశంలో సహాయ నిరాకరణోద్యమం ప్రారంభమయింది. కృష్ణా క్లబ్బులో ఉపన్యాసాలు జరిగేవి. జాతీయత ఒంట బట్టింది. సహాధ్యాయులయిన కాటూరి వేంకటేశ్వరరావుగారు డిసెంబరులోనే చదువు మానుకున్నారు. నాయనివారు, కళా వెంకటరావు, పులిగండ్ల వేంకట కృష్ణయ్య (నెల్లూరు), భాగవతుల లక్ష్మీనారాయణ మున్నగువారు పరీక్షకు డబ్బు కట్టి మానుకున్నారు. బందరుకు గాంధీజీ విచ్చేశారు. వారికి మౌలానా షౌకతాలీ, మౌలానా మహమ్మదాలీ అంగరక్షకులు. ఆ దృశ్యం చూచిన నాయనివారు పలువురు మిత్రులతో కలిసి మహావేశంతో ఒక ముస్లిం దుకాణంలో తేనీరు తాగివచ్చి, కళాశాల బోర్డు మీద "వందేమాతరం గీతము పాటింపుడీ" అంటూ వ్రాసి ఒంగోలుకు పయనమయ్యారు.

నాయనివారు పరీక్ష మానుకుని తిరిగి రావడం ఒంగోలులో మేనమామగారింట్లో ఎవరికీ ఇష్టంలేదు. నాయనివారు వారి కోరచూపులు, గీరమాటలు తప్పించుకొనడానికి ఒంగోలు కొండమీద విహరించడం ప్రారంభించారు. కొండ అవతల బావిలో ఈత, కొండమీది సుందర ప్రకృతి ఊత - ప్రణయ కవిత ఉప్పెనగా వచ్చింది.

"చెప్పె నత్తమ్మ చేతిలో చేయి వైచి
నీ కుమారున కిచ్చెద నా కుమార్తె
ననుచు మును నాన్న; నేడు పేరాస దగిలి
తోసిరాజనె జేసిన బాసలన్ని"

- అంటూ 'వత్సల వలపు'గా రూపొందింది. దానిని వెంటనే 'సాహితి' పత్రికకు పంపారు. (1922) ముద్రితమైంది. అదే నాయనివారి తొలి ముద్రిత రచన.

ఆ రోజులలో ఒంగోలులో ఆంధ్రకేసరి ప్రకాశంగారింట్లో జాతీయ



పాఠశాల నెలకొల్పబడింది. నాయనివారు ఆ పాఠశాలలో ఉపాధ్యాయులుగా పనిచేశారు. భూగోళశాస్త్రం చెప్పేవారు.

ఏమైనా బి.ఎ. ముగించక తప్పలేదు. మరల బందరు వెళ్ళారు. అప్పుడే విశ్వనాథ వారితో పరిచయమయింది. విశ్వనాథవారు జాతీయ కళాశాలలో ఉపాధ్యాయులు. వారి సోదరులు శ్రీ విశ్వనాథ వేంకటేశ్వరులుగారు 'కృష్ణాపత్రిక'లో ఉప సంపాదకులు. కనుక వారి పరిచయంతో 'కృష్ణాపత్రిక'కు తప్పనిసరిగా పద్యాలు వ్రాయడం అలవడింది. కవితా వ్యాసంగం కొనసాగింది. కాని, మాతృవియోగం సంభవించింది. తల్లడిల్లిపోయారు. ఆ దుఃఖంలో "మాతృగీతాలు" ఆరంభించారు. మాతృప్రేమ పార్లిపారని సాహిత్యం ఏ దేశంలోనైనా ఉంటుందా? ఆ సాహిత్యంలో ఈ గీతాలు మణిపూసలు; అమ్మ నుంచి అమ్మలగన్న యమ్మవద్దకు, ముగురమ్మల మూలపు టమ్మ వద్దకు హృదయాన్ని కొనిపోయే కరుణా వాహినులు.

మాతృవియోగంతో ఆ ఏడు, మరుసటి సంవత్సరం వివాహం వల్ల పరీక్ష పోయింది. పరీక్షలో ఇంగ్లీషు పరీక్షనాడు తమ ప్రణయ తపఃపరమావధిగా సిద్ధిని పొందినందుకు 'ఫలశ్రుతి'గా -

"అంత శ్రమపడి పావన మభ్రగంగ
ధారుణికి దెచ్చినాడు భగీరథుండు
అంత మథియించి కలశ రత్నాకరమ్ము
అమృత భాండమ్ము పడసినా రమర వరులు"

- అన్న పద్యం వ్రాసి తిరిగి వచ్చారు. పద్యం చదివి ప్యాసు చేసే పరీక్షక మహాశయుడు ప్రపంచంలో పుట్టలేదు మరి!* నాయనివారు 1925 సెప్టెంబరులో బి.ఎ. పూర్తిచేసి, మరు సంవత్సరం నెల్లూరులో ప్రొబేషనరీ సబ్ రెజిస్ట్రారుగా చేరారు. ఎనిమిది నెలలే ఈ నౌకరీ సాగింది, ఈ భావుకులకు. ఐదు గంటలకే ఇంటికి వెళ్ళేవారు. దానితో తగాదా వచ్చింది; మానివేశారు. తర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయంలో (విజయవాడలో) లోవర్ డివిజన్ గుమాస్తా గిరీతో కొంతకాలం గడిచింది.

ఇంతలో నాయనివారి కవితా జీవితమూ, జీవితమూ ఒక్క స్థాయిని ప్రస్థానం చేసే గొప్ప సంఘటన జరిగింది. సాహిత్యోపాసకులకు కల్పవృక్షమయిన శ్రీ బెల్లంకొండ రాఘవరావుగారు నాయనివారి ప్రతిభను గుర్తించి, వారికి నరసారావుపేటలో ఉపాధ్యాయ పదవి కల్పించారు. నాయనివారు అక్కడే ప్రధానోపాధ్యాయులై పదవిని విరమించారు.

నాయనివారు దాదాపు ఒక్క తరం కాల్పనిక కవితను ఆరాధించారు. తక్కిన భావకవులేమో ప్రణయాన్ని తదేకంగా భావించిన వారు. నాయనివారు ప్రణయాన్ని దేవీమూర్తిలోని ఒక అంశగా, ఒక కళగా దర్శించారు. తల్లి ఉద్బోధతో వలపులజ్యోతిని కనుగొనడానికి బయలుదేరి, తల్లికొరకే యాత్ర సాగించి, సమగ్ర దేవీమూర్తిని మాతృభావంతో దర్శించి, ఏకదేశంగా తన ప్రియురాలిలో ప్రణయ భావాన్ని చూచారు. సాటి కవులలో కనిపించనిదీ, వీరిలో కనిపించేదీ విశేషమిదే. వారి తొలినాళ్ళ కవితావ్యాసంగపు సర్వకృతుల సంకలిత సంపుటి "నాయని సుబ్బారావు కృతులు".

వారి పద్యాలు జీవితాన్ని చీల్చుకొని వస్తాయి. చక్కగా, చిక్కగా, అతి వేలమైన సంయమంతో, అనంతమైన భావనతో పద్యాలు చికిలీ పెడుతారు. కనుకనే వారికి తిక్కన పదబంధం, తిక్కన మెలకువలు చాల యిష్టం. కేతన దశకుమార చరిత కథాకథనమూ ఇష్టమే. కేతనా తిక్కన పథం వాడేగా!

నాయనివారు 1957లో హైదరాబాదు చేరారు. ప్రస్తుతం హైదరాబాదు రేడియో కేంద్రంలో రచనా ప్రయోక్తలు. దాదాపు పదహారు రేడియో నాటికలు వ్రాశారు.

వారికి నలుగురు కుమార్తెలు, ఒక కుమారుడు ఉన్నారు. పెద్ద కుమార్తె శ్రీమతి నాయని కృష్ణకుమారి ఉమెన్స్ కళాశాలలో ఆచార్య.

* నాయని సుబ్బారావుగారు ప్రశ్నపత్రం అంచుల్లో ఒక పద్యం వ్రాసి ఇంటికి తీసుకొని వెళ్ళి తరువాత రెండు పద్యాలు కలిపి 'ఫలశృతి' శీర్షిక ఉంచారు. 'అంత శ్రమపడి పావన మభ్ర గంగ' అనే పద్యమే ప్రశ్నపత్రం మీద వ్రాసింది. అంతేకాని సమాధాన పత్రం మీద కాదు వారు పద్యం రాసింది. ఈ సంగతి సుబ్బారావుగారే ఒక ఇంటర్వ్యూలో చెప్పారు. ఈ విషయంలో చాలామంది ఆయన సమాధాన పత్రం మీద రాశారని పొరపడుతున్నారు.

వారి సతీమణి శ్రీమతి హనుమాయమ్మగారు. ఆమే వారి ప్రణయ కవితకు ఆలంబన సదృశమైన వత్సలాదేవి.

నాయనివారు ఉదయం ఆరు గంటలకే లేచి కాలకృత్యాలు తీర్చుకుని పద్యాలు ఆలోచించి, చికిలీ పెట్టడం తల పోస్తుంటారు. సాయంకాలం వాహ్యాళి వెళ్లుతారు. వారికి నడక చాల యిష్టం. సహాయ నిరాకరణోద్యమంలో రోజుకు పది పదిహేను మైళ్ళు తిరిగేవారు మరి!

వారు ఆంగ్ల సాహిత్యమూ ఎంతో పఠించారు. కాని ఏ కవి ముద్రా వారి హృదయంపై పడలేదు. "కవిత్వానికి నన్ను ప్రేరేపించింది ఘటనలే. ప్రేమ, మాతృవియోగం, నరసారావుపేటలో పడిన బాధలు, స్వస్థలాన్ని వదిలినప్పటి బాధ నన్ను కవిగా చేశాయి. ఆ బాధాఫలమే 'వేదనా భాసుదేవము' అంటారు వారు. ఇప్పుడు తమ చిన్ననాటి అనుభవాలు చెప్పుకునే 'జన్మభూమి', 'కథ కంచికి -?' అన్న ఖండికలో సూచించినట్టు "అశరీర వధువు" అన్న కావ్యం వ్రాయగోరుతున్నారు. వారు సంకల్పసిద్ధులు. కవితామతల్లి ఒడిని నింపుతారు.

ఉపాధ్యాయ వృత్తిలోనే అనుభవం పండి, విజ్ఞానం నిండారిన వారు గనుక విద్యారంగంలో వారి అభిప్రాయాలు విలువైనవి. నరసారావుపేట ఉన్నత పాఠశాలలో తెనుగు బోధన భాషగా చేసిన వారిలో ప్రథములు వారు.

"ఇంగ్లీషు ప్రమాణంతో మనకేమి పని? ప్రయోజనం? దాని ఉపయోగం ఎంతవరకనేది గ్రహిస్తే చాలు" అంటారు వారు.

"నేడు విద్యార్థులలో విషయగ్రహణం హెచ్చింది. ఇంగ్లీషు ప్రమాణం పడిపోవడం వల్ల నష్టం లేదు. చిన్నప్పుడు మాతృభాష క్షుణ్ణంగా నేర్చుకుంటే, ఇతర భాషలు నేర్చుకోవడం సులభం. భాషల మూలసూత్రాలన్నీ సమానమే కనుక మాతృభాష మూలసూత్రాలు ఒంటబట్టాలి. మూడవ ఫారం దాక తెలుగులోనే చెప్పాలి. తర్వాత మూడేళ్ళలో కళాశాల ప్రవేశానికి తగినంత ఇంగ్లీషు సునాయాసంగా నేర్పవచ్చు.

"మనం ఎంతో పరిభాషను సంస్కృతం నుంచి తెచ్చుకుంటున్నాము. సంస్కృతంలో విదేశ పరిభాషాపదాలు ఎన్నో చేరాయి. అలాగే మనం పారిభాషిక పదాలను ఇతర భాషల నుంచి స్వీకరించి మలచుకోవచ్చు. దీనివల్ల ఉత్తరోత్తరా, స్వతంత్రంగా ఆలోచించి పరిశోధనలు జరుపడానికి వీలవుతుంది" అంటారు వారు.

మితభాషులు, నివురుగప్పిన నిప్పువంటివారు అయిన నాయని వారు తమ సహజ సుకుమార సౌజన్యంతో ప్రకృతిని ఆరాధిస్తూ, కవితను సేవిస్తూ, తాము తలపెట్టిన రచనలన్నిటినీ పూర్తిచేసి ఆంధ్రావళికి అర్పిస్తారనే విశ్వాసం ఆంధ్ర ప్రజలకు ఉన్నది.





ఎప్పటిమాటో! బహుశా 1932 లో నేమో? విజయనగరంలో 'చింతామణి' నాటకం ప్రదర్శిస్తున్నారు. బిల్వమంగళుడు, భవానీ శంకరుని వెంట చింతామణి ఇంటికి వెళ్ళే ఘట్టం. ప్రేక్షకులు వేయి కన్నులతో చూస్తున్నారు. చింతామణి భవనం నుంచి కర్ణపేయమైన సంగీతం వినబడుతున్నది. భవానీశంకరుడు ముందు నడువగా, బిల్వమంగళుడు చింతామణిని పరికిస్తాడు. ముఖంలో భావశబలత ముప్పిరిగొన్నది. కానున్న అపవర్గాచార్య కదా! భక్తి భావమూ పొటమరించింది. బిల్వమంగళుని నటనకు ప్రేక్షకులు తన్మయులయ్యారు. ఒక సహృదయ సామాజిక మహాశయుడు దిగ్గున లేచాడు. రంగం మీదికి ఉరికాడు. భవానీ



మధ్యములు; మాధవపెద్ది వారు దుర్యోధనులు. ఈ ముగ్గురూ వైయక్తిక జీవితంలోను ఒక్క కుటుంబం వారుగా మెలిగేవారు. "అదిగో ద్వారక!" అంటూ పులిపాటివారు హస్త నిర్దేశంతో గొంతెత్తారంటే, ప్రేక్షక సందోహమంతా ఆవైపు 'అర్రులు సాచిం'దన్న మాటే.

పులిపాటివారు ఈ శతాబ్దం ప్రారంభంలో (15-9-1900) తెనాలిలో జన్మించారు. సంపన్న కుటుంబం. మంచి అభిరుచులతో పెరిగారు. తెనాలి తాలూకా హైస్కూలులో సెకండు ఫారం చదువుతున్నప్పుడే నాటకాలలో వేషం కట్టడం ప్రారంభించారు. వారి మొదటి వేషం 1911 లో రాణా హమ్మీర్. హైస్కూలు చదువు తర్వాత శ్రీ వి. నాగయ్యగారితోపాటు చిత్తూరు జిల్లా బోర్డులో పనిచేశారు. అప్పుడు శ్రీ బి. రామకృష్ణమరాజుగారు జిల్లా బోర్డు అధ్యక్షులు. 1920

శంకరుని పక్కకు నెట్టి, బిల్వమంగళుని కౌగిలించుకుని, తన చేతిలోని వెండిచెంబు, పంచపాత్ర, కంచం, పట్టువస్త్రాలు అతనిచేతుల్లో కుక్కాడు. అరగంటవరకు కోలాహలం అణగారలేదు. ఆ వస్తువులన్నీ ఆయన కుమార్తె పెళ్ళి కోసం కొని, పెండ్లి విడిదికి వెళ్లుతూ, దారిలో 'చింతామణి' నాటకమంటే, చూద్దామని వచ్చినవాడు; వచ్చి ముగ్ధుడై బహూకరించాడు. బహూకృతుడైన బిల్వమంగళుడు శ్రీ పులిపాటి వేంకటేశ్వరులుగారు.



పులిపాటివారి పేరు అద్దంకి శ్రీరామమూర్తి, మాధవపెద్ది వేంకటరామయ్యగార్ల సరసనే వినబడేది. అద్దంకివారు దశరథులైతే, పులిపాటివారు భరతులు. అద్దంకివారు ధర్మజులైతే, పులిపాటివారు పాండవ



నుంచి నటనే వృత్తిగా పన్నెండేండ్లపాటు అద్దంకి, మాధవ పెద్దిగార్లతో పాటు గడిపారు. 1932 నుంచి పది సంవత్సరాల పాటు పన్నెండు చిత్రాలలో నటించారు. రెండు తడవలు (తణుకులో, ఏలూరులో) గజారోహణ, సువర్ణఘంటా కంక ణాది సత్కారం పొందారు.

రామదాసు, చకుముకిశాస్త్రి, కరటకశాస్త్రి, బిల్వమంగళుడు, కృష్ణుడు, అర్జునుడు, వెంగళరాయుడు, భవానీ శంకరుడు, నక్షత్రకుడు మొదలయిన పురుష పాత్రలూ, లతాంగి, విమల వంటి స్త్రీ పాత్రలూ ధరించినా, వారికి ఇష్టమైనవి, ప్రజలూ సెబాసన్నవి అర్జునుడు, వెంగళరాయుడు, భవానీ శంకరుడు, భరతుడు, నక్షత్రకుల పాత్రలు.

అర్ధశతాబ్ది నాటకానుభవం గలవారు గనుక, శనివారాలు, అమావాస్యలు, నాటకంలో అభినయించే నాటి రాత్రిళ్లు ఉప వాసం ఉండి, నటనను వ్రతంగా ఆచరించిన వారు గనుక, తరుచు నటకులకు లేని రచనాకౌశలం గలవారు గనుక నాటక కళను, నాటక శాలలను గురించి పెక్కు వ్యాసాలు వ్రాశారు; పలుమారు ప్రసంగించారు. తెనాలిలో 'యూనివర్సల్ అసోసి యేషన్' పేరుతో నాట్యకళోద్ధరణ సంఘం స్థాపించి నడిపిం చారు.

పులిపాటివారు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక ఏకాడమీ



జరుపుతారు. నిష్కర్షయినవారు; మొగమోటమి ఏ కోశానా లేదు. నిరంతరం వెల్లి విరిసే ఉత్సాహంతో ఉండేవారే. కాని, రెండవ కుమారుడు - వారి ఆశలెన్నింటినో పండిస్తాడనుకున్నవాడు - హఠాత్తుగా మృత్యువు వాతబడడంతో కొంత నిరుత్సాహపు నీడలు వారిపై పడ్డాయి.

పులిపాటివారికి తిరుపతి వేంకటకవులు మొదటి అభిమాన కవులు; తర్వాత పానుగంటి వారు. ఇప్పటికీ వారి రచనలలోని పద్యాలు సంభాషణలో దొర్లుతుంటాయి; మననమూ చేసుకుంటుంటారు. మరొక విశేషం - ఉత్తమ పాత్రలు ధరించాము గదా, తదనుగుణంగా ప్రవర్తన అలవరచుకుందామనే ఆశతో, దీక్షతో నడవడి దిద్దుకోడం నేటికీ మానుకోకపోవడం. కనుకనే కళ అన్నా, రంగస్థలమన్నా వారికి మహోన్నత సిద్ధాంతాలున్నాయి.

"జనానికి మంచి అభిరుచి కలిగించే బాధ్యత నటులదే. ఏదో వ్యాపార దృష్టితో చేసే ప్రదర్శనం కళాభివృద్ధికి తోడ్పడజాలదు. కళా దృష్టిలో పనికిరానిదంటూ లేదు. కలిసికట్టుగా పనిచేయాలి. వీటికి సంఘోద్ధరణ దృష్టీ తోడ్ప



సభ్యులు. 1960లో వారిని ఎకాడమీ ఫెలోషిప్పుతో గౌరవించింది. 1961లో వారికి జన్మస్థలమైన తెనాలిలో ఆస్థానకవి శ్రీ కాశీ కృష్ణాచార్యులవారి అధ్యక్షతన ఘనంగా షష్ట్యబ్దపూర్త్యుత్సవం జరిగింది. ఆస్థానకవి వారిని "నటకళేశ" అనే బిరుదుతో సంబోధించారు.

ప్రస్తుతం పులిపాటివారు తెనాలిలో స్వగృహంలో నివసిస్తున్నారు. ఇప్పటికీ నాటకాలు వేస్తారు. నేటికీ ఆహారనియమం పాటిస్తారు. ఉప్పు, కారం చాల తక్కువగా ఉపయోగిస్తారు. పాలు, మీగడ, వెన్న వారికి చాల యిష్టం. అలాటి వేషాలే వేశారు మరి! తెల్లవారుజామునే లేచి, నిత్యకృత్యాలు తీర్చుకొని, తపాలాఫీసుకు వెళ్ళుతారు. టపా తీసుకుని పది గంటలకు తిరిగివస్తారు. ఉదయమూ, రాత్రీ త్వరగా భోజనం ముగిస్తారు. పరస్థలం వెళ్లేటట్టయితే రాత్రి భోజనం చేయరు. మధ్యాహ్నం ఉత్తరాలు, వ్యాసాలు వ్రాస్తారు. సాయంకాలం మిత్రులతో గోష్ఠి



ప్రభుత్వం ఉంటేనే ఏ విద్య అయినా అక్కరకు వస్తుంది" అని వారనే మాటలలో నిజం లేదూ?

నాటకాల వల్ల, సినిమాలవల్ల జనం చెడిపోతారనే వాదం వింటే వారు ఫక్కున నవ్వుతారు. "చెడడమంటూ వస్తే ప్రతి దానివల్లా చెడడం ఉంది. అయినా, సభ్యత పాటించడం తప్పదు" అంటారు వారు. నీతిదాయకంగా ఉండి, ప్రజానీకాన్ని సన్మార్గానికి మళ్ళించే ఏ విషయమైనా నాటక వస్తువే. శాశ్వత విషయం ప్రదర్శించే నాటకం శాశ్వతమవుతుంది.

నాటకానికీ, సినిమాకూ ఎన్నడూ పోటీ లేదని, నాటకం సినిమా కన్నా కళాదృష్టితో పై స్థాయిదేనని వారి గట్టి నమ్మకం. రంగస్థలం మీద నటుడు ఎంతో చురుకుగా ఉండవలసి ఉంటుందని, సినిమాలో ఎంతో పాడుచేసి కొంత సాధించవచ్చునని వారనేది అనుభవ రసికులకందరికీ విదితమే.

డితే, కళ బాగుపడుతుంది" - ఇది వారి నిశ్చితాభిప్రాయం.

"ప్రజలకు నాటకాలపట్ల ఆదరణ చాల ఉంది. ప్రతి మున్సిపాలిటీ, ప్రతి పంచాయితీ ప్రదర్శన శాలలు నిర్మించాలి. అవి ఉంటే, నాటకాభివృద్ధి కలుగుతుంది. యువకులకు శిక్షణ, వృద్ధులకు పోషణ కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు కల్పించాలి. వృద్ధ నటుల మాటలను రికార్డు చేయించాలి. మంచి విమర్శకులూ ఉండాలి. నాటకకళ పైకి రావాలంటే సంఘాలు, ప్రభుత్వ ప్రోత్సాహం, నాటక రంగం, విమర్శలు - ఈ అంగచతుష్టయం ముఖ్యం. అప్పుడే కళ నాలుగు పాదాలపై నడుస్తుంది" అని వారి హితవు.

"మేము ఆ రోజులలో నాటకాలు ఆడాలని ఆడాము. జనం చూడాలని చూచారు. కళను అభిమానంతో పోషించారు. విదేశాలలో లలిత కళలకు ప్రత్యేకం అమాత్యశేఖరులున్నారు. మన దేశంలోను అలాటి ఏర్పాటు ఉండాలి. ఆదరించే

వినోదపు పన్ను తలచుకుంటే వారి ఒళ్ళు భగ్గుమంటుంది. ప్రాచీన కాలంలో ఇలాటి పన్ను ఉన్నా, ఇప్పటి పద్ధతిలాగ లేదని, నాటకాలు నీరసించడానికి ఇది కారణమని వారి నిశిత విమర్శ.

తెలుగు లలిత కళా ఎకాడెమీవారు కాని, ప్రభుత్వం కాని నాటక సంఘం స్థాపించి, ఇతర రాష్ట్రాలలోను, ఇతర దేశాలలోను తెనుగు నాటకాలు విధిగా ప్రదర్శించే ఏర్పాటు చేస్తే, నటనలో, నాటకరంగంలో తెలుగువారి ప్రతిభ దిగంతాలకు వ్యాపిస్తుందని వారి సూచన.

నాటక రంగంలో కులపతులూ, కురువృద్ధులూ మరుగవుతున్న నేడు, ఔత్సాహికులకు ప్రోత్సాహం అవసరమైన నేడు ఈ సూచనను పాటించగలవారు పాటిస్తే ఎంతో మేలు.





**శ్రీ** తుమ్మల సీతారామమూర్తిగారికంటే గొప్పగా కవిత చెప్పిన వారు ఉండవచ్చు. వారికంటే గొప్ప పండితులూ ఉండవచ్చు. కాని, వారిలాగా చెప్పినదానిని ఆచరణలో పెట్టి బదికే వారు మాత్రం అరుదు. అరుదేమిటి? నేడు వారి పేరు కనిష్ఠి కాధిష్ఠి తమే.

జీవితానికి, రచనకు సంబంధం ఉంటే వ్యక్తిత్వం, రచన రాణిస్తాయని తుమ్మలవారి విశ్వాసం. ప్రాచీనాలంకారిక సమయమూ ఇదే. దీనికి అనుగుణంగా వారు తొక్కిన తోవ మురారి మార్గం వంటిది. వారి రచనలు మొదటినుంచీ ఎప్పటికప్పుడు ఆత్మ పరిశోధన, ఆత్మ పరీక్ష చేసుకుంటున్నట్టే సాగాయి. "ఇది కర్తవ్యం. ఇది అకర్తవ్యం" అంటూ జాతికి సందేశం చెప్పడం అలవరచారు. తదనుగుణంగా తమ జీవితాన్ని దిద్దుకొనడానికి



అహరహం ప్రయత్నించారు, ప్రయత్నిస్తుంటారు.

"ఇన్ని నీతులు చెప్పితి నింత వెక్కి
రించితిని ధర్మువున్ గికురించువారి
నన్ను నే దిద్దుకొంటినా అన్న మధన
మేను విడక యించుక తలయెత్త గంటి"

- అన్నారు వారు. ఆ మధన ఎత్తిన తల గౌరీశంకర శిఖరం లాగ అత్యున్నతం.

వారిని గాంధీవాదం, రాష్ట్రవాదం పట్టుకున్నాయి. "నా రచనలు మొదటినుంచి సందేశాత్మకాలు, సమసామయిక రాజకీయ వస్తు ప్రధానాలు కావడం వల్ల కళకు, శిల్పానికి అవకాశం తక్కువ. పల్లెటూళ్ళు మొదలయిన వాటి గురించి చెప్పిన 'బంగారు భూమి' వంటి వాటిలో శిల్పానికి, కళకు ప్రాధాన్యం ఉంది" అంటారు వారు. కాని, వారి పద్యం ఒక్కటి చదివినా, ఈ వాదంతో ఏకీభవించము. మీదు మిక్కిలి కవితాశిల్పం జక్కనాచార్యుని కైవాడంలాగ, తిక్కనార్యుని కైతలాగ ఎంత



సుతారంగా ఉంటుందో తెలుసుకొని తన్మయులవుతాము. వారి రచనలు యింతటి శిల్పవైభవం సంతరించుకొనడానికి, జిగితో బిగితో సొబగువారడానికి కారణం వారి నైష్ఠిక జీవితమే. వారి జీవిత గానమే వారి కవిత. వారి కవితే వారి జీవితానికి పదశిల్ప ప్రతిరూపం.

తుమ్మలవారి జన్మస్థలం గుంటూరు జిల్లా కావూరు (జననం 25-12-1901). పిన్నతనంలో పన్నెండు సంవత్సరాలతో, వీధి బడితో చదువు ముగిసింది. వారి పదవయేట ఒక తమాషా జరిగింది. చెరుకుపల్లిలో కారెంపూడి రాజమన్నారుగారనే శతావధాని ఉండేవారు. వారి అవధానం తుమ్మలవారు ఒకమారు ఛూచారు. ఆ శతావధాని "శునకమ్మయ్యెను విష్ణుదేవుడహహా చోద్యంబుగా నత్తరిన్" అనే సమస్యను 'ఈశునకు అము అయ్యెను' అని పూరించారట. తుమ్మలవారికి కూడా కుతూహలం కలిగింది. వచ్చీరాని పదాలతో ఆయనలాగే పూరించారు. అప్పటినుంచీ వారి కవితాహృదయం పొంగింది. రచయిత కావాలనే ఆరాటం పరవళ్ళు తొక్కింది.

కాని, పైతృకమైన వృత్తి వ్యవసాయం. తండ్రికి బాసటగా ఉండక తప్పని పరిస్థితి. కనుక స్వయంకృషే అనివార్య మయింది. ఒకవైపు మడిసేద్యం, మరొకవైపు సాహిత్య కృషి సాగించారు. తండ్రి నారయ్యగారు, బావగారు వారి సాహిత్యాభి



రుచిని ప్రోత్సహించారు. భాషాభండారం నిండారడానికి ప్రాచీన సాహిత్యం, సంస్కృతం అవసరమని వారు గుర్తించారు. చందవోలులో ఉన్న తాడేపల్లి వేంకటప్పయ్య శాస్త్రిగారి వద్ద "అథ ప్రజానా మధిపః ప్రభాతే" ఆరంభించి, కాళిదాసత్రయం చదివారు. వ్యవసాయకాలంలో, పనినాళ్ళలో పగలు తీరిక దొరికేది కాదు. రాత్రిళ్ళు నాలుగు మైళ్ళు నడిచి వెళ్ళి పాఠం చెప్పుకొని వచ్చేవారు.

వ్యవసాయంలో శరీరం, సాహిత్యంలో పలుకు రాటు దేరాయి. ప్రాయంలో ఐదెకరాల చేనుకు సరిపోయే నారు ఒక్కరే పీకారు. 240 మోపుల గడ్డి ఒక్కరే కట్టారు. రాత్రి కూడా కలుపు తీశారు. కుప్పలు నూర్చారు. గడ్డి కోసేవారు. వెంట్లు కట్టేవారు. పది మోపుల గడ్డిపనలను ఒక్కరే ఎత్తారు. వీటితో వారి ఆరడుగుల ఆజానుబాహు విగ్రహం తీర్చిదిద్దినట్టయింది. ఇటు సాహిత్య క్షేత్రంలోను హరికథల నారులు చల్లారు. శతకాల కుప్పలు నూర్చారు. దోషాల కలుపులు తీశారు. ఆశువుల వెంట్లు కట్టారు. ఆజాను తెనుగు విగ్రహం తీర్చి దిద్దుకున్నారు.

దేశంలో స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా కొనసాగుతున్నది. 1920లో గాంధీజీ సేనాని అయ్యారు. గడ్డిపోచలను గండు మగలుగాను, మట్టిగడ్డలను మహావీరులుగాను మలచి రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఎదిరించారు. ఆ మహా సేనాని ప్రభావం తుమ్మలవారిపై ప్రసరించింది; వారి కవిత పైన ప్రసరించి, దానిని ప్రసన్నం చేసింది. గాంధీజీ ఆశయాలకు అనుగుణంగా బ్రతకాలని, నిరాడంబరంగా ఉండాలని వారు శ్రమింపసాగారు.



1923లో కాకినాడలో కాంగ్రెసు మహాసభ జరిగింది. తుమ్మల వారూ అక్కడికి వెళ్ళారు. వెళ్ళివచ్చిన తర్వాత మరి కొందరు ఉత్సాహితులతోపాటు కావూరులో హిందీ పాఠశాల పెట్టారు. దానితోపాటు తిలక్ జాతీయ కళాశాల ప్రారంభించారు. ఆ జాతీయ పాఠశాలలో "తెలుగు నీవే చెప్పాలి" అని సాటి దేశ సేవకులు తుమ్మలవారిని బలవంతం చేశారు. అప్పటినుంచి మొదలయింది వారికి పంతులు పని.

తెలుగు చెప్పడంతోపాటు జాతీయ కార్యక్రమం - ఖద్దరు విక్రయం, కాంగ్రెస్ ప్రచారం సాగించారు. పాఠశాలలో పదహారు రూపాయలు నెల జీతం. అది పుచ్చుకోవడమే వారికి బాధగా ఉండేది. సెలవుల్లో ఖద్దరు నెత్తిన పెట్టుకొని అమ్మి, రూపాయకు అణా చొప్పున ఇచ్చిన కమీషనును జాతీయ పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ భక్తిపూడి రామచంద్రరావుకు అప్పగించారు. 1920 నుంచి పదేళ్ళపాటు జిల్లా కాంగ్రెస్ సభ్యులుగాను, రాష్ట్ర కాంగ్రెస్ సభ్యులుగాను ఉన్నారు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. కావూరు కాంగ్రెస్ కార్యదర్శిగా పనిచేశారు.

తెలుగు పంతులు కావడంతో వారి కవిత 1928లో తొలి సారిగా "ఆత్మార్పణము" రూపంలో సాక్షాత్కరించింది. ఇది కపోత కథ వస్తువయిన చిన్న కావ్యం. అప్పటినుంచి సేద్యానికి స్వస్తి చెప్పారు. ఒజ్జనమే జీవిక అయింది. కాని, తెలుగు కైతమాగాణిలో "పెద్దకాపు" కాపించారు. "పరిగపంట" ఏరారు. "ధర్మజ్యోతి", "అమరజ్యోతి" వెలిగించారు. "గీతాంగణం"లో "రాష్ట్రగానం", "ఉదయగానం", "సర్వోదయగానం" చేశారు. కవితా ఖండాలతో "శబల"ను తీర్చారు. జీవితం ఉత్తరార్థంలో వ్రాసినవి "పైరపంట"లో చేర్చదలిచారు.

"నా రచనలో వస్తుగౌరవం బాపూజీ ఆత్మకథే శాశ్వతంగా ఉంటుంది. అందులో తెనుగు ముద్ర కూడా హెచ్చుగా ఉంది. ఉదాత్త భాషలోను పాడిగాను" అంటారు వారు.

నిజమే. సమకాలిక పరిస్థితులను ఆకళించుకొని ముందంజ వేసే రచయితే మహాకవి; క్రాంతదర్శి. గాంధీజీ ఉదాత్తచరితం భారత జాతికి అవిస్మరణీయం, నిత్యస్మరణీయం, రామాయణ భారతాలవలె . దానిని తుమ్మలవారు ఛందోమకుటంతో



అలంకరించారు. డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు దీని తిలక రచనలో అన్నట్టు "తిక్కనతో సజాతీయుడైనవాడు మన చౌదరి. అనగా, సరిసమానుడని అతిశయోక్తి బలికి అపాయము దేగు. ఆ వర్గమున నగ్రాసనము లేకున్నను ఆసనత్వము గల వాడు. తుమ్మల సీతారామమూర్తి మహాత్ముని ఆస్థానకవి. ఈ స్థానము శాశ్వతము."

తెలుగు ఒజ్జగానే వారు తరంపైగా గడిపారు; పొన్నూరులోను, అప్పికట్లలోను గండపెండేర, గజారోహణ, కనకాభిషేకాద్యనేక సన్మానాలు పొందారు. నలుగురు కుమారులతో, ఒక్క కుమార్తెతో ముద్దు ముచ్చట్లు తీర్చుకున్నారు. షష్ఠిపూర్తి పండుగ చేసుకున్నారు. చిన్నప్పుడు -

"అఱు పులిసి గిత్త అంకెవైచిన తరి
నడుముకట్టి పట్టె మెడకు దార్చి
ఊబిలోని బండి నూపి రేపిన మొన



గాడు" వయసు మళ్ళీ మళ్ళగానే ఉదరశూలతో సగమైపోయారు. గుప్పెడు కారప్పొడితో, చేరెడు నేతితో మొదటి కబళం కలిపే తిండి పుష్టి పోయింది. అన్నపూర్ణ వంటి సతీమణి అన్నపూర్ణమ్మ గారు సేవచేసినా తగ్గలేదు. దానికోసం ఉప్పు కారం లేని చప్పిడి భోజనం అలవాటు చేసుకున్నారు. రాత్రి గోధుమన్నం, మజ్జిగ పుచ్చుకుంటారు. దీనికి కారణం సేద్యం మాని ఒజ్జరికం చేయడమేనని కోపం కలిగింది. "బలభద్రులకున్ బడి కొల్వు గిట్టదు" అని తిట్టిపోశారు. అంతలో పంతులౌటవల్లనే కవిత పండిందనే సత్యం గోచరం కాగానే వినయంతో ఆత్మ ప్రత్యయంతో -

"రాష్ట్ర సిద్ధికొరకు రక్తమ్ము కార్చిన
కవిని నేను గాంధి కవిని నేను
బడలి బడలి తల్లి బాస కూడెము సేయు
కవిని నేను దేశి కవిని నేను!"

- అని ఆనందించారు. ఆంధ్రావళీ ఔనని తల ఊపింది.

ప్రస్తుతం వారు అప్పికట్లలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. తెల్లవారి కాలకృత్యాలు తీర్చుకున్న తర్వాత పత్రికా పఠనం, గ్రంథ పఠనం, వచ్చినవారితో గోష్ఠి, రచన వారి దైనందిన చర్య. రాత్రి రెండు గంటలప్పుడూ వ్రాస్తారు. 1930 నుంచీ డైరీ (దినచర్య) వ్రాయడం అలవాటు. ప్రతి జమా ఖర్చూ వ్రాయవలసిందే. దమ్మిడీ కూడా సరిపోవలసిందే. గాంధీవాదులు కావడం వల్ల ప్రత్యేకమైన అభిరుచులు లేవు.

కవిత్వానికి ప్రత్యేక భాషంటూ ఉంది. దాని నిర్మాణం వేరు. దాని హుందా తగ్గకుండా చూడడం కోసం సరైన మార్గంలోనే నడవాలని వారి నమ్మకం.

"ఇప్పటి సాహిత్యం జడావస్థలోనే ఉంది. ప్రజాసేవ లేకుండానే రాజకీయవాదులు పదవులు కోరినట్టు, పాండిత్యం కొరకు ప్రయత్నించకుండానే రచయితలు కావాలనే ఆరాటం నేటి యువకులలో ఉంది. కావ్యం ఎవరికి అంకితం చేసినా వచ్చే గొప్పదనం లేదు. కష్టపడకుండానే సంపాదిద్దామనే దురాశ ప్రతి రంగంలోను నేడు అలముకుంది. ఈ పరిస్థితి మారక తప్పదు. ఏ రూపంలో మారుతుందో నా బుద్ధికి అందడం లేదు" అంటారు వారు.

కాలానుగుణమైన భావవిప్లవం అవసరమనే వారి అభిప్రాయం. భాషా విప్లవం మాత్రం వారికి గిట్టదు. ప్రబంధ యుగపు పాకం కాకపోయినా సరళ సలక్షణ భాషలోనే కాలానుగుణమైన సందేశం చెప్పినప్పుడే కవిత అవుతుందనేది వారి నిశ్చయం.

"కవితా పరమావధి రసం, ఆనందం. మానవ హృదయాన్ని సంస్కరించడానికిగాని, శాంతి కలిగించడానికిగాని ఉపయోగపడేదే ఆనందం. ఆ ఆనందం ఉద్బుద్ధం కావడానికి సృష్టించే కవిత సరళంగా ఉన్నా, సలక్షణంగా ఉండాలని నా నమ్మకం. విషయ ప్రధానమైన రచనలు ఏలాటి భాషలో ఉన్నా, ఎంత తేలికగా ఉన్నా నష్టం లేదు" - ఇది వారి అభిప్రాయం.

అయితే, నేటి పరిస్థితిలో కవి బాధ్యత ఏమిటి? "కవి తన సందేశం మృదువుగా చెప్పడమే చేయదగిన పని. రచయితలలో మొదట సంస్కారం రావాలి. రచయితలు సంఘానికి సరైన సందేశం ఇచ్చినప్పుడు, సంఘం కూడా వారి సందేశానికి కొంత విధేయమవుతుంది" అని వారు సూచించే పరిష్కారమార్గం.

"నేర్చిన యొకింత గట్టిగానేర్చినాడ
కూర్చిన రవంత తిన్నగా కూర్చినాడ"

- అని తుమ్మలవారు "వినయమ్మెసరేగ శిరమ్ము వంచినా", వారి సారస్వతసేవ రవంత కాదు. కొండంత, బంగారు కొండంత. విశాలాంధ్ర రాష్ట్రభావన నవనవంగా ఉన్నంతవరకూ, గాంధీజీ సిద్ధాంతాల సౌరభం గుబాళిస్తున్నంత వరకూ, పరిగపంటలూ, పైరపంటలూ నాడులో కొనసాగుతున్నంత వరకూ వారి కవిత చెన్నువిడదు.



# మరపురాని మహర్షి



ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రి



"ఏమండీ, శాస్త్రిగారూ, మీరు చేయుచున్న పని చట్టమునకు విరుద్ధమైనది; న్యాయమునకు ప్రతికూలమైనది. మేము సహింపజాలము" అన్నారు ఒక ఫాదరీగారు.

"నేను చట్టానికి విరుద్ధంగా, న్యాయానికి ప్రతికూలంగా నడుచుకోడంలేదు" అని సమాధానమిచ్చారు ఆ శాస్త్రిగారు.

"మేము మీ మాటలు నమ్మము; నమ్మజాలము, మీరు చేయుచున్నపనికి అనుమతి ఇచ్చిన వారెవరు?" అని గద్దించి అడిగారు ఫాదరీగారు.

"మీకు అనుమతి ఉండగా లేనిది, నాకు లేదా?" అని ఎదురు ప్రశ్న వేశారు శాస్త్రిగారు.

"లేదు. మీకు లేదు. మాకు ఘనత వహించిన ప్రభుత్వం వారు మత ప్రచారము కొరకు అనుమతి పత్రమును, ఆజ్ఞా పత్రమును ఇచ్చియున్నారు" అన్నారు ఫాదరీగారు.

"మాకు అలాటి పత్రాలు ఏవీ లేవులెండి! ధర్మశాస్త్రమూ,



మా వీరమాహేశ్వరుల మహదాచారమూ మాకు వరవడి" అన్నారు శాస్త్రిగారూ.

"మీరు చెప్పునది మాకు అర్థమగుటలేదు. ఏమైనను, మీరు మా మతస్థులను మరల హిందూ మతమునకు మార్చుటను మేము ఇక సహింపము; సహింపజాలము. మిమ్ములను అరెస్టు చేయుటకు ఘనత వహించిన ప్రభుత్వము వారికి సిఫార్సు చేయుచున్నాము" - అని గర్జించారు ఫాదరీగారు.

"అయ్యా ఫాదరీగారూ, మీరు క్రైస్తవ ఫాదరీలయితే, నేను హిందూ ఫాదరీని. మనకు వాద వివాదాలెందుకు? మీ అధికారంలో ఉన్నదంతా చేసుకోండి" అని వినయంగా మనవి చేశారు శాస్త్రిగారు.

అస్పృశ్యతా నివారణోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజులలో గుంటూరు జిల్లా చినవడ్లపూడిలో ఇద్దరు సంఘ సేవకులకు జరిగిన వాకోవాక్యమిది. ఆ శాస్త్రిగారు శ్రీ ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రిగారు.

అపరంజి బంగారుఛాయలో, ఖద్దరు నీర్కావి ధోవతిలో, మెడలో పచ్చిపోకలంతేసి రుద్రాక్షల తావళంతో, బొజ్జవరకు వ్రేలాడుతున్న లింగకాయతో, అంగప్రత్యంగాలతోనూ, విభూతి త్రిపుండ్రాలతో, నాలుగు పరకల పిలకతో వెలిగిపోతూ, నిత్య కర్మానుష్ఠానాలు, షట్కాల శివపూజలూ యథావిధిగా ఆచరిస్తూ, నిరంతరం శివపంచాక్షరి జపిస్తూ ఉండే ఈ శోత్రియులేమిటి? అస్పృశ్యతా నివారణోద్యమంలో అంతటి అభినివేశంతో పాటు పడడమేమిటి? - అని నేడు ముదిగొండవారిని చూచే వారెవరైనా ఆశ్చర్యపడవచ్చు.

కాని,ముదిగొండవారు శైవద్వాదశాచార్యులలో ఆరాధ్య త్రయంలోని ఉద్భటారాధ్యుల సంతతి వారని, భక్తి మీది వలపును, బ్రాహ్మ్యంతో పొత్తును బాయక సమన్వయం సాధించిన భక్త శిఖామణుల వంగడం వారని తెలుసుకున్న తర్వాత, వీర వైష్ణవులు, వీర శైవులు మతాన్ని ప్రధానంగా పరిగణించి, కులాన్ని గౌణం చేశారని గ్రహించిన తర్వాత అలాంటి వంశంలోని వారు ఇలా సంఘ సంస్కరణలకు పూనుకోక ఎలా ఉంటారనే ప్రశ్న ఉదయిస్తుంది.

ముదిగొండవారు గుంటూరు జిల్లా తెనాలి తాలూకా ఈమనిలో జన్మించారు. (1902 ఆగస్టు). వారి పితామహులు నిగమాగమజ్ఞులు; షట్కాల శివపూజా ధురంధరులు; నిరతాన్నదాతలు. తండ్రిగారు కొండయ్య అయ్యవారు, సంస్కృతాంధ్ర భాషా కోవిదులు; 'నిర్వాణనిశ్రేణి' అనే గ్రంథం రచించిన వారు ముదిగొండవారు. పన్నెండు సంవత్సరాలవరకు స్వగ్రామంలోనే ప్రాథమిక పాఠశాలలో చదువుకున్నారు. ఇంట్లో ఆంధ్ర సంస్కృతాలు నేర్చుకొనడం ఉండనే ఉన్నది. తర్వాత ఎనిమిదేళ్ళు పలువురు మహాపండితుల వద్ద వేదాధ్యయనం, సంస్కృత కావ్యనాటకాలంకారాధ్యయనం కావించారు. వ్యాకరణ శైవాగమ శాస్త్రాధ్యయనం కావించారు. దేవకార్యాలు, ఉత్సవాది ప్రతిష్ఠాంతం చేయించగలరు.



ఏలూరులో జరిగిన సభలో 'ఉభయకవితా సమ్రాట్' బిరుదం, వరంగల్ సభలో గండ పెండేరం పొందారు.

ముదిగొండవారు దాదాపు ఎనభై సంస్కృతాంధ్ర గ్రంథాలు రచించారు. వారి 'శుక్లపక్షః' అనే సంస్కృత ఖండకావ్య సంపుటిలోని 'కాళిదాసః' అనే ఖండికను అఖిల భారత సాహిత్య అకాడెమీ వారు 1953 నాటి సంస్కృత కవితాసంపుటిలో ముద్రించి గౌరవించారు. ముదిగొండవారు సంస్కృత కవితలో కొన్ని ఆంధ్ర కవితా మర్యాదలు ప్రవేశపెట్టారు. పూర్వపు కొన్ని సంస్కృత శాసనాలలో సీసపద్యం (శీర్షికమనే పేరుతోనే), చంపకమాల కనిపిస్తాయి. ముదిగొండవారు మహాస్రగ్ధర, మత్తేభం, ఉత్పలమాల వంటి తెలుగు వృత్తాలను వాడారు. యతిని విరామంగా కాక తెనుగు అక్షరావృత్తిగా పరిగణించారు. కొన్నిచోట్ల పూర్వోత్తరార్ధ విచ్ఛేదం లేక కలిపి కూడా వేశారు. అయినా ఎబ్బెట్టుగా కనిపించలేదు, వినిపించలేదు.

అప్పుడు దేశంలో అవధానాల జాతరులు జరుగుతున్నాయి. ముదిగొండవారికి కూడా అవధానాలు చేద్దామనే తలంపు కలిగింది. వయస్సు ఇరవై సంవత్సరాలు. తొలిసారిగా ఈమనిలో అవధానం, ఉభయ భాషలలోనూ చేసి, కృతార్థులయ్యారు. తర్వాత పెక్కు పట్టణాలలో అష్టావధాన, శతావధానాలు వందకుపైగా చేశారు. అప్పుడు గంటకు మూడు వందల పద్యాలుగాని, శ్లోకాలుగాని చెప్పేవారు. సరే! ఇక పలుతావులలో సన్మానాలు, సువర్ణ పతాకాలు, కవిభూషణ, కవితా ప్రవీణేత్యాది బిరుదాలు చెప్పనక్కరలేదు.

కాని దర్శనాలు అధ్యయనం చేయనిదే, నిత్య జీవితానికి ఉపయోగపడే వాస్తు జ్యోతిషాదులు తెలియనిదే సంపూర్ణత్వం లభించదని వారికి తోచింది. 28వ ఏట శ్రీ జోస్యుల కనకయ్య సిద్ధాంతిగారి వద్ద ముహూర్త జాతక సిద్ధాంతమనే త్రివిధ జ్యోతిశ్శాస్త్రం అభ్యసించి, పది సంవత్సరాలపాటు పంచాంగాలు గుణించి ముద్రించారు. 'జ్యోతిర్విశారద' బిరుదం పొందారు. వాస్తు విషయాలు పరిశీలించారు. మహోపాధ్యాయ శ్రీ ముదిగొండ నాగలింగారాధ్యుల వద్ద దర్శనాలను, శైవదర్శనాలకు శాంతి చేశారు.



ముదిగొండవారిలో విశేషం వారు 1922 నుంచి - అంటే లోకవ్యవహారాలు తెలిసిన 20వ ఏట నుంచి - 25 సంవత్సరాలపాటు కాంగ్రెస్ సభ్యులుగా ఉండి దేశసేవ చేయడం; కులమత భేదాలు పాటించక అందరికీ విద్యాదానం చేయడం. వారు అజాత శత్రువులు. సతీమణి శ్రీమతి భ్రమరాంబగారు. ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు ఉన్నారు.

ప్రస్తుతం ముదిగొండవారు ఈమనిలో స్వగృహంలో ఉంటూ ఎవరు పిలిచినా ఉచితంగా జ్యోతిష, వాస్తు విషయాలు చెబుతుంటారు. దేవాలయాలలో ఉత్సవ ప్రతిష్ఠాదులు చేయిస్తుంటారు. కవితా గోష్ఠులలో పాల్గొంటూ ఉంటారు. శైవదర్శనాలపై ఉపన్యసిస్తుంటారు. పది సంవత్సరాలుగా శ్రీ శైవమహాపీఠ పండిత సభాధ్యక్షులుగా ఉన్నారు. "అయ్యా ఇల్లు కట్టుకుంటున్నాము. తలవాకిలి గుమ్మం ఎక్కడ పెట్టాలండీ? జల ఎక్కడ పడుతుందండీ?" అని ఒకవైపు కొందరు; "బర్రె తప్పిపోయింది, ఎక్కడ కనబడుతుంది?" అని అడిగేవారు కొందరు ఎంత వేధిస్తున్నా ఎంత మాత్రమూ విసుగుపడక సమాధానాలు చెబుతూ ఉంటారు. ఇంతయినా, చీకట్లోనే లేచి, అనుష్ఠానాదికం ముగించుకొనడం, షట్కాల శివపూజ, నీలకంఠ భాష్యాధ్యయనం యథావిధిగా సాగుతుంటాయి. మధ్యాహ్నం శివపూజ (భోజనం) తర్వాత విద్యార్థులకు పాఠం చెబుతారు; నూతన గ్రంథ రచన సాగిస్తారు. రాత్రి భోజనాల తర్వాత 'శివానందలహరి', 'మహిమ స్తవం' చదువుకొని పడుకుంటారు. ప్రస్తుతం చూపు కొంచెం ఆనడంలేదు. అందువల్ల ఇతరులు చదవగా వింటారు. ఇతరులకు చెప్పి వ్రాయిస్తారు.

వారికి భారతీయ సంస్కృతిపై అపారమైన భక్తిశ్రద్ధలున్నాయి. ప్రాచీన ధర్మాలను ఉద్ధరించాలని వారి ఆకాంక్ష. అస్పృశ్యులను శుద్ధిచేసి కలుపుకోవాలని వారి నిర్ణయం "ఇంకా ప్రాచీన సంస్కృతిపై ఆసక్తి కలుగుతుందనే నమ్ముతారా?" అని ప్రశ్నిస్తే, "దేనికైనా మితి అనేది ఉంది. ఇప్పటి పరిస్థితిపై వెగటు పుట్టి మన సంస్కృతిపై అభిరుచి కలుగుతుందనే నా విశ్వాసం" అంటారు వారు.

"సంస్కృతం సంవత్సరంలో మాట్లాడేటట్టు చేయగలను" అంటారు; విదేశీయులు సంస్కృతం





నేర్చుకోంగా లేనిది, నూటికి తొంభైపాళ్ళు సంస్కృత పదాలు నిరంతరం వాడుతున్న తెనుగువారు సంవత్స రంలోగా సంస్కృతం భాషించగలగడం గొప్పేమీ కాదని వారి అభిప్రాయం. సంస్కృతం మృతభాష కాదని, ప్రతి దానితోను సంబంధం కలది గనుక దానికి మృతి లేదని వారి గాఢ విశ్వాసం.

వారివి అముద్రిత గ్రంథాలింకా ఎన్నో ఉన్నాయి. ప్రస్తుతం వారు కలకత్తా 'జ్ఞానపీఠం'వారి కోరికపై 'విశ్వకళ' అనే సంగ్రహ విజ్ఞాన సర్వస్వం వంటి సంస్కృత కావ్యం రచిస్తున్నారు. 'విశ్వశరత్' అనే సంస్కృతాలంకార గ్రంథం, జవహర్‌లాల్ నెహ్రూ జీవితం చిత్రించే 'శాంతిదూత' అనే సంస్కృత కావ్యం రచిస్తున్నారు. శాంతిదూతను త్వరలో ముద్రించి భారత ప్రధానికి సమర్పించాలని కూడా ప్రయత్ని స్తున్నారు.

ఆంధ్ర భాషా మర్యాదలను ధైర్యంగా గీర్వాణ కవితలో ప్రవేశపెట్టిన ముదిగొండవారి సంప్ర దాయం, వాస్తవమైన సనాతన ధర్మాన్ని అనుసరిస్తూ సంఘసేవచేస్తున్న ముదిగొండవారి సముదాచారం విస్తరించే అవకాశం ముందు ముందు అనంతం.





# మరపురాని మనీషి



## స్థానం నరసింహారావు



నాలుగు దశాబ్దాలనాటి - 1920 నాటి - మాట. బాపట్లలో ప్లీడరు గుమాస్తాల నాటక సంఘం ఉండేది. దానిలో శ్రీ కామరాజు వేంకటనారాయణగారు కూడా సభ్యులు. ఆయన మేనల్లుండ్లలో ఒకరు కళాభిరుచి కలవాడు; పందొమ్మిదేండ్ల ప్రాయంవాడు. అతడు మేనమామతోపాటు ఆ నాటక సంఘానికి వెళ్ళి, నటుల తరిఫీదులలో హార్మోనియం శ్రుతి వేసేవాడు. అందువల్ల ఆ నాటకాల పద్యాలు, పాటలు, సంభాషణలు ఆ యువకునికి కొట్టిన పిండి. ఒకనాటి మధ్యాహ్నం ఆ యువకుడు యథాలాపంగా ఆ నాటకాల పద్యాలు, పాటలు పాడుకుంటున్నాడు. ఆ నాటక సంఘంలో హరిశ్చంద్ర పాత్ర ధరించే చోరగుడి హనుమంతరావుగారు ఆ పాడడం విన్నారు. "బాగుంది. బాగుంది. పాడవోయ్!" అని ప్రోత్సహించారు. కాని యువకుడు సిగ్గు పడ్డాడు; పాట పెగిలి రాలేదు.

తర్వాత రెండు నెలలకు తిరుపతి వేంకటకవులు బాపట్ల వచ్చి, అవధానాలు చేసి పౌరులను సంతోషపెట్టారు. వారి గౌరవార్థం హరిశ్చంద్ర నాటకం ప్రదర్శించదలచారు, ఆ నాటక సంఘంవారు. ప్రదర్శనం తీరా రెండు పూటలుందనగా చంద్రమతి పాత్రధారి జాడలేదు. నాటకం ఆగిపోయే దుస్థితి ఏర్పడింది. చోరగుడి హనుమంతరావుగారికి వెంటనే మన యువకుడు స్ఫురణకు వచ్చాడు. మరికొందరిని వెంట బెట్టుకొని, ఆ యువకుడు చదువుకుంటున్న ట్రయినింగు స్కూలుకు వెళ్ళారు. మధ్యాహ్నం రెండు గంటల వేళ. యువకుని అతని ఇంటికి కూడా వెళ్ళనివ్వకుండా పుస్తకాలతోసహా తమ సంఘానికి పిలుచుకుని వెళ్ళి, ఆపత్తు వచ్చిందని, ఎలాగైనా ఆదుకోవాలని కోరారు. యువకుడు ఏదో మామూలు పాత్ర కాబోలునని కొంచెం మొగ్గు చూపగా, చంద్రమతి వేషం అన్నారు. యువకునికి ముచ్చెమటలు పోశాయి. "ఆడవేషమా? మామయ్య మళ్ళీ గడప తొక్కనిస్తాడా? వెయ్యనంటే వెయ్యను" అని భీష్మించుకున్నాడు. సంఘం వారంతా గంటసేపు బ్రతిమాలగా, నాటకం ఆగిపోయి తలవంపులవుతుందని ప్రాధేయపడగా, ఒప్పుకున్నాడు. అయినా, బెరుకుగానే ఉంది, మామయ్య ఏమంటాడో అని.

మరుసటి రోజు పొద్దుగూకగానే,ఆ యువకుడు హరి కథకు వెళ్ళుతున్నానని అమ్మతో అబద్ధమాడి నాటక సంఘానికి బయలుదేరాడు. నాటక సంఘం నేపథ్యశాలలో గ్యాసులైటు ముందు మూగి, నటులు వేషాలు వేసుకుంటున్నారు. అక్కడికి వెళ్ళి వేషం వేసుకోడానికి భయమయింది యువకునికి, మామయ్య వచ్చి చూస్తాడేమోనని. కనుక ప్రొప్రయిటరు ఇంట్లోనే వేషం వేసుకున్నాడు. ప్రొప్రయిటరు చెల్లెండ్లు వేషధారణలో తోడ్పడ్డారు. యువకుడు అదివరకే చిత్రలేఖనంలో కొంత కృషి చేసినవాడు. కనుక చంద్రమతి పాత్ర ఎలా ఉండాలో మననం చేసుకుని, తదనుగుణంగా సింగారించుకున్నాడు.

నాటకం ప్రారంభమయింది. హరిశ్చంద్ర పాత్రధారి హనుమంతరావుగారు ముందు రంగంలో అడుగుపెడుతూ, "దేవీ, ఇటురమ్ము" అన్నారు. కాని, ఆ దేవి సభాకంపంతో కంపించి పోతున్నది. ఎదుట మామయ్య. (ఆయనమాత్రం 'చంద్రమతి గాడు రాలేదే? ఎవడురా. ఈ కొత్తవాడు' అని ఆలోచిస్తున్నాడు.) అడుగులు ముందుకు పడడం లేదు. ప్రొప్రయిటరు యవనిక అవతలి నుంచి ఒక్క తోపు తోశాడు యువకుణ్ణి. దభీమని కుప్పగా కూలుతూ రంగంలో ప్రవేశించాడు యువకుడు. అడుగులోనే హంసపాదు! యువకుని గాభరాను కప్పిపుచ్చడానికి హరిశ్చంద్రుడు "దేవీ! ఇది మహారణ్య ప్రాంతమని తెలియవా? రాయి, రప్ప కాలికి తగులవా? ముందు దారి చూచి నడువుము" అని అన్నారు. యువకుడు కొంచెం తేరుకున్నాడు. కాని, ఒక రాగం మొదలు పెడితే, మరొక రాగం పలుకుతున్నది గొంతు. కడపటి సీనులో భయం సహజతను చేకూర్చింది. ప్రేక్షకులు మెచ్చుకున్నారు. నాటకం సమాప్తమైంది. తిరుపతి వేంకటకవులు ఆశువుగా యువకుని ఆశీర్వదించారు.

"తెల్లవారితే నాటకమనగా, తెల్లవారుజామున ఒక కల వచ్చింది. ఆ కలలో నారింజ పండు రంగుగల ఒక పొగ దొర్లుతూ వచ్చి, స్త్రీ రూపం దాల్చింది. ఆ రూపం ఆ పొగనే వస్త్రంగా చుట్టుకుంది. నన్ను సమీపించింది. నా చేతులు పట్టుకుని, నన్ను వీపు మీద వేసుకుని, పైకి వెళ్ళిపోయింది. భయంతో కళ్ళు తెరిచాను. రొమ్ము మీద దిండు ఉంది. మళ్ళీ కళ్ళు మూసుకుంటే కల రాలేదు. అదేదో పరాశక్తి నన్నావేశించింది. ఇది నా శక్తి కాదు. ఎన్ని జన్మల కృషో! ఆ శక్తి నా భవిష్యత్తును చూపినట్టుగా భావిస్తున్నాను" అన్నాడు నాటకం ముగిసిన తర్వాత యువకుడు. ఆనాటి ఆ యువకుడే, నాటి నుంచి నేటి దాకా స్త్రీ పాత్రలలో నాటకరంగాన్నే ఏలి, నవనవోన్మేష నటన శబలతతో భరత శాస్త్రానికే మెరుగులు దిద్దిన శ్రీ స్థానం నరసింహారావుగారు.

శ్రీస్థానం నరసింహారావుగారు 1902 సెప్టెంబరు 23వ తేదీన బాపట్లలో జన్మించారు. బాపట్లలోనే స్కూలుఫైనలు దాక చదివారు. చిన్ననాటినుంచే వారికి సంగీతమన్నా, ప్రాచీన సాహిత్యమన్నా, చిత్రకళ అన్నా అభిరుచి ఉండేది. ప్రబంధాల లోని పాత్రలను ఊహించుకొని, రంగు రంగుల బొమ్మలు గీస్తూ సాధన చేసేవారు రహస్యంగా. 19 ఏళ్ళు వచ్చేవరకు చిత్రకళలో, ముఖ్యంగా "ఇంటెరిమ్ పెయింటింగు"లోను (వర్తమాన చిత్ర కళలోను), ఫొటోగ్రఫీలోను ఒక స్థాయిని సాధించారు. ఈ సాధన వారికి ఉత్తరోత్తరా పాత్ర కల్పనలో, పాత్రల ఆకల్పనలో ఎంతో ఉపకరించింది. 16వ ఏటనే తండ్రి హనుమంతరావు గారు పరమపదించడం వల్ల వారిని మేనమామ శ్రీ కామరాజు వేంకట నారాయణగారు ఆదుకున్నారు; తర్వాత ఆయనే మామ గారూ అయ్యారు. వారు నాటక ప్రియులు, నటులూను. కనుక స్థానంవారి లలిత కళాభిరుచికి దోహదమిచ్చి, లలితకళాభి వ్యక్తికి రూపు తీర్చారు.

చంద్రమతి వేషధారణతో, తిరుపతి వేంకటకవుల ఆశీః ప్రభావంతో స్థానంవారి జీవితస్థాయే మారింది. బోధనా భ్యసన పాఠశాలలో చదివి, సామాన్యోపాధ్యాయులుగానో, చిత్రకళోపాధ్యాయులుగానో మనుగడ గడపదలచిన స్థానం వారికి చంద్రమతి తాము వర్ణరంజితులై, ఇతరుల హృదయాలనూ రంజింప జేయాలనే తీవ్ర కాంక్షను కలిగించి, జీవితాన్నే చంద్రమయం చేసింది. వారి కాంక్ష ఫలించింది. తెనాలిలోని 'కృష్ణ హిందూ థియేటర్స్' అనే నాటక సంఘంలో 25 రూపాయల నెలజీతంపై స్త్రీ పాత్రధారి ఉద్యోగం దొరికింది. ఆ కాలంలో 25 రూపాయలు చిన్న జీతమేమీ కాదు. అక్కడ వారు ఆరు నెలలే పనిచేసినా, నిర్వహించిన యశోద, లీలావతి, మోహిని పాత్రలు వారికి ఎంతో కీర్తి తెచ్చాయి. తర్వాత వారు తెనాలిలోని 'రామ విలాస సభ'లో చేరారు. కొంతకాలం పిదప దానికి నిర్వాహకులూ అయి, తమతోపాటే, ఆ సభ యశస్సునూ దిగంతాలకు విస్తరింపచేశారు.

అప్పుడు రామ విలాస సభ యజమానులు భాగవతుల కుమార రాజగోపాలంగారు. నాట్యోపాధ్యాయులు త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారు. చిత్ర, నేపథ్య కళోపాధ్యాయులు వజ్జ బాబూరావుగారు. నటులేమో మాధవపెద్ది వేంకట రామయ్య, పులిపాటి వేంకటేశ్వరులు, గోవిందరాజుల వేంకట సుబ్బారావు, పెద్దిభట్ల వేంకటాచలపతి, పిల్లలమర్రి సుందరరామయ్య, ళింగమూర్తి వంటి హేమాహేమీలు. స్థానం వారు ఈ సభలో రోషనార, సత్యభామ, చిత్రాంగి, ముర, మధురవాణి, రాణి సంయుక్త, సుభద్ర పాత్రలు ధరించి, సభ విలాసానికే వన్నెలు తెచ్చారు.

సభ శిక్షణ ప్రాచీన సాంప్రదాయాన్ని అనుసరించే ఆధునికంగా ఉండేది. నాట్యశాస్త్రకారులు నిర్వచించిన రసానుగుణమైన వాక్యాభినయం, భావానుగుణమైన శబ్దోచ్చారణ, తగినంత సంగీతం, పాత్రోచితమైన ఆహార్యాంగికాభినయం నిర్వహించి, సామాజికులను రంజింపజేయడం ఈ సభ ఆదర్శం. "అందులోను వీరరాఘవస్వామిగారి శిక్షణ కత్తి మీది సాము. ప్రతిదానినీ వారు నిశితంగా చూచేవారు. గోవిందరాజుల సుబ్బారావు ఒకమారు గంతులు వేశాడు. 'ఏమిటా కుప్పిగంతులు?' అని స్వామిగారు చీదరించుకున్నారు. ప్రతినాటకం తర్వాత మరునాటి సాయంకాలం విమర్శ గోష్ఠి జరిగేది. నాటకంలో తప్పుచేసేవారికి జరిమానా వేసేవారు. సుబ్బారావు కూడా జరిమానా తప్పించుకోలేదు. నాకు ఎప్పుడూ ఫైన్ పడలేదు. అందరూ అసూయతో కాచుక్కూచున్నారు. ఒకమారు మూడు రాత్రులు వరుసగా నాటకాలు వేశాము. మూడోరోజు కృష్ణతులాభారం. నారదుడు సత్యభామతో సంభాషిస్తున్న ఘట్టం. అసలే అలసి ఉన్నాను. నారదుడు చెబుతుండగా ఆవులించాను. మరునాటి విమర్శ గోష్ఠిలో 'అంతటి మహాముని చెబుతూంటే, అగౌరవంగా ఆవులిస్తావా? తప్పు' అన్నారు అందరూ. సత్యభామ సౌభాగ్య గర్వం, అజాగ్రత్త చూపడం అవసరం గనుక ఒప్పే అని సమర్థించుకున్నాను. స్వామిగారూ అంగీకరించారు. నటుల సూచనలూ వారు తీసుకునేవారు. తర్వాత ఆంధ్రప్రభలో నేను 'ఆనాటి నా ఆవలింత' అనే వ్యాసం వ్రాశాను" అన్నారు స్థానంవారు.

స్థానంవారు వివిధ రాష్ట్రాలలోనే కాక, బర్మా మొదలయిన

విదేశాలలోను తమ నాటక సంఘంతో పర్యటించి, తమ నటన నైపుణితో జనాన్ని ముగ్ధులను చేశారు. మగవారు ఆడవేషం వేయడమేమిటి ఖొజ్జావారిలాగ అని ఆక్షేపించిన వారినీ తలలూపేట్టు చేశారు. నవ్వమని మూతి ముడుచుకొన్నవారిని విరగబడి నవ్వేట్టు చేశారు. ఏదో వంక దొరికేనా అని వేచి ఉన్నవారిని కలకాలం వేచి ఉండేట్టే చేశారు. అచ్చపు ఆడదని ఆడవారే భ్రమిసేట్టు చేశారు. ఆంధ్ర నాటక కళాపరిషత్తును ఒకమారు ప్రారంభించారు, ఒకమారు అధ్యక్షత వహించారు. 'నటకావతంస', 'ఆంధ్ర బాలగంధర్వ', 'నటశేఖర' ఇత్యాద్యనేక బిరుదాలు పొందారు. అసంఖ్యాక స్వర్ణ రజత పతకాలతో, స్వర్ణ కిరీటాలతోను అలంకృతులయారు. సంగీత నాటక అకాడమీ వారిని 'కళాప్రపూర్ణ'లను చేసింది. భారత ప్రభుత్వం 1956లో 'పద్మశ్రీ'తో భూషించి, హైదరాబాద్ రేడియో కేంద్రం నాటక ప్రయోక్తగా నియమించింది.

స్థానంవారు తమ 38 సంవత్సరాల నటజీవితంలో దాదాపు 16 వందల ప్రదర్శనలు జరిపారు. ఏ పాత్రనైనా సాటిలేని రీతిగ చూపారు. ముఖ్యంగా చిత్రాంగి, మధురవాణి, సత్యభామ, సుభద్ర, ముర, రోషనార పాత్రలను ఎంతో అధ్యయనం చేసి, ప్రదర్శించారు. సాహిత్య చరిత్రలను తిరగవేసి, ప్రాచీన శిల్ప చిత్రాలను పరిశీలించి, గంటల తరబడి ఒంటరిగా మననం చేసుకొని, వేషం దిద్దుకొని కాని రంగం మీదికి వచ్చేవారు కారు. ప్రతి పాత్రను వివిధ సన్నివేశాలలో ఊహించి, వివిధ స్త్రీ ప్రవృత్తులను ఆకళించుకొని నటించారు. వారి వేషం ప్రేక్షకులనే కాక సాటి నటులను, చిన్ననాటి మిత్రులను కూడా భ్రాంతి గొలిపిన ఘట్టాలు వందలు. 'రుస్తుం' అన్న నినాదం విన్న సోహరాబ్ దిగ్భ్రాంతుడయి అస్త్రసన్యాసం చేసినట్టు రంగ స్థలంమీద వారి నటనను చూచి పెదవి ఆడని, కాలు కదపని సాటి నటులను వారు సమయస్ఫూర్తితో లాలించి, ప్రోత్స హించిన సందర్భాలు అనేకం. ఇప్పటిలాగ అప్పుడు మైకులు ఉన్నాయా? అతి సున్నితమైన గుసగుసలను (విస్పరింగును) కూడా వాచికంలో పలికించేవారు.

స్థానంవారిలోని మరొక శక్తి విశేషం తమ అనుభూతులను, అనుభవాలను వివరించగల, నటనను సమర్థించగల, రచనను స్వాధీనం చేసుకోడం. వారు చక్కని శైలితో నాటకాలను గురించి, నటనను గురించి పెక్కు వ్యాసాలు వ్రాశారు. 'మోహినీ రుక్మాంగద', 'కృష్ణదేవరాయలు' మొదలయిన నాటకాలూ రచించారు. 1953 నుంచి తెనాలిలో 'నాటక కళాస్థానం' అనే సంస్థ నెలకొల్పి నిర్వహిస్తున్నారు.

స్థానంవారు పురుష పాత్రలు కూడా ధరించేవారంటే ఎవరైనా నమ్ముతారా? నమ్మక తప్పదు మరి! కాని, వారు వేసింది ఒకే ఒక మగవేషం - అదిన్నీ ఒకసారి - నారద వేషం, 'రాధాకృష్ణ' నాటకంలో. వారి చిత్రాంగిని, మధురవాణిని, సత్యభామను చూచిన కండ్లతో గడ్డాలు, మీసాలు లేక సిగకు, ముంజేతులకు, మణికట్టులకు మల్లెదండలు చుట్టుకుని తంబురా మీటుతూనో వచ్చే నారద వేషం చూస్తే ఎలా ఉంటుంది?

సినిమాలవల్ల నాటకాల విలువ తగ్గుతుందేమో? - అని అనుమానించే ప్రాణులను చూస్తే వారు మధురవాణి లొటిపిట్ట నవ్వు నవ్వుతారు. విదేశాలలో ఉన్నట్టు నాటక సంఘాల ఉద్ధరణకు, నాటక కళా విస్తృతికి కళాశాలలు, మంచి జట్టు (ట్రూప్) ఉంటే నాటకాల విలువ ఎప్పుడూ తగ్గదని వారి నిశ్చయం.

"ఏది వినిపించడానికైనా భాష ముఖ్యం. అది జటిలంగా ఉంటే ఏమిటి ప్రయోజనం? ఇక మన తర్వాతి మెట్టు వాచికం లేకుండా, మాట లేకుండా, భాష లేకుండా అభినయించడమే" అని వారి భవిష్యద్వాణి.

స్థానంవారు దేవ్యుపాసకులు. తెల్లవారే స్నాన సంధ్యాదులు నిర్వర్తించి, దేవిని ఉపాసిస్తారు. "చేసిన పాపాలు చాల ఉన్నాయి. ఈ విధంగానైనా పాపపంకం క్షాళిత మౌతుంది" అని వారి విశ్వాసం. తర్వాత వారు మిత్రులతో గోష్ఠి జరిపి, రేడియో స్క్రిప్టులు చదువుతారు. నాటక సంఘాలవారికి సలహాలిస్తారు. తర్వాత రేడియో కేంద్రంలో పని. వారి భాగ్య విశేషం సహస్ర మాస వృద్ధురాలయిన వారి మాతృశ్రీ ఆదెమ్మగారు వారి అభ్యుదయాన్ని తిలకిస్తూ ఉండడం.

వారు 'నటస్థానం' అన్న శీర్షికతో తమ నటనానుభవాలను వ్రాయదలచారు. ఆ గ్రంథం యువనటులకేకాక, సాహిత్యంలోను కళాదీపంగా ఉండగలదనే నా నమ్మకం.*

"మృదు మధూక్తుల రాశి మా మధురవాణి
నిత్య శక్త్యాత్మగౌరి మా సత్యభామ
అస్థిరాంగ లక్ష్మి మా చిత్రాంగి వనిత
లేకమై పుష్పమాలగ నెసగుత"

- మని సన్నుతిగన్న స్థానంవారు శ్రీ వేలూరి శివరామ శాస్త్రులుగారు ఏనాడో అన్నట్టు భావశబలతకు పెట్టిన పేరు. దానిని సమగ్రంగా రచించినవాడు కాళిదాసు; నటించినవారు స్థానంవారు.

* నటస్థానం పేరుతో స్థానంవారి స్వీయచరిత్ర అచ్చైంది.



దాదాపు ఏడు దశాబ్దాల నాటి మాట. స్వాతంత్ర్యోద్యమం అప్పుడే ఊపు అందుకుంటున్న రోజులు. శ్రీబాగ్, ఆంధ్రపత్రిక కార్యాలయం, ఆంధ్ర మహాసభ మొదలయిన ప్రాంతాలు స్వాతంత్ర్య సమరయోధుల కలకలం ముమ్మరంగా వినిపించే స్థలాలు. ఈ ప్రాంతాలంతటా నవ యువకుడొకడు ఒంగోలు ఖద్దరు దోవతీ - కుర్తాలతోగాని, చుడీదార్ పైజామా - అచ్కన్ లతోగాని తరచూ కనిపించేవాడు. అందగాడు, సౌమ్యుడు, సంగీతజ్ఞుడు, సువాసనలు వెదజల్లుతూ కనిపించేవాడు. పెద్దన వరూధిని ఉనికిని 'మగువ పొలుపు తెలుపు నొక్క మారుత మొలసెన్' అని సూచించాడు. ఆ యువకుని పొలుపు తెలిపే చందనాది తైలసౌరభం అల్లంత దూరం నుంచే వీచేది. "అదిగో శేషయ్యగారు! వస్తున్నారు శేషయ్యగారు!! ఆ సుగంధం అదే!!!" అని జనం సుగంధాలు వీచేవైపు తలలు తిప్పి చూచేవారు.

"వస్త్రేణ వపుషా వాచా
విద్యయా వినయేన చ
వకార పంచభిః హీనః
నరో నాయాతి గౌరవమ్"

శుభ్రమైన మంచి దుస్తులు, శుభ్రమైన సౌష్ఠవం గల శరీర యష్టి, మంచి పలుకు - ప్రవర్తన, సరైన చదువు - సందెలు, వీటికన్నిటికీ బంగారు మలామా వంటి వినయం అనే ఈ వకార పంచకం లేని వ్యక్తి గౌరవం పొందలేడు సమాజంలోనని - అన్నారు పెద్దలు. వీటిలో ఏవో కొన్ని ఉన్నా మర్యాదగా గడిపేయవచ్చు. ఐదూ ఉంటే అపరంజికి తావి.

ఈ తావియే శేషయ్యగారిది. శేషయ్యగారు స్వయం సుందరులు. ఒంగోలు లేత వంగపండు ముతక ఖద్దరు పోషాక్ లో మరీ మెరిసిపోయేవారు. సౌమ్యంగా మాట్లాడేవారు. ఆయన బహిరంగంగా ముఖం చిట్లించుకోవడం నేను చూడలేదు. నాతో వాదవివాదాలు వచ్చినపుడు నేను రెచ్చిపోయేవాడిని గాని, ఆయన వాదబలంతో నాకు నచ్చజెప్పడానికే ప్రయత్నించేవారు శాంతంగా. ఇక చదువంటారా! ఆయన పట్టుగా పల్లెకూటంలో చదివింది మెట్రిక్యులేషనే. కానీ ప్రపంచ పాఠశాలలో చదివింది అపారం, ఆకళించుకుంది అనంతం. ఎదుటి వాడిని బోల్తా

కొట్టించి వినమ్రుణ్ణి చేసేది ఆయన వినమ్రత. అందుకే ఆయన చుట్టూ అంత జనం, ఆయన రాకకు అంత నిరీక్షణ!



ఆయనకు మాటలకన్నా మందహాసాలే ఎక్కువ. వానిలో ఎన్నో అర్థాలు అందంగా వెలిసేవి. కాళిదాసు అజమహారాజును మేల్కొల్పే ఘట్టంలో -

"తామ్రోదరేషు పడితంద్రుమ వల్లవేషు
నిర్ధేతహార గుళికా విశదం హిమాంభాః
ఆ భాతి లబ్ధ పరభాగతయాధరోష్ఠే
లీలాస్మితం సదశనార్చి రివ త్వదీయమ్."

'అజ మహారాజా! ఎర్రని పొట్టల పల్లవ పుటాలలో పడిన, కడిగిన ముత్యంలాంటి మంచుబొట్టు చక్కని పలు వరుస కాంతితో నీ పెదవిపై మెరిసే మందస్మితంలాగా ఉంది సుమా!' అని అన్నాడు. శేషయ్యగారి మందహాసం నాకు ఈ కాళిదాసు శ్లోకాన్ని స్మరింపజేసేది ఎప్పుడూ.

అప్పటి తెలుగు పత్రికా రచయితలకు ఎవరికీ లేని, ఆయనకు ప్రత్యేకంగా ఉన్న అర్హత - తెలుగు షార్ట్‌హ్యాండ్ యోగ్యతాపత్రం కలవారు.

అదీ నాకు ఆయన పట్ల ప్రత్యేక గౌరవానికి గల కారణం. ద్వితీయ ప్రపంచ యుద్ధ సమయంలో ఆయన 'ఆంధ్రపత్రిక' ప్రత్యేక ప్రతినిధిగా ఆగ్నేయాసియా దేశాలలో పర్యటించి యుద్ధ వార్తలు పంపారు. నాకు ఆయన బాగా పరిచయమైన తరువాత ఎన్నో సార్లు అడిగాను. షార్ట్‌హాండ్ తరగతులు నిర్వహించండని. ఆయన ఒప్పుకునేవారు కారు. "అది పాత పద్ధతి. ఇప్పుడు మక్కీకి మక్కీ రిపోర్టింగ్ అవసరం లేదు. అంతేగాక టేప్ రికార్డర్, డిక్టాఫోన్ వంటివి వచ్చాయి. షార్ట్‌హ్యాండ్ అనవసరం" అనేవారు.

మద్రాసులో 1930 ప్రాంతాలలో 'ఆంధ్రనాటక కళాపరిషత్' సభల సందర్భంగా శేషయ్యగారు ఆంధ్రపత్రికలో పనిచేస్తూనే 'నాట్యకళ' అనే త్రైమాస పత్రికను ప్రారంభించి, దానికి సంపాదకత్వం వహించారు. 1945లో ఆంధ్రపత్రికను వదలిన తర్వాత 'నవోదయ' అనే వారపత్రికను దాదాపు నాలుగు సంవత్సరాలు ఉదాత్తంగా నడిపారు. 1980లో 'ఆంధ్రప్రభ'లో ఎడిటోరియల్ రైటర్‌గా చేరారు. అప్పుడాయనతో బాగా సన్నిహిత్వం ఏర్పడింది. ఆయనకు మొదటి నుంచి ఉన్న ఆంధ్ర మహాసభ సంబంధం కొన్ని దశాబ్దాలు కొనసాగింది. ఆంధ్ర మహా సభ సన్మానితులకు సన్మాన పత్రాలు కొన్ని శేషయ్యగారి ఆదేశం పై వ్రాసే భాగ్యం నాకూ కలిగింది.

'ఆంధ్రప్రభ'లో ఉన్నప్పుడు నార్లగారితో ఘర్షణతో నేను రాజీనామా యిచ్చాను. నార్లగారు అప్పుడు రాజ్యసభ సభ్యులు. ఢిల్లీలో ఉన్నారు. ఆయన వచ్చేలోగా వెళ్ళిపోదామని నా ఆత్రం. కనుక రాజీనామా శేషయ్యగారికి అందజేశాను. వారమైంది. ఉలుకూ లేదు, పలుకూ లేదు. నాకు సహజమైన కోపతాపాలతో ఆయనను నిలదీశాను. "మీరు ఎట్లాగూ పోతున్నారు. మీకేమైనా



రెండు డబ్బులు లాభిస్తాయేమో అని నా ప్రయత్నం" అన్నారు ఆయన. నేను చప్పగా చల్లారిపోయాను. ఆయన ఉపకార వారస్యం, సౌమ్యతా, పరాకాష్ఠకు ఇదొక తార్కాణం.

శేషయ్యగారు మొదటి నుంచీ పెద్దస్వాప్నికులు - ఆ స్వప్నాలలో రెండు పెద్దవి. ఒకటి రామదాసు ధ్యానమందిర నిర్మాణం - రెండవది వాగ్గేయకార వార్షికోత్సవం ఏర్పాటు. ఆశ్చర్యమేమిటంటే ఆ రెండు కలలూ నిక్కలలు కావడంలో నాకు కూడా ఉడుతా సేవకు అవకాశం కలుగడం.

శేషయ్యగారు పరమలౌక్యులు, కాని వారి లౌక్యం ప్రశాంత గంభీరం, పరోపకార పరాయణం. భద్రాద్రి రామాలయ పునరుద్ధరణకు నిధి సేకరించాలనుకున్నారు. ఆంధ్రప్రభకు రాయలసీమ కరవు కాటకాలకు, తుఫాను వరద బాధితులకూ నిధులు సేకరించిన కీర్తి ఉండనే ఉంది. కాని, దేవాలయం అనగానే మత మౌఢ్యం ప్రచార మవుతుంది. పత్రిక దెబ్బతింటుంది - అని పలువురు శంకించారు. శేషయ్యగారు శ్రీ గోయెంకా గారి అనుమతిని మహాలౌక్యంతో పొందారు. దీనికి.... ఢిల్లీలోని శ్రీ రామనాథ గోయెంకాకు ఆఫీసు టెలిప్రింటర్ మీదనే ఇలా వార్త పంపించారు. "ప్రసిద్ధ రామక్షేత్రమైన భద్రాచలం దేవాలయ పునరుద్ధరణకు, ఆంధ్రప్రభ ద్వారా నిధి సేకరించబోతున్నాను. దయజేసి మీ విరాళం ప్రకటించండి" అని. కోరింది అనుమతి కాదు విరాళం, ఇదే లౌక్యం.

శ్రీ గోయెంకా గారు మీన మేషాలు లెక్కించే మనిషి కాదు. "తగినంత మొత్తం వసూలు చేయగలమని మీకు ధైర్యం ఉంటే అలాగే కానివ్వండి. నా వంతు ఐదు వేలు" అని సమాధానం నిముషాల్లోనే వచ్చింది.

ఈ నిధి దాదాపు రెండు లక్షలు చేకూరింది. ఆయనే అన్నట్టు - "ఎవరో కొందరు నిత్య శంకితులు అనుమానించినట్టు కాక ఈ నిధి సేకరణవల్ల 'ఆంధ్రప్రభ' పేరు ప్రతిష్ఠలు పెరిగినవే కానీ తరగలేదు... హిందువులు మాత్రమే కాక కొందరు ముస్లిములు, క్రైస్తవులు కూడా నిధి సేకరణకు సహాయపడ్డారు.

ఈ మొత్తాన్ని శేషయ్యగారు భద్రాచలం రామాలయ జీర్ణోద్ధరణ సంఘాధ్యక్షులు శ్రీ కల్లూరు చంద్రమౌళిగారికి అందచేశారు. 'ఆంధ్రప్రభ' ద్వారా మీరు సమకూర్చి పెట్టిన డబ్బు కంటే అంతశ్చేతనను కదిలించేట్టు మీ పత్రిక ద్వారా రాష్ట్ర ప్రజలకు మీరు చేసిన ప్రబోధ ప్రచారాలు నూరింతలుగా మాకు సహాయపడినవి. మీరు వసూలు చేసిన డబ్బును మొత్తం నిధిలో

చేర్చడం లేదు. దానిని ఏ విధంగా వినియోగించాలో మీరే నిర్ణయించండి" అని శ్రీ చంద్రమౌళిగారు ఆ బాధ్యతను శేషయ్యగారి మీదే పెట్టారు.

తిరువయ్యారులో త్యాగరాజు పేరిట చక్కని స్మారకభవనం వెలసింది. త్యాగరాజు వంటివారే ప్రహ్లాద నారదాదుల కోవకు చెందిన పరమ భాగవతోత్తముడని ప్రస్తుతించిన రామదాసుకు ఆంధ్రదేశంలో గోదావరీ తీరంలో ఆదర్శప్రాయమైన స్మారక మందిరాన్ని నిర్మించడం సముచితమని శేషయ్యగారికి తోచింది. వెంటనే స్థలం కోసం అన్వేషించారు. జీర్ణోద్ధరణ సంఘం సభ్యులు శ్రీమాన్ ఎస్.టి.జి. వరదాచార్యులవారితో కలిసి రంగ నాయకుల గుట్ట ఎక్కారు. "ఆ గుట్ట పైకెక్కి నలుదిక్కులూ కలయ జూతును గదా! నా కొక విధమయిన తన్మయత కలిగింది. కొండ కొమ్మున నిలిచి కిందికి చూస్తే అర్ధ చంద్రాకారంగా ప్రవహించే గోదావరీ మహానది, తల ఎత్తి తిలకిస్తే శ్రీరామచంద్ర ప్రభువుకు ఛత్రం పట్టినట్టు నిర్మల నీలాకాశం, ఒక వైపున ఆనాడు గోపన్నగారు నిర్మించిన గోపుర ప్రాకార మండపాలు, వేరొక వైపున కంటి కింపైన పచ్చని చేలు. అతిలోక సుందరమైన ఆ వాతావరణాన్ని చూసినప్పుడు అది రామపద రాజీవ రేణువులచే పావనమైన ప్రదేశమే అయి ఉండాలని తోచింది" - ఆయనకు.

అక్కడే 1962 జనవరి 5వ తేదీన ఆనాటి ఉప రాష్ట్రపతి, వేద వేదాంత విద్యాపారీణుడు డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు రామదాస ధ్యానమందిరానికి శంకుస్థాపన చేశారు.

ఆ శంకుస్థాపన మహోత్సవం విశిష్టమైన గొప్ప సంఘటన. రాధాకృష్ణన్ ప్రసంగం వినడం కోసం చుట్టు ప్రక్కల నుంచి వేలాది జనం వచ్చారు. భద్రాచలం నూరింతలు పొంగినట్లనిపించింది. దేశంలోని వివిధ పత్రికల ప్రత్యేక విలేఖరులు దాదాపు రెండు వందల మంది వచ్చారు. నేను శేషయ్యగారి వెంట వ్యానులో ఆ సభను కవర్ చేయడానికే వెళ్ళాను. అది నాకొక అగ్ని పరీక్ష. ఎడిటర్ స్వయంగా రిపోర్టరుగా, ఇంగ్లీషు, తెలుగు షార్ట్‌హ్యాండ్ తెలిసినవాడు. అనుభవజ్ఞుడైన వ్యక్తి. ఆయనను మెప్పించగలగాలి. రాధాకృష్ణన్ ఇంగ్లీషులో ప్రసంగం ప్రారంభిం చారు. ఎస్.టి.జి. వరదాచార్యులుగారు దానిని వెంటవెంటనే అనువదించాలని ఏర్పాటయింది. రాధాకృష్ణన్ రెండు నిముషాలు ప్రసంగించారు. దాని అనువాదం విన్నారు. ఆయనకు సంతృప్తి కలగలేదు. వరదాచార్యులుగారిని కూర్చోండన్నారు. తెలుగులో ప్రసంగించడం ప్రారంభించారు. అదే ఆయన తొలి తెలుగు బహిరంగ సభా ప్రసంగం, అదే చివరి ప్రసంగం. రాధాకృష్ణన్ బ్రహ్మసూత్రాలు, శంకర కృతులు, నారద భక్తి సూత్రాలు, పాశ్చాత్య తత్త్వవేత్తల భక్తుల సూక్తులు- అసంఖ్యాకంగా ఉదాహరిస్తూ గంటసేపు అనర్గళంగా వ్యావహారిక భాషలో ప్రసంగించారు. జనం విస్తుపోయారు. నేను యథా మూలంగా వ్రాసుకున్నాను. ఆనాడు నా చేతిని హనుమంతుడు ఆవేశించా డనిపించింది. యమవేగంతో వ్రాసుకున్నాను. (ఏమి స్వామీ-మీరూ, మీ శ్రీమతిగారూ ఎంతో అందంగా వున్నారు. మీ కుమారుడు అంద వికారంగా పుట్టాడే - అని మా నాన్నగారిని ఎవరో ఒకమారు అడిగారు - నేను తుంగభద్రాతీరంలో చక్రతీర్థంలో ఆంజనేయుణ్ణి ఉపాసించిన తరువాత పుట్టాడు మరి - అని ఆయన నవ్వుతూ సమాధానం చెప్పారు.) తక్కిన పత్రికల భాయిలకు ప్రసంగ సారాంశం నేనే చెప్పవలసి వచ్చింది.

సభ ముగిసి భోజనానంతరం మధ్యాహ్నం రెండు గంటలకు వ్యానులో బయలుదేరి రాత్రి పదకొండు గంటలకు విజయవాడ చేరుకున్నాము. సభా విశేషాలు - ముఖ్యంగా రాధాకృష్ణన్ ప్రసంగం వ్రాసి ముగించాను. ఒంటి గంట దాటింది. శేషయ్యగారు సరి చూశారు. దేశంలో ఏ పత్రికా కవరు చేయనంతగా ఆంధ్రప్రభ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ కవర్ చేశాయి.

రామదాసు ధ్యాన మందిరం ఏవో కారణాలవలన 1972కు గాని పూర్తి కాలేదు. "ప్రశాంత సుందరమై, ధ్యాన సాధనాల కనువై, అనల్ప శిల్ప కళాలక్ష్మికి ఆలవాలమై, ఆధ్యాత్మిక తేజో విలసితమై, రామచంద్ర ప్రభువుకు రత్న కిరీటమో అన్నట్లు శ్రీ రామదాసు ధ్యానమందిరం రూపుదాల్చింది. శిలాప్రకృతిలో జీవం పుట్టినట్టు మందిర ప్రాంగణంలో నిలువెత్తు రామదాసు శిలావిగ్రహం వెలసింది. మందిరకుడ్యాలపై ముత్యాల ముగ్గుల వలె రామదాసు కీర్తనల, దాశరథీ శతక పద్యాల ఫలకాలు అమరినవి" అని శేషయ్యగారు సంతోషించారు. 1972జూన్ నెలలో ఆనాటి రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు గారి నాయకత్వంలో ధ్యాన మందిర ప్రారంభో త్సవం జరిగింది. దానిని నేను 'ఆంధ్రప్రభ'కు ముఖ్యంగా 'ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక'కు కవర్ చేసి పంపే అవకాశం కలిగింది. (అప్పుడు నేను 'హైదరాబాద్ లేఖ' అని వార పత్రికలో వ్రాసేవాడిని)

ఈ విధంగా శేషయ్యగారి ఒక కల ఫలించింది. రెండవ కల కూడా త్వరలోనే నిజమయింది. అది ఏటా భద్రాచలంలో వాగ్గేయకార మహోత్సవం. అది ఎలా ఫలించిందీ ఆయన మాటలలోనే చదవండి - "1971లో భద్రాద్రి రామాలయ ధర్మకర్తల మండలికి అధ్యక్షులుగా ఎన్నికైన శ్రీ అల్లూరి మూర్తి రాజు గారి సన్మాన సభకు నేను అధ్యక్షత వహించాను... వాగ్గేయ

కార మహోత్సవాలలో ప్రాంతీయ విద్వాంసులంతా పాల్గొన వచ్చు. భక్తికీ, సంగీతానికీ భద్రాద్రిని యావద్భారతానికే కేంద్ర స్థానంగా చేయవచ్చు'' అన్నాను.

శ్రీ మూర్తిరాజు గారి ముఖం పద్మంలా వికసించింది. "శేషయ్యగారూ! ఇన్ని మాటలెందుకు? సంగీత విద్వాంసులను ఆహ్వానించి సభా కార్యక్రమాలను మీరు నిర్వహించండి. వారికి సౌకర్యాలు సమకూర్చి యథోచితంగా వారిని సత్కరించే బాధ్యతను మేము వహిస్తాము'' అంటూ బ్లాంక్ చెక్కు నాకు ఇచ్చారు.''

- ఇలా ఆయన రెండు కలలూ ఫలించాయి. మొదటి ఉత్సవం 1973 డిసెంబరు నెల చివర జరిగింది. తొమ్మిదవ ఉత్సవం సందర్భంలో విద్వత్సన్మాన ప్రత్యేక సంచిక వెలువ రించారు. దానికి నేనూ, నా మిత్రులు శ్రీ చాగంటి కపాలేశ్వరరావు గారూ తోడ్పడ్డాము.

తమ పెక్కు కలలతోపాటు ఈ రెండు పెద్ద కలలను నిక్కలలుగా చేసుకున్న శ్రీ శేషయ్యగారితో సహకరించి నేనూ కృతార్థుణ్ణయ్యాను.

శేషయ్యగారు సహజ శాంత గంభీరులు, సంపూర్ణంగా గాంధీజీ అనుయాయులు గనుక అందరితోనూ సరళంగానే ప్రవర్తించేవారు. ముఖ్యంగా సహోద్యోగులతో చాలా చనువుగా ఉండేవారు. అంత మాత్రాన ఆ చనువు దుర్వినియోగపరచే అవకాశమిచ్చేవారు కారు. కాళిదాసు దిలీపుని విషయంలో అన్నట్టు "అప్రధృష్యోభిగమ్యః'' ఆయనకు సంపాదకులుగా "టు హైర్ అండ్ ఫైర్'' అధికారాలున్నా ఎన్నడూ వాటిని ఆయన దుర్వినియోగం చేయలేదు. 'ఆంధ్రప్రభ'లో 1959లో సమ్మె తరువాత నార్లగారు తప్పుకోగానే శేషయ్యగారు సంపాదకత్వం వహించినప్పుడు ఇక "ఆంధ్రప్రభ మూత పడుతుంది'' అని కొందరు శంకించారు. అలాంటిదేమీ జరగలేదు. నార్లగారు గద్గద నదద్గోదావరిలాంటివారు. శేషయ్యగారు కాన్పూరు వద్ద ప్రవ హించే విశాలోదార గంగ వంటివారు. ఏదో నెమ్మదిగా ప్రవహి స్తున్నది కదా -అని దూకితో లోపలి వేగంతో కొట్టుకు పోవలసిందే.

శేషయ్యగారి పనితీరు హడావుడి లేని నిత్య కర్మ వంటిది. అంతా సవ్యంగా, ప్రశాంతంగా జరిగిపోయేది. ఆయన సహో ద్యోగులలో కొందరు - నిత్యోద్రేకులు ఆయనపై బుట్టల కొద్దీ, గుట్టల కొద్దీ ఫిర్యాదులు చేసినా వారి ఎడల ఎలాంటి వైషమ్యం, వైరస్యం లేకుండా ప్రవర్తించేవారు. ఆయన వారికి నచ్చజెప్ప డానికి ప్రయత్నించేవారు. యజమానులతోనూ ఆయన తీరు ఇదే.

అభిప్రాయ భేదాలకు అవకాశమివ్వని అపరంజి దోవ ఆయనది. దానికి ప్రధాన బలం సౌమ్యత, సానుభూతి. ఇవి ఆయన చిన్ననాటినుంచే దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, ప్రకాశం గార్ల వంటి చండ్ర ప్రచండులు, గొల్లపూడి సీతారామశాస్త్రిగారి వంటి శాంతి దాంతి ధనుల సహవాస, సాహచర్య, సహకార్య కర్తృత్వంతో అబ్బినవి. సంగీతం, నాటక రంగం కూడా ఆయన ప్రవృత్తికి వన్నె తెచ్చాయి. కనుకనే సహోద్యోగులు ఎంత తిరగబడినా, కొందరు అధికారుల బలంతో ఎగిరిపడినా చివరకు పిల్లికూనలయ్యేవారు.

ఆయన సహోద్యోగులకు ఇచ్చిన ప్రోత్సాహమూ అసమానం. నేను అప్పుడు మద్రాసులో ఉన్నాను. ఆంధ్రప్రదేశ్ పురాతత్త్వశాఖ డైరక్టరు, ఉస్మానియా విశ్వవిద్యాలయ చరిత్రాచార్యులు డాక్టర్ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు అమెరికాలో మరణించారు. శేషయ్యగారు ఆయన సేవలను వివరిస్తూ సంపాదకీయం వెంటనే క్రీడుపై వ్రాసి పంపమని నాకు సందేశం పంపారు. నేను అప్పటికప్పుడు పాత జ్ఞాపకాలు కూడగట్టుకుని ఏదో అయిందనిపించాను. ఉజ్జయినిలో జరిగిన కాళిదాసు సమ్మే ళనంపై సంపాదకీయం వ్రాశాను. సరిహద్దు సమస్యలు, ఇతర రాష్ట్ర సమస్యలు, సాహిత్యోద్యమాలు ప్రముఖ కవి పండిత పరిశోధకుల నిర్యాణాలు మొదలయిన వాటిపై సంపాదకీ యాలు వ్రాసే అవకాశం కలిగించారు. సహోద్యోగుల అభిరుచిని బట్టి, శక్తిని బట్టి వారిని ప్రోత్సహించడం ఆయన తమ విధిగా భావించేవారు.

నేను 'ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక'లో ఉన్నప్పుడు "మరపు రాని మనీషి'' మొదలయిన శీర్షికల నిర్వహణకు పరోక్షంగా ఆయనే బాధ్యులు. ఆయన రెండవ కుమారుడు శ్రీ నీలంరాజు మురళీధర్ 'ఆంధ్రప్రభ'లో అప్పుడు ఫొటోగ్రాఫర్. ఆయనతో కలిసి ప్రముఖులతో ముఖాముఖీ జరిపి ఆ శీర్షిక నిర్వహిం చాను. అది చాలా జనాకర్షకమైంది.

శ్రీ శేషయ్యగారు 1905లో జన్మించారు. 1992 జనవరి 16న హైదరాబాదులో కన్నుమూశారు. వృత్తి ధర్మాన్ని సత్య ధర్మంతో మేళవించి పత్రికారచనకు, మేధావిలసితాన్ని, లౌకిక ప్రజ్ఞా పాట వంతో మేళవించి, సేవా ధర్మానికి మెరుగులు పెట్టిన ఆ పత్రికా సుగతునికి ఇవే నా భాష్పాంజలులు.

శ్రీ నీలంరాజు వేంకట శేషయ్యగారు పరమపదించిన సందర్భంలో ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో వ్రాసినది.

# మరపురాని మహత్వం



## బందా కనకలింగేశ్వరరావు



**నా**టకాలకు కాణాచి అయిన నాటి బళ్ళారి. దాదాపు రెండు వందలమంది కాకలుతీరిన భరత శాస్త్రవేత్తలు, అలంకారికులు, ఆధునిక నాటక విమర్శకులు, నాటక కర్తలు, నటనధురీణులు సమావేశమయ్యారు. 'చిత్రనళీయం'లోని బాహుక పాత్రాభినయం సాగుతున్నది. పండితులందరూ తదేకదీక్షతో పరిశీలిస్తున్నారు. అభినేత చివరి వాక్యం ముగించారు. బళ్ళారి రాఘవ లేచి రంగస్థలం ఎక్కి, ఆ అభినేతను ఆలింగనం చేసుకుని, "చిరంజీవి కనక లింగేశ్వరరావు బాహుకుని నటన అద్వితీయం. ఇక నేను రిటైరు కావచ్చు సంతోషంగా. నా వారసుడు వచ్చాడు" అన్నారు. పండితుల కరతాళధ్వనులతో, వహవ్వా నినాదాలతో ఆ ప్రాంతమంతా హోరెత్తింది. తర్వాత రాఘవ "హిజ్ యాక్టింగ్ ఆఫ్ బాహుక హేజ్ టేకెన్ ఇన్‌స్పిరేషన్ ఫ్రం ది పాస్ట్ అండ్ ఈజ్ ఎ లెసన్ ఫర్ ది ప్యూచర్" అని ఆనాటి మద్రాసు మెయిల్ కు పెద్ద వ్యాసం వ్రాశారు కూడా.

ఆ అభినేత బాహుక పాత్రాభినయం తన సిద్ధిగా భావించే వారు. దానినే కాదు, ఏ పాత్రనైనా వారు అంత తన్మయత్వంతోను అభినయించారు. అభినయిస్తారు. అంత సాధనా చేశారు; చేస్తారు. నేడు వారి ఏకైక లక్ష్యం కూచిపూడి నాట్యకళా ప్రచారం; దానికి విశ్వ విఖ్యాతి చేకూర్చడం. ఇరవైనాలుగు గంటలూ వారి పని ఇదే. వారి వినోదమిదే. ఇదే వారి తపన; ఇదే వారి తపస్సు. వారు శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారు.

బందావారు జన్మించింది కృష్ణాజిల్లా కైకలూరు తాలూకా ఆటపాక గ్రామంలో 1907జనవరిలో. వారి తండ్రి శ్రీ శ్రీశైలం గారు కొల్లేటి లంకలకు కరణం. బందావారి విద్యాభ్యాసం



చిన్నతనంలో కొంతకాలం స్వగ్రామంలోను, ఏలూరులోను జరిగింది. తర్వాత బందరు నోబుల్ కళాశాలలో పట్టభద్రు లయ్యారు.

తల్లి శ్రీమతి సుందరమ్మగారి పుణ్యమా అంటూ పాట అంటే పసితనం నుంచే వారికి సరదా. మరి కళాశాల విద్యార్థి దశలో నాటకాలంటే ఉత్సాహం ఉద్బుద్ధం కావడంలో ఆశ్చర్య మేముంది? కళాశాల నాటక సమాజానికి అధ్యక్షులయారు. అప్పుడు, వారు తొలిసారిగా నాటకంలో రంగు పూసుకున్నది కృష్ణ వేషంతో. బావమరిది శ్రీ కొడాలి సుబ్బారావుగారు దుర్యో ధనుడుగా రాయబారం రంగాలు ఆడపాదడపా ప్రదర్శించేవారు. పిదప మద్రాసులో న్యాయ కళాశాలలో చదువుతున్నప్పుడు నాటక సంఘానికి కార్యదర్శి అయి, పెక్కు నాటకాలు ప్రదర్శిం చారు.

చెన్నపురిలోనే వారు మహానటులు కావడానికి తెన్నులు తీరాయి. చెన్నపురి ఆంధ్ర మహాసభలో బళ్ళారి రాఘవతో పాటు వేషాలు వేసే మహదవకాశం వారికి కలిగింది. వారి సారంగధర పాత్ర, రాఘవ రాజరాజ నరేంద్ర పాత్రః అలాటి కలయిక న భూతో న భవిష్యతి. 1934లో న్యాయవాది పట్టా పుచ్చుకొన్న తర్వాత, ఏలూరులో వకాల్తా ప్రారంభించి రెండేండ్లపాటు బాగా ఆర్జించారు. అప్పుడే, ఏలూరు తాలూకా బోర్డు సభ్యులుగాను ఎన్నికయారు. కాని, కళ వారిని ఊరుకోనివ్వలేదు; వారు 'ప్రభాత్ థియేటర్స్' అని సొంత నాటక సమాజం స్థాపించి, వివిధ నాట కాలు ఆడేటట్టు చేసింది.

ఆ రోజుల్లోనే వారి జీవితం మరొక మలుపు తిరిగింది. అది సినిమా మలుపు. రాఘవతో కలిసి 1935లో బొంబాయిలో 'ద్రౌపదీ మాన సంరక్షణ'లో కృష్ణ పాత్ర ధరించారు. ఆ పాత్ర ఆహార్యం కోసం సొంతంగా కిరీటం చేయించుకున్నారు. దానిని ఇప్పటికీ ధరిస్తారు. ఆ కిరీటం, ఒక ఉంగరం తమకు భాగ్యం తెచ్చిపెట్టాయని వారి నమ్మకం. ఆ నమ్మకానికి తగినట్టుగానే శ్రీ బెల్లంకొండ సుబ్బారావుగారు కృష్ణపాత్రధారణకు నిరాక రించడం వల్ల బందావారి కృష్ణునికి ప్రజాదరం హెచ్చింది.

అప్పటినుంచి పదేళ్ళపాటు సినిమా జీవితం సాగింది. సారంగ ధర, కాలచక్రం, జెమినీవారి బాలనాగమ్మ చిత్రాలలో నాయక పాత్ర, పాదుకలో భరత పాత్ర నిర్వహించారు. 1942లో భార్యా వియోగం సంభవించడంవల్ల, సినిమా వాతావరణం రుచించ నందుననూ చిత్ర ప్రపంచం నుంచి వైదొలగారు.

ఏలూరుకు తిరిగివచ్చి, ద్వితీయ వివాహం చేసుకున్నారు. సతీమణి పేరు శ్రీమతి కనకదుర్గమ్మగారు. ఆమె అడుగుపెట్టిన వేళా విశేషం బందావారికి కనకవర్షం కురియసాగింది. 'ప్రభాత్ థియేటర్స్' కార్యకలాపం తీవ్రతరం చేశారు. శ్రీయుతులు ఊటుకూరి సత్యనారాయణరావు, జంపన చంద్రశేఖరరావు, గబ్బిట వేంకటరావుగార్లచేత రంగస్థలానుగుణంగా పెక్కు నాట కాలు వ్రాయించుకొని ప్రదర్శించారు.యుద్ధకాలంలో నాటకాల వల్ల లక్షలు సంపాదించారు. బిల్వమంగళ పాత్రను సరికొత్తగా నటించారు. ఇరవై ఐదేండ్లపాటు నాటక సమాజం నడిపారు.

1955లో రష్యా, ఫిన్‌లెండ్, చెకొస్లొవేకియా మున్నగు దేశాలు



నావల్ల కాదు. గిరీశం వరకు వెళ్ళగలను. భవానీ శంకరపాత్ర నే వేయజాలను. ఆంజనేయులే మూతి, అశ్వత్థామ తోక వేయను" అంటారు వారు ఆవేశంతో.

"నా వేషంకన్నా మరొకరు ఎక్కువగా చేయ రాదు. అలా చేస్తే, ఆ వేషం కింద పెట్టవలసిందే. అంటే పరిణతి కోసం ప్రయత్నిస్తాను. ఎవరన్నా బాగా చేస్తే, నా తాళం చెవులు పక్కన పెట్టివేయ డమే" - ఇది వారి ప్రతిజ్ఞ. కంట్రాక్టు నాటకా లయినా, వారు తమ షరతులను వదలుకోలేదు.

బందావారు ప్రస్తుతం ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో నాటక ప్రయోక్తలు. వారికి ఏడుగురు కుమార్తెలు, ఒక కుమారుడు. వారు జీవితం నల్లేరు పై బండిలాగ నడిచిపోయే సంతుష్టాంతరంగులైన గృహస్థులు. పెక్కు గ్రంథాలు కృతి పుచ్చుకున్నారు. శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారు 'శశిదూతం' వారికి అంకితమిచ్చారు. బందావారు స్వగ్రామంలో శివాలయం నిర్మించి, తటాకం తవ్వించారు;

పర్యటించి, అక్కడి నాటకరంగాలు పరి శీలించి స్వదేశానికి తిరిగివచ్చిన తర్వాత కేంద్ర సంగీత నాటక అకాడమీ సభ్యులుగాను, డ్రామా స్కాలర్‌షిప్ కమిటీ ఎక్స్‌పర్ట్‌గాను, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ కార్యవర్గ సభ్యులుగాను నియమితు లయారు.

బందావారు పెక్కు వేషాలు వేశారు - కృష్ణుడు, బాహుకుడు, కాళిదాసు, బిల్వమంగళుడు, ప్రతాప రుద్రుడు, శ్రీనివాసుడు, కర్ణుడు, కణ్వుడు, రాముడు, అభిమన్యుడు, సారంగధరుడు, గిరీశం, సలీం, రఘునాథ్, అల్లూరి సీతారామరాజు, రామ శాస్త్రి - ఇంకా ఇంకా ఎన్నో. వాటికి సాక్షిగా గవర్నర్లు, మహారాజులు ఇచ్చిన పెక్కు సువర్ణ పతకాలు, రజత పాత్రలు, బిరుదులు ఉన్నాయి. కురుపాం రాజా వారిని "అభినవ కృష్ణ" అన్నారు. జయపురం మహా రాజా "నటశేఖర" అని సంబోధించారు. కాని, వారి అభిమాన పాత్రలు బాహుకుడు, కృష్ణుడు, బిల్వ మంగళుడు.

"అన్ని పాత్రలు నాకు ఇష్టమే. ఇష్టంలేందే ఏ వేషమూ వేయను. రౌడీ వేషాలు, విలన్ వేషాలు





వేదపాఠశాల స్థాపించారు. వారికి దుర్వ్యసనాలేమీ లేవు. తుదకు పొగైనా తాగరు; తమ్ములమైనా నమలరు.

వారికి కేవలం వాక్సానుభూతి గిట్టదు. ఆత్మను చంపుకొని, ముష్టి ఎత్తుకొని, కళాసేవ చేయడం వారి అభిమతం కాదు. "నా కళ చూపించాను. సంతోషించారు. నాకు డబ్బు ఇచ్చారు. నా పాత్రను తిట్టిన వారు ఎవరూ లేరు. అందరూ మెచ్చారు" అంటారు వారు.



నాటకం పైవారికనే వాదం వారికి నచ్చదు. "నాటకం పై వారికీ కాదు, కింది వారికీ కాదు. ఇద్దరికీ అనుకూలంగా సమన్వయించాలి. కళను, వ్యాపారాన్ని సమన్వయించాలి. ముప్పై ఏళ్ళ క్రితం నేను 'భగవద్గీత' ప్రదర్శించి అందరికీ రక్తి కట్టించాను."

ఇప్పటి నాటకరంగం పరిస్థితిపై వారికి చాల అసంతృప్తి ఉంది. నేటి నాటకరంగం పతనమైపోయిందనే వారి ఆవేదన. "(1) మానవత్వాన్ని పైకితెచ్చే నాటకాలు ఎవరూ వ్రాయడం లేదు. (2) పూర్వం నటులు ఆజన్మ నటులు, తపస్వులు. ఇప్పుడు మంచి నటులు రావడంలేదు. (3) ప్రేక్షకులకు మంచి అభిరుచి లేదు. వనస్పతి మిఠాయి అలవాటయితే నేతి మిఠాయి జీర్ణం కాదు. కమర్షియల్ రోజులలో చెడ్డ అభిరుచి కలిగించారు. ఇది జాతికి ద్రోహం. చెడ్డ నటుడు నటనకేకాక తన ఆత్మకూ ద్రోహం చేసుకుంటాడు. మంచి ప్రేక్షకులు కావాలంటే మంచి నాటకాలు వేయాలి. 4) నేడు మంచి విమర్శలూ లేవు. మంచి విమర్శ వచ్చినప్పుడే ప్రజాస్వామ్యం. మంచి నాటకాలు, మంచి నటులు, మంచి ప్రేక్షకులు, మంచి విమర్శలు - ఈ నాలుగూ ఉంటేనే, నాటకరంగం నాలుగు పాదాలపై నడుస్తుంది. మంచి నాటకాలు



బృందాన్ని యావద్భారతంలోను తిప్పుతూ చేస్తున్న ప్రచారం సాటిలేనివి. "ఐదేళ్ళవరకు కూచిపూడి వారికి డబ్బిచ్చి, ఆ సంప్రదాయంలో బాగా శిక్షణ ఇచ్చాము. ఇప్పుడు వారు బాగా నేర్చుకున్నారు. కష్టపడి ముష్టెత్తి సంపాదించిన రెండు లక్షల రూపాయలతోను, ఇతర సహాయంతోను కూచి పూడిలో సిద్ధేంద్ర కళాక్షేత్రం కట్టిస్తున్నాము" అని వారు జన్మ తరించినట్టుగా, నిండుగా,హాయిగా వర్ణిస్తారు.

నిజమే. సత్కార్యం చేసేవారికి ఎవరికైనా ఆసంతుష్టి, ఆ వాక్పుష్టి, ఆ నిండుదనం ఉంటాయి. జీవితమంతా నాటకానికి పణంగా ఒడ్డి, ఒకరికి తల వంచక, చేయి చాచక తాము తల ఎత్తుకుని తాము అభిమానించిన కళకూ ప్రతిష్ఠ చేకూర్చి సిద్ధసంకల్పులైన బందావారు సిద్ధేంద్ర కళాక్షేత్రాన్ని యావద్భారతానికే కాదు; యావత్ప్రపంచానికే మహత్తర కళాతీర్థంగా రూపొందించగలరనడం వారిని ఏమాత్రం తెలుసుకున్నవారికైనా కరతలామలకం.



వేయించి నేతి మిఠాయి తినిపించాలి. ఈ పని నేను ఒక్కణ్ణే చేయలేను" అంటారు వారు.

అయితే, "మీరు బిల్వమంగళుని వేషం వేసి నప్పుడు 'గుత్తి వంకాయ కూర' పాట పాడారు; పోనీండి. కణ్వుని వేషంలోను, కృష్ణుని వేషంలోను పాడారే! మీరు కూడా ప్రేక్షకులలో చెడ్డ అభిరుచికి దోహదం చేయలేదా?" అని ప్రశ్నిస్తే, "నేనేమి చెయ్యను? జనం వేలం వెర్రి. రాళ్ళు పడేయించు కోమంటారా?" అని వారు ప్రశ్నతో సమాధాన మిస్తారు.

ఏమైనా, వారి నటనా జీవితమంతా ఒక ఎత్తు; కూచిపూడి నాట్యసంప్రదాయ సముద్ధరణం ఒక ఎత్తు. 'కళాక్షేత్రం' అనే పేరుతో కూచిపూడి నాట్య పాఠశాల స్థాపించి చేస్తున్న కృషి, కూచిపూడి నాట్య



# మరపురాని మనీషి



## ఖండవల్లి లక్ష్మీరంజనం



కాదు, అనువైన చోట కూడ అధికు ఇని చెప్పు కోలేదు. పై అధికారులు రికార్డులలో ఎన్ని అవక తవకల ఎంట్రీలు చేసినా, వారు విద్యార్థుల హృదయాలు, విద్వాంసుల మన్ననలు చూర గొన్నవారు గనుక తొణకలేదు బెణకలేదు; మనసు చీకాకుపరచుకొని తగాదాలకు దిగలేదు; కర్తవ్య నిర్వహణలో ఏమరు పాటు చూపలేదు; ఆత్మవిశ్వాసం కోల్పోయి అధికారుల ఆదర కటాక్షానికి అంగలార్చలేదు. ఆనాడు వారు అన్యథాగా ప్రవర్తించిఉంటే, ఈనాడు ఉస్మా నియా విశ్వవిద్యాలయంలో తెలుగుకు ఇంతటి స్థానం లభించేది కాదు. తెనుగు భాషపై కూరిమే వారి ఓరిమికి కారణం.

ఇంతటి అభిమానధనులు, విద్యార్థి వత్స లులు అయిన ఖండవల్లివారు తూర్పు గోదావరి జిల్లా కొత్తపేట తాలూకా బెల్లంపూడి గ్రామంలో 1908లో జన్మించారు. బెల్లంపూడి సమీపం లోని ఊడుమూడిలో ప్రాథమిక విద్య, అమలా పురంలో రెండవఫారం ముగించారు. వారి జనకులు శ్రీ సూర్యనారాయణ శాస్త్రిగారు అప్పుడు వరంగల్లు మట్వెలవాడలోని త్రిలిం గాంధ్రాయుర్వేద కళాశాలలో సంస్కృత పండి తులు కావడం వల్ల ఖండవల్లివారూ వరంగల్లు కువచ్చి, హనుమకొండ హైస్కూలులో మూడవఫారంలో చేరి మెట్రిక్ ముగించి, 1924 లో రాజధానిలోని నిజాం కాలేజిలో ప్రవేశించి బి.ఎ.లో సంస్కృ తంలో విశ్వవిద్యాలయ ప్రథములుగా ఉత్తీర్ణులయారు. తర్వాత సిటీ కాలేజిలో ఇంగ్లీషు టీచరుగా పనిచేయసాగారు. 1936లో తెనుగు - సంస్కృతం ఎం.ఎ.లో ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణులై ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖలో లెక్చరరుగా చేరారు. శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి పదవీ విరమణ తరువాత ఆచార్య (ప్రొఫెసర్) పీఠం అధిష్ఠించి, నేటిదాక ఆ పీఠం అలంకరిస్తున్నారు.

వారికి విద్యార్థి దశ నుంచే శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారి వంటి పరిశోధకులతోను, 'గోలకొండ' పత్రికా సంపాదకులు సురవరం ప్రతాపరెడ్డిగారి వంటి ప్రజా, సాహిత్య సేవకులతోను, లోకనంది నారాయణగారి వంటి సాహిత్య పోషకులతోను పరి చయం కలిగింది. విశ్వవిద్యాలయంలో రెక్టార్ కిషన్‌చంద్ వంటి

సాహిత్య సార్థవాహులు కొందరు పట్టాభిషిక్తులకు, బరా యెనాం నవాబులకు బరాబరులు చేస్తూ, పొగడితల రగడలు రచిస్తూ, నిజాం ప్రభుత్వంలో పదవులు పట్టుకుని, ఎంతో అధి కారం ఉన్నా ఇరుగు పొరుగులకు ఇంతైనా ఉపకారం చేయక పోగా, ఏమిటో తవ్వి తలకెత్తినట్టు మేకపోతు గాంభీర్యంతో మసలుతూ, పరివారగణంతో నవ్యరీతులకు నారులు పోసిన వారని, సాహిత్యానికి కొత్త సొబంగులు సమకూర్చినవారని, చరిత్రకు చరిత్ర ఇచ్చినవారని కైవారాలు చేయించుకుంటున్న సమయంలో - ఉస్మానియా విశ్వవిద్యాలయంలో అద్దంలో కొండలాగ, నివురులో నిప్పులాగ, కుండలో దీపంలాగ ఉంటూ, న్యాయానికి, ధర్మానికి పట్టుగొమ్మగా ఉన్న ఇద్దరు ముగ్గురు ఆచార్యులలో శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు ఒకరు.

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు అనువు కానిచోట మాత్రమే

ధర్మపరాయణుల బలం చేకూరింది. లక్ష్మణరాయ గ్రంథాలు వారిని విశేషంగా ప్రోత్సహించాయి. 1936 నుంచే సాహిత్యసేవ ప్రారంభించారు. "తెలుగు దుక్కి" శీర్షిక కింద వ్యాసాలు వ్రాశారు. ఆధునిక కవితను గురించి 'త్రివేణి' మొదలయిన ఆంగ్ల పత్రికలలో పెక్కు వ్యాసాలు ప్రకటించారు. కొన్నాళ్ళు కవితా చెప్పారు.

తెలంగాణాలో సారస్వత సేవకు ఆలవాలమయిన 'కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం' వారి కృషిని ఉద్దీపితం చేసింది. రెండు సంవత్సరాలపాటు (1936-37) ఆ భాషానిలయానికి కార్యదర్శిగా ఉన్నారు. తర్వాత కూడా పుస్తకాల సేకరణకోసం, చందాల కోసం తెలంగాణాఅంతటా పర్యటించారు. వర్ధంతులు, జయంతులు ఎన్నో జరిపారు. సారస్వత పరిషత్తుకు సభ్యులుగా ఉండి దాని విస్తృతికి కృషి చేశారు. నిజాం రాష్ట్ర గ్రంథాలయ సంఘం కార్యదర్శిగా ఉన్నారు. సర్కార్ నౌకరీ మినహాగా ఏమి చేసినా అనుమానించే పోలీసుల నిగా ఎక్కువ కావడం వల్ల ఈ కార్యకలాపం కొంత కట్టిపెట్టవలసి వచ్చింది.

ఇలాటి నిగాలు, గుమానులు పడే పనులకంటే శాశ్వత ప్రయోజనంగల కృషికి పూనుకోడం మేలని వారికి తోచింది. కొమర్రాజు వారు వదలిపెట్టిన 'విజ్ఞాన సర్వస్వం' పూర్తి చేయాలనే కోరిక కలిగింది. ఇద్దరు ముగ్గురు ఆప్తమిత్రులతో కలిసి గ్రంథావలోకనం, విషయ సంగ్రహణం ప్రారంభించారు. 1940 ప్రాంతంలో యుద్ధం మూలంగా విద్యుద్దీపాలు లేనందున ఆముదం దీపాలవెలుగులోనే చదువు, వ్రాత కొనసాగించారు. 1944 నాటికే విజ్ఞాన సర్వస్వం పూర్తి చేద్దామనుకున్నారు. మహారాష్ట్ర 'జ్ఞానకోశ్' ఉండనే ఉంది. దానిని ఆదర్శంగా పెట్టుకొన్నారు. నాలుగైదు సంపుటాల విషయం ఐదారు నెలలలో సిద్ధ మ్మయింది. దానిని ముద్రణకు ఇద్దామని సైకిలు కారియర్‌కు కట్టి బయలుదేరారు. దారిలో పనిబడి ఒక దుకాణం వాకిట్లో సైకిలు ఆపి లోపలికి వెళ్ళారు. తిరిగి వచ్చి చూస్తే, సైకిలు, విజ్ఞాన సర్వస్వం, సర్వస్వం పోయాయి. ఏ సాహిత్య ప్రేమియో, సైకిల్ ప్రేమియో కొట్టుకుపోయాడు. ఆ ప్రయత్నం అంతటితో ఆగింది.

ఇంతలో శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు పదవీ విరమణ చేయడం వల్ల ఖండవల్లివారు ఆచార్య పదవి అధిష్ఠించవలసి వచ్చింది. విశ్వవిద్యాలయంలో సంస్కృతిని గురించి పాఠాలు చెప్పవలసి వచ్చింది. దానికోసం చేసిన అధ్యయన ఫలితమే "ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి", "ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహం" వంటి ఉద్గ్రంథాలు. కొన్నాళ్ళకు దేశం స్వతంత్రమైంది. తమను అభిమానించినవారు మంత్రులు, మహామంత్రులు అయ్యారు. దానితో ఖండవల్లివారికి 'విజ్ఞాన సర్వస్వం' పునరారంభ వాంఛ రేకెత్తింది.

"బిదురు వేంకటశేషయ్యగారు, లోకనంది నారాయణగారు, రావడవారు విజ్ఞాన సర్వస్వం కోసం మాలాగే అదివరకే ప్రయత్నించి విఫలులయారు. మా మిత్రులు, అభిమానులు తోడ్పడుతారనే నమ్మకంతో 1953లో శ్రీ బేతనభట్ల విశ్వనాథంగారూ, నేనూ కలిసి వర్ణక్రమానుసారంగా విజ్ఞాన సర్వస్వం తయారు చేద్దామని మరల పూనుకున్నాము. ఒక సంఘం నియమించుకొని శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్యగారిని చైర్మన్‌గా పెట్టుకున్నాము. చందాలు పోగు చేశాము. ప్రభుత్వం పదివేల రూపాయలు మంజూరు చేసింది. తర్వాత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం లక్ష రూపాయలు విరాళమిచ్చింది. మద్రాసులోని తెలుగుభాషా సమితివారు చేస్తున్న కృషి అప్పటికి గాని మాకు స్పష్టంగా తెలియలేదు. కనుక మా సంఘం పేరు 'సంగ్రహ విజ్ఞానకోశ సమితి' అని మార్చుకొన్నాము. ఇప్పటికి మూడు సంపుటాలు వచ్చాయి. నాలుగవది ముద్రణలో ఉంది" అన్నారు ఖండవల్లివారు.

వారు ఆంధ్ర రచయితల సంఘానికి అధ్యక్షులుగా ఉంటూ, దాని పక్షాన సిద్దేశ్వర చరిత్ర, ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధం, సంస్కృత లిపిలో అహోబల పండితీయం (ఆంధ్ర వ్యాఖ్యా సహితం) ప్రచురించారు. ఓరియంటల్ కాలేజి స్థాపించి, 1958లో బి.ఓ.ఎల్., డి.ఓ.ఎల్.వంటి ప్రాచ్య పట్టాలు విశ్వ విద్యాలయంలో ఏర్పాటు చేశారు. స్వామి వివేకానందకమిటీ హైస్కూలుకు కార్యదర్శిగా ఉండి, దానికి భవనం కట్టిస్తున్నారు.

ఖండవల్లివారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో చేసిన సేవ తెనుగుకు, తెనుగువారికి బహుకాల బహుఫలాలు కలిగించే నిరుపమ సేవ. వారు ఆచార్య పదవి అధిష్ఠించిన తర్వాత తెనుగుకు స్థాయి, హోయి ఏర్పడ్డాయి. తెలుగు విద్యార్థి తల ఎత్తుకొని తిరుగసాగాడు. ఎం.ఎ. తరగతిలో సంస్కృతం, ద్రావిడ భాషల్లో ఏదో ఒకటి తప్పక తీసుకొనే ఏర్పాటు చేశారు. తెనుగును 'సెకండ్ లాంగ్వేజ్' చేయడం కోసం అకేడమిక్ కౌన్సిల్‌లో పోరాడి గెలిచారు. పిహెచ్.డి. పెట్టించారు. విద్యార్థులకు తెలుగంటే మన మాతృభాష అనే ఆదరం కలిగించారు. విద్యార్థులతో పలువురు కవులపై చర్చాగోష్ఠులు జరిపించి, వారికి పరిశోధనాభిరుచి పుట్టించారు. మహాభారతంపైన, నాటకాలపైన శ్రీనాథునిపైన సదస్సులు జరిపించి వాటిని గ్రంథరూపంగా ముద్రించడానికి ఏర్పాట్లు చేశారు. 'శ్రీనాథ పదప్రయోగసూచిక' తయారుచేయించి ముద్రిస్తున్నారు.

ఖండవల్లివారు అత్యంత నిరాడంబరులు. రాత్రి తొమ్మిది

గంటలకు పడుకొని, రెండు గంటలకు లేచి వ్రాసుకుని, ఉదయం మలర కొంతసేపు పడుకోడం వారి అల వాటు. సంగ్రహ విజ్ఞానకోశానికి వారు ప్రధాన సంపా దకులు. దాని పనితోను, థీసీస్‌ల పర్యవేక్షణ తోను వారికి వ్యవధే ఉండదు. చిన్నప్పుడు హాకీ, ఫుట్ బాల్ ఆడేవారు. ఈత వారికి చాల యిష్టం. "1929లో స్కౌట్ మాస్టరుగా గద్వాలకు వెళ్లాము. నా వెంట నా తమ్ముడు బాలేందు శేఖరం వచ్చాడు. కృష్ణకు వెళ్ళాము. నా తమ్ము డు గట్టు సరిగా చూడక నీళ్లలో దిగాడు. కొట్టుకు పోయాడు. నేను వెంటనే దూకి, అతన్ని రక్షించాను. ఎన్నోసార్లు ఈతలోను, బోట్‌రేస్‌లోను ఫస్ట్‌గా వచ్చాను" అంటూ వారు చిన్ననాటి ముచ్చట్లను ముక్తసరిగా చెబుతారు. వారి సతీమణి శ్రీమతి భ్రమరాంబగారు. వారికి ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు.



ప్రస్తుతం వారు సాహిత్య చరిత్ర నవ్యరీతులలో వ్రాస్తున్నారు. చాలవరకు అది పూర్తయింది. విశ్వవిద్యా లయం పక్షాన మరి మూడు గొప్ప పనులు ప్రారం భించారు.

"(1)విశ్వవిద్యాలయం పక్షాన ఆంధ్ర మహా భారతం పునర్ముద్రణ చేయించడానికి ప్రయత్నిస్తున్నాను. ప్రాథమిక చర్యలు పూర్తయ్యాయి. పాఠాంతరాలను సేక రించే పని సాగుతున్నది. ఈ ప్రణాళికను విశ్వవిద్యా లయో పాధ్యక్షులు డాక్టర్ డి.ఎస్.రెడ్డి ఆశీర్వదించారు. విశ్వవిద్యాలయార్థిక సహాయ సంఘాధ్యక్షుడు డాక్టర్ కొఠారీ ప్రశంసించారు.

(2) తెలంగాణాలోని మాండలికాల అధ్యయనానికి పథకం సిద్ధపరచాను.

(3) ఆంధ్రదేశపు చారిత్రక భూగోళం (ది హిస్టారికల్ జాగ్రఫీ ఆఫ్ ఆంధ్ర) రచించాలని ప్రయత్నిస్తున్నాను. శాసనాలలోను, సారస్వతంలోను ఉన్న స్థలాల పేర్లు సేకరిస్తున్నాము. ఇవన్నీ ఎలా ఉన్నా మహభారత ప్రకటన కొనసాగితే చాలు" అన్నారు వారు.

అమృతహస్తులైన ఖండవల్లివారు ఆరంభించినదేదీ విఫలం కాలేదు. "స్లో అండ్ స్టడీ విన్స్ దిరేస్" అన్నది వారు ఏనాడో జీర్ణించుకొన్న నీతివాక్యం. అదే వారి అఖండ విజయానికి నాంది వాక్యం. భండార్కర్ పరిశోధన సంస్థ వారు (పూనా) సంస్కృత మహాభారతాన్ని అనిదంపూర్వంగా, అసదృశంగా సంస్కరించి ప్రకటించినట్లు ఉస్మానియా విశ్వవిద్యాలయం కూడా ఖండవల్లి వారి సంపాదకత్వాన ఆంధ్ర మహాభారతాన్ని నిర్దుష్టంగా, నిరుప మానంగా ప్రచురించగలదనే నా మనస్సు చెబుతున్నది.

"31-7-63"నాటి 'మరపురాని మనీషి' శీర్షికలో 1929లో స్కౌట్ మాస్టరుగా గద్వాలకు వెళ్ళాము. నా వెంట నా తమ్ముడు బాలేందు శేఖరం వచ్చాడు. కృష్ణకు వెళ్ళాను. నా తమ్ముడు కొట్టుకు పోయాడు. నేను దూకి అతన్ని రక్షించాను' అని వ్రాశారు.

గద్వాల వద్ద ఈతలో కొట్టుకుపోయినది మా తమ్ముడు బాలేందు శేఖరం కాదు. డాక్టర్ రామారావు (వెటరినరీ కాలేజీలో రీడరు). బాలేందు శేఖరమూ, నేనూ కలిసి ఆయన్ను జలగండాన్నించి తప్పించాము.

విజ్ఞాన సర్వస్వకృషి తెలంగాణంలో కొంత ప్రారంభించి విరమించిన వారిలో స్వర్గీయ కాశింఖామగారూ ఉన్నారు. డాక్టర్ రావాడ సత్యనారాయణగారు ఇప్పటికీ మాతో పనిచేస్తూనే ఉన్నారు.

-ఖండవల్లి లక్ష్మీరంజనం



శ్రీ కామరాజు వేంకటప్పయ్యగారు 1928లో నందిగామలో తాసీల్దారుగా ఉన్నప్పుడు, తన కింది కరణాలను పిలిపించి తన కుమారితకు మంచి సంబంధం చూడమన్నారు. అప్పుడు ఆమె కు పన్నెండేండ్ల ప్రాయం. రెండవ ఫారం చదువుతున్నది. కర ణాలు శ్రద్ధగా మంచి సంబంధం చూచారు. ఇల్లిందలవారి అబ్బాయి. పేరు శ్రీ సీతారామరావుగారు. తాసీల్దారుగారింటి పెండ్లి. మహా వైభవంగా జరిగింది.

పెండ్లి కుమార్తె కాపురానికి వెళ్లింది. పుట్టిన ఇల్లూ, మెట్టిన ఇల్లూ నవీనతకు ఉన్ముఖమైనవే. కనుక ఆమె ఆంధ్రప్రదేశ్ రాజధానిలోని స్టాన్లీ గర్ల్స్ హైస్కూలులో చేరింది. నాలుగేళ్లు గడిచాయి. మెట్రిక్యులేషన్ పరీక్షల సమయం. ఆమెకు మరొక పెద్ద పరీక్ష ఏర్పడింది. పిల్ల తల్లి అయింది. ఇంత చిన్నతనంలోనే తల్లినయ్యానే అనే సంకోచంతో, పరీక్షకు వెళ్లలేకపోయానే అనే ఆవేదనతో ఆమెలో జిజ్ఞాస వేయి పడగలతో విజృంభించింది. 'ట్రూ స్టోరీ మేగజైన్' వంటి ఉబుసుపోక కథల పత్రికలను చదవడమే కాక, తీరని జిజ్ఞాసతో ఎంతో అధ్యయనం చేసింది. భర్త అప్పటికి ఎమ్.ఎస్‌సి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో విజ్ఞాన శాస్త్రోపన్యాస కులు; ఎంతో ప్రోత్సహించారు. ఆమె జిజ్ఞాస జ్ఞానార్జన తోనే ఆగలేదు; ఆమెను కార్యప్రవణురాలినిగా చేసింది. ఆమె తన జ్ఞానాన్ని మహిళా జనసేవకు వినియో గించింది. తన మాటలను చేతులుగానూ మలచింది. ఆమే శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారు.

ఆ రోజులలో తెలంగాణాలో మహిళల పరిస్థితి వేరు. ముస్లింలు చాల ముందంజ వేసేవారు కాని, హిందూ మధ్యతరగతి మహిళలు ఎంతో వెనుకబడి ఉండేవారట. ఇక పై తరగతి స్త్రీల సంగతి చెప్పనక్కర లేదు. అసూర్యంపశ్యలు. విద్యార్థినీ దశ నుంచే ఆంధ్ర మహిళాసభ కార్యకలాపాలలో ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్న ఇల్లిందల సరస్వతీదేవిగారికి హిందూ మధ్య తరగతి మహిళల కోసం, ముఖ్యంగా తెలుగువారి ప్రగతి కోసం ప్రత్యేకంగా ఒక సంస్థ నెలకొల్పడం అవసరమని తోచింది. శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారిగారితో కలిసి 1934లో 'ఆంధ్ర యువతీ మండలి' స్థాపించారు. శ్రీమతి రంగమ్మ ఓబులరెడ్డిగారు అధ్యక్షులు.

'ఆంధ్ర యువతీ మండలి' స్థాపనేమో జరిగింది. దానికి సభ్యురాండ్రను చేర్చడం మహా యజ్ఞమయింది. అప్పటి కష్టానుభవాలను ఇల్లిందలవారు చెబుతూ ఉంటే ఆశ్చర్యం కలుగుతుంది; ముచ్చటగానూ ఉంటుంది. "సభ్యురాండ్రను చేర్చుకొనడానికి బయలుదేరేవారం. గౌరవ కుటుంబాలవారు వెలుపలికి వచ్చేవారు కాదు. సంస్థానాల రాణీగార్లు, జాగీర్దారిణీ గార్లు మాతో ముఖాముఖిగా మాట్లాడేవారు కారు. పరదా వెనక లీలగా కనిపిస్తూ చెలికత్తెల ద్వారా గాని, ఆయాలతోగాని కబురు పంపేవారు. సముఖాన రాయబారమంటే ఇదే కాబోలునని అనుకునేవారం. సభ్యత్వపు జాబితాలో తమ పేర్లు తమ బిరుదా వళితో సహా వ్రాయాలని పదే పదే చెప్పేవారు. మండలికి కీర్తి శేషులు ప్రతాపరెడ్డిగారు 'అసతో మా సద్గమయ' అనే నినాదం సూచించారు. డాక్టర్ బూర్గుల రామకృష్ణారావుగారు నియమావళి సిద్ధపరచారు"

ఇల్లిందలవారు ఈ విధంగా శ్రమపడుతూ పన్నెండు సంవత్స



రాలపాటు కార్యదర్శి, ఉపాధ్యక్ష పదవులను నిర్వహించి, మండలిని పెంచి పెద్ద చేశారు. డాక్టర్ బూర్గుల రామకృష్ణారావు గారి సతీమణి శ్రీమతి అనంత లక్ష్మీదేవిగారు అధ్యక్షస్థానం అలంకరించినప్పుడు మండలి బర్కత్‌పురాలో పెద్ద భవనం నిర్మించుకొంది. మండలి నేడు శిశువిహారం మొదలయిన అను బంధ సంస్థలతో కోడిలాగ, పండ్ల తీగలాగ కనుల పండువు చేస్తు న్నది. ఇల్లిందల వారిప్పుడు మండలికి శాశ్వత సభ్యులు.

ఇల్లిందలవారి కార్యదక్షత ఆంధ్ర యువతీ మండలికే పరి మితం కాలేదు. వారు భారత సంఘ సంక్షేమ మహాసభ తాలూకు ఆహార సంఘంలో సభ్యులుగాను, బందీఖానాల, అస్పత్రుల పర్యవేక్షకులుగాను, శిశుసంక్షేమ సంఘ సభ్యులుగాను ఉంటూ ఎన్నో నూతన పథకాలు సూచించారు; వాటిని ఆచరణలోను పెట్టించారు. సంఘసేవ జీవిత లక్ష్యం కావడంవల్ల సాహిత్య సంస్థలతోను వారికి సంబంధం అనివార్యమైంది. ఆంధ్ర సార స్వత పరిషత్తు నిర్వాహక సభ్యులుగాను, హైదరాబాద్ నగరంలో ప్రాచీనతమమైన కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయానికి పెక్కు సంవత్సరాలు నిర్వాహక సభ్యులుగాను, దక్షిణ భారత హిందీ ప్రచారసభ హైదరాబాద్ శాఖకు కొన్నేళ్లు నిర్వాహక సభ్యులు గాను, ఉపాధ్యక్షులుగాను, కేంద్ర గ్రంథా లయ శిశుశాఖ సభ్యులుగాను ఉంటూ గుప్తంగా చేస్తున్న సేవ పలువురికి తెలియదు. ఇక సాంఘిక, సారస్వత సభలకు అధ్యక్షత వహిం చడం వంటిది లెక్కలేనన్నిసార్లు.

ఇల్లిందలవారు కళ కళకోసమన్నట్టుగా, రచనను రచన కోసం చేపట్టలేదు. వారు దానిని సంఘసేవలో సాధనంగాను, అజ్ఞాన తమస్సును పోగొట్టే కరదీపికగాను భావించే కథలు, వ్యాసాలు మొదలయినవి వ్రాశారు. వారి మొదటి కథ, మొదటి వ్యాసం 1933లో 'గోలకొండ' పత్రికలో ప్రచురితమయాయి. తర్వాత పదేళ్లలో హైదరాబాద్‌లో రేడియో కేంద్రం నెలకొల్పడం, తెలుగుకు అవకాశం కలగడం తటస్థించాయి. శిశు మహిళా జనోద్ధరణ లక్ష్యంతో వ్యాసాలు, నాటికలు, కథలు మొదల యినవి వ్రాయవలసి వచ్చింది.

రచయిత ఏమి చెప్పినా కాలానుగుణంగా చెప్పాలి. అదొక కళ. ఆ కళను వారు జర్నలిజం ద్వారా నేర్చుకున్నారు. చెప్ప దలచిన విషయానికి 'లింక్' ఇవ్వడం వారు ప్రత్యేకంగా గ్రహిం చారు. ఈ మెలకువతోనే వారు పెక్కు సమకాలిక పత్రికలలో వివిధ శీర్షికల క్రింద అనర్గళంగా వ్రాశారు. వారికి గల పత్రికా రచనానుభవాన్ని బట్టే, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో జర్న లిజం తరగతులు పెట్టినప్పుడు వైస్ ఛాన్సలర్ డాక్టర్ దొరస్వామి గారు వారికి ప్రత్యేకంగా అనుమతి ఇచ్చారు. అక్కడ కూడా వారు పరీక్షకు వెళ్ళకపోవడానికి మరొకటేదో అడ్డు వచ్చింది. వారు వ్రాసిన వివిధ రచనల సంపుటాలే జీవన సామరస్యము, నారీజగత్తు, వెలుగు బాటలు, అక్కరకు వచ్చిన చుట్టము, ముత్యాల మనసు, పండుగ బహుమతి, జాతి రత్నాలు, బాల వీరులు మొదలయినవి.



ప్రదేశ్ శాసనమండలి ఏర్పడినప్పుడు, వారి సంఘసేవకు పరిగణనగా సభ్యత్వం లభించింది.

వారి రచనలో వర్తమాన సమస్యలు ప్రధానం. "నీలో అనేక శక్తులున్నాయి. వాటిని పైకి తెచ్చుకుని ప్రకాశించడానికి ప్రయత్నించండి. మగవారిపై కోపం వద్దు - అనే నేను నా రచనలలో సాటి మహిళలను కోరుతున్నాను. ఏదైనా యాచించడం వద్దు. సంపాదించుకోవాలి - అనే నేను హెచ్చరించాను. మహిళల మనసులో మగవారిపై గల దురభిప్రాయాలు పోవాలనే నమ్మకంతో వ్రాస్తున్నాను" అంటారు వారు.

"పూర్వ విషయాలు ఇప్పటి వారికి ఎలా చెబితే తెలుస్తాయో వ్రాయడానికి ప్రయత్నిస్తున్నాను. నేను నా అభిప్రాయాలను, నా దృష్టితోనే కాక యావద్భారత మహిళల దృష్టితోను తెలిపాను. స్వయంవరాధికారం, చల్లటితల్లులు మొదలయిన వ్యాసాలలో ఈ విషయాన్ని చూడవచ్చు. మన సంప్రదాయం సరిగా తెలియకపోవడం వల్లనే ఇప్పటివారు వాటిని వదులుతున్నారు" అని వారి అభిప్రాయం. ఏమైనా వారి రచనలు ధార్మికదృష్టి గర్భితాలు. కాని, నవీనతా నవనవలాడుతుంటుంది.

"విశ్వనాధవారి పుస్తకాలు, ముఖ్యంగా వ్యాసాలు నన్ను ప్రభావితం చేశాయి. ముట్నూరి కృష్ణరావుగారి సంపాదకీయాలు నన్ను కర్తవ్యోన్ముఖిని చేశాయి" అని వారు అన్నమాటల యాథార్థ్యం వారి రచనలు నిరూపిస్తాయి.

"నేడు ఆడవారెవరైనా వ్రాస్తే, వారెక్కడ వ్రాసి ఉంటారోయ్! ఎవరో ఆసరా ఉంటారు. లేదా వారి పేరుతో వ్రాశారు - అన్నది నేటి మగవారి మనస్తత్వం. ఇది మారాలి" అన్నారు వారు. దొంగపేర్లతో, ఆడపేర్లతో వ్రాసే మగవారు మాటుమణిగేవరకు ఇలాటి కువిమర్శలు పోవు.

ప్రస్తుతం ఇల్లిందలవారు పెద్ద నవలనొకదానిని వ్రాస్తున్నారు. అది వారి రచనలకన్నిటికీ మణిపూసగా, మహాకావ్యంగా ఆంధ్రులచేతిని అలంకరించగలదనే నమ్ముతున్నాను. మూడు దశాబ్దాల లోకవృత్త పరిశీలనానుభవంతో, వివిధ విషయాధ్యయనంతో, రెండు దశాబ్దాల పుంఖానుపుంఖ రచనలతో రాణించే వారి లేఖిని ఈ నవలనూ జాతిరత్నంగానే సృష్టిస్తుంది.



ఇల్లిందలవారి భర్త శ్రీ సీతారామరావుగారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో రీడరుగాను, డీన్‌గాను ఉన్నారు. బూర్గుల వారు విద్యామంత్రిగా ఉండగా వారు విశ్వవిద్యాలయం నుంచి ప్రభుత్వ విద్యాశాఖకు తక్కినవారితోపాటు బదిలీ అయి ట్రెయినింగ్ కాలేజి ప్రిన్సిపాలుగాను, విద్యాశాఖ డిప్యూటీ డైరెక్టరుగాను ఉండి, ప్రస్తుతం సిటీ సైన్స్ కాలేజి ప్రిన్సిపాలుగా ఉన్నారు. వారు చదివింది కెమిస్ట్రీ అయినా కవిత్వమంటేను, సంస్కృత సాహిత్యమంటేను మహాయిది. ఇల్లిందల దంపతులకు ముగ్గురు కుమార్తెలు, ఒక కుమారుడు. ఇల్లిందలవారికి తోటపని, కసూతీపని చాల ఇష్టం.

ఇల్లిందలవారి తల్లి కామరాజు వెంకట లక్ష్మమ్మగారు బ్రహ్మసమాజ నాయకురాలు దేశిరాజు పెదబాపయ్యగారి సోదరి. కనుక ఇల్లిందలవారికి ఉగ్గుబాలతోనే సంస్కార భావాలు అబ్బినవి. కాని, ఒకరిద్దరు పిల్లలు పోయిన తర్వాత సనాతన సంప్రదాయం మీదా మక్కువ కలిగింది. కనుక తెల్లవారుజామున నాలుగు గంటలకే లేచి స్నానం చేసి ఆరు గంటల లోపుగా లలితా సహస్రనామం, శివసహస్రనామం, శివపంచస్తవి పారాయణం చేస్తారు. మధ్యాహ్నం చదువుకుంటారు. సాయంకాలం సభలు సమావేశాలలో పాల్గొంటారు. 1958లో ఆంధ్ర

# మరపురాని మూర్తి



## దేవులపల్లి రామానుజరావు

187



ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. రెండు చెక్కలుగా ఉన్న తెలుగు నాడు ఏకీకరణకు ఉద్యమం ఉధృతంగా సాగుతున్నది. రామాయణంలో పిడకలవేటలాగ కేంద్ర ప్రభుత్వం దృష్టి ఉస్మానియా విశ్వ విద్యాలయంపై పడింది. ఆ విద్యాలయంలో బోధన భాష ఉరుదూ కావడం, అక్కడి పారిభాషిక పద రచనా శాఖ అద్వితీయంగా ఉండడం ఢిల్లీ వారి నోట నీరూరేట్టు చేశాయి. ఫారసీ లిపిని దేవనాగరి లిపిగా మార్చి, ఉస్మానియా విశ్వ విద్యాలయాన్ని హిందీ విశ్వవిద్యాలయంగా పరకాయం చేయడానికి పూనుకున్నారు. తెలుగునాట, ముఖ్యంగా తెలంగాణాన, ఆందోళన చెలరేగింది. భాషా ప్రయుక్త రాష్ట్రాలతో మాతృభాషకు ఏమో ఒరుగుతుందని ఆశిస్తే, ఉన్న సంస్థే చేయిజారిపోతున్నదేమోనని, ప్రముఖ పౌరులతో 'ప్రతిఘటన సంఘం' (సిటిజన్స్ కమిటీ) ఏర్పడింది. దాని సమావేశకర్తను అంతకు ముందు చూడని వారు, తొలిసారిగా చూచినవారూ ముక్కు మీద వేలు పెట్టుకున్నారు; ఎవరు ఈ వామనుడు, ఏమిటి ఈ పైజమా - షేర్వానీ వేషం, ఆకాశం చూస్తూ ఐమూలగా అంగలు వేసే ఈ నడకేమిటి - అని. కాని, ఆయన ఆకారంలో వామనుడైనా, తెలివితేటలలో, వ్యవస్థాపన పాటవంలో త్రివిక్రముడని తెలిసిన వారు మాత్రం ఉద్యమం సఫలం కాక తప్పదని ఎప్పుడో నిర్ణయించుకున్నారు. వారి నిర్ణయం నిజమయింది.

ఔను మరి! అంతకుముందు ఆరేళ్ళుగా హైదరాబాద్ సారస్వత పరిషత్తు కార్యభారం వహించి, తెలంగాణాలోను, ఇతరత్రాను ఉన్న మారుమూల పల్లెలకూ కాళ్ళు అరిగేలా తిరిగి, సారస్వతోద్యమం వ్యాపింపజేసి, రాజధాని నగరం నడుమ దానికొక సువిశాల స్థలం సంపాదించి, తలయెత్తి చూడదగిన, సర్వాంగ సుందరమైన భవనాన్ని నిర్మింపజేసి, తెలుగువారు తలయెత్తుకొనేట్టు చేసిన నిర్మాణ దక్షుడు ఆయన. ఆంధ్ర రాజధానిలో ఆయనను చూడనివారు, చూచి గుర్తించనివారూ ఉండరు. ఆయన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు.

శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు ఓరుగల్లు పట్టణంలో 1917 ఆగస్టు 24న జన్మించారు. మెట్రిక్యులేషన్ వరకు హనుమకొండలో చదివారు.

తర్వాత హైదరాబాద్‌లోని నిజాం కాలేజీలో 1939లో పట్టభద్రులయ్యారు. సంపన్న కుటుంబం: జీవితంలో కష్టాలేవీ ఎదుర్కోవలసిన అవసరం కలుగలేదు. డొక్క కోసం రెక్కలు ఆడించవలసిన దుర్గతి అసలే లేదు. కనుక బి.ఏ. పట్టం పుచ్చుకున్న తర్వాత, రెండేళ్ళపాటు గ్రంథాలయోద్యమంలోను, మరి రెండేళ్ళపాటు యువజన కాంగ్రెస్‌లోను పాల్గొన్నారు. ఆ సమయంలో ప్రజాసేవకులందరికీ కలిగినట్లే వీరికీ న్యాయవాది కావాలనే కోరిక కలిగింది. నాగపూర్ వెళ్ళి ఎల్ఎల్.బి. తరగతిలో చేరి ఉత్తీర్ణులయ్యారు. తిరిగి వచ్చి వకాలత్ ప్రారంభించారు.

అప్పుడు హైదరాబాద్ రాష్ట్ర రాజకీయ వాతావరణం భయానకంగా ఉంది. ఆజాద్ హైదరాబాద్ నినాదాలు విజృంభించాయి. వాటికి తోడు రజాకార్ల హాహారవాలు. దేవులపల్లి వారి తెలుగుతనం పరవళ్ళు తొక్కింది. ఈ అభివృద్ధి నిరోధకులను ప్రతిఘటించడానికి గొంతు విప్పాలి. దానికి తాము నడుపుతున్న "శోభ" సారస్వత మాసపత్రిక చాలదు అనుకున్నారు. "నాకు న్యాయవాది వృత్తే చాల ఇష్టం. గొప్ప న్యాయవాది కావాలనే మొదటి నుంచి ఆశ. కాని, వెర్రి తలలు వేసిన ఉద్యమాలను ఎదుర్కొనడం విద్యుక్తధర్మం. నా భావాల ప్రకటనకు దారి చూస్తూండగా 'గోలకొండ' పత్రిక దినపత్రిక అయింది. దాని సంపాదకుడుగా నా వ్రాతలకు, 'కూతలకు' ధారాళంగా అవకాశం దొరికింది. ఈ కారణంగానే, నేను ఒక ఉద్యమం నుంచి మరొక ఉద్యమానికి శాఖా చంక్రమణం చేయడం సంభవించింది. నా జీవితం ఈ విధంగానే గడిచిపోతూంది" అన్నారు దేవులపల్లివారు.



'గోలకొండ' పత్రిక సంపాదకత్వం 1947 నుంచి నాలుగేండ్ల వరకే సాగింది. 1948 డిసెంబరు నుంచి సారస్వత పరిషత్తుతో సంబంధం కలిగింది. 1952 - 53లో దానికి అధ్యక్షులుగాను, ఇప్పటి వరకూ ఉపాధ్యక్షులుగాను ఉన్నారు. తర్వాత తర్వాత ఆ సంస్థ భవనాలు లేచాయి. "నాతో ఎవరికీ విరోధం లేదు. నా పనులు ఎంతో సవ్యంగా సాగిపోయాయి. నరోత్తమరెడ్డి, పులిజాల హనుమంతరావు, గడియారం రామకృష్ణ శర్మ నా పనులకు ఎంతో తోడ్పడ్డారు. మేము నలుగురమూ కలిసే పని చేశాము" అన్నారు వారు.

ఏ పని ఫలమైనా కర్త, కారయిత మొదలయిన ఆరుగురికీ చెందుతుందని అభియుక్తోక్తి. కాని, కర్త కంటే కారయితకే ప్రాధాన్యం హెచ్చుగా ఇవ్వాలని నా అభిప్రాయం. ఏ పనైనా చేయడం కన్నా చేయించడం కష్టం. తను ఏదో తనకు నచ్చింది చేయడం సులువు. తన యిష్టానిష్టాలు తగ్గించుకుని, పదు గురితో పనిచేయడం కష్టం; పదుగురితో పనిచేయించడం మరీ కష్టం. ఆ విధంగా ఇతరులతో పనిచేయించినవారే మొదటి నుంచీ గొప్పవారయ్యారు; గొప్ప పనులూ సాధించారు. కొందరు తమ మేధతోను, సౌజన్యంతోను పదుగురినీ ఆకట్టు కోగా, కొందరు అధికారంతోను, ఈవితోను ఆకట్టుకుంటారు. మేధ, సౌజన్యం లేకపోతే విద్యారణ్యుల వారు వేదభాష్యమనే మహ ధ్వరాన్ని ముగించేవారే కాదు. ఏతావతా:

వ్యవస్థాపన శక్తికి కలిసికట్టుతనం కన్నతల్లి. దానికి దేవులపల్లి వారు పుట్టినిల్లు. ఆ శక్తి మరొక శక్తితో కలిసి ఉండకపోతే రాణిం చదు. దానికి వారి రచనాశక్తి తోడయి వన్నె తెచ్చింది. దానికి సహకారిణి వారి ప్రసంగచాతురి. ఎవరినీ నొప్పించక గంటల తరబడి విషయైకదృష్టితో మాట్లాడగలరు. వాటన్నిటి ఫలితాలే నవ్య కవితా నీరాజనము, సారస్వత నవనీతము, వన నీతము, వ్యాసమంజూష వంటి సాహిత్య విమర్శ గ్రంథాలు; మనదేశము, ఆదిమవాసులు, తెనుగు దేశము, జవహర్‌లాల్ నెహ్రూ, గౌతమ బుద్ధుడు వంటి బాల సారస్వతము; పచ్చ తోరణము వంటి పద్య కావ్యాలు; తెలుగు సీమలో సాంస్కృతిక పునరుజ్జీవనము వంటి సాంస్కృతిక గ్రంథాలూనూ.

ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన వెంటనే "తెలంగాణములేని ఆంధ్ర రాష్ట్రము అసమగ్రము. ఆంధ్రజాతి సర్వతోముఖాభివృద్ధిని దృష్టిలో ఉంచుకొని ఆంధ్ర నాయకులు - ఏ ప్రాంతము వారైనను - బద్ధ కంకణులై కృషి చేసి, ఆంధ్ర రాష్ట్రమును సమగ్రము గావించ విశాలాంధ్ర సాధనకు దీక్ష వహించవలసి యున్నది" అని ఘోషించిన తొలిబంతి వారిలో వారొకరు. దానికోసమే వారు అయ్యదేవర కాళేశ్వరరావు మొదలయిన పెద్దలతో కలిసి విశాలాంధ్ర నిర్మాణోద్యమం నడిపారు. 'హైదరా బాద్ స్వాతంత్ర్యోద్యమము', 'విశాలాంధ్ర రాష్ట్రము', అన్న గ్రంథాలు రచించారు. కార్యసిద్ధి తర్వాత 'విశాలాంధ్ర వచ్చింది', అనే పుస్తకం రాశారు. ఉస్మానియా విశ్వ విద్యాలయం బదిలీ ప్రతిఘటనోద్యమం ఫలితం మొదటే తెలిపాను.

వారితో సంబంధంలేని సారస్వత సంఘమంటూ, విద్యాసంస్థ అంటూ రాష్ట్రంలో లేదు. కొంతకాలం ఉస్మానియా విశ్వవిద్యా లయం సెనేట్‌లోను, రాష్ట్ర ప్రభుత్వం విద్యా సలహా సంఘం లోను, కేంద్ర పాఠ్యపుస్తక సంఘంలోను, ఆల్ ఇండియా రేడియో సలహా సంఘంలోను సభ్యులు. టాగూరు శతవార్షిక జయంతి సంఘ కార్యదర్శులు. గురజాడ శతవార్షిక జయంతి సంపుటి సంపాదకులు. అయినప్పుడు, వారు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఏర్పడినప్పటినుంచి కార్యదర్శి పదవి అలంకరించడం, కేంద్ర సాహిత్య అకాడమీ కౌన్సిలు సభ్యులు కావడం, సాహిత్య ప్రతినిధులుగా రాజ్యసభలో ఆసీనులు కావడం ఆశ్చర్యం కాదు.

ఏ ఉద్యమానికన్నా సహకారమే మూలమయినప్పుడు, వారు సహకారోద్యమంలో పాల్గొనడం సహజాతి సహజం. వారు కో ఆపరేటివ్ జనరల్ ఇన్‌ష్యూరెన్స్ సొసైటీ డైరెక్టర్ల బోర్డు సభ్యులు కూడా.

"నాకు ప్రాచీన సాహిత్యంలో భారతం, భాగవతం ఇష్టమై నవి. నవీనులలో గురజాడ, రాయప్రోలు, విశ్వనాథ, అబ్బూరి,



ఆ విశ్వజనీనతే మన సంస్కృతిని శాశ్వతం చేస్తున్నది" అని వారి విశ్వాసం.

వారు తెల్లవారుజామున నాలుగున్నరకే లేచి, స్నానాదులు ముగించుకుని, ఆరున్నర నుంచి ఎనిమిదిన్నర వరకు ముఖ్యమైన వ్రాతపనులు చూచుకుంటారు. తర్వాత సారస్వత పరిషత్తు కార్యాలయానికి వచ్చి, పరిషత్తు, సాహిత్య అకాడమీల పనులు చేస్తారు. పన్నెండు గంటలకు ఇంటికి వెళ్ళి భోజనం ముగించి, గంటన్నర విశ్రమిస్తారు. సాయంకాలం నాలుగున్నర నుంచి పరిషత్తు కార్యాలయంలో మరల కార్యక్రమం ప్రారంభం. సాయంకాలం ఆరు గంటలకు వాహ్యాళికి బయలుదేరుతారు. వారికి బ్రిడ్జి ఇష్టం, ఇప్పుడు లేదు. షేర్వానీ, పైజామా నచ్చిన దుస్తులు.

వారికి తోటపని చాల ఇష్టం. "నాకు బాదర బందీ ఏమీ లేదు. నా కుమారుడు ఎదిగి వస్తున్నాడు. నాకు ఏ జంఝాటమూ ఇక ఉండదు. ఆఖరుకు వరంగల్లులో స్థిరపడి, తోటపని చేసుకుందామని ఉంది" అని వారు అంటున్నప్పుడు ఎన్నో ఉద్యమాలకు, సంస్థలకు నారుపోసి, నీరుపోసి పెంచి పండించుకున్న దేవులపల్లివారు తోటలనూ బాగానే పెంచి పండ్లు అనుభవించ గలరనడం నిస్సందేహమనే అనిపిస్తుంది.

దువ్వూరి, జాషువ, దాశరథి చాల ఇష్టమైనవారు. తెలుగు సాహిత్యంలోని వెలుగులను హిందుస్తానీ వారికీ తెలుపడానికి ఉరుదూలో 'తెలుగు సాహిత్య చరిత్ర' ప్రచురించాను. హాలీ, గాలిబ్, వచనకారుడు మౌలానా షిబ్లీ నాకు చాల సన్నిహితులు. జాతీయోద్యమానికి సంబంధించినంతవరకు హాలీ రచనలను తెలుగులో ప్రచురించాను" అని వారు అంటూ రంజకంగా ఎంతసేపైనా సంభాషిస్తారు.

"ప్రాచీన సంస్కృతిలోని ఉదాత్తతను కాలానుగుణంగా మలచుకోవాలని, ఆ నిగ్గును రక్షించుకోవాలని కోరేవారిలో నేనొకణ్ణి. ప్రాచీనతతో సంబంధం ఉండాలనేవాణ్ణి. భారతీయ సంస్కృతిలో విశ్వజనీనత ఉంది. దానినే మనం రక్షించుకోవాలి.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పక్షాన మంచి తెలుగు నిఘంటువు ఒకటి నిర్మింపజేయాలనీ, సారస్వత పరిషత్తుకొక గొప్ప రెఫరెన్స్ లైబ్రరీ ఏర్పాటు చేయాలనీ వారికి ప్రస్తుతం ఉన్న కోరికలు. ఇన్ని సాధించిన వారికి ఇవి ఏపాటివి?

సృజనాత్మక శక్తి, దానిని మించిన నిర్మాణదక్షతగల శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు ఈ రెండు కోరికలతోనే సంతృప్తి పడక, తెనుగు సాహిత్యం, తెలుగువారి అభిరుచి దేశంలోని ఇతర భాషల వారికి ఒరవడి అయ్యేటట్టు సారస్వత మహాధ్వరానికి పూనుకుంటారని ఆశిస్తున్నాను.



# మరపురాని మధురం



## అనుబంధం

జీవిత-చిత్రాలు:

## మల్లాది కృష్ణానంద్

ఛాయా-చిత్రాలు:

## నీలంరాజు మురళీధర్

191



## మల్లాది కృష్ణానంద్ - పరిచయం

పుట్టింది (1958) పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వూరు దగ్గరయితే, చదువుకుంది - పెరిగిన వాతావరణమంతా గుంటూరు జిల్లా నరసరావుపేటలో.

ఆ దరిమిలా ఐజ్వాలు (మిజోరం), షిల్లాంగ్ (మేఘాలయ)లలో, పై చదువులు, ఉద్యోగాన్వేషణకోసమని వెళ్ళి, విఫలయత్నంతో స్వగ్రామానికి తిరిగొచ్చారు.

ఆ మీదట దక్షిణ మధ్య రైల్వే - సికింద్రాబాద్‌లో కొంతకాలం, ఆ తర్వాత, రాష్ట్ర సమాచార పౌర సంబంధ శాఖలో 1985 నుండి పని చేస్తున్నారు. ప్రస్తుతం సమచార శాఖలో డిప్యూటీ డైరక్టర్, హైదరాబాద్ రీజియన్‌కు ఇన్‌ఛార్జ్‌గా ఉన్నారు.

సాహిత్య, సాంస్కృతిక, పర్యాటక చారిత్రక విషయాలపై వ్యాసాలు రాయడం హాబీ. ఆ అలవాటును మొదట్లో కుటీర పరిశ్రమగా భావించినా, ప్రస్తుతం ప్రతి రచనా ఏ కొద్దిమందికయినా ఉపయోగపడాలని ఆశపడుతున్నారు.

ఇదేమీ అత్యాశ కాదేమో!

ఈ ఆశతోనే వివిధ రంగాల్లో నిష్ణాతులు, కీర్తిశేషులైన 116 మంది తెలుగు ప్రముఖులతో 'తెలుగు పెద్దలు' పుస్తకాన్ని నేటి యువతకోసం రాస్తే, మంచి స్పందన వచ్చింది.

ఈ యాంత్రిక యుగంలో నేటి యువతరం 'ఎందరో మహనీయుల్ని' మర్చిపోతోంది. వారి సేవలు, కృషి తెరమరుగవుతున్నాయి.

"గతం భవిష్యత్తుకు మార్గదర్శకత్వం" వహిస్తుందనడంలో సందేహం లేదు. అందుకే తెలుగు పెద్దల జీవిత చరిత్రలు మరికొన్నింటిని సేకరించాలనీ - వాటిని నేటి యువతరం ముందుంచాలనీ ప్రస్తుత లక్ష్యంగా నిర్ణయించుకున్నారు.

192



**స్వా**తంత్ర్యోద్యమంలో చాలాకాలం మన నాయకులు బ్రిటీష్ దేశపు 'యూనియన్ జాక్'నే ఎగురవేసేవారు. ఇది ఏమాత్రం సహేతుకం కాదని వాదిస్తూ, మన దేశానికంటూ ప్రత్యేకంగా జాతీయ జెండా ఉండాలని వాదించి, గాంధీజీ కోర్కె మేరకు త్రివర్ణపతాకాన్ని రూపొందించిన - విజయవాడ వాస్తవ్యులు శ్రీ పింగళి వెంకయ్య తెలుగువారందరికీ సుపరిచితులే. జాతీయ పతాక రూపకల్పన చేసిన శ్రీ పింగళి వెంకయ్య ఆంధ్రులు కావడం మనందరికీ ఎంతో గర్వకారణం.

1906లో కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ మహాసభల్లో బ్రిటీషు వారి జెండా ఎగురవేస్తే, ఎంతో ఆందోళన చెందిన వ్యక్తి శ్రీ పింగళి. భారతీయులకు ప్రత్యేక జెండా రూపొందించడం కోసం ఎన్నో నమూనాలను ఆయన తయారు చేశారు. రవీంద్రనాధ్ ఠాగూర్, బాలగంగాధర తిలక్, దాదాభాయ్ నౌరోజీ వంటి ప్రముఖ నాయకులతో సంప్రదింపులు జరిపారు. అంతేకాదు, తన అనుభవాలన్నింటినీ క్రోడీకరిస్తూ, 1916లో A National Flag for India అనే పుస్తకాన్ని ఆయన రాశారు.

ఆంధ్రోద్యమంలో భాగంగా 1913లో బాపట్లలో జరిగిన ప్రథమ ఆంధ్ర మహాసభల్లో శ్రీ పింగళి పాల్గొన్నారు. తన ఉపన్యాసాలతో ప్రజల్ని చైతన్యవంతుల్ని చేశారు. 1916లో లక్నోలో జరిగిన భారత జాతీయ కాంగ్రెసు మహాసభల్లో శ్రీ

పింగళి ప్రతిపాదించిన ప్రత్యేక జెండాను ఆమోదించారు. 1921 మార్చి 31న విజయవాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశాల్లో గాంధీజీ ప్రత్యేకంగా పింగళిని ఆహ్వానించి, జాతీయ జెండా రూపొందించాల్సిందిగా కోరారు. శ్రీ పింగళి, అదే సమావేశంలో కేవలం మూడు గంటల వ్యవధిలో ఎరుపు, తెలుపు, ఆకుపచ్చ రంగులతో జెండాను రూపొందించి, గాంధీజీకి అందజేశారు. ఈ జెండాకు ఎంతో ప్రచారం లభించింది. ప్రజలు ఎంతో భక్తి భావంతో జెండాలను ఎగురవేసుకొని, బ్రిటీషు వారి ఆగ్రహావేశాలకు గురై ఎన్నో కష్టాలు, నిర్బంధ కారాగార శిక్షలు, లాఠీ ఛార్జీలకు గురయ్యారు. 'ఝండా ఊంఛా రహే హమారా' అని, నినాదాలు చేస్తూ, బ్రిటీషు నిషేధాజ్ఞలను సయితం లెక్కచేయక, జెండా సత్యాగ్రహ ఉద్యమాలు ఆనాడు భారతీయులు నిర్వహించారు.



కొద్దిరోజుల అనంతరం, జెండా రంగులకు సంబంధించి కొన్ని వాగ్వివాదాలు చెలరేగాయి. ఎరుపు, తెలుపు, ఆకుపచ్చ రంగులు ముస్లిం, హిందూ, క్రైస్తవ మతాల ప్రతీకలుగా భావించడంతో, నలుపు రంగు - సిక్కు మతస్థులకు కావాలని ఆందోళన కొనసాగింది. అయితే, కేసరి, తెలుపు, ఆకుపచ్చ రంగులతో జెండాను ప్రతిపాదించడంతో ఈ సమస్య తొలగిపోయింది. కేసరి రంగు ధైర్య, సాహసాలకు, తెలుపు శాంతి సత్యాలకు, ఆకుపచ్చ విశ్వాస, శౌర్యాలకు ప్రతీకలుగా పేర్కొన్నారు. జెండా మధ్య తెలుపు రంగులో 'రాట్నం' వెలిసింది. ఆ రకంగా శ్రీ పింగళి రూపొందించిన జెండా స్వాతంత్ర్యోద్యమ కాలంలో ఎంతో ప్రాముఖ్యత సంతరించుకుంది. అలాగే అందరి ప్రశంసలు అందుకుంది. అయితే, స్వాతంత్ర్యానంతరం, రాజ్యాంగ సభలో జాతీయ జెండా ప్రవేశపెట్టినప్పుడు త్రివర్ణపతాకంలోని రాట్నం గుర్తుకు బదులుగా, సారనాథ్ స్థూపంలోని అశోకుని ధర్మచక్రం ఉండాలని సూచించారు. ఈ రకంగా, భారతీయుల కంటూ ప్రత్యేక జెండా ఉండాలన్న శ్రీ పింగళి వారి కోర్కె మేరకు మువ్వన్నెల త్రివర్ణపతాకం మనందరికీ లభించింది. ఆ పిదప శ్రీ పింగళి వెంకయ్య జెండా వెంకయ్యగా ప్రఖ్యాతి చెందారు.

జాతీయ జెండా రూపొందించడంలోనే కాక, స్వాతంత్ర్య పోరాటం తొలిదినాలు 1906 నుంచి స్వాతంత్ర్యం సిద్ధించే దాకా శ్రీ పింగళి ఎన్నో ఉద్యమాలు, ఆందోళనలలో పాల్గొని నిస్వార్థంగా తన సేవలు అందిస్తూ, ఎన్నో కష్టాలు అనుభవించారు.

శ్రీ పింగళి 1876 ఆగస్టు 2న, కృష్ణాజిల్లా దివి తాలూకాలో భట్లపెనుమర్రు గ్రామంలో జన్మించారు. తండ్రి శ్రీ హనుమంతరాయుడు. ఆయన యార్లగడ్డ గ్రామకరణంగా ఉండేవారు.

కృష్ణాజిల్లాలో ప్రాథమిక, ఉన్నత విద్యలు పూర్తయ్యాక, సైన్యంలో చేరాలన్న కోర్కెతో, 19 సంవత్సరాల వయస్సులో దక్షిణాఫ్రికా వెళ్ళారు. అక్కడే! పింగళికి గాంధీజీతో పరిచయం అయ్యింది. ఆ పిదప కొద్దికాలానికే స్వదేశం తిరిగివచ్చి, మద్రాసులో ప్లేగు వ్యాధి నిరోధక ఇన్‌స్పెక్టర్ శిక్షణ పొంది, బళ్లారిలో ప్లేగు వ్యాధి నిరోధక అధికారిగా ఉద్యోగంలో చేరారు. తర్వాత ఉన్నత చదువలు చదవాలన్న తృష్ణతో రాజకీయ అర్థశాస్త్ర అధ్యయనంకోసం కొలంబో విశ్వవిద్యాలయానికి వెళ్ళారు. ఆ పిదప, జపనీస్, సంస్కృతం, ఉర్దూ భాషలు నేర్చారు, అనర్గళంగా ఈ భాషలు మాట్లాడగల దిట్టగా పేరు సంపాదించారాయన.

శ్రీ పింగళి తన ఉపన్యాస పటిమతో సభికుల్ని ఆశ్చర్య చకితుల్ని చేసేవారు.



ఆయన వ్యవసాయ రంగంలో విశేష పరిశోధనలు చేశారు. ముఖ్యంగా సన్నని నూలును అందించే కొత్త ప్రత్తి వంగడాలను ఆయన రూపొందించారు. వ్యవసాయ రంగంపై తన అనుభవాలతో పుస్తక రచన కూడా చేశారు. శ్రీ పింగళి మరెన్నో కొత్త వంగడాలను రూపొందించారు. అందుకు గుర్తింపుగా, లండన్ లోని రాయల్ అగ్రికల్చరల్ సొసైటీ ఆయనకు సభ్యత్వం ఇచ్చి గౌరవించింది. 1911 - 1919 మధ్యకాలంలో మచిలీపట్నం ఆంధ్ర జాతీయ కళాశాలలో వ్యవసాయశాఖ అధ్యాపకుడిగా పనిచేస్తూ, కళాశాల ఆవరణనే ఒక వ్యవసాయ సుక్షేత్రంగా తీర్చిదిద్దారు.

అంతేకాదు, శ్రీ పింగళి ఖనిజ శాస్త్రంలో కూడా అపారమైన విజ్ఞానాన్ని సంపాదించారు. దేశంలో ఏ రాష్ట్రంలో, ఏయే ప్రాంతాల్లో ఎటువంటి ఖనిజం లభిస్తుందోనన్న విషయంలో ఆయన విశేష పరిశోధనలు జరిపారు.

జాతీయ జెండా రూపకర్తగా, వ్యవసాయ, ఖనిజ శాస్త్రవేత్తగా, బహుముఖ ప్రజ్ఞాశాలిగా, బహుభాషా కోవిదుడుగా, అన్నింటికీ మించి జాతీయవాదిగా ప్రఖ్యాతి చెందిన శ్రీ పింగళి వెంకయ్య తనకంటూ ఏమీ మిగుల్చుకోలేదు. కడపటి రోజుల్లో దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించారాయన. జీవితాంతం నిరాడంబరంగా, నిజాయితీగా, వృద్ధాప్యంలో చర స్థిరాస్తులు ఏమీ లేకుండా చేతిలో చిల్లిగవ్వైనా లేని దుర్భర జీవితాన్ని గడిపారాయన.

ఆయనకి యిద్దరు కుమారులు, ఒక్క కుమార్తె. ఏనాడూ తన కోసం తాపత్రయపడని శ్రీ పింగళి కోసం 1963 జనవరిలో - ఆయన అభిమానులు శ్రీ కె.ఎల్.రావు, శ్రీ జి.ఎస్.రాజు తదితర ప్రముఖులు ఒక నిధిని ఏర్పాటు చేశారు. అయితే అది అప్పటికే ఆలస్యమైందని చెప్పొచ్చు. శ్రీ పింగళి 1963 జులై 4న శాశ్వతంగా కన్నుమూశారు.

శ్రీ పింగళి తన చివరి కోర్కెగా, ఆయన మృతదేహంపై జాతీయ జెండాను కప్పి, స్మశాన వాటికలో దగ్గర్లోని ఒక చెట్టుకు కట్టాల్సిందిగా ఆయన కోరారు. దేశమాత కోసం తన సర్వస్వం త్యాగం చేసిన మహామనీషి శ్రీ పింగళి వెంకయ్య.

జాతీయపతాకం గురించి నియమాలు :

జాతీయ పతాక విషయంలో ఎవరికి తోచినట్లు వారు ఉపయోగించకుండా కొన్ని నియమ నిబంధనలు ఉన్నాయి. బ్యూరో ఆఫ్ ఇండియన్ స్టాండర్డ్సువారు ఈ నియమ నిబంధనలు తు.చ. తప్పక పాటించాలని సూచించారు. జాతీయ జెండా కొలతలు : 21' × 14', 12'×8', 6' × 4', 3' × 2', 9' × 6' సైజుల్లో మాత్రమే ఉండాలని పేర్కొన్నారు.

మూడు రంగుల జెండా మధ్యభాగంలో ధర్మచక్రం నేవీబ్లూ రంగులో మాత్రమే ఉండాలని, ధర్మచక్రంలో 24 గీతలు ఉండాలని సూచించారు.

జాతీయ జెండాను అలంకరణకోసం వాడరాదనీ, అలాగే జెండా ఎగురవేసేటప్పుడు ఎట్టి పరిస్థితుల్లోను నేలను తాకరాదని పేర్కొన్నారు.

ఎగురవేసేటప్పుడు వేగంగాను, అవనతం చేసేటప్పుడు మెల్లగా దించాలి.

కాషాయరంగు అగ్రభాగాన ఉండాలి.

సూర్యోదయానంతరం మాత్రమే పతాకం ఎగురవేయాలి. అలాగే, సూర్యాస్తమయం కాగానే జెండాను దించివేయాలి.

ప్రముఖ నాయకులు, పెద్దలు, మరణించిన సందర్భాల్లో సంతాప సూచకంగా జాతీయపతాకాన్ని అవనతం చేయాలి. జాతీయ పతాకం వాడుకలో ఈ నియమాలన్నీ ప్రతి భారతీయ పౌరుడూ పాటించాల్సిన గౌరవ, మర్యాదలుగా గుర్తించాలి.



తెలుగువారి కోసం, తెలుగుభాషా చరిత్ర కోసం పరిశోధనలు చేసి, తమ జీవితాలనే అంకితం చేసిన పెద్దలెందర్నో ఈ తరం యువత ఆసాంతం మరిచి పోతున్నారు. అలాంటి జాబితాలో శ్రీ వఝ్ఝల కూడా ఒకరుగా చెప్పొచ్చు.

వఝ్ఝలవారు తమ జీవితాన్ని తెలుగుభాషా చరిత్ర పరిశోధన లకే అంకితం చేసిన గొప్ప సంస్కృతాంధ్ర కవి. అయితే ఆ మహనీయుని గురించి కొద్దిపాటి పండితులను మినహాయిస్తే, మరెవ్వరికీ ఆయన గురించి తెలియదు. ఇది విచారకరం.

తెలుగులో జీవితచరిత్రలు ఉన్న పుస్తకాలే చాలా తక్కువ. దానికితోడు, ఉన్నటువంటి కొద్దిపాటి పుస్తకాలలో కూడా బహు ముఖ ప్రజ్ఞాశాలి శ్రీ వఝ్ఝల గురించి కొన్ని పంక్తులైనా లేక పోవడం శోచనీయం.



శ్రీ చినసీతారామశాస్త్రి తన జీవితాన్ని వ్యాకరణ శాస్త్రానికే అంకితం చేసిన గొప్ప సంస్కృతాంధ్ర కవి. వ్యాకరణ శాస్త్రంతో పాటు, సంస్కృత కావ్య నాటక గ్రంథాలను, జాతక ముహూర్త సిద్ధాంత భాగాలను, లీలావతీ బీజ గణితం, తర్క, వేదాంత, ధర్మశాస్త్రాలను తమ కుటుంబంలోని పెద్దలందరి దగ్గర శిష్యరికం చేస్తూ నేర్చుకున్నారు.

శ్రీ వజ్ఝల 1878 జూన్ 25వ తేదీన జన్మించారు. తల్లి వెంకటాంబ, తండ్రి ముఖలింగేశ్వరశాస్త్రి. వీరి స్వగ్రామం విజయనగరం జిల్లా బొబ్బిలికి దగ్గరలో ఉన్న పాలతేరు. ఆ తర్వాత జీవనోపాధికోసం విజయనగరం చేరి అనేక పాఠశాలల్లో తెలుగు పండితుడిగా పన్జేశారు. తన విశేష ప్రజ్ఞాపాటవాలతో తోటి పండితులతోపాటు, విజయనగరం మహారాజావారి దృష్టిని ఆకర్షించారు. తత్ఫలితంగా స్థానిక మహారాజా సంస్కృత కళాశాలలో ఉద్యోగం లభించింది. ఇక్కడ సుమారు రెండు దశాబ్దాలకు పైగా తెలుగు భాషా వికాసానికి కృషి చేశారాయన. ఈ సమయంలోనే ఆయన ఎక్కువగా వ్యాకరణ సిద్ధాంతాలపై పరిశోధనలు జరిపారు. అంతేకాదు చిన్నయసూరిగారు రాసిన బాల వ్యాకరణంపై శ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిగారు రాసిన వ్యాఖ్యానాలపై వజ్ఝలవారు సుమారు మూడు సంవత్సరాల పాటు వాదోపవాదాలు పత్రికా ముఖంగా చేశారు. అయితే, ఆ దరిమిలా వజ్ఝలవారు చేస్తున్న శాస్త్రీయ వాదననే పలువురు వ్యాకరణ పండితులు సమర్థిస్తూ ప్రశంసించారు. శాస్త్రిగారు చతురోక్తులతో, చక్కని సమయస్ఫూర్తి, గాంభీర్యంతో పలు పండిత సభలలో తన అపార పాండిత్యంతో అనర్గళంగా మాట్లాడి సభికులను ఆకర్షించేవారు!!

శ్రీ శాస్త్రి ఆనాటి పండితులందరి మాదిరిగానే ఎన్నో అష్టావధానాలు, శతావధానాలు చేశారు. ఎన్నో భాషా యుద్ధాలు, వాదోపవాదాలు ఆయన చేశారు. తిరుపతి వేంకటకవులు మొదలుకుని

నేటి ఆధునిక పండితుల దాకా కొన్ని వందలసార్లు భాషా శాస్త్ర చర్చలలో ఎదురొడ్డారు.

'ఆంధ్ర శబ్ద చింతామణి' గ్రంథం భారతాన్ని తొలుతగా ఆంధ్రీకరించిన నన్నయ్య రాసాడని, లేదు - నన్నయ్య రాసిన గ్రంథం కాదని వాదోపవాదాలు జరుగుతున్న రోజులవి. ఆ సందర్భంలో ప్రముఖ సాహితీవేత్త - కందుకూరి వీరేశలింగం పంతులుగారు సైతం నన్నయ్య, 'చింతామణి' గ్రంథాన్ని రాయలేదని నిర్ద్వందంగా పేర్కొంటారు.

అయితే ఈ వాదన సరికాదని, శ్రీ కందుకూరి వాదనలను శ్రీ వజ్ఝల ప్రతిఘటిస్తూ, సాధికారంగా, సప్రాణికంగా 'ఆంధ్ర శబ్ద చింతామణి' నన్నయ్యగారే రాశారని రుజువు పరిచారు. సంస్కృత పదాలను తెలుగులో ఎలా తెచ్చుకోవాలో 'ఆంధ్ర శబ్ద చింతా మణి' వివరిస్తుంది. నన్నయ్య రాసిన భారతంలోని తెలుగు పదాలను -- చింతామణిలోని సిద్ధాంత సూత్రాలను సరిచూపుతూ 'ఆంధ్ర శబ్ద చింతామణి' - నన్నయ్య రచనేనని అనుపమానంగా రుజువు చేశారు. ఆ నన్నయ్యే తిరిగి తాను 'చింతామణి' రాయలేదన్నా వజ్ఝలవారు మాత్రం ఒప్పుకోరేమోనని సాహితీకారులు ఛలోక్తిగా అంటుంటారు.



శ్రీ వజ్ఝలవారు మూర్తీభవించిన సజీవ వ్యాకరణ శాస్త్రంగా నాటి సమకాలీన సంస్కృతాంధ్ర పండితులు కొనియాడారు.

'సాహిత్య విమర్శలో కొత్తపాతల మేలు కలయిన - శ్రీ వజ్ఝల' అని శ్రీ గురజాడ అప్పారావు ఆనాటి పండితులకు పరిచయం చేశారు. విజయనగరంలో ఉండే రోజుల్లో శ్రీ వజ్ఝల - శ్రీ గురజాడ అప్పారావుకు చేదోడు వాదోడుగా ఉంటూ సహాయ పడేవారు. శ్రీ గురజాడ సూచనల మేరకే "వసుచరిత్ర విమర్శ"ను శ్రీ వజ్ఝల చేపట్టి తెలుగు సాహిత్యానికి అనన్యమైన సేవ లందించారు.

'ద్రావిడ భాషా పరిశీలనం' - రెండు భాగాల ఉద్గ్రంథాన్ని శ్రీ వజ్ఝల రాశారు. దక్షిణాది నాలుగు భాషలైన తెలుగు, మళ యాళం, కన్నడ, అరవం భాషలు, ఆ భాషల వ్యాకరణాన్ని క్షుణ్ణంగా తాను నేర్చుకుని, ఈ గ్రంథం రచించారంటే - ఆయనలోని పట్టుదల, ఏకాగ్రత, ఏపాటివో తేట తెల్లమౌతాయి.

అలాగే శ్రీ వజ్ఝల - రెండు భాగాలు గల "ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము", అధర్వణకారి కావళి పీఠిక, బాల సరస్వతీయ పీఠిక, - తదితర రచనలు వీరి నిశిత పరిశీలనా దృష్టికి దృష్టాంతాలు.

'వసుచరిత్ర విమర్శనము', హరిశ్చంద్ర నలో ప్రాఖ్యాన పీఠిక - వజ్ఝలవారి కావ్య విమర్శనా నైపుణ్యానికి నిదర్శనంగా చెప్పొచ్చు.

శ్రీ వజ్ఝల ఆంధ్రభాషాభిమాని.

పంచాఙ్గమ్, పఙ్క్తికణము, బిన్దువు తదితర మాటలను సులువుగా, పంచాంగం, పంక్తి, బిందువు అని రాసుకోవడమే మంచి సాంప్రదాయం అని ఛాందసులతో పోరాడి శాస్త్ర విరుద్ధ మని రుజువు చేసాడాయన. గొప్ప వ్యాకరణ పరిశోధకుడిగా కీర్తిగాంచిన శ్రీ వజ్ఝల చిన సీతారామశాస్త్రి, స్వల్ప అస్వస్థతో 1964 మే 29న స్వర్గస్తులైనారు.





సుప్రసిద్ధులైన వేంకట పార్వతీశ్వర కవులలో పేరును బట్టి, వయస్సు రీత్యా కూడా ప్రథములు - శ్రీ బాలాంత్రపు వేంకట రావు - రెండవ వారు శ్రీ వోలేటి పార్వతీశంగారు.

ఈ జంటకవులు ఇద్దరూ 'నర నారాయణుల'లాంటి వాళ్ళ మని చెప్పుకున్నారు. జీవాత్మ - పరమాత్మలులా, ప్రకృతీ - పురు షులులా వ్యవహరించారు. ఆంధ్ర సాహితీ గగనంలో ఈ కవి ద్వయం సూర్య చంద్రుల్లా వెలిగారు. 20వ శతాబ్ద తొలి భాగంలో సాహిత్య వినువీధుల్లో వీరు వీరవిహారం చేశారు. 'కవిరాజ హంసలు' - 'కవి కులాలంకారులు' అనే బిరుదులతో నవ్య కవిత్వ యుగకర్తలుగా ఈ జంట కవులు కీర్తి గడించారు.

విశ్వకవి రవీంద్రునిలాగ వేంకట పార్వతీశ్వర కవులు కవి తలు, కథానికలు, నవలలు, నాటకాలు, వ్యాసాలు, కావ్యాలు, ఖండ కావ్యాలు - ఇలా అనేక సాహిత్య ప్రక్రియలు చేశారు.

శ్రీ వేంకట్రావుగారు తూ.గో.జిల్లా మల్లాం గ్రామంలో 1881 జనవరి 2వ తేదీన జన్మించారు. తల్లి శ్రీమతి సూరమ్మ - తండ్రి శ్రీ వేంకట నరసింహం. ప్రాథమిక విద్య వరకే పాఠశాలలో చదివి, ఆ తరువాత స్వయంకృషితో సంస్కృతం - తెలుగు భాషలతో పాటు బెంగాలీ, కన్నడ భాషలలో కూడా పాండిత్యం ఆయన సంపాదించారు. తాను ఏ గురువు దగ్గర శాస్త్రాలు, కావ్యాలు ఏమీ చదువుకోలేదని ఆయన చెప్పుకున్నారు. అయినా పంచ కావ్యాలు, వ్యాకరణం, తర్కం, స్వయంకృషితో అవగతం చేసుకున్నానని ఆయన అంటారు.

శ్రీ సూక్తం, పురుష సూక్తం, సంధ్యావందనం మొదలైన వాటిల్లో రసాయన శాస్త్ర సంబంధిత విషయాలున్నాయని, అవి స్వర్ణయోగ రహస్యాలు చెబుతాయని, శ్రీ వేంకటరావు కొన్నాళ్ళు నమ్మేవారు. జ్యోతిష్యం, సంగీతం, వాస్తు శాస్త్రాలలో అపార పాండిత్యం గల శ్రీ వేంకటరావు భారతదేశంలో ఆర్ష ధర్మం మళ్ళీ మొలకెత్తాలని, మన పూర్వీకుల గొప్పదనాన్ని ఎలుగెత్తి చాటాలని అభిప్రాయపడేవారు.

తణుకులో తల్లాప్రగడ సూర్యనారాయణరావు దగ్గర కొంత కాలం ప్లీడరు గుమాస్తాగా పనిచేస్తూ ఆ ప్లీడరు గారు నడుపు తున్న 'సువర్ణ లేఖ' మాస పత్రికను శ్రీ వేంకటరావుగారే నిర్వ హించేవారు. ఆ తర్వాత కొంతకాలం పిఠాపురం పట్టణ సహకార బ్యాంకులో డైరక్టరుగా కూడా పన్జేశారు.

'ఆంధ్ర భీష్మ', 'మహోపాధ్యాయ' శ్రీ ఆచంట వేంకటరావు సాంఖ్యాయన శర్మగారు 'కల్పలత' అనే పత్రిక నడుపుతుండే వారు. 'కల్పలత' పత్రిక ఆ రోజులలో ప్రముఖ సాహితీ వేదికగా ఉండేది. పలు సమస్యలు - ప్రశ్నల పోటీలు ఆ పత్రిక తరచు నిర్వహించేది. అలాంటి ఒక ప్రశ్నల పోటీలో ఇతరులు అనేక మందితో పాటు, శ్రీ వేంకటరావు, శ్రీ పార్వతీశంగారు కూడా పాల్గొన్నారు. ఆ పోటీలో మొదటి బహుమతి శ్రీ ఓలేటి పార్వతీశం గారికి, రెండవ బహుమతి శ్రీ నడకుదిటి వీర్రాజు పంతులు, మూడో బహుమతి శ్రీ వేంకటరావుగార్కి వచ్చాయి. ఆ రకంగా, 'కల్పలత' సాహిత్య పత్రిక ద్వారా వేంకటరావు - పార్వతీశం గార్ల పరిచయం కల్గుతుంది. అయితే, వీరి ఇద్దరి పరిచయం, స్నేహంగా, గాఢానురాగం, కవిద్వయంగా కల్పిన ఘనత శ్రీ వీర్రాజు గారికే దక్కుతుందని, ఆనాటి సమకాలీన సాహితీ ప్రముఖులు చెప్తారు.

ఏది ఏమైతేనేమి, తిరుపతి వేంకట కవులు తెలుగువారి పద్యానికి ఎంత ప్రచారాన్నితెచ్చి పెట్టారో, వేంకట పార్వతీశ్వర కవులు 'ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల' ను స్థాపించి గద్యానికంత ప్రచారం చేశారు.



బెంగాలీ భాష నుండి అనేక నవలలను అనువాదం చేశారు. అనేక సాంఘిక, చారిత్రక నవలలు రాశారు. రెండు నెలలకు ఒక గ్రంథం చొప్పున అనేక సాహితీ ప్రచురణలను ప్రచురించారు.

కవిద్వయాలుగా 1909లో వీరు కవితా రచనలు చేయడం ప్రారం భించారని, 1937 నాటికి వీరు 170 పైగా గ్రంథాలు ప్రచురించారని సాహితీవేత్తలు అంటారు.

సామాన్య ప్రజానీకంలో సైతం పుస్తకాలు - ప్రచురణలు చదివే అలవాటును వీరు చేశారు.

1909కి పూర్వం శ్రీ వేంకటరావు 'ధనాభిరామము', 'యాచ సూర్యేంద్ర విజయం' (నాటకాలు), 'సురీస', 'కమలినీ కలహంస' (నవలలు), 'స్త్రీల వ్రత కథలు' అనే గ్రంథాన్ని రాశారు.

జంటకవులుగా శ్రీ వేంకటరావు - పార్వతీశంగార్లు అను రూప, చందమామ, హారావళి, బృందావనం అనే పద్య కావ్యాలు; వసుమతీ వసంతం, ప్రమదావనం, శ్యామల, మాతృ మందిరం - వంటి నవలలు; సీతారామ, రాజసింహ, గోరా, నౌకాభంగము, నీరద, కృష్ణకాంతుని మరణ శాసనము, నీలాం బరి, తదితర సాంఘిక, చారిత్రక, అపరాధ పరిశోధనా నవలలు బెంగాలు, కన్నడ భాషల నుండి అనువదించారు.

బాలల కోసం, యువత కోసం గోగీతం పద్యవీధి, లక్ష్మీ విలాసం; మొదటి తరగతి నుండి ఐదవ తరగతి విద్యార్థులకు ఉపయోగపడేలా 'బాల గీతావళి' - ఐదు భాగాలను వీరు ప్రచురించారు. అలాగే, బొమ్మల రామాయణం, బొమ్మల భారతం, బొమ్మల భాగవతం కూడా వీరు రాశారు.

సంప్రదాయ జంటకవులుగా ప్రఖ్యాతి చెందిన వీరు-ఏడు భాగాలు గల 'శివ పురాణం', మూడు భాగాలతో 'బ్రహ్మ పురాణం', 'వామన పురాణం' వీరు రచించారు.

ఈ జంట కవులు తమ జీవిత కాలంలో అవిరళమైన సాహిత్య కృషి చేసి, తమ జీవితాలను ధన్యం చేసుకున్నారు. వీరిద్దరు ఒకే గళంతో, ఒకే కలంతో ఆంధ్ర సాహిత్యానికి ఎనలేని కృషి చేశారు. కలిమిలో - లేమిలో కష్ట సుఖాలల్లో ఆంధ్ర కవితా సరస్వతిని సమానంగా ఆరాధించారు.

**ఏకాంతసేవ : గేయ కావ్య రచన :**

అయితే, వీరు రచించిన 'ఏకాంతసేవ' ఒక చక్కని గేయ కావ్యం. ఆంధ్ర రాష్ట్రంలో ఆనాడు సాహితీ వేత్తలందర్నీ ఉర్రూత లూగించింది. తెలుగు సాహిత్య చరిత్రలో 'ఏకాంతసేవ' లాంటి కావ్యం మరొకటి లేదని భావ కవితా చక్రవర్తి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి అంటారు.

62 గేయాలతో ఈ కావ్యం హృదయానందాన్ని, నిగూఢ ఉప నిషత్ అర్థాలతో ఆత్మానందాన్ని పంచియిచ్చిందని, ఆనందా మృతంలో తేలియాడేలా 'ఏకాంతసేవ' కావ్యం ఓలలాడిం చిందని సాహిత్య వేత్తల అభిప్రాయం.

దివ్య ప్రణయలీల, ప్రకృతి సౌందర్యం ఈ కావ్యంలో దర్శనమిస్తాయి. ఆత్మ - పరమాత్మ కొరకు అనుభవించే విరహం, ప్రార్థన, లాలింపు, సందర్శన, సాంగత్యకాంక్ష - ఈ కావ్యంలో ముగ్ధ మనోహరంగా జంట కవులు వర్ణించారు.

భక్తుడు తనను ప్రియురాలుగా పోల్చుకుంటాడు. తన ఆరాధ్యుడైన ఆ పరమేశ్వరుని కోసం పరితపిస్తాడు. ఇదొక ఉత్కృష్టమైన కావ్యరచనగా ప్రశంసలు అందుకొంది.

ప్రభువును ప్రాణేశ్వరునిగా, ఈ విశ్వాన్నంతా ప్రాణవిభుని మందిరంగా పోల్చడంలో విశ్వకవి రవీంద్రుని పోలిందని, బెంగాలీయులకు 'గీతాంజలి'లా - తెలుగువారికి 'ఏకాంతసేవ' కావ్యం అలాంటిదని, నూతన ఆంధ్ర సారస్వతంలో యిలాంటి కావ్యం మరొకటి లేదని, దేవులపల్లి ప్రశంసించారు.

అయితే, ఈ వ్యాఖ్యను అపార్థం చేసుకొని రవీంద్రుని గీతాంజలికి - ఏకాంతసేవ కావ్యం అనువాదం అని అపోహ పడతారు కొందరు. నిజానికి అది కేవలం అపోహ మాత్రమే. ఆనాడు ప్రతీనోటా - ప్రతీ ఇంటా, ప్రతీ సాహిత్య సభలో 'ఏకాంత సేవ' గీతాలే వినిపించేవట.

ఏకాంతసేవ - వేదాంత సుధ, పేరుతో వ్యాఖ్యానాన్ని జంట కవులలో ఒకరైన శ్రీ వోలేటి పార్వతీశంగారి మనుమరాలు శ్రీమతి చాగంటి సీతాలక్ష్మీదేవి రాశారు. ఆమె ఈ కావ్యాన్ని ఆంగ్లంలో కూడా అనువదించారు.

అలాగే, శ్రీ వేంకటరావు గారి కుమారుడు శ్రీ రజనీకాంతరావు ఈ కావ్యాన్ని Alone With The Spouse Divine పేరిట ఇంగ్లీషులో తర్జుమా చేస్తే, తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురించింది. ఆ రకంగా జంట కవులు సంబంధీకులు వారి పెద్దల రచనను ఆంగ్లంలో అనువదించడం గమనించాలి.

ఎన్నో గ్రంథాలు - రచనలు చేసిన ఈ జంట కవులు ఆఖరిగా పిఠాపురం యువరాజు శ్రీరావు వేంకట మహీపతి గంగాధర రామారావు కోర్కె మేరకు తెలుగులో రామాయణం రాయాలని పూనుకుంటారు. ఏడు కాండాలు గల వాల్మీకి రామాయణం





లోని, ఐదు కాండాలు మాత్రమే రాయడం పూర్తి చేసిన అనంతరం శ్రీ వోలేటి స్వర్గస్థులయ్యారు.

అసంపూర్తిగా నిల్చిన రామాయణ అనువాదాన్ని తన స్నేహితుని పైగల ప్రేమవల్లనో, మరేయితర కారణాల వల్లనో కాని శ్రీ వేంకటరావుగారు రచన పూర్తి చేయడానికి పూనుకోలేదు.

అయితే శ్రీ వోలేటి కుమారుడు శ్రీ అచ్యుతరామచంద్ర మూర్తి, ఎంతో సమర్థవంతంగా మిగిలిన భాగాన్ని పూర్తిచేశారు.

ఈ శతాబ్దపు తెలుగు కవితా యుగ కర్తలుగా కీర్తించ వలసిన ఈ జంట కవులకు తగిన సముచిత స్థానం లభించలేదని వీరి అభిమానులు, సాహితీ చరిత్రకారులు అంటారు.

ఈ విషయంలో ఎలాంటి సందేహం లేదు.

ఎలాంటి ఫలాపేక్ష ఆశించక సాహితీ సేవకే తమ జీవితాన్ని సంపూర్ణంగా అంకితం చేసిన శ్రీ బాలాంత్రపు వేంకటరావు 1972 అక్టోబర్ 27న స్వల్ప అస్వస్థకు గురై స్వర్గస్థులైనారు.

శ్రీ వేంకటరావుగార్కి ఇద్దరుకుమారులు. శ్రీ నళినీకాంత రావు, శ్రీ రజనీకాంతరావు. ఈ ఇద్దరూ కూడా బహుముఖ ప్రతిభావంతులే. శ్రీ రజనీకాంతరావు మంచి సంగీత శాస్త్ర నిధి. 'ఆంధ్ర వాగ్గేయ కారచరిత్ర'ను రచించారు. ఆకాశవాణిలో ఉన్నత పదవిలో పనిచేసి రిటైరైనారు.

# మరపురాని మనిషి



## అయ్యంకి వేంకట రమణయ్య

205



మహాసభలు విజయవాడలో నిర్వహించి, గ్రంథాలయ సంఘాన్ని, ఆ సంఘం తరపున "గ్రంథాలయ సర్వస్వం" పేరున పత్రికను నిర్వహించాడాయన.

అఖిలభారత స్థాయిలో కూడా 'అఖిల భారత పౌర గ్రంథాలయ సంఘాన్ని' 1919లో స్థాపించి, ఆ సంఘం తరపున "ఇండియన్ లైబ్రరీ జర్నల్" ఆంగ్ల పత్రికను నిర్వహించాడాయన.

1910లో 'ఆంధ్ర భారతి', 1927లో 'కొరడా' పత్రికలను శ్రీ అయ్యంకి నిర్వహించారు. నూతన గ్రంథాలయాల ఏర్పాటుకు, మూలన పడిన అనేక లైబ్రరీల పునరుద్ధరణ కోసం, గ్రంథాలయ కార్యకర్తలకు శిక్షణాతరగతులు నిర్వహిస్తూ, రాష్ట్రంలోని పలు మారు మూల

'గ్రంథాలయోద్యమ పితామహుడి'గా - శ్రీ అయ్యంకి వెంకట రమణయ్య ఆంధ్రులందరికీ సుపరిచితులు. శ్రీ అయ్యంకి గొప్ప సంఘసంస్కర్త, స్వాతంత్ర్య సమరయోధుడు, పత్రికా సంపాదకుడు కూడా...

శ్రీ అయ్యంకి 1890 ఆగష్టు 7వ తేదీన తూర్పు గోదావరి జిల్లా కొనకుదురులో జన్మించారు. తండ్రి వెంకటరత్నం, తల్లి మంగమాంబ.

ప్రముఖ జాతీయ నాయకుడు శ్రీ బిపిన్ చంద్రపాల్ యొక్క ఉపన్యాసాన్ని రాజమండ్రిలో విని, ఉత్తేజితుడై హైస్కూలు చదువులకు స్వస్తి పలికి, స్వాతంత్ర్య సమర పోరాటంలో పాల్గొన్నాడాయన.

గ్రంథాలయాలు ప్రజల విశ్వవిద్యాలయాలుగా పేర్కొంటూ, రాష్ట్రంలో పలు గ్రంథాలయాల స్థాపనకు, వాటి అభివృద్ధికీ ఆయన తన జీవితాంతం కృషి చేశాడు. గ్రంథాలయ ఉద్యమం స్వాతంత్ర్య సాధనకు, ప్రజలను చైతన్యవంతుల్ని చేయడానికి ఉపయోగపడుతుందని ఆయన ఆశించాడు. సుమారు ఆరు దశాబ్దాలు గ్రంథాలయ రంగంలో విశేష కృషి చేశాడాయన. తొలుతగా, 1911లో రామమోహన గ్రంథాలయాన్ని విజయవాడలో నెలకొల్పాడు.

అలాగే, ప్రథమంగా 1914లో ఆంధ్రదేశ గ్రంథాలయ

గ్రామాలలో సయితం ఆయన పర్యటించాడు. ఆయన చేసిన అవిరళ కృషికి గుర్తింపుగా 'గ్రంథాలయ శాస్త్ర విశారద', 'గ్రంథాలయ పితామహ', 'గ్రంథాలయోద్ధారక', 'సరస్వతీ సామ్రాజ్య ప్రతిష్ఠాపనాచార్య' వంటి అనేక బిరుదులతో సాహితీవేత్తలు పలువురు ఆయన్ని సత్కరించారు.

1972లో భారత ప్రభుత్వం ఆయనికి "పద్మశ్రీ" గౌరవాన్ని అందించింది. ఆ మహనీయుని సేవలు స్మరించుకునేలా - 1979 నుండి ఉత్తమ గ్రంథాలయ కార్యకర్తలకు శ్రీ అయ్యంకి లైబ్రరీ అవార్డులు అందజేస్తున్నారు.

శ్రీ అయ్యంకి గ్రంథాలయోద్యమంతోపాటు, హోంరూలు ఉద్యమంలో, దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి 'రామదండు', ఆంధ్రబాలభటోద్యమం, వయోజనవిద్య, దివ్యజ్ఞాన సమాజం, సహకార ఉద్యమాలలో ప్రముఖ పాత్ర వహించాడు.

శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారితో కలిసి ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నడాయాన. తెలుగువారికోసం, పలు ప్రాంతాల్లో గ్రంథాలయాల ఏర్పాటుతోపాటు, ఆంధ్రుల అభ్యున్నతికి, సామాజిక వికాసానికి అవిరళ కృషి చేసిన శ్రీ అయ్యంకి 1979 మార్చి 7న విజయవాడలో తుదిశ్వాస విడిచారు.



# మరపురాని మిత్రం



## రాయప్రోలు సుబ్బారావు

207



**భా**వ కవితా పితామహుడు - శ్రీ రాయప్రోలు సుబ్బారావు.

దేశ స్వాతంత్ర్యం కోసం ఉద్యమాలు, మరోవైపు తెలుగు వారందరూ ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కోరుతూ ఆంధ్రోద్యమాలు ముమ్మరంగా కొనసాగుతున్న రోజుల్లో దేశభక్తి గీతాలు, రాష్ట్రాభిమానం, ప్రభోధించే అనేక గీతాలు రచించి ఆధునిక ఆంధ్ర కవితా లోకంలో తనదంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని శ్రీ



రాయప్రోలు పొందారు.

రాయప్రోలువారి గీతం

"ఏ దేశమేగినా ఎందుకాలిడిన,
ఏ పీఠమెక్కినా, ఎవ్వరేమనిన,
పొగడరా నీ తల్లి భూమి భారతిని,
నిలుపరా నీజాతి నిండు గౌరవము'

నేటికీ - తెలుగునాట ప్రతి ధ్వనిస్తూనే ఉంది.

"సిరులు పొంగిన జీవగడ్డయి,
పాలు పాతిన భాగ్యసీమయి,
వ్రాలినది యీ భరత ఖండము,
భక్తి పాడరా తమ్ముడా!"

"వేద శాఖలు పెరిగె నిచ్చట,
ఆది కావ్యం బందె నిచ్చట,
బాదరాయణ పరమ ఋషులకు,
పాదుసుమ్మిది చెల్లెలా!"

- ఇలా రాయప్రోలువారి అనేక గీతాలు జాతీయభావాన్ని ప్రబోధిస్తూ, గతంలో ఎవ్వరూ చేయలేని విధంగా ఉద్వేగపూరిత చైతన్యాన్ని కల్గించాయి. ఆంధ్రోద్యమ సమయంలో ఈ పద్యాలను శ్రీ దుగ్గిరాల గోపాల కృష్ణయ్య తన సహజ గంభీర ధోరణిలో పఠిస్తూ, ఆనాటి సామాన్య ప్రజలను సయితం చైతన్యపూరితుల్ని చేయడం, ఆంధ్రుల చరిత్రలో చిరస్మరణీయం.

శ్రీ రాయప్రోలు సుబ్బారావు 1892 మార్చి 17న గుంటూరు జిల్లాలోని గార్లపాడు గ్రామంలో జన్మించారు.

1908లో విద్యార్థిగా ఉండే రోజులు నుంచే అనేక కవితలు - పద్యాలు రాయడం శ్రీరాయప్రోలు ప్రారంభించారు. కాకినాడలో రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి ప్రోత్సాహంతో హైస్కూలు విద్య, మెట్రిక్యు లేషన్ పూర్తయ్యాక, ఉన్నత చదువులకు పోకుండానే హైదరాబాద్‌లో శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు ప్రారంభించిన 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం' రూపొందించడంలో సహాయ సంపాద కులుగా చేరారు. ఆ తర్వాత విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ రచించిన 'గీతాంజలి' పలుమార్లు చదివి, స్పందించి, శాంతిని కేతనంలో కొంతకాలం ఉండటానికి ముందుగా రవీంద్రుని అనుమతి తీసుకున్నారు. 1915 నుండి 1918 వరకూ శాంతిని కేతనంలో పలువురు కవి పండితుల సాహిత్యాన్ని అధ్యయనం చేశారు. శాంతినికేతనం నుండి కాశీ వెళ్ళి సుమారు ఏడాది పాటు సంస్కృత పండితుల వద్ద వివిధ శాస్త్రాలు అధ్యయనం చేసి విజయవాడచేరి, తన సాహితీ కృషి ప్రారంభించారు. కొంతకాలం తన మేనమామ శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యంశాస్త్రితో కలిసి ఆశుకవిత్వం, అవధాన ప్రదర్శనలలో పాల్గొన్నారు. ఆ తర్వాత శ్రీ రాయప్రోలు 38 సంవత్సరాల పాటు రాష్ట్రంలోని పలు విద్యాసంస్థలలోని తెలుగుశాఖలలో వివిధ పదవులు చేపట్టి విద్యారంగ పరిపుష్టికి విశేష కృషి చేశారు. శ్రీ రాయప్రోలు 1921లో ఉస్మానియా విశ్వ విద్యాలయంలోని తెలుగు శాఖలో అధ్యాపకులుగా, రీడర్‌గా, ప్రొఫెసర్‌గా పనిచేశారు. వరంగల్లు లోని కళాశాల ప్రిన్సిపాలుగా, 1956లో తిరుపతి వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖాధిపతిగా మూడు సంవత్సరాలు పనిచేసి 1959లో సికింద్రాబాద్‌లోని మారేడు పల్లిలో స్థిరపడ్డారు. శ్రీ రాయప్రోలు రచనలు తృణకంకణం, స్నేహలతాదేవి, ఆంధ్రావళి, మాధురీదర్శనం - ఇలా అనేక కావ్యసంపుటాలుతోపాటు శంకరాచార్యులవారి 'భజ గోవిందం', 'సౌందర్యలహరి' శ్లోకాలను ఆంధ్రీకరించారు. వాల్మీకి రామాయణం, సుందరకాండలను గేయరూపంలో అత్యంత రమణీయంగా రూపొందించారు.

అంతేకాకుండా ప్రముఖ ఆంగ్లకవి గోల్డ్‌స్మిత్ రచించిన "హెర్మిట్" కావ్యాన్ని 'లలిత'గా , టెన్నిసన్ రచించిన "డోరా" ను 'అనుమతి'గా తెలుగులో పద్యకావ్యాలుగా శ్రీ రాయ ప్రోలు అనువదించారు. ఉమర్ ఖయ్యాము - రుబాయిలను పారశీక మూలం నుండి కాకుండా, ఫిట్ జెరాల్డ్ ఆంగ్లానువాదం నుండి తెలుగులో 'మధుకలశం'గా ప్రచురించారు. ఇవికాక, మిశ్రమంజరి, ఆంధ్రావళి, జడకుచ్చులు, వనమాల వంటి అనేక ఖండకావ్యాలు శ్రీ రాయప్రోలు మనోహరంగా రూపొం దించి తెలుగువారికి అందించారు. 'మిశ్రమంజరి' ఖండ కావ్యానికి 1965లో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. శ్రీరాయప్రోలు సుబ్బారావు తెలుగు సాహిత్యంలో ఒక నూతనాధ్యాయం సృష్టించారు. సాధు, సాత్విక రమణీయ దంపతీ శృంగారమే మానవున్ని ఉదాత్తుణ్ణి చేస్తుందని శ్రీ రాయప్రోలు తన కావ్య ఖండికల ద్వారా ప్రబోధించారు. తెలుగు సీమ సొగసు, తెలుగువారి ఆచార, వ్యవహారాలు, భాషా సౌకుమార్యం, భావ గంభీరతలతో పాటు ఆంధ్ర ప్రాభవం మనోహరంగా, చక్కని పదాల కూర్పుతో, రమణీ యంగా గానం చేసిన మహాకవి శ్రీ రాయప్రోలు సుబ్బారావు.

నవ్య సాహిత్య పరిషత్ అధ్యక్షునిగా, ఆంధ్ర పండిత పరిషత్ అధ్యక్షునిగా, రేడియో సలహా సమితి, ఫిలింసెన్సార్ బోర్డు, కేంద్ర, రాష్ట్ర సాహిత్య అకాడమీ సలహా సంఘం సభ్యునిగా శ్రీ రాయప్రోలు విశేష సాహితీ సేవలు అందజేశారు.

తెలుగు సాహితీలోకంలో భావ కవిత్వ యుగకర్తగా కీర్తించ బడ్డ శ్రీ రాయప్రోలు 1984 జూన్ 30న సికింద్రాబాద్‌లో తుదిశ్వాస విడిచారు.

ఈ శతాబ్ది తెలుగు కవి పెద్దలలో మహాకవి శ్రీ రాయ ప్రోలు. వారి రచనలు నేటి యువత, రచయితలకు ఆదర్శం, నూతన స్ఫూర్తి కూడా.





**20** సంవత్సరాల వయస్సులోనే తిరుపతి వేంకట కవుల చేత 'మహాస్సాగర' అని ప్రస్తుతించబడ్డ గొప్ప తెలుగు కవి, కథకుడు, నవలా రచయిత, తత్వవేత్త, బహుభాషా పండితుడు, అన్నింటిని మించి గొప్ప జాతీయవాది - గాంధీజీ అనుయాయుడు - శ్రీ వేలూరి శివరామశాస్త్రి.

సాంఖ్య, యోగ, తర్క, వేదాంత శాస్త్రాలను క్షుణ్ణంగా అభ్యసించాడాయన. ఖగోళ, భూగోళ శాస్త్రాలను నిశితంగా శోధించి సాధికారమైన గ్రంథాలు రాసారు.

బెంగాలీ భాషలోని శరత్, రవీంద్రుల నవలలను తెలుగులో అనువదించారు. అందులో 'బాపనపిల్ల, అరక్షణీయ, బిందు గారబ్బాయి, రాముని బుద్ధిమంతనం తదితర నవలలు ప్రముఖమైనవి.





గుజరాతీ భాషనేర్చుకొని 'గాంధీజీ ఆత్మకథ' ను శ్రీ వేలూరి తెలుగులో రాశారు. 'ఫ్రెంచిలో విక్టర్ హ్యూగో రాసిన "లే మిజరబుల్స్"; సర్ వాంటిస్ స్పానిష్ నవల - "డాన్ క్విక్సోట్"లను శ్రీ వేలూరి తెలుగులో అనువదించారు.

శ్రీ వేలూరి చేసిన - ఉత్తర హరివంశ విమర్శ, ఎఱ్ఱన హరివంశం, నరసింహ పురాణాలపై - లఘు కావ్యాలు నేటికీ పండితులకు ప్రామాణికంగా పేర్కొంటారు.

శ్రీ వేలూరి సాహితీ రచనలు క్రొత్త - పాతల మేలు కలయికకు ఒక దిక్సూచి అని సమకాలీన సాహితీవేత్తలు అంటారు.

ఆయన ప్రాచీన మార్గంలో పురాణాలను, ప్రబంధాలను నవ్యమార్గంలో లఘుకావ్యాలు, ఖండకృతులు రాశారు. సులతానీ, డిప్రెషన్ చెంబు, ఒకటే చీర తదితర కథలు - తొలినాటి తెలుగు కథానికలకు రూపు రేఖలు తీర్చిదిద్దాయని అంటారు.

శ్రీ వేలూరి రచనలు ఒక అద్వితీయ సందేశం



అందించేలా ఉంటాయని, ఆయన నిరాడంబరత, నిష్కళంక జీవితం ప్రతిబింబించేలా ఉంటాయని నేటి సాహితీ విమర్శకులు అంటారు.

19 సంవత్సరాల చిన్న వయస్సులోనే గుంటూరులో సంపూర్ణ శతావధానం చేసి పలువురు పెద్దలచేత ప్రశంసలందుకున్నాడాయన.

ఆ తర్వాత కొంతకాలం విజయ ధుందుభి మోగిస్తూ పలు చోట్ల అష్టావధాన, శతావధానాలు చేశాడాయన.



శ్రీ వేలూరి కృష్ణా జిల్లాలోని చిరివాడ అగ్రహారంలో 1892 ఏప్రిల్ 9న ప్రముఖ సాహితీ కుటుంబంలో జన్మించారు. తండ్రి వెంకటేశ్వరావధానులు - తల్లి విశాలాక్షి.

తర్క వేదాంత శాస్త్రాలను వేమూరి రామ బ్రహ్మశాస్త్రి దగ్గరా, అపర పతంజలిగా ప్రఖ్యాతిగాంచిన జయంతి భగీరథ శాస్త్రిగారి దగ్గర అలంకార వ్యాకరణ శాస్త్రాలను అధ్యయనం చేశారు.

తిరుపతి వెంకటకవులను తన గురువులుగా కీర్తించా డాయన. మిడిల్ స్కూల్‌లో ఇంగ్లీషును మానివేసి, స్వయం కృషితో ఇంగ్లీషు నేర్చానని ఆయన అంటారు.

సంగీతంపై అభిరుచితో, పట్టుదలతో సంగీతం కూడా శ్రీ వేలూరి నేర్చారు.

శ్రీ వేలూరికి చదువు చెప్పిన గరికపాటి జోగిశాస్త్రి గారు గొప్ప పౌరాణికులు. ఆయనకు చక్కని గాత్రం ఉంది. ఆయన నోట ఒకరోజు మధురమైన రాగం విని, శ్రీ వేలూరి ఆ రాగాన్ని ప్రయత్నించబోతే, గొంతు పెగల్లేదట. దాంతో ఆవేదనతో -

"గాతే గురుః గురుసుత శ్చ సుతా చ గాతే
నాహం ప్రభుః యదపి కంఠ విలుంఠనేన,
హా! సామగానగురు మే శృణు కంఠనాళః
త్వద్వస్త్ర సీమని భవిష్యతి వేణు నాళః"

- అని భగవంతుడ్ని ప్రార్థించారట. ఆ తర్వాత సాధనతో సంగీత జ్ఞానం కూడా పొందారని - ఆయన సమకాలీనులు అంటారు.

తిరుపతి వేంకట కవులలో ఒకరైన తిరుపతి శాస్త్రిగారి మరణానంతరం, ఏలూరులో ఏర్పాటు చేసిన సంతాపసభలో పాల్గొనేందుకు శ్రీవేలూరి వెడతారు. ఆ సభకు తాను ఎంతో శ్రమించి తెలుగులో రాసిన అలంకార శాస్త్ర గ్రంథాలు, నాటకాల రాత ప్రతులు మరి ఇతర అనేక అమూల్య గ్రంథాలు తనతో తీసుకెళ్ళారు. అయితే ఈ పుస్తకాలన్నీ ఉన్న ఆయన పెట్టెను దొంగలెవరో దొంగిలించారు. ఇదిలా ఉంటే, గోరుచుట్టుపై రోకలి పోటులా, మరికొద్ది రోజులకే ఆయన స్వగ్రామంలోని ఇంట్లో ఎంతో కాలంగా పదిలంగా భద్రపరచుకున్న తన సొంత గ్రంథాలయం - అగ్ని ప్రమాదానికి గురై గ్రంథాలన్నీ బూడిదపాలౌతాయి. ఇలాంటి అగ్ని పరీక్షను తట్టుకోవడం అంత సులభమైంది ఏమీ కాదు.

ఈ సందర్భంగా శ్రీ వేలూరి తన హృదయ వేదనను అగ్నిహోత్రుడితో ఇలా చెప్పుకుంటారు :

"కాల్చితి విల్లు సర్వమును
గాల్చితి సాత్రము లూతముట్టుగా
గాల్చితి వెల్లయున్ ధనము
కాల్చితి వెల్లయు ధాన్యరాశులన్
గాల్చితి వున్న వెల్లయును
గాల్చిన గాల్చితి కాక గ్రంథమున్
కాల్చిన నీకు నో జ్వలన!
కడ్పది నిండెనొ కాలు నిండెనో?

- అని అగ్నిహోత్రుడితో తన ఆవేదన చెప్పుకున్నారు. తగులబడిపోయిన గ్రంథాలను చూసి విలపిస్తూ -

"పెంచితి పెద్ద చేసితిని
ప్రీతియుతంబుగ రాణివాసమం
దుంచితి రాజయోగ్య కుసుమోస
వనంబులు క్రుమ్మరిల్ల ని
ర్మించితి విస్మరించితిని మేదినిమింటిని నొక్క పెట్టన
ర్పించితి నిన్ను నగ్గి కిని పెన్ బలిగా
గవితా సరస్వతీ!"

- అని ఆక్రోశించారు.

ఆ తర్వాత స్వగ్రామంలో ఊరికి దూరంగా, మామిడితోటలో ఒక కుటీరం నిర్మించుకుని ఎన్నో అమూల్య గ్రంథాలు సేకరించారు. మరెన్నో అమూల్య రచనలు చేశారు. శిష్యులకు పాఠాలు నేర్పుతూ ప్రశాంతంగా సుమారు 25 సంవత్సరాలు ఏకాంతంగా గడిపారు.

శ్రీ వేలూరి వారి రచనలు నేటి తరానికి మార్గదర్శకాలు. సుమారు ఐదు దశాబ్దాలకు పైగా సాహితీ సేవ చేసిన 'వాఙ్మయ తపస్వి' శ్రీ వేలూరి శివరామశాస్త్రి 1967మార్చి 17వ తేదీన స్వర్గస్థులైనారు.





**శ్రీ** ఖాసా సుబ్బారావు జనవరి 23, 1896లో నెల్లూరు జిల్లాలో జన్మించారు. నెల్లూరులో ప్రాథమిక విద్య వరకూ ఆపైన మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాల నుండి తత్వశాస్త్రంలో గ్రాడ్యుయేషన్ పూర్తిచేశారు. మాజీ రాష్ట్రపతి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ ఆ రోజుల్లో మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో తత్వశాస్త్ర ఆచార్యులుగా పనిచేస్తుండేవారు. ఆ రకంగా శ్రీ సర్వేపల్లి వారి శిష్యుడు - శ్రీ ఖాసా. ఆ పిదప కొద్దిరోజులు అమావన్ రాజాస్థానంలో ప్రైవేటు సెక్రటరీగా కొద్దికాలం పనిచేశారు. ఆ తర్వాత రాజమండ్రి



లోని ఆర్ట్స్ కాలేజీ నుండి టీచర్స్ ట్రైనింగ్ కోర్సు చేసి నెల్లూరు జిల్లా ఆత్మకూరులో టీచరుగా, హెడ్మాష్టరుగా పన్జేసారు. 1924లో శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు ప్రారంభించిన 'స్వరాజ్య' పత్రికలో సహాయ సంపాదకులుగా, లీడర్ రైటర్‌గా 12 సంవత్సరాలపాటు, దాదాపు ఆ పత్రిక మూతపడేవరకూ, పనిచేశారు.

స్వాతంత్ర్య సమరంలో గాంధీజీ పిలుపు అందుకుని ఉప్పు సత్యాగ్రహం ఆందోళనలో పాల్గొన్నారు. 1930లో ఈ ఆందోళనలో భాగంగా తన జిల్లాలోని గ్రామ గ్రామాన్ని తిరిగి ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయడంలో పాల్గొన్నారు. ఈ సందర్భంగానే ప్రప్రథమంగా శ్రీ ఖాసాను ఆంగ్లేయ అధికారులు నిర్బంధించి జైలు శిక్ష విధించారు.

విదేశీ వస్తు బహిష్కరణలో భాగంగా కొంతమంది పిల్లల్ని బ్రిటీషు పోలీసులు విచక్షణా రహితంగా లాఠీలతో బాధిస్తుంటే, శ్రీ ఖాసా ఆ దృశ్యాన్ని చూడలేక, ఆయన కూడా పిల్లలతో పాల్గొంటే, పోలీసుల లాఠీ దెబ్బలతో స్పృహ కోల్పోగా ఆసుపత్రిలో చేర్పించారు. ఈ విషయం ఆనాటి మద్రాసు పట్టణంలో ఎంతో అలజడిని సృష్టించడమే కాకుండా, "హౌస్ ఆఫ్ కామన్స్" లో చర్చకు గూడా గురైంది. బ్రిటీషు పార్లమెంటు ఈ విషయాలపై విచారించేందుకై 'లోథియన్ కమీషన్' నియమించింది.

ఆ దరిమిలా, బ్రిటీషు ప్రభుత్వం పోలీసులు లాఠీచార్జీ చేసేటప్పుడు లాఠీలకు ఇనుప వస్తువులు ఏమీ ఉండరాదని నిషేధాజ్ఞలు జారీ చేశారు.

ఏదో కొద్దికాలం అధ్యాపక వృత్తిలో పన్జేసినా, శ్రీ ఖాసా తన

జీవితాంతం గొప్ప జర్నలిస్టుగానే పన్జేశారు. జైలు నిర్బంధం పూర్తయ్యాక, కలకత్తాలోని 'ఇండియన్ ఫైనాన్స్' పత్రికలో ఒక సంవత్సరంపాటు చేశారు. ఆ తర్వాత బొంబాయి నుండి ప్రచురించే 'ఫ్రీ ప్రెస్ జర్నల్'లో పన్జేశారు. శ్రీ ఖాసా రాసిన సంపాదకీయాలు ఆనాటి స్వాతంత్ర్య ఉద్యమ నాయకులనే కాకుండా, గాంధీజీని సయితం ఆకర్షించేలా ఉండేవి.

శ్రీ ఖాసా 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' ఆంగ్ల దినపత్రికకు 1940లో జాయింట్ ఎడిటర్‌గా చేరి, తర్వాత ఆ పత్రిక సంపాదకునిగా పన్జేశారు. 1942లో 'క్విట్ ఇండియా' ఉద్యమంలో భాగంగా జైలు శిక్ష అనుభవించారు. శ్రీ ఖాసా 1946 ఫిబ్రవరి 16న 'స్వతంత్ర' వారపత్రికను స్వయంగా ప్రారంభించారు.

తనకున్న అనేక ఆర్థిక ఒడిదుడుకులకు తోడు, ఉన్నత ఆశయాల పుణ్యమా అని శ్రీ ఖాసా ప్రారంభించిన పత్రిక ఎక్కువ కాలం కొనసాగలేకపోయింది. తిరిగి, 1956 జూలైలో శ్రీ రాజాజీ ఆశీస్సులతో కొద్దిపాటి బడ్జెట్‌తో ఆంగ్లంలో 'స్వరాజ్య' ఆంగ్ల పత్రికను ప్రారంభించారు. కానీ మూడేళ్ళ తర్వాత 'కల్కి' శ్రీ టి. సదాశివంకు యాజమాన్య బాధ్యతలు అప్పగించి, తాను పత్రిక సంపాదకత్వం చేపట్టారు.





సామాన్య ప్రజల బాగుకోసం, వారి ఉన్నతి కోసం, 'స్వరాజ్య'లో శ్రీ ఖాసా ప్రత్యేక శీర్షిక 'సైడ్‌లైట్స్'ను తన కలం పేరు 'ఖాసా'గా తన జీవితంలో చివరి క్షణం వరకూ రాశారు. శ్రీ ఖాసా 1961 జూన్ 16న తుది శ్వాస విడిచారు. (ఆయన 'సైడ్‌లైట్స్' కలం పేరు 'ఖాసా' తో 'స్వరాజ్య'లో జూన్ 16, 1961న చివరి సారిగా ప్రచురితమయ్యాయి). శ్రీ ఖాసా గొప్ప జర్నలిస్టే కాదు. గొప్ప మానవతావాది. అభ్యుదయ ఆశయాలు గల శ్రీ ఖాసా ఆంధ్రులకు ప్రాతఃకాల స్మరణీయుడు.





"జీవితం ఎంతో అందమైంది. జీవితంలో మరెంతో మాధుర్యం ఉంది. ఆ మాధుర్యాన్ని అనుభవించడమే మన విధి" అని శ్రీ ఆచంట జానకిరామ్ అంటారు.

"మన చుట్టూ ఎంతో సౌందర్యం ఉంది. ఈ సౌందర్యాన్ని అవగాహన చేసుకొని, మన జీవితంలో ప్రతి నిముషం ఎంతో విలువకలదిగా చేసుకోవచ్చు" అని శ్రీ ఆచంట అభిప్రాయ పడతారు.

ఇది అక్షర సత్యం!

శ్రీ ఆచంట జానకిరామ్ గొప్ప సౌందర్యోపాసకుడు, సాహితీ వేత్త, విమర్శకుడు. అన్నింటికీ మించి గొప్ప చిత్రకారుడు.

స్నేహం గురించి ఆయన ప్రస్తావిస్తూ - స్నేహాన్ని ఒక గొప్ప



సంపదగా ఆయన పేర్కొంటారు.

స్నేహానికి - సౌందర్యానికి అధిక ప్రాధాన్యతనిచ్చే శ్రీ ఆచంట జానకిరామ్ ఆకాశవాణిలో అనేక ఉన్నత పదవులు నిర్వహించారు.

స్వాతంత్ర్యం పూర్వమే, 1938 జూన్ 16న ఆనాటి బ్రాడ్ కాస్టింగ్ మీడియాలో చేరారు.

శ్రీ జానకిరామ్ 1903 జూన్ 16న జన్మించారు. తండ్రి. డా॥ లక్ష్మీపతి, తల్లి శ్రీమతి డా॥ ఆచంట రుక్మిణమ్మ.

శ్రీమతి రుక్మిణమ్మ ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో వైద్య, ఆరోగ్య శాఖ మంత్రిగా ఉన్నారు.

శ్రీ ఆచంట ఆకాశవాణిలో పనిచేసే రోజుల్లో అనేక వినూత్న కార్యక్రమాలు రూపొందించడంతోపాటు, ప్రముఖ తెలుగు సాహితీవేత్తలందరిచేత రేడియోలో ప్రసంగాలు ఏర్పాటుచేసి, ఆంధ్రుల సాహితీ - సంస్కృతీ వికాసానికి ఎంతో కృషి చేశారు.

మద్రాసు నేషనల్ కళాశాలలో ఆయన చదువుకునే రోజులలో విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ ఆ కళాశాలకు ఛాన్సలర్‌గా ఉండేవారట.

ఛాన్సలర్ హోదాలో విశ్వకవి మద్రాసు కళాశాలకు వచ్చినప్పుడు తాను ఆ సమయంలో వాలంటీర్‌గా పనిచేసినట్లు, రవీంద్రునికి సన్నిహితంగా ఉన్నట్లు శ్రీ ఆచంట చెప్తారు.

తమ అధ్యాపకులు జేమ్స్ కజిన్స్ డా. అనిబిసెంట్‌ల దగ్గర క్రమశిక్షణ, జీవితంలో 'రమ్యత'ను ఆరాధించడం నేర్చుకున్నానని ఆయన అంటారు.

అలాగే, గాంధీజీ మద్రాసు వచ్చినప్పుడు శ్రీ ఆచంట తాను స్వయంగా వడికిన నూలు దండ గాంధీజీకి వేసి, మహాత్ముని ఎదుట ఉపన్యసించారని, "ఇప్పుడు తృప్తిగా ఉందా?" అని మహాత్ముడు శ్రీ ఆచంటను ప్రశ్నించారని, ఆయన ఎంతో తృప్తిగా తన పాత జ్ఞాపకాలు నెమరవేసుకుండేవారు.

గాంధీజీ ప్రవచనాలు పట్ల తానెంతో ప్రతిభావితుడినయ్యానని ఆయన అంటారు.

తెలుగు ప్రబంధాల ప్రాశస్త్యాన్ని వివరిస్తూ "గ్లిమ్‌సెస్ ఇంటూ తెలుగు క్లాసిక్స్" అనే గ్రంధాన్ని ఆయన రాశారు.

అలాగే, ఆంధ్రదేశంలో నాటి రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక పరిస్థితులను ఎంతో వివరంగా వివరిస్తూ, "సాగుతున్న యాత్ర (రెండు సంపుటాలు)", "నా స్మృతి పథం"లో అనే గ్రంధాలు రాశారు.

సుమారు రెండు వందల దాకా రేడియో నాటికలు - నాటకాలు, సుమారు 20 సం.పైగా ఆయన ఆకాశవాణిలో పనిచేసిన రోజుల్లో రాశారు.

అలాగే వీరు రాసిన 'స్వర్ణసీత' (కావ్యం)లో విశ్వజనీనతను





కల్పింపజేశారని ఆనాటి ప్రముఖ సాహితీవేత్తలు శ్రీ ఆచంటను అభినందించారు.

శ్రీ ఆచంట సాహితీవేత్త మాత్రమే కాదు గొప్ప చిత్రకారుడు కూడా. కన్ను ఆర్పకుండా, తదేకంగా చూడగల్గే అనేక వర్ణ చిత్రాలను శ్రీ ఆచంట రూపొందించారు. ఆయన వేసిన చిత్రాలు ప్రకృతి రమణీయత ఉట్టిపడేలా, చక్కని రంగుల మిశ్రమాలతో అద్భుతంగా ఉండి చూసేవారిని ఆకర్షించేవి. సుమారు 200 చిత్రాలు రూపొందించిన శ్రీ ఆచంటను ప్రముఖ సాహితీ వేత్త శ్రీ బుచ్చిబాబు, ప్రముఖ చిత్రకారుడు దేవీప్రసాద్ రాయ్ చౌదరి చిత్రకళలో తనను ప్రోత్సహించారని అంటారు. తనను తొలుతగా ఈ రంగంలో పరిచయం చేసింది డా. అయ్యప్పన్ అని అంటారు. ఈ విషయమై శ్రీ జానకిరాం తన పాత అనుభవాలు గుర్తుచేసుకుంటూ, తాను ఆకాశవాణిలో పన్జేస్తున్న కాలంలో దక్షిణ భారత చిత్రకారుల సంఘ అధ్యక్షుడైన డా. అయ్యప్పన్ శ్రీ ఆచంటను ఆ సంస్థ కార్యదర్శిగా ఉండాలని కోరారట. అయితే, ఏ మాత్రం చిత్రకారుడు కాని శ్రీ ఆచంట కార్యదర్శి పదవికి అనర్హుడని కొందరు చిత్రకారులు వ్యతిరేకించారు. తక్షణమే శ్రీ జానకిరామ్ ముప్పావలాకు ఒక రంగు డబ్బా, బ్రష్ కొనుక్కొని చిత్రాలు వేయడం ప్రారంభించారు.

ఆ తర్వాత కొంతకాలం ప్రముఖ చిత్రకారుడు దేవీప్రసాద్ రాయచౌదరి దగ్గర కొన్ని మెళుకువలు నేర్చారు.

శ్రీ ఆచంట తన 73వ పుట్టినరోజు సందర్భంగా, హైదరాబాద్‌లోని ఆంధ్ర మహిళ సభ కళాశాల గ్రంథాలయంలో తాను చిత్రీకరించిన అనేక చిత్రాలను మూడు రోజులపాటు ప్రదర్శించారు. అనంతరం, ఆ చిత్రాలను ఆ కళాశాలకే బహుకరించిన సున్నిత మనస్కుడు శ్రీ ఆచంట.

నేటి ఆధునిక ఆంధ్రుల చిత్రకళలో ఆంధ్రత్వం లోపిస్తోందని సుమారు రెండు దశాబ్దాల క్రితమే శ్రీ ఆచంట అభిప్రాయ పడ్డారు. దామెర్ల రామారావు, అడవి బాపిరాజు వంటి ప్రముఖ చిత్రకారులు తెలుగుదనం ఉట్టిపడేలా చిత్రించేవారని, ఆ తెలుగుదనం నేటి చిత్రకారుల చిత్రాలలో లోపిస్తోందని ఆయన అంటారు.

భారతీయ సంస్కృతీ - సంప్రదాయలను నేటి తరం యువత పదికాలాలపాటు పదిలపరచుకోవాలని, లేదంటే నాగరిక ప్రపంచంలో మనకు స్థానం ఉండదని ఆయన అంటారు.

భారతీయ పరిరక్షణ కోసం పరితపిస్తూ, భారతీయతను ప్రతిబింబిస్తూ ఎన్నో రచనలు, చిత్రాలు రూపొందించిన శ్రీ ఆచంట, తిరుపతిలో విశ్రాంతి జీవితం గడుపుతూ స్వల్ప అస్వస్థతకు గురై 1994లో స్వర్గస్థులైనారు.

ఈయన భార్య శ్రీమతి ఆచంట శారదాదేవి తిరుపతిలోని పద్మావతీ మహిళా కళాశాలలో 'తెలుగు శాఖ' అధిపతిగా పనిచేశారు.

# మరపురాని మూర్తి



## మల్లాది రామకృష్ణశాస్త్రి

225



శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి పేరు చెప్పగానే తెలుగు సినిమా మాటలు - పాటలు రచయితగా ప్రతి ఒక్క తెలుగువానికి స్ఫురణకు వస్తారు. మరి కొందరయితే, ఆయన్ని తెలుగు చలన చిత్రగీతాల అజ్ఞాత రచయితగా కీర్తిస్తారు. ఏది ఏమైనా శ్రీ మల్లాది అసమాన ప్రతిభాపాటవాలు గల బహుభాషా కవి పండితులని కొందరికే తెలుసు. తెలుగు భాషకే ఆయన పరిమితం కాదు. ద్రావిడ భాషలన్నింటిల్లోనూ, అలాగే బెంగాలీ, ఒరియా, అస్సామీ, తదితర దేశీయ భాషలతోపాటు ఫ్రెంచి, గ్రీకు, జపనీసు, జర్మన్, లాటిన్, చైనీస్ వంటి పాశ్చాత్య భాషలలో కూడా కేవలం చదవడం రాయడం వరకే కాదు, శాస్త్రీయంగా చర్చించగల పాండిత్యం ఆయనకు ఉందంటే అధికశాతం సాహితీ పిపాసకులు నమ్మరేమో!

కానీ, సుమారు ఏభై దేశీయ, పాశ్చాత్య భాషలు ఆయనకు వచ్చుని, ఆయన సమకాలీనులు, ప్రస్తుత సాహితీ విమర్శకులు ప్రకటిస్తూ, మరింత ఆశ్చర్యపరుస్తారు.

అంతమాత్రమే కాదు, ఖగోళ, జ్యోతిష్య, చిత్రలేఖన, తర్క, న్యాయ, వేదాంత, అలంకార, వ్యాకరణ, సంగీత, నాట్య శాస్త్రాలనూ ఆయన అధ్యయనం చేశారు.

మరో విశేషం ఏమంటే, స్వగ్రామం బందరులో చదువుకునే రోజుల్లోనే, ఒక ముస్లిం పండితుని దగ్గర 'ఉర్దూ' నేర్చుకుని, 'ఖురాన్'ను ఆమూలాగ్రం పఠించారట. అలాగే, 'బైబిలు' సంపూర్ణంగా చదివి, అందుకు సంబంధించిన పీటర్ - కేటర్ పరీక్షలు పాసయ్యారు. భాషలు నేర్వడానికి, పాండిత్య పరిశోధనలకు వయో, వర్గ, మత భేదం లేదని ఆనాడే రుజువు చేసిన గొప్ప పండితుడు శ్రీ మల్లాది.



శ్రీ మల్లాది కృష్ణాజిల్లా మచిలీపట్నంకు సమీపంలోని చిట్టిగూడూరు గ్రామంలో 1905 జూన్ 16న ఒక సంపన్న కుటుంబంలో జన్మించారు. తల్లి శ్రీమతి కనకమ్మ. తండ్రి శ్రీ నరసింహ శాస్త్రి.

మచిలీపట్నంలో స్థిరపడిన శ్రీ మల్లాది, బి.ఎ. డిగ్రీ వరకూ స్థానిక కళాశాలలోనే చదివారు. ఆ తర్వాత మద్రాసు విశ్వ విద్యాలయం నుండి సంస్కృతాంధ్రాలలో ఎం.ఏ. పట్టాలు పొందారు.

అలాగే, వేదాధ్యయనం, బ్రహ్మసూత్రాలు, మహాభాష్యం ప్రముఖ వేద పండితులు శ్రీ యడవల్లి సుబ్బారావు అవధానులు, శ్రీ నోరి సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ శిష్లా నరసింహ శాస్త్రి తదితరుల వద్ద నేర్చారు.

కొంతకాలం గుంటూరులోని శ్రీ పాములపాటి వెంకట కృష్ణయ్య చౌదరి గారి 'దేశాభిమాని' పత్రికకు ఉపసంపాదకులుగా పన్జేశారు.

ఆ తర్వాత మార్చి 1945లో ప్రసిద్ధ రచయిత శ్రీ సముద్రాల రాఘవాచార్యులు సహాయంతో సినీరంగ ప్రవేశం చేశారు. ఎన్నో చిత్రాలకు మాటలు - పాటలు రాశారు. సినీ చిత్ర గీతాల అజ్ఞాత రచయితగా - తన పేరు బైట పడకుండా ఎందరికో కీర్తి తెచ్చిపెట్టిన - శ్రీ మల్లాది 'చిన్నకోడలు' చిత్రానికి సంభాషణలు రాయడంతో సినీకవిగా పరిచయమయారు. 'సువర్ణసుందరి', 'చివరకు మిగిలేది', 'చిరంజీవులు', 'రేచుక్క', 'విప్రనారాయణ', 'పల్నాటి యుద్ధం', 'రాజనందిని', 'దేశద్రో హులు', 'టాక్సీ రాముడు', 'జయభేరి', తదితర అనేక చిత్రాలకు మాటలు, పాటలు రాసి, తెలుగు సగటు సినీ ప్రేక్షకుల మనస్సు లను సయితం దోచుకున్నాడాయన.

సినీగేయ రచయతగా స్థిరపడటానికి పూర్వం కొంతకాలం 'కృష్ణాపత్రిక'లో పనిచేశారు. ఆ సమయంలో ఆయన నిర్వహించిన 'చలవ మిరియాలు' శీర్షికన సున్నిత విమర్శలు, 'నా కవి మిత్రులు' అనే శీర్షికన తన సమకాలీన కవిపండితులపై ఆయన రాసిన వ్యాసాలు - నేటికీ అనన్య సామాన్యంగా దర్శన మిస్తాయి.

ఛందోబద్ధమైన కవిత్వంతోపాటు, యక్షగానాలు, ద్విపదలూ,

నవలలూ, వ్యాసాలూ, విమర్శలు, ఎన్నో గేయాలు, నాటకాలు, మరెన్నో గ్రంధాలకు పీఠికలూ రచించి, అనువాదాలు కూడా చేశారు శ్రీ మల్లాది.

అన్నింటికంటే మిన్నగా, శ్రీ మల్లాది చేపట్టిన ప్రక్రియల్లో 'చిన్న కథలు' అత్యంత ఆకర్షణీయమైనవి - ప్రధానమైనవీను. 19 సంవత్సరాల వయస్సు నుండి చిన్ని కథలు రాయడం ప్రారంభించిన శ్రీ శాస్త్రిగారి 120 కథారచనలను నాల్గు సంపుటాలుగా ప్రముఖ సాహితీసంస్థ ఇటీవల ప్రచురించింది. శ్రీ మల్లాదివారి 'డు - ము - వు - లు' - కథ, 14 - భారతీయ భాషల్లోకి అనువదించబడింది. ఈ మహా, బహు భాషా పండితుడు, స్వల్ప అస్వస్థతకు గురై తన సాహితీ వ్యాసాంగాన్ని చాలించి - 1965 సెప్టెంబరు 12న శాశ్వతంగా కన్నుమూశారు.





**వే**యవయ్యా! వేయి
ముడి - మీద ముడి,
మరో ముడి,
మూడు ముళ్ళు వేశావా!
భద్రంగా వేశావా,
రామభద్రా!

- అంటూ ఆకాశవాణిలో ఖంగున భద్రాచల శ్రీరామ కళ్యాణ ప్రత్యక్ష వ్యాఖ్యానంలో విన్పించిన శ్రీ జమ్ములమడకవారి గళం విననిి తెలుగువారంటూ ఉన్నారా?

ఆకాశవాణిలో భద్రాద్రి శ్రీరామ కళ్యాణ ప్రత్యక్ష వ్యాఖ్యానానికి శ్రీకారం చుట్టింది శ్రీ జమ్ములమడక వారే!

సుమారు 16 సంవత్సరాలు ప్రతియేటా నిర్విఘ్నంగా - "సీతే - జగన్మాతాః" అంటూ భద్రాద్రి సీతారాముల కళ్యాణాన్ని ఆకాశవాణి ప్రత్యక్ష ప్రసారంలో తన వాక్చాతుర్యంతో కళ్ళకు కట్టినట్లు చూపారు - శ్రీ జమ్ములమడక.

శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ గుంటూరు జిల్లా

బాపట్లకు సమీపంలోని కోడితాడిపఱ్ఱులో 1907లో ఉగాది పండుగ రోజున జన్మించారు.

గంభీరమైన శైలితో, ముగ్ధమనోహరంగా ధారాళంగా ఉపన్య సించగల దిట్ట, సంస్కృతాంధ్ర కవి - శ్రీ జమ్మమడక మాధవ రామ శర్మ.

విజయనగరంలోని యం.ఆర్. సంస్కృత కళాశాలలో ఆయన సంస్కృతం అధ్యయనం చేశారు. మహాపండితులు శ్రీ తాతా సుబ్బరాయశాస్త్రిగారి శిష్యులు.

గుంటూరు జిల్లా తెనాలిలోని కె.ఎల్.ఎన్. సంస్కృత కళాశాలలో సంస్కృత పండితులుగా చాలాకాలం పన్జేశారు. అనంతరం గుంటూరులోని ఎ.సి.కాలేజిలో తెలుగు లెక్చరర్‌గా; అక్కడ రిటైరైన పిదప, గుంటూరులోనే డా. కె.వి.కె. సంస్కృత కళాశాలలో సంస్కృతాంధ్ర పండితులుగా కొంతకాలం పనిచేశారు. ఆనాటి ఆ కళాశాల ప్రిన్సిపాలుగా ఉన్న శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య వీరి గురించి ప్రస్తావిస్తూ, సంస్కృత - తెలుగు భాషలలో అనర్గళంగా, ధారాళంగా, ఓ జలపాత సదృశ్యంగా గంభీరమైన శైలిలో ప్రసంగించడం ఆయన ప్రత్యేకత అని అంటారు.

సంస్కృత - తెలుగు భాషలలో అనర్గళంగా మాట్లాడ గల్గే 'మహోపన్యాసకులు'గా పేరెన్నికగన్న "జ" కారత్రయగా పండితులలో ఒకరిగా శ్రీ జమ్మమడక ప్రఖ్యాతి అని శ్రీ ఏలూరిపాటి అంటారు.

'జ'కారత్రయం అంటే మహాపండితులు శ్రీ జటావల్లభుల పురుషోత్తంగార్ని, శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగార్ని, శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగార్ని, పండిత పామరులను ఆకర్షిస్తూ ఉపన్యసించగల మహోపన్యాసకులని ఆ రోజుల్లో పిలుస్తుండే వారట.

ఆయన రచనాశైలి, ఉపన్యాసధోరణి రెండూ కూడా గంభీర పద - సమాసాలతో, అలంకారాలతో కొంతమేర క్లిష్టంగానే ఉండేదని ఆయన సమకాలీకులు అంటారు. "సాహితీసభలో అందర్నీ ఆకట్టుకోవాలంటే కొంత క్లిష్టమైన పదాలు - సమాసాలు వాడటంలో తప్పేమీ లే"దని ఆయన అనేవారని శ్రీ ఏలూరిపాటి ఆయనతో తన అనుభవాలు గుర్తుచేసుకుంటూ అంటారు.

1960 ప్రాంతంలో పశ్చిమ గోదావరి జిల్లా తణుకులో జరిగిన ఒక సాహితీ సభకు శ్రీ జమ్ములమడక, కరుణశ్రీ, శ్రీ ఏలూరిపాటి ముగ్గురూ హాజరయ్యారట.



ఏలూరిపాటివారి ఉపన్యాసం సాదాసీదాగా, సామాన్యులకు సైతం అర్థమయ్యేలా ఉంటుంది. చాలా సరళమైన శైలిలో ఉన్న ఆయన ఉపన్యాసాన్ని విన్న శ్రీ జమ్ములమడక, అనంతరం శ్రీ ఏలూరిపాటితో మాట్లాడుతూ "నీ ఉపన్యాసం చాలా బాగుం"దని ప్రశంసించారట. అలా అంటూనే, "మీ భాష మరీ

సరళంగా ఉంది. అయితే, ఎదుటి వారికి అర్థం అయ్యీ - అవకుండా, అందీ - అందనట్లు కొంత పనికట్టుకునయినా, గంభీరంగా మాట్లాడా" లని సలహా ఇచ్చారట.

సులభశైలిలో ఉండటమే తన కిష్టమని ఏలూరిపాటి సమాధానమిచ్చేసరికి, శ్రీ జమ్ములమడక, కరుణశ్రీ - ఇద్దరూ కూడా 'అయితే సరే' అని ముక్తాయించారట.



పెద్ద సమాసాలు, అలంకారాలు, సంస్కృత పదమిళితంతో -ఉపన్యసించడం- జమ్ములమడకకు అత్యంత ప్రీతిపాత్రమైందని - ఆయన అభిమానులు అంటారు. ఆయన ఒరవడిని ఆయన మిత్రులు చాలామంది అనుకరించేవారని వారంటారు.

ప్రతి సాహితీ సభలోనూ ముందుగా సంస్కృతంలో "నమః" (నమస్కారాలు) అనడం, చివరిగా "స్వస్తి" అంటూ, సంభోధించడం అలవాటుగా గల జమ్ములమడక, తాను ఉపన్యసించబోయే విషయాలన్నింటినీ ముందుగానే ఒక వరుస క్రమం లో కొన్ని పాయింట్లుగా తయారు చేసుకునేవారట.

ఉద్యోగ నిర్వహణలో సైతం ఎంతో నియమనిష్టలు పాటించే వారని, నిర్మొహమాటంగా, ఎలాంటి మొగమాటాలకు తావివ్వకుండా నిక్కచ్చిగా మాట్లాడేవారని ఆయన సమకాలీకులు అంటారు. ఆయన నిక్కచ్చితనమే ఆయనకు రావాల్సినంత ప్రాచుర్యం రాకుండా చేసిందని వారు అభిప్రాయపడతారు.

తెలుగులో తొలిసారిగా 'భువనవిజయం' రూపకాన్ని రూపొందించి, శ్రీ కందా భీమశంకరంగారితో శ్రీ కృష్ణదేవరాయ పాత్ర వేయిస్తూ, తాను తిమ్మనగా పాత్ర పోషించారు. శ్రీ మధునాపంతుల, శ్రీ విశ్వనాథ, శ్రీ జాషువా తదితరులెందరో ఆ 'భువన విజయం'లో పాల్గొన్నారు.

ఆ దరిమిలా, నేడు "భువనవిజయం" రూపకాన్ని పలు సాహితీవేత్తలు పలుచోట్ల ప్రదర్శిస్తుండటం గమనించాలి. 'మహామహోపాధ్యాయ', 'సాహిత్యాచార్య', 'లాక్షణిక శిరోమణి' వంటి అనేక బిరుదులు ఆయనకున్నాయి.

సంస్కృతంలోని అలంకారశాస్త్రాన్ని ఆద్యంతం తెలుగులో అనువాదానికి ఈయన పూనుకున్నారు.

ఆంధ్ర ప్రతాపరుద్రీయం, నవరస గంగాధరము, ధ్వని సారము, కావ్యప్రకాశము, నాట్యవేదం, రసభారతి వంటి పలు గ్రంథాలు ఆయన రచించారు.

తన జీవితాన్ని కడదాకా సాహితీసేవకే అంకితమిచ్చిన మహామహోపాధ్యాయుని ఇంట కొన్ని వందల అరుదైన పుస్తకాలతో చక్కని సొంత గ్రంథాలయం ఉంది. ఆయన మరణానంతరం పుట్టపర్తిలోని ప్రశాంతి నిలయానికి కొన్నింటిని విరాళంగా ఇచ్చారట. 1985లో జ్యేష్ఠ బహుళ అమావాస్యనాడు వారు పరమపదించారు.

# మరపురాని మనిషి



శ్రీరంగం శ్రీనివాసరావు



ఆధునిక ఆంధ్ర సాహిత్యంలో అభ్యుదయ యుగానికి నాందీ ప్రస్తావన చేసిన మహాకవి - శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీశ్రీ). కవిత్వంలో నూతన శకానికి ఆయన ఆద్యుడు. 1910 జనవరి 2న విశాఖపట్నంలో ఆయన జన్మించారు. తల్లి శ్రీమతి అప్పలకొండ, తండ్రి శ్రీ శ్రీరంగం వేంకట రమణయ్య. తండ్రి గారిది అధ్యాపక వృత్తి. శ్రీశ్రీకి ఒకటిన్నర సంవత్సరాల వయస్సు లోనే తల్లి మరణించింది. బాల్యంలో తాను ఒంటరిగా గడిపానని శ్రీశ్రీ పేర్కొన్నారు. అందుకే ప్రేమంటే ఒక అపనమ్మకం తన మనసులో చోటు చేసుకుందని ఆయన అన్నారు. అతి చిన్న వయస్సు నుంచే శ్రీశ్రీ పద్యాలు రాస్తుండేవారు. చిన్నతనంలో 'జగన్మిత్ర' అనే నాటక సమాజంలో వారి ప్రదర్శనలలో బాలనటుడిగా వేషాలు వేశాడాయన.

చిన్నతనంలోనే 'స్వశక్తి' అనే పత్రికకు తాను రాసిన పద్యాలు పంపితే ప్రచురితమయ్యాయి. 'గోకులాయి', 'వీర సింహం', 'విజయసింహం'లాంటి రచనలు 17 సంవత్సరాలైనా నిండక మునుపే రాశారు. 1929నాటికి శ్రీమతి వేంకట రమణమ్మతో వివాహం జరిగింది. ఆనాటి రోజుల్లో తనపై ప్రభావం చూపిన ఆంధ్ర కవులు శ్రీ రాయప్రోలు, శ్రీ విశ్వనాథ, శ్రీ దేవులపల్లిగా శ్రీశ్రీ పేర్కొన్నారు.1926లో 'కవితా సమితి'ని స్థాపించి, సాహితీ వ్యాసంగాలు నిర్వహించాడాయన. శ్రీశ్రీ రచించిన కవితా ఖండిక 'ప్రభవ' 1928లో ముద్రితమైంది.

మద్రాసు క్రిష్టియన్ కళాశాలలో 1931లో బి.ఏ. డిగ్రీ పూర్తిచేసి నిరుద్యోగ పట్టభద్రుడిగా రోజులు గడవక బీదరికం అనుభవించానని, జీవితాన్ని కవిత్వంలోనే వడబోస్తూ, తెగిన



గాలిపటంలా గడిపానని శ్రీశ్రీ అనేవారు. 1936లో 'వీణ' పత్రిక సంపాదకవర్గంలో కొంతకాలం పన్జేశారు. అయితే 1938లో 'ఆంధ్రప్రభ'లో సహాయ సంపాదకునిగా పన్జేశారు. 'శ్రీశ్రీ' తన జీవితంలో ఎన్ని ఒడిదుడుకులు వచ్చినా, కవితా వ్యాసంగం మాత్రం వదలలేదు. ఆనాటి రోజుల్లో అధికంగా వాడుకల్లో ఉన్న సాంప్రదాయ, భావ కవితా ధోరణులు ఆకర్షించిన వాడైనా, కొన్ని కొత్త ధోరణులు తన కవితల్లో శ్రీశ్రీ ప్రదర్శించేవారని, శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ తది తరులు పేర్కొన్నారు.

శ్రీశ్రీ రాసిన 'మహాప్రస్థానం' అఖిలాంధ్ర కీర్తి తెచ్చి పెట్టింది. ఆంధ్రసాహిత్య చరిత్రలో ఒక కొత్త మలుపును సృష్టించిన 'నవ్య సాహిత్య పరిషత్తు'ను 1936లో ప్రారంభించడంలో శ్రీశ్రీ కూడా ప్రముఖ పాత్ర వహించారు. అయితే 1937లో తన ఆప్తమిత్రుడు కొంపెల్లి జనార్దనరావు మరణించడంతో తీవ్ర విచారాన్ని, దుఃఖాన్ని అనుభవించానని శ్రీశ్రీ రాశారు. చిన్నతనంలోనే తల్లి, సవతితల్లి, ఆప్తమిత్రుడు, ఆ పిదప భార్య ఇలా అందరూ ఒకరి తర్వాత ఒకరు మరణించడంతో జీవితంలో ఏదో తీర్చ లేని వెలితిలో బాధకు గురైనాడాయన.



1942లో ఆకాశవాణిలో, 1943ప్రాంతంలో సైన్యంలో, ఆ తర్వాత నాటక సమాజాలలో పన్జేశారు. అభ్యుదయ రచయితల సంఘం స్థాపనలో, విప్లవ రచయితల సంఘంలో శ్రీశ్రీ ప్రముఖ పాత్ర వహించారు.

1948లో సినీరంగంలో ప్రవేశించారు. దీంతో ఆర్థికంగా కొంత నిలదొక్కుకున్నాడాయన. 'చెవిలో పువ్వు' లాంటి చలన చిత్రాల నిర్మాణం చేపట్టాడు కూడా. 1953లో మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యునిగా, 1957లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యులుగా పన్జేశారు.

రాజ్యలక్ష్మీ ఫౌండేషన్ వారి తొలి సాహితీ పురస్కారం శ్రీశ్రీకే దక్కింది. 1966లో సోవియట్‌లాండ్ నెహ్రూ అవార్డు పొంది ఆనాటి సోవియట్ యూనియన్ సందర్శించారు. ధనిక స్వామ్య దురాశా పిశాచికి బలియై అల్లాడుతున్న పేదల వాణిని వినిపింప జేసిన విప్లవకవి శ్రీశ్రీ.

శ్రీశ్రీ తెలుగులో వినూత్న కవితా ప్రయోగశీలిగా, అభ్యుదయ కవితామార్గ ప్రవర్తకుడిగా, భావ కవితా యుగంలో, భాషలో, వస్తువులో, ఛందస్సులో, క్రొత్త పోకడలను సృష్టించిన సత్కవిగా, తెలుగు సాహితీ చిత్రపటంలో విశేషఖ్యాతి నార్జించాడు శ్రీరంగం శ్రీనివాసరావు. 'మహాప్రస్థానం', 'మరో ప్రపంచం', 'చరమరాత్రి', 'ఖడ్గసృష్టి' - 'అనంతం' లాంటి రచనలు శ్రీశ్రీ ప్రతిభకు, పాండిత్యానికి ప్రతీకలుగా నిలుస్తాయి. సమత్వం, మానవత్వం, స్వాతంత్ర్యం ఆయన కవితా ఉద్యమ లక్ష్యాలు. 1970లో కాకినాడలో నిర్వహించిన శ్రీశ్రీ షష్టిపూర్తి సందర్భంగా, ఆయన రచనలన్నీ ఆరు సంపుటాలుగా ప్రచురించారు. సమ సమాజ సంస్థాపక ప్రవక్తగా కీర్తి సాధించిన శ్రీశ్రీ అనారోగ్యంతో జూన్ 15, 1983లో మృతిచెందినా, సాహితీ జగత్తులో ఆయన రచనలు అజరామరంగా దర్శనమిస్తున్నాయి.







తెలుగు నవలా సాహిత్యంలో క్రొత్త అధ్యాయాలను ప్రారంభించిన నవలాకారుడు శ్రీ త్రిపురనేని గోపీచంద్. 1953లో కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడు, ఆంధ్ర ప్రభుత్వ సమాచార డైరక్టరుగా ఆయన పనిచేశారు. ఆకాశవాణి ప్రయోక్తగా కూడా గోపీచంద్ తెలుగు వారందరికీ సుపరిచితులు.

శ్రీ గోపీచంద్ గొప్ప నవలా రచయిత మాత్రమే కాదు, కథకుడు, వ్యాసకర్త, నాటక రచయిత, చిత్ర దర్శకుడు కూడా.

ప్రముఖ సంఘ సంస్కర్త శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి గారి కుమారుడిగా, శ్రీ గోపీచంద్ మొదట భౌతికవాది, హేతువాది. మార్క్సిజంలోని సాంఘిక న్యాయసూత్రం ఆయన్ని ఆకర్షించింది.

శ్రీ గోపీచంద్‌గారి 'అసమర్థుని జీవితయాత్ర' ప్రఖ్యాత నవలగా కీర్తి గడించింది. అన్నింటా అసమర్థుడైన విద్యాధికుని వైయక్తిక ప్రవృత్తి, జీవితతత్వపు చర్చ ఈ నవలలోని ప్రధానాంశాలు.

శ్రీ గోపీచంద్ 1910 సెప్టెంబరు 8న కృష్ణాజిల్లా అంగలూరులో జన్మించారు. ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధుడు, 'మాలపల్లి' రచయిత శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ గారి ప్రభావం గోపీచంద్ నవలల్లో కన్పిస్తుంది. న్యాయశాస్త్రంలో పట్టాపొంది న్యాయవాద వృత్తి చేపట్టినా అతి కొద్దికాలంలోనే ఆ వృత్తిపై విముఖత ప్రదర్శించారు. ఆంధ్ర రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ కార్యదర్శిగా ఉండి, హేతువాదాన్ని బల పరుస్తూ, ఎందర్నో హేతువాదంలో సుశిక్షితులుగా రూపొందించాడాయన. అయితే, ఆ పిదప రాజకీయాలకు స్వస్తి పల్కి, రచనా వ్యాసాంగంపై దృష్టి మరల్చి, ఎన్నో కథలు, నాటకాలు, వ్యాసాలు, నవలలు రాశారు. ఆయన రచనాశైలి సున్నితంగా, సూటిగా, సంక్షిప్తంగా ఉంటుంది. 'భార్యల్లోనే ఉంది', 'దేశం ఏమయ్యేట్టు?', 'గీతా పారాయణం', 'తండ్రీ - కొడుకులు', 'ధర్మాసుపత్రి', తదితర కథా సంపుటాలు సామాన్య కథా పాఠకుడ్ని కూడా కదిలించి, నూతన స్ఫూర్తిని, ఆలోచనారీతిని అందించేవిగా ఉంటాయి.

శ్రీ గోపీచంద్ అరవిందుని దర్శించి అరవిందుని లైఫ్ డివైన్ - వంటి గ్రంథాలను అధ్యయనం చేశారు. ఆ తర్వాత 'పోస్టు చేయని ఉత్తరాలు' పేరున భౌతికవాదం - ఆధ్యాత్మిక వాదాలలో దేన్నీ త్యజించకుండా, చక్కని రచన ఆయన చేశారు.

'పండిత పరమేశ్వర శాస్త్రి వీలునామా' నవలకు శ్రీ గోపీచంద్‌కు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. గోపీచంద్ గారి 'మెరుపుల మరకలు', 'చీకటి గదులు' - తదితర నవలలు; 'మాంచాల', 'గ్రుడ్డి సంఘం', 'అభాగిని', 'తత్త్వమసి', 'మాలపల్లి' - వంటి నాటకాలు ప్రతి తెలుగువాడు తనకి తీరిక దొరికినప్పుడు ఒక్కసారైనా చదవాలని అభిలషిస్తాడు.

శ్రీ గోపీచంద్ 'రైతుబిడ్డ', 'గృహప్రవేశం' తదితర చిత్రాలకు సంభాషణలు రాశారు. 'ప్రియురాలు', 'పేరంటాలు', 'లక్ష్మమ్మ కథ' చిత్రాలకు దర్శకత్వం వహించాడాయన.

ప్రాచ్య - పాశ్చాత్య తత్త్వవేత్తల దృక్పథాలను చర్చిస్తూ - గోపీచంద్ రాసిన 'తత్త్వవేత్తలు' రెండు భాగాలుగా వెలువడింది.

శ్రీ గోపీచంద్ ఆధునిక యుగపు ప్రఖ్యాత రచయిత. ప్రతిభా సంపన్నుడైన శ్రీ గోపీచంద్ 1962 నవంబరు 22న హైదరాబాద్‌లో మృతి చెందారు.



# మరపురాని మనీషి



## దివాకర్ల వేంకటావధాని



శ్రీ దివాకర్ల ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో 1951 నుండి 1978 వరకూ సుమారు 27 సంవత్సరాలకు పైగా ఉపన్యాసకులుగా, రీడరుగా, ఆచార్యగా, తెలుగు శాఖాధ్యక్షునిగా పలు బాధ్యతలు నిర్వహించారు.

తెలుగు భాషా బోధనలో, శోధనలో, ఉపన్యాస విన్యాసంలో, శ్రీ దివాకర్ల ఎందరికో ఆరాధ్యుడు. నడిచే విజ్ఞాన

సర్వస్వంగా, వినయశీలిగా, ఆదర్శ ఆచార్యునిగా, సమకాలీన సాహితీవేత్తల ప్రశంసలు శ్రీ దివాకర్ల అందుకున్నారు.

పశ్చిమ గోదావరి జిల్లా ఆకుతీగపాడు అనే చిన్న గ్రామంలో 1912 జూన్ 23వ తేదీ, గురు పూర్ణిమ పండగనాడు శ్రీ దివాకర్ల జన్మించారు. తల్లి శ్రీమతి వెంకమాంబ, తండ్రి శ్రీ సుందర రామయ్య. శ్రీ సుందరరామయ్యగారు గొప్ప సంస్కృత పండితులు కావడంతో, తనకు తొలిగురువు తన తండ్రి అని ఆయన అంటారు.

తిరుపతి వెంకటకవులలో ఒకరైన శ్రీ దివాకర్ల తిరుపతి శాస్త్రి - అవధానిగారికి స్వయానా పినతండ్రి. ప్రాథమిక విద్య పశ్చిమగోదావరి జిల్లాలోని 'యండగండి', 'ఉండి', గ్రామాలలో జరిగింది.

చదువుకునే రోజుల్లోనే సభలలో పద్యాలు పఠించడం, 'భారతి' లాంటి సాహితీ పత్రికలకు రచనలు ఆయన పంపడం చేస్తుండేవారు.

కుటుంబ ఆర్థిక పరిస్థితులు బాగాలేని కారణంగా, కళాశాల చదువులకోసం, ఎన్నో కష్టాలు అనుభవించానని ఆయన అంటారు. విజయనగర మహారాజ కళాశాలలో ఉచిత భోజన సౌకర్యంతోపాటు స్కాలర్‌షిప్ లభిస్తుందని విజయనగరం వెడితే, అలాంటి అవకాశం దొరకక నిరుత్సాహంతో తిరిగి స్వగ్రామం చేరానని ఆయన అంటారు.

అయితే, ఆ పిదప బందరులోని హిందూ కళాశాల అధ్యక్షులు, తిరుపతి వేంకటకవుల శిష్యులైన శ్రీ వారణాసి శ్రీనివాసరావుగారి సహాయంతో బందరు హిందూ కళాశాలలో ఇంటర్‌మీడియట్‌లో చేరారు.

ఈ సమయంలోనే ప్రముఖ కవి పండితులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ తన ఇంటిలో వసతి ఏర్పాటు చేసి, ఆయన తన స్నేహితులతో చెప్పి వారాలు చేసుకుంటూ చదువుకునే ఏర్పాటు చేశారట. శ్రీ విశ్వనాథ 'ఏకవీర' నవల డిక్టేట్ చేస్తుంటే, శ్రీ దివాకర్ల రాసి పెట్టారు. శ్రీ విశ్వనాథ పదహారు రూపాయలు శ్రీ దివాకర్లకు పారితోషికంగా అందజేశారని, ఆయన అంటారు. ఆ తర్వాత విశ్వనాథగారి సలహా, సహకారాలతో ఆంధ్ర విశ్వ విద్యాలయంలో తెలుగు బి.ఏ. ఆనర్సు చదవడానికి విశాఖపట్నం వెళ్ళారు. విశ్వవిద్యాలయ వైస్ - ఛాన్సలర్‌గా డా. సర్వేపల్లి రాధాకృష్ణన్, ప్రొ వైస్-ఛాన్సలర్‌గా శ్రీ విక్రమదేవవర్మ ఉండేవారు. బి.ఏ. ఆనర్సులో ప్రప్రథముగా ప్యాసయిన వారందరికీ డా. సర్వేపల్లి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో లెక్చరర్ ఉద్యోగాల్లో ప్రోత్సహించారు. కానీ, దివాకర్లకు మాత్రం ఆ అవకాశం కలగలేదంటారు. ఇందుకు కారణం మరొకటి - మరొకటి కాదు. శ్రీ దివాకర్ల, శ్రీ విశ్వనాథవారి శిష్యుడు కావడంతో, ఆనాటి విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షుడు శ్రీ పింగళి లక్ష్మీకాంతంకు, శ్రీ విశ్వనాథకు అభిప్రాయ బేధాలుండటంతో అవధానిగారికి అధ్యాపక అవకాశం చేజారిపోయిందని, రాజకీయాలు - మనస్పర్థలకు ఆ కాలం - ఈ కాలం ఏమని, శ్రీ దివాకర్లగారి అభిమానులు అంటారు. అయితే, డా. సర్వేపల్లి పండితులు శ్రీ దివాకర్లకు స్థానిక కళాశాలలో తెలుగు పండిట్ ఉద్యోగం యిప్పిస్తే, 1934 జూలై మొదటి తేదీ నుండి ఆ ఉద్యోగం ప్రారంభించారు.

అయితే, ఆ తర్వాత ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖ అధ్యాపకులుగా అవకాశం 1951 ఆగస్టు ఒకటో తేదీన లభించింది.

'ఫైవ్ పండిట్సు' తెలుగు గైడు చదవకుండా ఎస్.ఎస్.ఎల్.సి. ప్యాసయిన వారు ఆ రోజుల్లో అరుదే. 'ఫైవ్ పండిట్స్' తెలుగు గైడు గ్రంధకర్తగా శ్రీ దివాకర్ల తెలుగునాట ప్రఖ్యాతి. సుమారు రెండు దశాబ్దాలకు పైగా 'ఫైవ్ పండిట్స్' తెలుగు గైడు ఎస్.ఎస్.ఎల్.సి. ఆ తర్వాత ఎస్.ఎస్.సి., ఇంటర్‌మీడియట్ విద్యార్థుల కోసం శ్రీ దివాకర్ల రూపొందించారు. అయితే, ఈ గైడు రాయడం వల్ల శ్రమ తప్పిస్తే, ప్రచురణకర్తలే అధిక లాభం పొందారని శ్రీ దివాకర్ల అంటారు.

శ్రీ దివాకర్లగారి సాహితీసేవకు గుర్తింపుగా లభించిన గౌరవ పురస్కారాలు, సన్మానాలు, బిరుదులు అనేకం. విశాఖపట్నంలోని భారతీయ మహాసభల సందర్భంగా 1938లో అవధానిగార్ని 'కవిభూషణ' బిరుదు ప్రధానం చేసి సత్కరించారు.

1977లో ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వారు 'కళాప్రపూర్ణ' బిరుదుతో సత్కరించారు. 1967 - 68లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవధానిగారి 'సాహిత్య సోపానములు' విమర్శనా గ్రంధానికి బహుమతి అందజేసింది. తెలుగునాట ఉన్న సాహితీ సంస్థలన్నింటితో సంబంధం ఉన్న శ్రీ దివాకర్లను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వం ఇచ్చి గౌరవించింది. కేంద్ర సాహిత్య అకాడమీ మెంబరుగా, జ్ఞానపీఠ్

ఆంధ్రప్రదేశ్ సలహా సంఘ అధ్యక్షులుగా, తెలుగు అకాడమీ, యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్‌ల సభ్యునిగా - ఇలా పలు సంస్థల అభివృద్ధికి ఇతోధిక సేవలు ఆయన అందజేశారు.

ఒక పుస్తకాన్నిగానీ, కావ్యాన్నిగానీ ఒక్కసారి తిరగేస్తే, అందులోని పద్యాలన్నింటినీ అనూహ్యంగా, అనర్గళంగా తిరిగి చెప్పగల అద్భుత ధారణాశక్తి - దివాకర్లవారి సొంతం. ఈయన ఏక సంథాగ్రాహిత్వాన్ని "ఫొటోగ్రాఫిక్ మెమరీ" అని ప్రముఖ పత్రికా సంపాదకులు శ్రీ నార్ల వెంకటేశ్వరరావు అంటారు.

పరిపూర్ణ అధ్యాపకునిగా, ఉపన్యాసకునిగా ఊపిరి పోసిన విలక్షణ వ్యక్తిగా, ప్రాచీన కవుల కావ్యాల్లోని మాధుర్యాన్ని, కవుల నైపుణ్యాన్ని, తన రచనలతో, ఉపన్యాసాలతో తెలుగు వారందరికీ పంచిపెట్టిన సౌమ్యమూర్తి, శ్రీ దివాకర్ల వెంకటావధాని తన తుదిక్షణం వరకూ ఆంధ్ర వాఙ్మయ వికాసానికే కృషి చేశారు: బొంబాయిలోని భారతీయ విద్యాభవన్‌లో ఏర్పాటు చేసిన ఒక సాహితీ సదస్సుకు హాజరైన శ్రీ దివాకర్ల 1986 అక్టోబరు 21వ తేదీన అర్ధరాత్రి 12గం. తర్వాత బొంబాయిలోని స్థానిక ఆసుపత్రిలో శస్త్ర చికిత్స అనంతరం, శాశ్వతంగా కన్నుమూశారు.

అయితే, దివాకర్ల వారి రాజ సందర్శనము, మధువనము, కవి పరాజయము, త్రింశతి (ఖండ కావ్యం), శ్రీ శివభక్త విజయము, కిరాతాంజనేయులు వంటి పలు రచనలు తెలుగు సాహితీ అభిమానుల మదిలో అజరామరంగా నిలుస్తాయి.





తిరుమల రామచంద్ర దంపతులు

(ఫైల్ ఫొటో)

శ్రీ తిరుమల రామచంద్ర 1913లో జూన్ 13న అనంతపురం జిల్లాలో జన్మించారు. తల్లి జానకమ్మ - తండ్రి శేషాచార్యులు.

శ్రీ తిరుమల రామచంద్ర గొప్ప పండితుడు, రచయిత, పరిశోధకుడు, భాషాతత్వశాస్త్రవేత్త, విమర్శకుడు. అన్నింటికంటే మిన్నగా ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడాయన. గాంధీజీ పిలుపు మేరకు స్వాతంత్ర్య సమర ఉద్యమాల్లో పాల్గొని ఎన్నో మార్లు జైలుశిక్ష అనుభవించాడాయన. స్వాతంత్ర్య సమరంలో తిరుపతిలోని గోవిందరాజస్వామి దేవాలయ గోపురంపై జాతీయ జెండా ఎగురవేసి, బ్రిటీషువారి ఆగ్రహానికి గురై, జైలు శిక్ష అనుభవించాడాయన. అంతేకాదు సర్దార్ భగత్‌సింగ్ మరికొంత మందిని బ్రిటీషువాళ్ళు ఉరి తీసిన పిమ్మట బ్రిటీషు ప్రభుత్వం బనాయించిన కేసులో ముద్దాయిగా, మద్రాసు కోర్టులో శ్రీ తిరుమలను విచారించారు.

సుమారు ఏడు దశాబ్దాల పాటు పలు సాహిత్య, సంగీత, నాటక, సాంస్కృతికరంగాల్లో ఎనలేని సేవలు అందజేసిన శ్రీ తిరుమల రామచంద్ర నిగర్వి, రాగద్వేషాలకు అతీతుడు. "నా లక్ష్యం - మానవత్వం. ఎవ్వరి స్వేచ్ఛను అడ్డుకోవడం నా అభిమతం కాదు" అని నిర్ద్వంద్వంగా ఆయన చెప్పేవాడు.



యావత్తు దేశం పర్యటించాడాయన. తిరుమల వారు తెలుగు భాషతోపాటు సంస్కృతం, ప్రాకృతం, కన్నడం, తమిళం, హిందీ, ఇంగ్లీషు భాషలలో గొప్ప పాండిత్యాన్ని సంపాదించారు.

ప్రస్తుత పాకిస్థాన్ దేశంలో భాగంగా వున్న లాహోర్‌లో బి.ఏ. డిగ్రీ చేశారు. మద్రాసు విశ్వ విద్యాలయం నుండి సంస్కృతంలో 'విద్వాన్' పంజాబు విశ్వవిద్యాలయం నుండి హిందీలో 'ప్రభాకర' అలీఘర్‌లోని ఆయుర్వేద విద్యాపీఠం నుండి 'ఆయు ర్వేధ భూషణ' పొందారు. 21 పైగా గ్రంధాలు తెలుగులో రాశాడా యన. అలాగే సంస్కృతంలో, హిందీలో, రచనలు చేశారు. తాను నేర్చిన ఏడు భాషల నుండి ఎన్నో అనువాద రచనలు చేశారు. ఆయన రచనలలో ముఖ్యంగా 'లిపి పుట్టు పూర్వో త్తరాలు', 'నుడి - నానుడి', 'హిందువుల పండుగల పూర్వా పరాలు', 'మరుపురాని మనీషి' శీర్షికన ప్రముఖులతో ఆయన నిర్వహించిన ఇంటర్వ్యూలు నేటి యువతకు ఎంతో ఆదర్శం.

తెలుగు పత్రికల సాహిత్య చరిత్రను గ్రంథస్థం చేశాడాయన. ఆయన చివరి రోజుల్లో రాసిన 'హంపి నుండి హరప్పా దాకా' ఒకరకంగా చెప్పాలంటే 1947కు ముందుగల నాలుగు దశాబ్దాల స్వీయ అనుభవాలు, ఆయన కీర్తి కిరీటంలో మరో మణిమకు టంగా నిలుస్తుంది.

పాత్రికేయునిగా శ్రీ తిరుమల 1944లోనే 'డైలీ టెలిగ్రాఫ్'

(కాన్పూరు) పత్రికలో పనిచేశారు. అలాగే 'తెలంగాణా' పత్రికలో, 'ఆంధ్రప్రభ', ప్రముఖ సాహిత్య పత్రిక 'భారతి', 'ఆంధ్రపత్రిక' తదితర పత్రికలలో పనిచేశారు.

అంతేకాదు, మద్రాసులోని ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు గ్రంధాలయం, తంజావూరులోని సరస్వతీ మహల్ గ్రంధాలయం లో పండిట్‌గా పనిచేశారు. బిర్లా రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో సంస్కృత వ్రాతపత్రాల క్యాటలాగర్‌గా పనిచేశారు.

పండిత, పామర జనాలను సమదృష్టితో ఆదరించే శ్రీ తిరుమల తాను జీవించిన చివరి నిముషం వరకూ ఏదో కొత్త విషయాలను నేర్వాలనీ, తెలుసుకోవలన్న తృష్ణతోనే, కాలం గడిపారు. తనను 'నిత్య విద్యార్థిగా' సగర్వంగా వర్ణించుకున్నారు.

శ్రీ తిరుమల సాహిత్య, సాంస్కృతికరంగాల్లో చేసిన కృషికి గుర్తింపుగా ఎన్నో సంస్థలు బిరుదులు ఇచ్చాయి, సన్మానాలు అనేకం చేశాయి.

అందులో ప్రముఖంగా, కలకత్తాలోని నాగరీ ప్రచారిణీ సభ 'పత్రికా శిరోమణి' బిరుదుతో 1976లోనే సత్కరించింది. అలాగే, వారణాసిలోని సంస్కృత విద్యాపీఠం 'మహా మహోపాధ్యాయ' బిరుదుతో, ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వ విద్యాలయంవారు గౌరవ డాక్టరేట్‌తో సన్మానించాయి.

శ్రీ తిరుమల రామచంద్ర సాహితీ జ్ఞాని.

శ్రీ తిరుమల రామచంద్ర తన చేవ్రాలు చేస్తూ క్లుప్తంగా తి॥ రా॥ గా రాస్తుండేవారు. చేవ్రాలు అలా రాస్తూ, తి॥ తిరిగి, రా॥ రాను అని అర్థోక్తిలో నవ్వేవారాయన. చివరకి అలాగే సాహితీ మహామహుడు తిరుమల రామచంద్ర అక్టోబరు 12, 1997 హైదరాబాద్‌లోని నిమ్స్ ఆసుపత్రిలో మలేరియా మెనైంజిటిస్ వ్యాధితో, 84 సంవత్సరాల వయస్సులో తిరిగిరాని లోకాలకు వెళ్ళిపోయారు.





జీవితంలో ప్రేమించలేకపోవడమే గొప్ప విషాదం. ప్రేమించి విఫలం కావడం కాదని - బుచ్చిబాబు అంటారు. మానవ జీవితంలోని సౌందర్య తృష్ణ. సామరస్యం, కరుణ, విషాదం, ఉల్లాసం, వేదన, వాంఛ, వీటి స్వరూప స్వభావాలను విశదంగా, నిశితంగా తన రచనలలో బుచ్చిబాబు వ్యాఖ్యానించారు.

నాగాజుమేడ, కొత్తవంతెన, పాతనీరు, అరకులోయలో కూలిన శిఖరం, నన్ను గురించి కథ వ్రాయవూ, అడవికాచిన వెన్నెల, 'బీ', లాంటి కథలు సుమారు 80 పైగా బుచ్చిబాబు ముప్పై సంవత్సరాల రచనాకాలంలో రాశారు.

బుచ్చిబాబు - అసలు పేరు శివరాజు వెంకట సుబ్బారావు. 1916 జూన్ 14వ తేదీన కృష్ణాజిల్లాలో జన్మించారు. ఇంగ్లీషులో రాసే కవితలకు 'సంతోష్ కుమార్' అనే కలం పేరుతో బుచ్చిబాబు అనేక రచనలు చేశారు. శ్రీ బుచ్చిబాబు రాసిన ఏకైక నవల - 'చివరకు మిగిలేది' తాత్త్విక జిజ్ఞాసతో కూడిన గంభీరమైన నవల. ఒక్కసారి చదివిన వాళ్ళకు చాలాకాలం గుర్తుండిపోతుంది. మనస్తత్వపు లోతులను రచయిత తరచి,



చదువుకునే రోజుల నుంచే తత్త్వ, మానవ శాస్త్రాలను అధ్యయనం చేశాడు. ప్రకృతి సౌందర్యాధకుడు బుచ్చిబాబు. సాహిత్యంతో పాటు సంగీతం, అభినయం, చిత్రలేఖనంలలో చక్కని పరిజ్ఞానం బుచ్చిబాబుకు సాధికారంగా ఉంది. బుచ్చిబాబు సున్నితమైన భావుకుడు. ప్రకృతిలోని అందచందాలపట్ల ఎంతో తాదాత్మ్యం చెందేవాడు. 'అంతరంగ కథనం' పేరుతో తన చిన్ననాటి సంగతులను, అనుభవాలను అనుభూతులను బుచ్చిబాబు ఎంతో అద్భుతంగా తన రచనలో పొందుపరిచాడు. అంతరంగ కథనంలో ద్రౌపది, సీత పాత్రలకు ఉన్న తారతమ్యాన్ని ఎంతో భావుకంగా, కళాత్మకంగా బుచ్చిబాబు వర్ణించాడు.

తరచి అవగాహన చేసుకుని సజీవమైన పాత్రలను ఈ నవలలో సృష్టించాడు. మానవ జీవితానికి పరమార్థం, మానవ సంబంధాలు, అనుబంధాలు, ఎలా ఒకరికి ఒకర్ని ఎలా దగ్గర పరుస్తున్నాయో, శాసిస్తున్నాయో ఈ నవలలో సునిశితంగా బుచ్చిబాబు విశ్లేషిస్తాడు. కాల్పనికవాద ధోరణి నుండి అనుభూతి పూర్వక రచనాధోరణి అనుకరించిన. తొలి నవ కథారచయితలలో ప్రముఖుడుగా బుచ్చిబాబు ప్రశంశించబడ్డాడు. 1936లో ప్రారంభమైన ఆయన తొలి రచన, 82 కథలు, అజ్ఞానం అనే వచన కావ్యం, చివరకు మిగిలేది (నవల), 40 వ్యాసాలు, 40 నాటికా నాటకాలు, షేక్స్పియర్ సాహిత్య పరామర్శ - ఇలా పలు రచనలు చేసి ఆధునిక తెలుగు సాహిత్యంలో బహుముఖ ప్రజ్ఞాశాలిగా పేరెన్నికగన్నాడు. పాలకొల్లులో ఎస్.ఎస్.ఎల్.సి., గుంటూరు ఎ.సి. కళాశాలలో ఇంటరుమీడియట్, డిగ్రీలు చేసి, మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో బి.ఎ. ఆనర్సు, నాగపూర్ విశ్వవిద్యాలయం నుండి ఎం.ఎ. పట్టా పొందాడు.





బుచ్చిబాబు కథలలో ఒక ఆవేదన, సంవేదన కొట్టచ్చినట్లు కన్పిస్తుంది. బుచ్చిబాబుని కొందరు నిరాశావాది, పలాయనవాదిగా వర్ణిస్తే, మరికొందరు క్రియాశీలవాదిగా, ఆశావాదిగా, సౌందర్యారాధకుడుగా అభివర్ణిస్తారు. జ్ఞాన తృష్ణ. వివేచన, విషయ విజ్ఞానం బుచ్చిబాబు రచనా వ్యాసాంగంలో కన్పడుతుంది. తాత్త్వికుడైన సృజనాత్మక ప్రతిభాశీలిగా కీర్తించబడ్డ బుచ్చిబాబు 1967లో తుదిశ్వాస విడిచారు.











మహాకవి శ్రీ మధునాపంతుల సత్యన్నారాయణశాస్త్రి - 'అపర నన్నయ'గా కీర్తిపొందారు. ఈయన 1920, మార్చి 5న కోనసీమ లోని పోలవరం సమీపంలో పల్లిపాలెంలో జన్మించారు. కావ్యా లంకారాలు, వ్యాకరణ శాస్త్రాన్ని చిన్నతనంలోనే కూలంకుషం గా అధ్యయనం చేసిన శ్రీ మధునాపంతుల మద్రాసు విశ్వ విద్యాలయం నుంచి 1940లో 'విద్వాన్' పట్టాను పొందారు. రాజమండ్రిలో వీరేశలింగం పంతులుగారి హైస్కూలులో తెలుగు ఉపాధ్యాయుడిగా, 'సూర్యరాయాంధ్ర నిఘంటు' కార్యా లయంలో పండితుడిగా, సాహిత్య మాస పత్రిక 'ఆంధ్రి' సంపాద కులుగా తెలుగు సాహిత్య విలువల పరిరక్షణకు విశేషంగా ఆయన కృషి చేశారు. 'స్వప్న వాసవదత్తం', 'రత్నావళి' సంస్కృత నాటకాలను తెలుగులోకి అనువదించారు. మధునాపంతుల గారి 'ఆంధ్ర పురాణం' విశేష ఖ్యాతి నార్జించడమేకాక రాష్ట్ర సాహిత్య అకాడమీ పురస్కారం కూడా పొందింది. మధునా పంతులగారి ఇతర రచనలు - 'బోధివృక్షం', 'చరిత్ర ధన్యులు', 'తోరణం', 'శ్రీ ఖండం', 'చైత్రరథం', 'ఆంధ్ర రచయితలు' తదితర సాహితీ రచనలు తెలుగు వారికి ఆయన అందించిన అసాధారణ రసగుళికలు. ఆంధ్ర విశ్వవిద్యాలయం 'కళాప్రపూర్ణ' బిరుదుతోనూ, సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వంతోను గౌర వించింది. 'ఆంధ్రకుటీరం' స్థాపించి తెలుగు రచనా వ్యాసాం గాన్ని ఇతోధికంగా ప్రోత్సహించారాయన.



MARAPURĀNI MANEESHI (45 Pen Portraits)




రామమోహన గ్రంథాలయం (విజయవాడ - 1960) :: ఎడమ నుండి కుడికి :
శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ రాయప్రోలు సుబ్బారావు, శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ
శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య, శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, శ్రీ దివాకర్ల వేంకటావధాని

---

## ఈ సంకలనంలోని మహనీయ మాననీయులు

- కాశీ కృష్ణాచార్యులు
- మాడపాటి హనుమంతరావు
- గిడుగు వేంకట సీతాపతి
- హరార్కే గుండేరావు
- తాపీ ధర్మారావు
- ఆదిరాజు వీరభద్రరావు
- మామిడిపూడి వేంకట రంగయ్య
- గన్నవరపు సుబ్బరామయ్య
- నేలటూరి వేంకటరమణయ్య
- తల్లావజ్ఝల శివశంకర శాస్త్రి
- రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ
- ద్వారం వెంకటస్వామి నాయుడు
- దీపాల పిచ్చయ్యశాస్త్రి
- కోలవెన్ను రామకోటేశ్వరరావు
- విశ్వనాథ సత్యనారాయణ
- గుర్రం జాషువా
- కనుపర్తి వరలక్ష్మమ్మ
- దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి
- అద్దంకి శ్రీరామమూర్తి
- నాయని సుబ్బారావు
- పులిపాటి వెంకటేశ్వరులు
- తుమ్మల సీతారామమూర్తి
- ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రి
- స్థానం నరసింహారావు
- నీలంరాజు వెంకట శేషయ్య
- బందా కనకలింగేశ్వరరావు
- ఖండవల్లి లక్ష్మీరంజనం
- ఇల్లిందల సరస్వతీదేవి
- దేవులపల్లి రామానుజరావు
- పింగళి వెంకయ్య
- వజ్ఝల చిన సీతారామశాస్త్రి
- బాలాంత్రపు వేంకటరావు
- అయ్యంకి వేంకటరమణయ్య
- రాయప్రోలు సుబ్బారావు
- వేలూరి శివరామశాస్త్రి
- ఖాసా సుబ్బారావు
- ఆచంట జానకిరామ్
- మల్లాది రామకృష్ణశాస్త్రి
- జమ్ములమడక మాధవరామశర్మ
- శ్రీరంగం శ్రీనివాసరావు
- త్రిపురనేని గోపీచంద్
- దివాకర్ల వేంకటావధాని
- తిరుమల రామచంద్ర
- బుచ్చిబాబు
- మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

---



AJO - VIBHO PUBLICATIONS